# బార్డోలీ విజయము.

గ్రంథకర్త:

మహాదేవ దేశాయి.




అనువాదకుడు:

ముదిగంటి జగ్గన్న శాస్త్రి,

తణుకు.

ఇతరులకు వెల 1-0-0]     [చందాదారులకు వెల 0-12-0

# పీ ఠి క.

విజయబార్డోలీయొక్క వీరచరిత్ర భారతదేశ స్వాతంత్ర్యచరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపబడు ననుట కెట్టి సందియమును లేదు. భారతరైతు యెంత కృంగియున్నను, యెంత నిర్వీర్యముగావింపబడినను, యెంత యజ్ఞానాంధకారములో త్రోయబడినను, యెంతదారిద్ర్యము ననుభవించుచున్నను, యెంత స్తబ్ధత్వ మతని నావహించినను సత్యాగ్రహానల మతనితో నింకను నశించ లేదనియు సమయము వచ్చినప్పు డీయంతర్నిహితశక్తి ప్రదర్శింపబడుననియు బార్డోలీరైతులు ప్రపంచమునకు వెల్లడిచేసిరి. అట్టి వీరులచరిత్ర నాంధ్రరైతు లోకమున కెరింగింపవలెనను కుతూహలముతో శ్రీయుత మహాదేవదేశాయిగారిచే రచింపబడిన యీగ్రంథమును తెనిగించితిని. ఇందులోని తప్పులను మాపాఠకులు మన్నింతురు గాక యని వేడుకొనుచున్నాను.

ముదిగంటి జగన్నశాస్త్రి.

# బార్డోలీ విజయము.



## మొదటి యధ్యాయము.



### “బార్డోలీ—అందలిప్రజలు.”

“బార్డోలీ హఠాత్తుగా ‘చారిత్రకస్థానము’ నలంకరించెను; అది తనస్థితిని బొత్తిగా గ్రహించుట లేదు.”

పయొనీరుపత్రిక.

బార్డోలీ (వాలడ్‌తో కలసి) 222 చతురపుమైళ్ల వైశాల్యమును, 137 గ్రామములును కలిగి సూరతుజిల్లాలో మిక్కిలి తూర్పుగానున్న తాలూకా యైయున్నది. దీని కుత్తరసరిహద్దు తపతీనది; ఈనది వెనుక సూరతుజిల్లాలోని మాండ్వీ తాలూకా కలదు. దీనితూర్పుపశ్చిమదిశలయందు బరోడాసంస్థానమును దక్షిణమున కొంత బరోడాసంస్థానమును కొంత సూరతుజిల్లాలోని జలాల్పూరుతాలూకాయును కలవు. తాలూకాసరిహద్దుగా చాలవరకు బరోడాసంస్థానమే యున్నది. దీనిప్రాముఖ్యత సత్యాగ్రహచరిత్ర చదివినకొలది చదువరులకే తెలియగలదు. తపతికంటె చిన్ననదులు రెండు మూడు తాలూకాను ఛేదించుకొని యరేబియాస

ముద్రములో కలియుచున్నవి. వీటిలో దేనికిగాని వంతెనలు లేవు. నడివర్షాకాలములో వీటిని దాటశక్యముకాదు. తాలూకాయొక్క పశ్చిమభాగముననున్నభూమి సారవంతమైన నల్లనేల; ఇచ్చట నన్నిపంటలును (ముఖ్యముగా ప్రత్తి, ధాన్యము, జొన్న) పండును. తూర్పుదిశనున్నగ్రామములు గుట్టలతోను, అడవులతోను నిండిన పేదభూములు. వీటికి నీటిసదుపాయములు లేవు; శీతోష్ణస్థితి చాలయధ్వాన్నముగానుండును.

తాలూకాలోనున్న 87000 మంది ప్రజలలో చాలమంది వ్యవసాయదారులే. అచ్చటనున్న ప్రజలలోని కాన్బీలు, అనవ్లాలు (బ్రాహ్మణులలో నొకజాతి) బనియాలు (వైశ్యులు) కాలీపరాజ (నల్లనివారు) అను ప్రధానజాతుల యొక్క సరియైన జనాభాలెక్కలు తాలూకాలోని గతసెటిల్‌మెంటులెక్కలలో తెలుపబడలేదు. కాని యుజ్జాయింపున సగముమంది కాలీపరాజులు అనగా నల్లనివారు; ఇందులో 11000 కేవలము కాలీపరాజులున్నూ 30 లేక 40 వేలు దూబ్లాతరగతివారును కలరు; పలచపలచగా కొంతమంది పారశీకులును, క్వచిత్తుగా మహమ్మదీయులును గలరు. మొదటి రెండుజాతులవారును భూమికలవారు, వ్యవసాయదారులునై యున్నారు. బనియాలందరును ఋణదాతలు; వారు వ్యవసాయదారులు కారు. కాలీపరాజులు లేక

నల్లనివారందరును (ఛోదారి, ధూదియా, గామిట్, దూబ్లా మొదలగువారందరును) తాలూకాలోనున్న వ్యవసాయపు పని చేయునట్టికూలివాండ్రు. దూబ్లాలు అనువా రొక ప్రత్యేకతెగ యనవచ్చును. వారికృషి యెంతమాత్రము నైచ్ఛికముకాదు. వీరి పెండ్లిండ్లువగైరాలు యజమానులే చేయుచు వీరిని ఋణగ్రస్తులనుచేసి తమకు బానిసలనుగా చేసికొందురు. మహమ్మదీయులలో కొందఱు చిల్లరవర్తకులున్నను చాలమంది వ్యవసాయదారులు. తాలూకాలో కొద్దిపారశీకకుటుంబములు కలవు. వీరు గొప్పభూస్వాములు, సారాదుకాణదారులు నై యున్నారు.

బార్డోలీతాలూకాలోనున్న సామాన్యమైనగ్రామము ఖేడాజిల్లాలోనున్నగ్రామముకంటె చాల చిన్నది. కొన్ని గ్రామములలో 25 లేక 10 యిండ్లకంటెకూడ నెక్కువ యిండ్లు లేవు. తాలూకాలో పశ్చిమదిశనున్నగ్రామములలో జనాభా కొంతదట్టముగా నున్నను ఖేడాజిల్లాలోని గ్రామములలోనున్నంతజనసమ్మర్ద మిచ్చట కానరాదు. 'అగ్ర' జాతులవారికి పెంకుటిండ్లు, పెద్దగుమ్మములు, దొడ్డగుమ్మములు, విశాలమైన యావరణములు కలవు; కాని ప్రజలు తమపశువులను కూడ తమయిండ్లలోనే కట్టివేసికొనుచుందురు.

ఈచిహ్నములు తాలూకాలోని విశేషమును దెల్పని చూపవు; కాని భారతదేశచరిత్రలో బార్డోలీ కనన్యస్థానము

నొసంగినలక్షణములను మనము సూక్ష్మముగా పరిశీలింప వలసియున్నది.

దక్షిణాఫ్రికాలో గాంధీమహాత్మునితో పనిచేసిన సత్యాగ్రహులలో చాలమంది బార్డోలీవారే! వీరాచరిత్రాత్మకమైనసమరములో తమధైర్యస్థైర్యములను, పట్టుదలను రుజువుచేసియే యుండిరి. వీరిలో కాన్బీలు, అనవ్లాలు, ముసల్మానులు కలరు. వీరు దక్షిణాఫ్రికాకు ద్రవ్యార్జనకు పోయి యచ్చట గొప్పవలసను స్థాపించుకొనిరి. బార్డోలీలో నిట్టి సత్యాగ్రహు లుండబట్టియే గాంధీమహాత్ముడు 1921—1922 లలో సమిష్టిశాసనోల్లంఘనమును ప్రారంభించుటకు బార్డోలీయే తగినప్రదేశమని నిర్ణయించెను. కొన్నికారణములచే నాయుద్దేశ్య మప్పుడు విరమింపబడెను. ఆకారణములు మన కప్రస్తుతమైనను చరిత్రలో నొక మహోద్యమము నారంభించుటకు ప్రధానస్థానము నలంకరించెననుకీర్తిమాత్రి మక్లే యుండెను. సమరమును హఠాత్తుగా నాపివేయుటవలన ప్రజలలో కొంతమాంద్యము ప్రవేశించినను యుద్యమయంత రార్థమును వారు మరచిపోలేదు. తాలూకాలోనున్న గ్రామపెత్తందారు లందరును (చాలమంది కాన్బీజాతివారు) తమ యుద్యోగములకు రాజీనామాల నిచ్చి వాటిని సమయము వచ్చినప్పు డధికారులకు పంపవలసినదని గాంధీమహాత్మునకు సమర్పించిరి. చాలగ్రామములలో జాతీయపాఠశాలలు

కలవు. ఇతరచోట్లకంటె నీతాలూకాలో ఖద్దరు విశేషము గా వాడుకలోనున్నది. కాలీపరాజజాతివారిలో నొకనూతన సంస్కార మావిర్భవించెను. వారిలో చాలమంది కల్లు, సారా, మొదలగు విషపదార్థములను త్రాగమని ప్రమాణ ములను తీసికొనిరి. మహాత్ముని నిర్బంధానంతరము 1922 లో శ్రీయుత వల్లభాయిపటేలునాయకత్వముక్రింద గుజ రాతులోనున్న ప్రచారకులందరును బార్డోలీతాలూకాలో స్థిరవాస మేర్పరచుకొని నిర్మాణకార్యక్రమమును పూర్తిచేసి గాంధీమహాత్ముడు సమిష్టిశాసనోల్లంఘనమును ప్రారంభిం చుట కగ్రస్థానము నొసంగినతాలూకా సార్థకనామమును బడయునట్లు చేసిరి. తాలూకాలో నలుదిశలను నాలుగు కేంద్రకార్యస్థానములు స్థాపింపబడెను. ఇచ్చట ప్రజలతో నైక్యమై పనిచేయుట కారితేరిన కొందరుసేవకులు స్థిరపీఠ ముల నేర్పరచుకొనిరి. బార్డోలీ, సార్భాణ్, వారిడ్, వాం కనర్ మొదలగు నీనాలుగుకేంద్రములు 1928 లో జరిగిన సత్యాగ్రహములో నగ్రస్థానముల నలంకరించెను. ఈతా లూకాకు బార్డోలీ ముఖ్యపట్టణమైనట్లే వీరి నిర్మాణకలా పమునకును నిదియే శిరస్థానము నలంకరించెను; ఇచ్చట కా లీపరాజయువకులకును, బాలురకును ప్రత్యేకవడుకుపాఠశా ల, నేతపాఠశాల, వడ్రపుపాఠశాల స్థాపింపబడెను. ఈకాలీప రాజజాతినే నేను మరియొకప్రదేశములో రానిపరాజాజాతి

యని వర్ణించియుంటిని. దీనికొక చరిత్ర కలదు. కాలీపరాజ అనగా నల్లనివారు; లేక వెనుకబడియున్నజాతి అని యర్థము. కాని 1926 వ సంవత్సరములో మహాత్మునియాధిపత్యమున నొక గొప్పసభ చేసి యీజాతివారందరును నీచనామమైన 'కాలీపరాజ' అను దానిని తిరస్కరించి తమయథార్థ నామమైన రానిపరాజ అనగా అటవీనివాసులు అను సార్థక నామమునే ధరింపవలయునని తీర్మానించుకొనిరి. ఈప్రజలలో నిర్మాణకార్యక్రమ మభివృద్ధి యైనకొలది ప్రతిసంవత్సరము మహాసభలను జరుపుకొనుచున్నారు; ఆదర్శప్రాయములగు ఖద్దరుప్రదర్శనములను జరుపుచున్నారు. ఈజాతికొరకే తను సర్వస్వమును, యావత్కాలమును సమర్పించిన చునీలాల్ మెహతాదంపతులు వందనీయులు. వీరికృషి ఫలించినది. ఈతాలూకాలో నదృష్టవంతులైన యితరజాతులకంటె నే డీజాతిలోనే యెక్కువమంది పవిత్రజీవితములను గడుపుచున్నారు. అనేకకుటుంబములు తమనూలు తామే వడకుకొందురు. తమబట్టలను తామే నేసికొందురు. నారుత్రాగుడును విసర్జించి తమజాతి కితరులపై నాధిక్యమైన గొప్ప పలుకుబడిని సంపాదించిరి. ఈజాతివారికొరకు లక్ష్మీదాసు పురుషోత్తం, యుగతాంధేవులవల్ల స్థాపింపబడినపాఠశాల చాలమంది ప్రజాసేవకులను సృష్టించెను. వీరందరును దీర్ఘనిద్రలోనున్నగ్రామములకు బోయి ప్రజలలో నిద్రాణమైయున్నశక్తులను మేల్కొలిపిరి.

సార్భాను, వారడ్ కేంద్రములు పరిచారకు లనుకొన్నంతపనిచేయజాలకపోయినను తమకృషినిమాత్రము యుద్యమమునకు తగినట్టిపట్టుదలతో సాగించెను. వారడ్‌లోనున్న జాతీయపాఠశాలాయాజమాన్యమును వహించిన జహ్వార్భాయిపటేలు తనపాఠశాలాకార్యక్రమము నంతను జరుపుకొనుచు సంవత్సరములో పదిలక్షలయిరువదివేలగజములనూలు వడకెను. బార్డోలీతాలూకాలోనున్న యనేకగ్రామములలో తీవ్రమైనపరిశోధనలను జరిపినమీాదట జయకరుగారు తయారుచేసిన సెటిల్‌మెంటులెక్కల నన్నిటిని ఖండించుచు 1926 వ సంవత్సరములో వ్యాసములను వ్రాసిన నరహరిపరిక్‌గారు సార్భాను ఆశ్రమయాజమాన్యమును చాలకాలమునుండి వహించుచుండెను. అత డొకసారి తనసరిహద్దులోనున్న యొకగ్రామములోని ప్రజలు తమవస్త్ర వ్యవసాయపుపనులుచేయుదూబ్లాజాతివారియెడల నతికౄరముగా సంచరించి దానికి క్షమార్పణ కోరకపోవుటచే వారము రోజు లుపవాసము చేసెను.

గాంధీమహాత్ముని నిర్బంధించినకాలములోను, అ ని విడిచిపెట్టినతరువాతనుకూడ జరిగినపని యీవిధము గ్రామవాసులకును ప్రచారకులకును నభేద్యమైన యైక త్యమును చేకూర్చుటచే ప్రజలు తమకెప్పు డెట్టికష్టము వచ్చినను ప్రచారకులసహాయమును పొందెడివారు.

ఇంతేకాకుండ యభ్యుదయమును చేకూర్చు నెట్టియుద్యమముకైన నర్హ్యలనొనర్చు కొన్ని సహజలక్షణము లీప్రజలలో కలవని వేరుగ చెప్పనక్కరలేదు. బార్డోలీలోనున్న కాన్బీలు రానిపరాజులవలె సంస్కారములకు తీపినీటికి చేపలవలె యెదురెక్కుజాతులు మరేతాలూకాలోను కాన్పించవు. కాన్బిజాతిలోని వ్యవసాయదారుని పరిశ్రమ, నిపుణత, పొదుపు సుప్రసిద్ధములు; నిరాడంబరులు, సత్యప్రియులు నగు రానిపరాజు ప్రజలతోను, ప్రజలకొరకును పనిచేయగలుగుట ఆనందదాయకమనియు, మహాభాగ్యమనియు వేరుగ చెప్పనక్కరలేదు. కాన్బిజాతిస్త్రీలు తమపురుషులతో పాటు పొలములలో పనిచేయుచు వారికష్టములలోను పనిపాటులలోను యథార్థమైనభాగస్వాము లగుచున్నారు. కలకలలాడు నిర్మలమైనవారివదనకమలములలో నొకవిధమగు సహజపవిత్రత పొడగట్టును. ఈజాతియంతయు కొంతమూఢవిశ్వాసమున్నను సహజముగా భగవద్భయముకలవారు; వీరు చేసినశపథములందు, యిచ్చిన బాసలందు పవిత్రతను పాటించుచుందురు. వీరి కులకట్టుబాటులాధునికనాగరికతయొక్క దండయాత్రలన్నింటిని తరించెను; నేడు గుజరాతులోనున్న జాతులన్నింటిలో నిదియే చక్కనికట్టుబాట్లు గల జాతియని చెప్పవలెను. ఇక రానిపరాజజాతివంటి నిరపరాధమైనజాతిని, మోసమునెరుగనిజాతిని వేలెత్తిచూపనేలేము. దీనిఫలితముగా నీరెండుజాతులును వీరితోపాటు గుజ

రాతులలో వీరి సహచరభాగ్య మబ్బిన యితరజాతులును కూడ నతిశాంతస్వభావులు, చట్టబద్ధులు. బార్డోలీలో కోర్టులకు పోవు పేచీలు చాలతక్కువ; నేరములు మచ్చుకైనను దొరకవేమొ! సత్యాగ్రహమున కిట్టి బార్డోలీతాలూకాకే యర్హతకలదనుటలో నాశ్చర్య మేమున్నది?

"ధర్మయుద్ధములో భగవంతుడే రంగములను వన్ను చుండును; అతడే యుద్ధములను నడుపుచుండును." అని మహాత్ముడు తన దక్షిణాఫ్రికాసత్యాగ్రహచరిత్రలో చెప్పియున్నాడు. "దాచుకొనవలసిన రహస్యము లేవియు లేనట్టియు, మోసము, అసత్యములకు తా వెంతమాత్రమును లేనట్టియు ధర్మయుద్ధము దానంతటదియే సంభవించును; మతపరిసక్తికల మానవు డెప్పుడును దీనికి సంసిద్ధుడయియే యుండును. ధర్మయుద్ధ మెప్పుడును భగవంతుని పేరనే జరుగవలెను; కనుక సత్యాగ్రహి కేవల మసహాయుడై యున్నట్లు భావించునపుడును, అతనిచుట్టును, దారి తెన్ను లేని మహాంధకార మేర్పడినపుడును మాత్రమే భగవంతు డతనిశరణుకు వచ్చును. తన కాలిక్రిందనున్న ధూళికంటెకూడ తా నధముడని భావించునపుడే భగవంతుడు సహాయము చేయును. దుర్బలులకును అసహాయులకును మాత్ర మే భగవంతునిసహాయము ప్రసాదింపబడును." బార్డోలీ రైతుయొక్క దుర్బలత్వమే లేక సాధుస్వభావమే ప్రపంచములో నతినిరంకుశప్రభుత్వముతో సత్యాగ్రహమును సల్పుట కతనికి తగినయర్హత నొసంగెను.

---

# బార్డోలీ విజయము.



## రెండవ యధ్యాయము.



"రక్తమును పీల్చు విధానము."

"భారతదేశమును పాలించుపాలకుల ప్రధానలక్ష్యము ప్రజలస్థితిగతుల నభివృద్ధి చేయుట కాదు; ప్రభుత్వాదాయమును చేకూర్చునదీనదములను పెంపొందించుటే వారి లక్ష్యము.''

కైర్ హార్డీ.

బార్డోలీ సత్యాగ్రహ కారణమును వర్ణించుటకు పూర్వ మచ్చటి భూమిశిస్తును విధించుసమస్యనుగురించిన కొన్ని ముఖ్యాంశములను చర్చించు టత్యవసరము. నేను భూమికొలతలు, సెటిల్ మెంటులు మొదలగు పురాణగాథలతో చదువరులను వేధింపను; భూమిశిస్తుయొక్క స్వభావస్వరూపము లెట్టివో యను తర్కముతోను మిమ్ము బాధించను. కాని యీచరిత్రను చదువువారు తెలిసికొనవలసినకొన్ని సత్యములను క్లుప్తపరచుటతో తృప్తిపడెదను.

భూమిమీద చెల్లుచున్న ఆదాయము "పన్నా" లేక "అద్దెయా" అను రాద్ధాంతసిద్ధాంతములను గొప్పగొప్పప్రభు

తోద్యోగులుకూడ నొకప్పుడు నిష్పక్షపాతబుద్ధితో తర్కించు చుండెడివారు. భూమియంతయు ప్రభుత్వమువారిదే యనియు, భూమిమీఁద చెల్లుచున్నఆదాయము పన్నుకాక అద్దెయనియు వాదించువాదము 1856 లో తూర్పు యిండియా కంపెనీ డైరెక్టర్లు చేసిన ప్రకటనలకును, 1880 లో లిట్టను ప్రభుత్వమువారు చేసిన ప్రకటనలకును విరుద్ధమనియిదివరలోనే యొకప్పుడంగీకరింపబడెను. విశేషానుభవముకల బేడెన్ పవెల్ తన "భూమి పద్ధతులు" అను పుస్తకములో నీక్రిందివిధముగా స్పష్టీకరించియున్నాడు. "భూమిమీఁదవచ్చు రాబడి అద్దెగా భావింపబడ నేరదు. చట్టముప్రకారము భూమికలవానిని భూస్వామి లేక భూమికధిపతి యని పిలువక "భూమిని ఆక్రమించినవాఁడు" అని పిలుచునట్టి రైతువారీభూములసందర్భము లోకూడ దీనిని అద్దెగా భావింపరాదు ... భూమిమీఁద చెల్లు రాబడిని యింకను వర్ణింపవలెనన్నచో నే నీయధ్యాయమును "వ్యవసాయపురాబడిమీఁదపన్ను" అనియే భావించెదను. కాని యీగ్రంథకర్తయే యీచర్చయంతయు నిరుపయోగమని వ్రాయుచున్నాఁడు. ఇది యప్రధానమైనచర్చ యగుటచే నిరుపయోగముగా కాన్పించుటలేదు; ప్రభుత్వమువారు దీనిలోనున్న యంతర్భావములను నాశనము చేయుటచేతనే యీ చర్చ నిరుపయోగము గావింపబడెను. లేనిచో నిది చాల ముఖ్యమైన విషయమే యగును. భూమిమీఁద వచ్చురాబడి

పన్నుకాక మరేమియు కాదని ప్రభుత్వమువా రంగీకరించే యెడల ననేకముఖ్యసమస్యలు విడిపోకలవు. ప్రభుత్వము వా రింతవరకును భూమికి తామే యధిపతులమని చాటుచున్నారు. బొంబాయి ప్రభుత్వమువారి యార్థిక సభ్యుడు 1924 మార్చిలో నీక్రిందివిధముగా ప్రకటించెను. "భూమి ప్రభుత్వమువారిది కాదనియు, దీనిని కలిగియుండుట ప్రభుత్వమున కొక గొప్పనిధి కాదనియు నెవ్వరును చెప్పజాలరు; దీనివలన వచ్చు రాబడిచేతనే ప్రభుత్వము జరుగుచున్నది." విపరీయమైన యీసిద్ధాంతమునుండియే ప్రస్తుత మములులోనున్న రెవిన్యూపద్ధతిలోని దోషములన్నియు సంక్రమించుచున్నవి. ప్రభుత్వమువారు దీనివలన తమకు కావలసినంత పిండుకొనవచ్చును; ఏకొద్దిరూపాయిల బకాయికిగానో వేలకొలది ఖరీదుచేయుభూమిని ప్రభుత్వవశము చేసికొనవచ్చును; రెవిన్యూఉద్యోగి యెంతపన్ను విధించినను దానిని ప్రశ్నించుట కేకోర్టుకును అధికారము లేదు; ప్రభుత్వమువారి నిర్ణయముల నేశాసనసభయును కదపచాలదు. ఏలననగా భూమియంతయు ప్రభుత్వమువారిది. దానికి వారే అధిపతులు. రక్షణపొందుటకు రైతుకట్టి హక్కును లేదు! పాఠకులు గుర్తించవలసినమరియొకముఖ్యవిషయ మేమనగా శాశ్వత సెటిల్మెంటు యేర్పడనియన్నిరాష్ట్రములలోను భూమిపన్ను యపరిమితముగా హెచ్చిపోయెను. 1860 ప్రాంతము

-లలో శాశ్వతసెటిల్‌మెంటు విషయమై తీవ్రమైనచర్చలు జరుపబడెను. క్యానింగు, లారెన్సు మొదలగు రాజప్రతినిధులు శాశ్వతసెటిల్‌మెంటుపద్ధతియే ప్రభుత్వమునకును ప్రజలకునుగూడ ప్రయోజనకారిగా నుండునని భావించిరి. కాని మర్యాదహీనమైన కొన్నికుతంత్రములవలన యీసూచన యాచరణకు తేబడలేదు. కాగితమునుమాత్రమే యలంకరించినయీసూచనను తరువాతవచ్చినప్రభుత్వము తల్లక్రిందులు చేసెను. దీనిఫలితముగా భూమిపన్ను యెప్పటికప్పుడు హెచ్చింపబడుచు వచ్చెను. ఈనష్టము బొంబాయి రాజధానిలోవలె మరేరాజధానికిని తగులలేదు. అందులోను గుజరాతులో తగిలినంతనష్టము రాజధానిలో మరెచ్చటను తగులలేదు. గుజరాతుజిల్లాలలో ముఖ్యముగా సూరతుజిల్లాలో (బార్డోలీతాలూకా యిందులోనిదే) విధింపబడిన హెచ్చుభూమిపన్ను, మనిషికి యకరమునకు పడినదారుణ భారమును గమనార్హములు. రావుబహదరు జోషీగారు బొంబాయిభూమిపన్నుసమస్యను గురించి సంశయరహితముగా సుస్పష్టముగా వ్రాయుచు 1900-1901 లో బొంబాయిరాజధానిలో ప్రజలమీద పడినపన్నులభారము తదితరరాజధానులలో పడినదానికంటె చాల హెచ్చుగానున్నదనియు (తలకు రు 2-0-0) వ్యవసాయములోనున్న భూమిమీదపడినభారము గుజరాతుజిల్లాలలో నన్నింటికంటె

నెక్కువయనియు (యకరముకు రు 4-0-0) గుజరాతులో సూరతుజిల్లాలో మరింత యధికమనియు (యకరముకు రు 5-9-0 చూపెను. బార్డోలీకి సంబంధించినంతవరకు భూమిరాబడి యేవిధముగా హెచ్చినదియు నీక్రింది యంకెలవలన తెలియగలదు.

| | | | |
|---|---|---|---|
| 1864_65 | ... | ... | 3,18,162 |
| 1866-67 | ... | ... | 4,00,939 |
| 1894-95 | ... | ... | 4,30,263 |
| 1897-98 | ... | ... | 4,58,317 |
| 1923-24 | ... | ... | 5,14,762 |

ఇప్పుడు దీనిమీద నూటికి యిరువది రూపాయిలచొప్పున హెచ్చుపన్ను విధింపవలెనని సూచింపబడెను.

ఏసెటిల్ మెంటుఉద్యోగిగాని తను సర్వేచేసినకాలములో వెనుకటి సర్వేకాలమునాటికంటె యకరము కేమాత్రమైనను పంట హెచ్చినదని వాదించి యుండలేదు. ప్రజలు భూమియొక్క నిజసారము నానాటికి విపరీతముగా తగ్గిపోవుచున్నదని తీవ్రముగా వాదించి యుండిరి. కాని యొకప్పుడు అమెరికాయుద్ధముతరువాత హెచ్చినధరలు భూమి ఆదాయమును హెచ్చించుటకు సాకుగా చూపబడెను; మరి యొకప్పుడు తాలూకాయొక్క సామాన్యమైశ్వర్యమే పన్ను హెచ్చించుటకు తగినకారణమనిరి; తుదిసెటిల్ మెంటు

కాలములో నొకవంక సెటిల్‌మెంటుకమిషనరు "వ్రాత మూలకముగానున్న లెక్కలవలన 1896 లో తాలూకామీద హద్దుమీరినపన్ను విధింపబడెను లేదా పన్నువిధించుటకు చివర మితియైన నికరాదాయములోని యర్ధభాగము వరకు విధింపబడెనని రుజువగుచున్నది" అని వ్రాయుచున్నను సామాన్యమైశ్వర్యము, ధరవర లమితముగా పెరిగిపోవుట, మక్తాలు హెచ్చుగానుండుట హెచ్చుపన్ను విధించుటకు కారణమనిరి. పాఠకుడు గ్రహించవలసిన మూడవ విషయ మేమనగా యీవిధముగా నిరంకుశముగా పన్నువిధించుపద్ధతినుండి రైతును రక్షించుతరుణోపాయ మేమియును లేదు. కోర్టువా రతనిని రక్షింపజాలరు. హెచ్చుపన్ను విధింపబడినదని హైకోర్టులో 1873 లో నొకరు దావా తీసికొని రాగా కోర్టువారు సెటిల్‌మెంటుఉద్యోగియొక్క నిర్ణయమును త్రోసివేసి దావా తెచ్చినరైతుకు సుముఖముగా తీర్పుచెప్పిరి. వెంటనే యా తీర్పుమీద ప్రభుత్వములో గొప్పకల్లోలము సంభవించెను. బొంబాయిభూమిఆదాయపు అధికారచట్టమని యొకచట్టము సృష్టింపబడెను. దీనిప్రకారము పన్ను విధించుసందర్భములలో మామూలుకోర్టుల కధికార మేమియు లేదనిరి. కనుక సెటిల్‌మెంటుఉద్యోగి వేయుదారుణపన్నునుగురించి రైతు యే స్వతంత్రన్యాయాధికారులతోను నొక్కి చెప్పుకొనుటకు వీలులేకుండ

చేసిరి. శాసనసభగాని, యిండియాప్రభుత్వముగాని యేమియు చేయజాలవు. "భూమిఆదాయపద్ధతియొక్క పరిపాలనకు చెందినంతవరకు సంస్కరణములు పిమప్రాయములయ్యెను. చట్టముప్రకారము న్యాయస్థానద్వారములనుండి రైతును పారద్రోలిరి. ఇండియాప్రభుత్వమువా రెట్టి జోక్యమును కల్పించుకొనకుండ వారియధికారమును చాలవరకు తగ్గించివేసిరి. వారివారివిధులను పంచుకొన్నుటచేతను, రెుక్కువ అధికారముల నిచ్చివేయుటచేతను, క్రిందియుద్యోగులను శాసించుతమయధికారమును యిండియాప్రభుత్వమువారు చెలాయింపరు. భూమిఆదాయము రాష్ట్రముకు చెందినవిషయము; అందులోను ప్రజల కివ్వకుండ ప్రభుత్వమే యుంచుకొనిన విషయము. కేంద్రప్రభుత్వమువారు తమ చేతిలోనే యుంచుకొనిన యిట్టియధికారములసందర్భములలో స్థానికప్రభుత్వముల తీర్పులలో జోక్యము కల్పించుకొనుటకు సిద్ధాంతరీత్యా యధికారులైయున్నను స్థానికప్రభుత్వముల బాధ్యతలను నెరవేర్చుటకు తగినంత స్వాతంత్ర్యముండవలె ననునెపమున వా రట్లు చేయనొల్లరు. కనుక రాష్ట్రములలోనున్న ప్రజాయత్తము చేయనివిషయములలో స్థానికప్రభుత్వములకే సంపూర్ణాధికారమున్నది." అని యొక బొంబాయిశాసనసభ్యుడు నుడివెను.

ఇట్టివిరంకుశాధికారమును శాసింపవలె ననునుద్దేశముతో 1919 లో పార్లమెంటువారిచే నియమింపబడిన కమిటీముందర సాక్ష్యములు తీసికొనబడెను. కమిటీవారు "భూమిరాబడిని సారెసారెకు మార్చుచుండుపద్ధతిని సాధ్యమైనంత త్వరలో నెక్కువ కట్టుదిట్టములతో శాసనబద్ధము గావింపవలెను." ముఖ్యముగా నెందుచేతననగా "దీనివలన నెక్కువ బాధననుభవించుప్రజల కీవిధానమును తయారుచేయుటలో నెట్టియధికారమును లేదు; ఇక నీవిధానముచే తయారుకాబడిననియమములు సూత్రములు పన్ను చెల్లించునట్టి ప్రజల కందుబాటులో లేవు; అవి వారికి సరిగా నర్థముకావు"అని వ్రాసియుండిరి.

1924 లో బొంబాయి శాసనసభలో హెచ్చుమంది సభ్యులచే నీక్రిందితీర్మానము గావింపబడెను.

"ఈసభలో నెన్నుకొనబడిన ప్రభుత్వసభ్యులు, ప్రజాసభ్యులు గలిగిన యొకకమిటీ యేర్పడవలెను. ఇందులో ప్రజాసభ్యులు హెచ్చుగా నుండవలెను. ఈకమిటీవారు 1919 లో పార్లమెంటుకమిటీవారు భూమిఆదాయమును మార్చుచుండుట నెక్కువ కట్టుదిట్టములతో శాసనబద్ధము గావింపవలెనని చేసిన శిఫారసులనుగురించి యోచింపవలెను; దీనిని నెరవేర్చుట కెట్టిరూపము, యెట్టిస్వభావము గలశాసనము గావింపవలెనో తెలియచేయవలెను; ఇట్టిశాస

నము గావింపబడువరకును భూమిపన్నును మార్పునట్టిప్రయత్నములను మానవలెను; ఇట్లు మార్పుచేసి క్రొత్తసెటిల్‌మెంటుప్రకారము క్రొత్తపన్నులను విధింపరాదు."

ప్రభుత్వమువా రీతీర్మానము నెదిరించిరి. కాని హెచ్చుమందిచే నిది యామోదింపబడుటచే భూమిఆదాయమును విధించుకమిటీ యనుదానిని (తీర్మానములోని పూర్వాంశమును) జరిపి యుత్తరాంశమును గాలికెగురగొట్టిరి. నెమ్మదిగా మూడువత్సరములను దాటనిచ్చి తాలూకావెంబడి తాలూకాలో పైనుదహరింపబడిన పార్లమెంటరీకమిటీశిఫారసును, శాసనసభయొక్క తీర్మానమును తృణీకరించుచు క్రొత్తసెటిల్‌మెంటును జరిపించి క్రొత్తపన్నుల విధించిరి. 1927 లో మరల మరియొక తీర్మానము గావింపబడెను. ఇందులో 52 రు అనుకూలురు 29 మంది మాత్రము (ప్రభుత్వసభ్యులందరును కలసి) వ్యతిరేకులు.

"ఈసభ 1924 మార్చి 15 వ తేదీని హెచ్చుమందిసభ్యులచే సవరింపబడి చేయబడినతీర్మానములోని సిద్ధాంతమును తిరిగి ధృవపరచుచు తగినశాసనమును ప్రవేశపెట్టి దానిని త్వరలో నమలులో పెట్టించుట కనుగ్రహింపవలెనని కౌన్సెలు సభాధిష్ఠులైన గవర్నరుగారికి శిఫారసు చేయుచు భూమిపన్నుకమిటీవారి నివేదికను వ్యతిరేకుల వ్యతిరేకవాదమును వారి సూచనలను యోచించి 1924 మార్చి 15 వ తేదీ తరు

వాత క్రొత్తసెటిల్‌మెంటులను జరిపి పన్నులను హెచ్చించిన సందర్భముల కీతీర్మానము వర్తించునట్లు చేయవలెననియు, నట్టిశాసనము నమలులోనికి పెట్టువరకును 1924 మార్చి 15వ తేదీతరువాత క్రొత్తసెటిల్‌మెంటు జరిపి హెచ్చించినపన్నులను వసూలుచేయవలదని రెవిన్యూయుద్యోగస్థుల నాజ్ఞాపింపవలసినదనియు'' తీర్మానించిరి.

ఒకసంవత్సరము జరిగిపోయెను; కాని యవసరమైన శాసనమును ప్రవేశపెట్టకుండా శాసనసభయొక్క రెండు తీర్మానములకును ప్రభుత్వమువారు స్వస్తిచెప్పిరి. భూమి పన్నుకమిటీవారి రిపోర్టుపైని ప్రభుత్వమువారమలు చేసిన తీర్మానము ప్రభుత్వభూమిపన్నుచరిత్రలో నతిదుర్భరమగు యధ్యాయమని చెప్పక తప్పదు.

ఈకమిటీలో 22 సభ్యులుకలరు; ఇందులో 7 గురు మాత్రమే యెట్టి సవరణలును లేకుండ తీర్మానము నంగీకరించినవారు. అధికారసభ్యులకును అనధికారసభ్యులకును మధ్య నొక పోరాటము సాగింపబడెను. అధికారసభ్యులందరును కలసి యేకగ్రీవముగా తమ యసమ్మతిని తెలుపుప్రకటన చేసిరి. అటుగుటు అనధికారసభ్యులును కలసికాని ప్రత్యేకముగాగాని తమప్రకటనలను గావించిరి. ఫలిత మేమయ్యెను! ప్రభుత్వమువారితీర్మానము యీరిపోర్టులోనున్న ప్రతిముఖ్యశిఫారసును బుట్టదాఖలు చేసెను. "బ్రహ్మాండమై

నయాలోచనలు సలిపినమీదట" కమిటీలోని "అధికారసభ్యులమతమునే యంగీకరింపక తప్పనిసరి యయ్యెననియు" "భూమిపన్నును స్థిరపరచుట కొక్కమన్నాలుమాత్రమే ప్రమాణముగా తీసికొనవలెననియు'' ప్రభుత్వమువారు శెలవిచ్చిరి. అన్నిఖర్చులు పోను మిగులు నికరాదాయములో నేశతాంశమును ప్రభుత్వమువారు పన్నుగా విధింపవలెను? యను విషయమును తీసికొనుడు. కమిటీలోని హెచ్చుమంది నికరాదాయములో నాలుగవవంతుకంటె నెక్కువపన్ను విధించరాదని తీర్మానించిరి. కాని కౌన్సిలుసభాధ్యక్షులైన గవర్నరుగారు "ప్రస్తుత మాచరణలోనున్న" నికరాదాయములోని సగభాగమును చివరమితిగా భావించుట యుచితముగా నుండునని తలచుచున్నారట.

ఈయాచరణయంతయు గత సెటిల్మెంటులలో సెటిల్మెంటుఉద్యోగియులు ప్రవేశపెట్టినదే యని గ్రహింతురుగాక! ఈకమిటీవారు క్రొత్తగా సెటిల్మెంటు చేయనున్నవాటినన్నిటిని పరీక్షించుట కొక స్థిరమైనసలహాసంఘము నేర్పాటుచేయవలెనని మరియొక ముఖ్యశిఫారసును చేసిరి. ఈసందర్భములోకూడ నధికారసభ్యులవాదమునే ప్రభుత్వమువారు బలపరచి యీశిఫారసును త్రోసివేసిరి. ఇక భూమిక్రిందపారు నీటితీరువానుగురించి చూడుడు. కమిటీలోని అనధికారసభ్యులు పన్నువిధించుటలో భూమిక్రిం

దపారునీటిని యొకవిషయముగా తీసికొను నాచారమును మానివేయవలె ననిరి. ఈతీరువాను మానివేయకూడదని ప్రభుత్వసభ్యులు చేసిన బ్రహ్మాండమైనవాదనల కనధికార సభ్యులు జయప్రదముగా ప్రతివాదముల నొనర్పజాలక పోయి రని ప్రభుత్వమువారు కనుగొనిరట! కనుక పాపము వా రీశిఫారసు నంగీకరింపజాలకపోయిరట! సెటిల్‌మెంటు ఉద్యోగికి సహాయార్థము తాలూకాబోర్డుచే నెన్నుకొనబడిన యిద్దరురైతుప్రతినిధులనుకూడ తీసికొనవలె నను కమిటీలోని అనధికారసభ్యులనిరపరాధమైనతీర్మానముకూడ ప్రభుత్వమువారికనంగీకారమైనదట! "ఈసూచనకు వ్యతిరేకముగా నధికారసభ్యులు చేసినవాదములతో మే మంగీకరించుచున్నాము; మేము దీని కంగీకరింపజాలనందుకు చింతిల్లుచున్నాము." అని ప్రభుత్వమువారు నకారశుద్ధారలను కురిపించిరి.

కనుక దీనివలన నెక్కువగా బాధనొందుప్రజల "కీపద్ధతిని తయారుచేయుటలో కొంత ప్రాతినిధ్యము" నీయవలె ననుపార్లమెంటరీకమిటీవారిశిఫారసును మంటకలిపిరి. ప్రస్తుతపద్ధతిని నిరంతరముగా సాగించుటను శాసనబద్ధము చేయవలె ననుసూచనకుకూడ నీగతియే పట్టెను. రెవిన్యూ సభ్యుడు పైతీర్మానమునుగురించి యిట్లు మాట్లాడెను.

"రివిజను సెటిల్ మెంటుపనులను సాగించిన మొదటి 25 తాలూకాలలోను మొత్తం 10 లక్షలయేబదివేలు పన్ను వచ్చుచున్నది. ఈసభలోని గౌరవసభ్యులెవరైనను యింతటి పెద్దమొత్తమును ప్రభుత్వమువారు వదలుకొనవలెనని చెప్పుట "ముఖ్యముగా నీరాజధాని ప్రస్తుత మిట్టి యార్థికస్థితిలో నుండగా" నాకాశ్చర్యమును కలిగించుచున్నది.

1841 లో ఫ్రిజరు ఎలరు యిచ్చినవాఙ్మూలముతో దీనిని పోల్చి చూడుడు. "రైతుయొక్క యైశ్వర్యమే మన లక్ష్యముగా నుండవలసినపన్ను విధించుసందర్భములో "ప్రభుత్వమువారు ప్రజల కెంతయెక్కువ మొత్తమును వదలిపెట్టగలరు?" అను సమస్యయే ప్రధానము కాని "ప్రభుత్వమున కెంతహెచ్చురాబడి సమర్పించవలెను" అనునది కాదు; లేదా 1864 లో బొంబాయిగవర్నరైన బార్టిల్ ఫ్రియర్ యిచ్చిన వాఙ్మూలముతో పోల్చుడు. "ఆర్థికలాభ మంత ముఖ్యమైన విషయము కాదనియు నప్రత్యక్షఫలితమైన (పన్నులు చెల్లుటలో) స్థిరత్వము, పన్నులను మితముగా విధించుట, తద్వారా రైతుయొక్కస్థితి యభివృద్ధిచెందుట- ఇవి ప్రత్యక్షముగా పన్నులను వృద్ధిచేయుటకంటె ప్రధానమనియు ప్రభుత్వము వారిచే స్పష్టముగా సూత్రీకరింపబడెను " సేలిస్బరీప్రభువు వచించినట్లు హిందూదేశము రక్తవిహీనము గావింపబడుటయే గాక శరీరములో నత్యంతరక్తశూన్యమైనభాగముకే పట్ట

కారు ప్రయోగింపబడెను. ఈభూమిపన్నువిధానముయొక్క చరిత్రయే యిట్టివిధానము నెదుర్చుటకు పన్నులనిరాకరణమును నడిపించుటకు దోహదము నొసంగునంతటికళంక భూయిష్ఠమైయున్నది. అయినను వల్లభాయిపటేలుగారి ముందున్నసమస్య యింతకన్న స్వల్పమైనది.

---

# బార్డోలీ విజయము.



## మూడవ యధ్యాయము.



"బార్డోలీయుదంతము."

"పన్నులు అంతఃపురములలో గ్రంథములమధ్యనుండు సిద్ధాంతులచే (Thearsts) శాసింపబడరాదు. శాస్త్రప్రయోగమునకివి దొరకవు. ఒక్క సెటిల్‌మెంటుయుద్యోగియే వానిని గ్రామములలోను, పొలములమీదను నిరుపద్రవకరముగా నడుపగలడు."

ఇది భారతప్రభుత్వమువారి జనవరి 16 వనాటి తీర్మానము. వెనుకటియధ్యాయములో వివరింపబడినకళంకము యొక్క బార్డోలీతాలూకాకేకాక యింక ననేకతాలూకాలకుగూడ సంభవించెను. బార్డోలీతాలూకాలో గతసెటిల్‌మెంటు 1896 లో జరిగెను; బొంబాయిరాజధానిలోని ప్రస్తుతయాచారము ననుసరించి యిది 1926 లో మరల జరుగవలెను. ఈపని ఎం. ఎస్. జయకరుగారికి వప్పచెప్పబడెను. ఈయన కిదివరలో నిట్టిపనిలో నెట్టి యనుభవమును లేదు. ఈయన 1924 లో తనపనిని ప్రారంభించి యయిదు నెలలలో ప్రభుత్వమువారి కొకనివేదికను పంపించెను. ఈనివేదిక

మీద 1925 జూన్ 30 వ తేదీ కలదు. ఈనివేదిక ప్రభుత్వమువారికి 1925 నవంబరు 11 వ తేదీవరకును పంపబడలేదు. దీనికి కారణము జయకరుగారే యిట్లు చెప్పిరి. "చిత్తు నివేదిక మొట్టమొదట సెటిల్ మెంటుకమీషనరుగారికి పంపించబడెను. కవుళ్లు క్రియములు మొదలగువిషయములను గురించినయధ్యాయములను పై యుద్యోగస్తునిసూచనలనుబట్టి సవరణచేసినతరువాత నవి తిరిగి వారియామోదమునకు పంపబడెను. ఆయన యాకాగితముల నిప్పుడే సరియైన మార్గముద్వారా పోవలెనని తిరిగి పంపించిరి." సూరతు జిల్లాకు కలెక్టరుగానుండి యీయన యిట్లు వ్రాసెను. సహాయసెటిల్ మెంటుఉద్యోగియొక్క నివేదిక సాధారణముగా కలెక్టరుద్వారా పంపించబడును. దాని నాయన పరీక్షించి సెటిల్ మెంటుకమిషనరుకు పంపించును. ఈసందర్భములో కలెక్టరుదొరగారు నివేదికను పరిశోధింపజాలకపోయిరి. ఏలననగా ప్రభుత్వతీర్మానములోనిభాషలో "అసలు కలెక్టరుగారు శలవుమీదనుండుటచే సెటిల్ మెంటుఉద్యోగియే కలెక్టరుగానుండుట తటస్థించెను." అయినను దానిని "సెటిల్ మెంటుకమిషనరుగారు(ఈయనకూడ వెనుక నీజిల్లాకలెక్టరుగారే) కూలంకషముగా పరీక్షించిరి; మొత్తముమీద నీయన దీనిని తిరిగివ్రాసెను." (ఎందుకనగా తనసూచనల ప్రకారము సవరింపబడినను యిది యాయనకు తృప్తికరముగా లేదు.

ఈనివేదికనిచ్చట సంగ్రహపరచెదను. జయకరుగారు ప్రస్తుతపన్నులమీద నూటికి రు 25 చొప్పున హెచ్చుపన్ను వేయవలెననెను; మరియు నీయన 23 గ్రామములను తక్కువ వర్గమునుండి హెచ్చువర్గముకు హెచ్చించెను; దీనిఫలితము గా తాలూకామీద మొత్తపుపన్ను నూటికి ముప్పదిరూపాయిలకు, మించి హెచ్చింపబడెను. రు 5,14,762 లనుండి రు 6, 72, 273 లకు పన్ను హెచ్చింపబడెను. ఈహెచ్చుదలకు యీయన యీక్రిందికారణములను (ఆయనభాష లోనే) సూచించెను.

1 "తపతీవాగు రైలుమార్గము మొదలగు రహదారీలు చాలయభివృద్ధిగాంచెను."

2 "సుమారుగా 3800 జనాభాయభివృద్ధి చెందెను."

3 "పాడిపశువులు, బండ్లు చాల హెచ్చెను."

4 "పక్కాయిండ్లు క్రొత్తగా సంతటను లేచుచున్నవి కనుక నైశ్వర్య మభివృద్ధిమైనది."

5 "కాలీపరాజజాతివారిస్థితి యభివృద్ధి గాంచెను. వారిలో విద్య హెచ్చెను. త్రాగుడు తగ్గెను."

6 "ధాన్యాములధర లపరిమితముగా హెచ్చెను. పత్తి ధరకూడ హెచ్చెను."

7 "వ్యవసాయపుకూలిపనులు ద్విగుణ మయ్యెను."

8 "భూములధరలు హెచ్చెను; కవులుదారు లిచ్చు మక్తాలతో పోల్చి చూచిన భూమిపన్ను రేటు క్రమముగా తగ్గుచున్నది."

తాలూకా మొత్తముమీద గత సెటిల్ మెంటుకాల మునాటిపంటపదార్థముల విలువకంటె నిప్పుడు పదార్థము లవిలువ "రు 15,08,077 చచ్చులేకుండ హెచ్చగుటయే" యీాయన నూటికి ముప్పదిచొప్పున హెచ్చుపన్ను శిఫారసు చేయుట ప్రబల కారణమట.

ఈ నివేదిక దరిమిలాసంవత్సరము ప్రకటింపబడెను. కాదు, కాదు. అపరాధము శమించునుగాక! ఇది ప్రకటింపబడలేదు. ఈనివేదిక లెప్పుడును ప్రభుత్వమువారిగెజెటులలో గూడ ప్రకటింపబడవు. వెనుక రెవిన్యూయుద్యోగియైన శివదాసనీగారీసంవత్సరము మూర్చిశాసనసభలో చెప్పినట్లు "సెటిల్ మెంటుఉద్యోగస్థులనివేదికప్రతు లుచితముగా ప్రజల కందచేయబడవు. సాధారణముగా జరుగున దేమనగా తాలూకాకచేరీలో నొక్కప్రతిమాత్ర ముంచబడును; వ్యవసాయదారు లీనివేదికను గ్రహించి తమ యభ్యంతరములను పంపవలెను. ఇది ధర్మము కాదని నేనుచు నొక్కివక్కాణించుచున్నాను. గ్రామస్థులందరు నెంత వెనుకబడియుండిరో, వా రెంతసోమరులో మన మెరుగుదుము. వారు యిరువదిమైళ్లు తాలూకాముఖ్యపట్టణముకు నడిచి యనేకసారు

లాంగ్లముననే యుండుయాని వేదికను చదువగలరని తలంప రాదు. యథార్థముకు కొన్నిసందర్భములలో మన్లుతుదా (తహసీల్దారు) రొక స్థితిలో ప్రజలా ప్రతులను తీసికొనరాదని యాజ్ఞాపించెను. బార్డోలీని వేదికనుకూడ నిప్లే ప్రజలు తాలూకాకచేరివద్ద చూచుకొనుటకు మాత్రమే నోచుకొనిరి. బార్డోలీతాలూకా కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గమువారు నరహరిపరిక్ గా రధ్యక్షులుగను కుమాల్భాయిమురార్జిగారు కార్యదర్శిగను గల యొకకమిటీని నియోగించిరి. పరిక్ గారు తా మెంతఖరీదయినను యిచ్చి నివేదికయొక్క ప్రతిని కొనెదమని మన్లుతుదారుకు వ్రాసెను. కాని యవసరమున్నచో కచేరీకివచ్చి చదువుకొని విషయములను వ్రాసికొని వెళ్ళవలసినదని వారికి జవాబుచెప్పిరి. ఈరిపోర్టును చదివి కమిటీవారు తాలూకాయంతయు ప్రచారముచేసి సెటిల్‌మెంటుఉద్యోగిగారు 'సత్యములని' కనిపెట్టిన విషయములు చాలవరకు గలసాక్ష్యమును పోగుచేసిరి. పరిక్ గారు నవజీవనుపత్రికలో వ్యాసపరంపరలద్వారా నివేదికను ఖండించిరి. గుజరాతుమహావిద్యాలయపండితుడగు మాల్కానీగారుకూడ మహాత్మునియంగుఇండియాపత్రికలో నిదేవిధముగా వ్యాసములను వ్రాసిరి.

దీనితో తృప్తిపడక బార్డోలీరైతులు 1927 లో మహాసభను గావించి తమశాసనసభాప్రతినిధులైన రావుబ

హాద్దరు భీమభాయినాయిక్ శివదాసనీగార్ల నాయకత్వము క్రింద గొప్పగొప్ప వ్యవసాయదారులందరును 1927 మార్చిలో రెవిన్యూసభ్యుని దగ్గరకు వెళ్లిరి. కాని యాదొరవారు వారిని తృణీకరించిరి. మే నెలలో రావుబహద్దరైన భీమభాయినాయిక్‌గారు సెటిల్‌మెంటుఉద్యోగస్తునివేదికను వివరముగా ఖండించుచు రెవిన్యూసభ్యుని కొక మహజరును పంపించిరి. దీనికిగూడ నాగతియే పట్టెను. 1927 జూలై మాసములో ప్రభుత్వమువారు ప్రజాప్రతినిధ్యమునంతను తుంగలో నూరదొక్కి యొక తీర్మానమును గావించిరి. వారు సెటిల్‌మెంటుకమిషనరుగారిశిపారసుల నంగీకరించిరి; ఈ యుద్యోగి పూర్తిగా మరియొక నూతనవర్గమును సృష్టించి 32 గ్రామముల నందులో చేర్చెను; దీనిఫలితముగా కొన్ని గ్రామములలో పన్నులు నూటికి రు 50 లేక 60 వరకు హెచ్చెను. హెచ్చువర్గములోకి మార్చుట, దానిమీద హెచ్చు పన్ను వడ్డించుట, పంటలకు ముఖ్యముగా ప్రత్తికి ధరలు హెచ్చుట పన్నులు హెచ్చించుటకు తగుకారణమనిన సెటిల్‌మెంటుఉద్యోగిగారితో వీ రేకీభవించి సెటిల్‌మెంటుఉద్యోగిచెప్పిన నూటికి 30 చొప్పునను సెటిల్‌మెంటు కమిషనరు చెప్పిన 29 చొప్పునను కాక నూటికి 22 చొప్పున హెచ్చింపవలెననిరి.

ప్రజలు చూపిన యభ్యంతరములను చర్చించుచు ప్రభుత్వమువారు "1925 లగాయితు ప్రత్తిధర పడిపోయినదనియు" ధరలు "యిప్పు డయిదుసంవత్సరములక్రితమువలెనంత హెచ్చుగానుండక పోవచ్చును" అనియు నంగీకరించిరి; కాని "దామాషా అంకె మొదటి 14 సంవత్సరముల దామాషాకంటె హెచ్చుగానుండు"నని వాదించుచు "ముప్పది వత్సరముల దీర్ఘకాలమువరకు నుండునట్టి పన్నులను విధించుపద్ధతి మాటిమాటికి తారుమారగుచుండు ధరవరలమీద మాత్రమే యాధారపడక ముఖ్యముగా కవుళ్ళు అనగా మక్తావిలువలయొక్క లెక్కలమీదనే స్థిరపర్చబడవలెను." అని ద్రావిడప్రాణాయామ పద్ధతిగా వాదించెను. నూటికి యిరువదిరెండు మాత్రమే హెచ్చించుటలో ప్రత్తిధరలు పడిపోవుటచేతను, మక్తా విలువలు ముందు కొంత తగ్గవచ్చుననియు దయారసమును చూపించిరట:

చివరవాక్యమొకవిధమగు క్షమార్పణవంటిది. మర్మమంతయు దానిపైవాక్యములో నున్నదని నాయభిప్రాయము. సెటిల్‌మెంటు కమిషనరుద్వారా యోచించుచుండునట్టి ప్రభుత్వచిత్తవృత్తి నిది తెలియజేయుచున్నది. రాజధాని యంతటను జరుగు సెటిల్‌మెంటువ్యవహారముల కన్నిటికిని యీ కమిషనరుగారే యధిష్ఠాన దేవత.

సెటిల్‌మెంటుకమిషనరు సెటిల్‌మెంటు ఉద్యోగియొక్క నివేదికను విమర్శించి వ్రాసిననివేదిక దొరకనందున ప్రభుత్వమువారిముందు ప్రజలతరఫున ప్రాతినిధ్యమును వహించినవారు సెటిల్‌మెంటుఉద్యోగినివేదిక కావలెనని మొదటనుండియు మొరబెట్టుచుండిరి. ఈనివేదిక సమస్తమును బట్టబయలు చేయునట్టిది; కనుకనే ప్రభుత్వమువారు దీనిని బుద్ధిపూర్వకముగా గుప్తపరచి యుండిరి. సెటిల్‌మెంటు ఉద్యోగి తనంతటతానే తన నివేదిక "కవుళ్ళు క్రియములు మొదలగు కొన్ని సందర్భములలో సెటిల్‌మెంటుకమిషనరు యొక్క బోధల ననుసరించి సవరింపబడినమీదనే" ప్రభుత్వమువారికి పంపబడెనని యొప్పుకొనెను. అయినప్పటికినియీ సెటిల్‌మెంటుకమిషనరుగారు తన సూచనల ననుసరించి సవరింపబడిన నివేదికను విమర్శించుచు సెటిల్‌మెంటు ఉద్యోగి యొక్క నివేదికలోని ప్రధానాంశములనే త్రుంచివేసెను, అతడీక్రిందవిధముగా కఠినవిమర్శను గావించెను.

"మనమిప్పుడు జయకరుగారు క్రొత్తపన్నులను గురించిచేసిన సూచనలకు వత్తము. ఆయన మరియు కేవలము పంటలయొక్క మొత్తపువిలువమీదనే తన దృష్టిని యుంచుట చాలవిచారకరము. 57 వ పేరాలో నతను సంగ్రహపరచిన సామాన్యపరిస్థితుల సందర్భములో భూములధరలు, మక్తాలు పెరిగెనని యొక్కవాక్యములో మాత్రమే చెప్పెను;

యధరలు క్రమముగా పెరిగెనని మాత్రమే చెప్పి మక్తావిలు వలతో పోల్చిన పన్నులరేటు తగ్గిపోయినదని వ్రాసెను. ఇక్కడ దీనికాధారమేమియు చూపబడలేదు. దీనిని నిర్ణించుటకును యిదమిద్ధమనునిరూపణ మేమియును చేయబడ లేదు. సెటిల్‌మెంటు నివేదికలో నిట్టియవకతవక నెవరును యూహింపరు. ప్రభుత్వమువారు పన్నును వస్తురూపక ముగా తీసికొనునెడల దానివిలువ ద్రవ్యరూపములో చాల యెక్కువగా నుండెడి (మనకందరకు తెలిసినదే) దనువిష యమును రుజువుచేయుటకు రెండుపుటలువ్రాసెను. అతడు తాలూకాలోని మొత్తపుపంట రు 15 లక్షలు పెరిగియుండు నని వ్రాయుచు, నప్పుడు కళ్ళుతెఱచి బహుశః యిదంతయు సందర్భశూన్యమనియు ఖర్చులుకూడ నిదేవిధముగా పెరిగిన చో నెక్కువపన్ను కట్టుట కాస్కారముండదనియు గ్రహిం చెను. పైగా ఖర్చులు 15 లక్షలుకాక 17 లక్షలవరకు పెరి గినచో పన్నులను విధిగా తగ్గించుటకు కూడ న్యాయము న్నది. కనుక జయకరుగారు పంటల నుత్పత్తిచేయుటకయిన హెచ్చుఖర్చులకంటె వాటి ధరవరల హెచ్చుదలయే యెక్కు వైనదనికాని లేదనికాని యెట్లు స్థిరపర్చగలరు? "ఈవిషయ మును మన ముపేక్షింపరాదు! అనుటకంటె నతడేమియును చెప్పజాలడు. ఇట్లు కోటయొక్క సింహద్వారము నతడు పూర్తిగా తెఱచివేసెను. పెరిగినధరలకంటె పంట లనుత్పత్తి

చేయుటకగు ఖర్చులే హెచ్చయినవని వాదించువా రున్నచో నతనియొక్క వాద మంతయు నొక్కసారి కూలిపోవును.

జయకరుయొక్క నివేదికలోని 57 వ పేరా మొదలు 65 వ పేరావర కంతయు నసంబద్ధముగానున్నది. అంతే కాదు. అది తన సూచనలలో న్యాయము లేదనుటకు తగి నవ్యతిరేక వాదమును కూడ స్ఫురింపచేయుచున్నది. 65 వ పేరాచివరకు వచ్చుసరికి రాబోవు 30 సంవత్సరములకు పన్ను విధించుటలో గల కష్టము నతడు చూడగలిగెను. అది మానవశక్తి కతీతమైనదని ప్రభుత్వము వారికి తెలియును. 30 వత్సరముల కొకసారి సెటిల్మెంటు కట్టుపద్ధతిని ప్రభుత్వమువారు ప్రయత్నింపకూడదు. సెటిల్మెంటుల స్వభావ మెంతమాత్రమును తెలియకపోవుటచేతను, వాటిని నిర్మించుట కొకసిద్ధాంతముగాని చట్టముగాని లేకపోవుటచేతను పూర్వకాలమున నిది యవలంబింపబడెను. కాని సెటిల్మెంటును పంటలయొక్క మొత్తపురాబడిని పురస్కరించుకొని స్థిరపరచుచో మనస్థితి యథార్థమ్ముగా నుండును. మొత్తపుపంట విపరీతముగా నభివృద్ధిచెందెనని యతడు చూపి యీ కారణముచే నూటికి ముప్పదిమూడు చొప్పున తీసికొనవచ్చునని నిశ్చయపరచెను. కాని ధరలు నిలబడియుండవని యతడెరుగును అధికపన్నులను విధించె ననునింద నతడు తన మీద వేసికొన నిచ్చగింపక కొసంతైనను కారణము చెప్పకుం

డ పిరికితనముచే నూటికిరువదియైదు హెచ్చించుట 'యుక్తమని ధర్మమని' తృప్తిపడెను. ప్రభుత్వము నూటికి 75 వరకు హెచ్చుపుచ్చుకొనవలసినచో నితడు 65 'చాలధర్మమనియు న్యాయమనియు' చెప్పి యుండెడివాడు. నిజమేమనగా నితడు చుక్కాని, దిగ్దర్శనీయంత్రము లేనియోడవలె ప్రయాణము చేయుచున్నాడు."

పైనుదహరింపబడిన విషయములను బట్టి ప్రభుత్వము వారిట్టి యమూల్యమైనప్రచురణల నేల దాచియుంచిరో బోధపడ గలదు. సెటిల్మెంటుఉద్యోగి కెట్టి యాధారమునులేనిచో ప్రభుత్వముహారికిని నూటికిరువదిరెండు చొప్పున హెచ్చించుట కాస్కారము కాన్పించదు. జయకరువలె వారుకూడ "కాసంతైనను కారణమును చూపకుండ పిరికితనముచే" నూటికి 22 "న్యాయమని ధారాళమని" తృప్తిపడిరి.

సెటిల్మెంటుకమీషనరైన ఆండర్సనుగారు జయకరుయొక్క నివేదిక కీవిధముగా స్వస్తిచెప్పి పన్నుల నభివృద్ధిచేయుటకు తగిన యాధారమును కనుగొనిరి. ఈయన గభాలుమని "మనకు యథార్థమైన యాధారము మక్తాలవిలువయొక్కటే" యని కనిపెట్టి జయకరుయొక్క క్రియములు, మక్తావిలువలు మొదలగువానిని యథార్థములని యొప్పుకొని "అధమపక్షము సగము భూమియైనను స్వయముగా వ్యవసా

యముచేయని భూస్వాములదే" యని యనుకొని మక్తావి లువల యాధారముపై నూటికి 29 శిఫారుసులు చేసెను.

జయకరు, అండర్సనుగార్ల నివేదికలలో దేనిని సమర్థించుటో తెలియక ప్రభుత్వమువారు ముందు గొయ్యి, వెనుక నుయ్యివలె బాధపడి చివరకు నూటికి 22 చొప్పున శిఫారుసుచేసి బయలుపడిరి.

ఈ హెచ్చుపన్నును బార్డోలీపై ప్రయోగించినపరిస్థితులలో కొంతకళంక మున్నది. 1903 మే 5 వ తేదీనాటి నెం 2973 ప్రభుత్వతీర్మానము క్రొత్తపన్ను గతించు సెటిల్ మెంటు కాలములోని చివరవత్సరముతో గాక క్రొత్తసెటిల్ మెంటుకాలములోని ప్రథమవత్సరములతోమాత్రమే ప్రారంభమగునని విధించుచున్నది. భూమిపన్నును గురించిన కోడ్‌లో (స్మృతిలో) క్రొత్తసెటిల్ మెంటును ప్రారంభించు సంవత్సరములో "ప్రాతపన్నుకును క్రొత్తపన్నుకును గల తేడా(క్రొత్తపన్ను హెచ్చయినపుడు) తిరిగి వాపసుకాబడవలెను; క్రొత్తపన్ను తరువాత వచ్చు సంవత్సరమునుండి మాత్రమే వసూలుచేయబడవలెను" అని 104వ సెక్షనుస్పష్టముగా విధించుచున్నది. కనుక ప్రభుత్వతీర్మానమును 104 వ సెక్షనునుకలిపి చదివినచో బార్డోలీలో క్రొత్తపన్నులను 1927-1928 లో ప్రవేశపెట్టి 1928-29 లో అనగా ఫిబ్రవరి 1929 లో వసూలుచేయవలెను. 104 వ సెక్షనునుండి తప్పిం

చుకొనుటకు పైనుదహరింపబడిన ప్రభుత్వ తీర్మానముకు వ్యతిరేకముగా 1927-28 లోనే క్రొత్తపన్నులను వసూలు చేయుటకుగాను, క్రొత్తసెటిల్మెంటు 19 వ జూలై 1927 లోనే (1926-1927 సంవత్సరములోని చివరమాసము) ప్రవేశపెట్టబడెను.

---

# బార్డోలీ విజయము.



## నాలుగవ యధ్యాయము.



"ప్రజావాదము."

"తప్పు ప్రజలే యనేకసార్లు ఒప్పు చేసినవారగుచుండుట ప్రజాజీవితములో నొకవిషాదచరిత్ర"

స్పెక్టేటరు.

వెనుకటి యధ్యాయములో సంగ్రహపరచిన మూడు ప్రభుత్వపత్రములలోను పన్నులను హెచ్చించువాదము కలదు. ఇవి యొకదానికొకటి వ్యతిరేకముగా నున్న వనుసంగతి కొంతసేపుమరచి సత్యాగ్రహము ప్రారంభించినదిలగాయతు ప్రభుత్వోద్యోగు లిచ్చిన వాఙ్మూలములు, ఉపన్యాసములు మొదలగు వానిలో నున్నవాదములకు ప్రజ లేమిప్రత్యుత్తరము నిచ్చిరో చూతము. రైతులవాదములనన్నింటిని సమర్థించిన బ్రూమ్‌ఫీల్డుకమిటీవివేదికను లక్ష్యమందుంచుకొనినచో ప్రభుత్వవాదమును మనము విమర్శింపబూనుట నిష్ప్రయోజనము. కనుక నేను ప్రజావాదమును సంగ్రహపరచెదను.

జయకరుగారిహేతువులను మొదట తీసికొనుదు:—

1 గతసెటిల్‌మెంటుతరువాత తెరువబడినతపతీరైలు మార్గమును గూర్చి ఘనముగా మాట్లాడిరి. అందర్సనుదొర

వారుకూడ నీవత్సరపుశాసనసభలో మాట్లాడుచు రైలుమార్గమువల్ల కలిగినలాభమునుగురించి విజృంభించిరి. 1896 లో సెటిల్ మెంటునివేదికను తయారుచేసిన ఫెర్నాండిసుగారికి త్వరలో రైలు వచ్చుచున్నదని పూర్తిగా తెలియుననియు క్రొత్తపన్నులను విధించునపుడు, విశ్వాసముగలప్రభుత్వసేవకునివలెనే, యతడు దానివలన ముందుకలుగబోవులాభములను పూర్తిగగమనించె ననియు జయకరు, ఆండర్సనుగార్లు విస్మరించిరి. ఆయన "బి. బి. సి. ఐ. రైల్వేకంపెనీయేజంటు వలన ముందుసంవత్సర మిదేసమయములో నీమార్గము ప్రారంభింపబడునని నేను తెలిసికొంటిని. అయిదుసంవత్సరములలో బార్డోలీ సూరతుతో రైల్వేసంబంధమును కలిగియుండును. క్రొత్తసెటిల్ మెంటును ముప్పదిసంవత్సరములవరకును మార్చుటకు వీలుండదు. కనుక ప్రస్తుతపరిస్థితుల ననుసరించి క్రొత్తగా నెంతహెచ్చుపన్ను విధించవలసియుండు ననుసందర్భములో ముందువచ్చురైల్వేలాభములను సరిగా గుర్తించుట యుక్తమే యని చెప్పక తప్పదు." ఫెర్నాండిసు పన్నులను స్థిరపరచునపుడు రైతులకు దీనివలన కలుగునని తాననుకొనినలాభమును పూర్తిగా యోచించెను. అతనితరువాతవచ్చినవారు రైతుపై మరల పన్ను వేయవలెనని శలవిచ్చుచున్నారు.

2 గతసెటిల్మెంటుతరువాత క్రొత్తగా వేయబడిన రోడ్డులవిషయమై యవి స్థానికనిధులలోనుండియే వేయబడిన వని మనము గుర్తించవలెను. వాటిలో చాలవరకు కలనల్ ప్రిస్కాటుకాలమునాటిరోడ్డులకంటె బాగుండలేదు. వానిని గురించి "నర, పశుజాతులగుండెలను బ్రద్దలుచేయుటకు యోగ్యమైనవి." అని యతడు వర్ణించెను. అతడు చెప్పినట్లు మంచి ఋతువులో మామూలుకాలిబాటలు మనుష్యులస్వల్పావసరములకును, పశువులపాదములకును 'రెండవతరగతిరోడ్డులు' అని పిలువబడుఛండాలపురోడ్లకంటె బాగుండును. "బార్డోలీ మనచేతులలోనికి వచ్చినతరువాత నది చెల్లించిన విపరీతమైనహెచ్చుపన్నును తలచితిమేని దానికి మనము దయ చూపకతప్పదు" అని యతడనెను. ఇప్పుడు ప్రభుత్వము వారు రైతుమీద హెచ్చుపన్ను వేసి తమదయను వొలక బోయుచున్నారు.

3 ముప్పదిసంవత్సరములలో 3800 మంది జనాభా హెచ్చిరనువాదము అప్రస్తుతము. ఇచ్చటకూడ నీసంఖ్య అపార్థమునకు సావకాశము నిచ్చుచున్నది. ఈహెచ్చుదల నాలుగయిదుగ్రామములకే చెందును. ఇవి వర్తకస్థానము లేక పట్టణప్రాంతములు. గ్రామములలోమాత్రము జనాభా చాల తగ్గిపోయినది.

4. పాడిపశువులు హెచ్చినవట! అనగా ప్రజలు పొట్టపోసికొనుటకు పాలు, పెరుగుల నమ్ముకొనుట మొదలగువృత్తుల నవలంబింపవలసివచ్చెను. జయకరుగారు తనంతట తా నంగీకరించినట్లు సాగులోనికి వచ్చినభూమి హెచ్చినను వ్యవసాయపుపశువులసంఖ్య తగ్గిపోయె ననుహంశము గమనార్హము. బండ్లు హెచ్చినవట! 1896 లో వీటినిగురించి 'లెలీ'యనుసూరతుకలెక్టరు యిట్లు చెప్పెను. "ప్రతిప్రత్యేక వ్యవసాయదారుకు నాగలి యెంతముఖ్యమో బండికూడ నంతముఖ్యము. క్రొత్తబండి యనగా నొకచిన్నవ్యవసాయదారొకబండిని కొనుటకు తగినధనమును చేకూర్చుకొనె నని యర్థము; కాని సాధారణముగా నది మరియొకప్రత్యేకవృత్తి యనిమాత్రమే గ్రహించవలెను. ఇట్టిసందర్భములలో నది తాలూకాలోని యైశ్వర్యముకు కూడీకగాక ధనమును తండ్రి యాస్తిలోనుండి తనవిభక్తకుమారునకుగాని కుమారులకుగానిపంపకము చేయుటవంటిది."

5 "క్రొత్తయిండ్లు బాగుగా కట్టబడినపక్కాభవనములు" యైశ్వర్యాభివృద్ధిని సూచించుచున్న వనువాదము గ్రామస్తులను వారియార్థికస్థితులను గురించి కనుగొనకుండగ జయకరుగా రెంతనిర్లక్ష్యముగా విచారణ సలిపెనో విశదము చేయుచున్నది. ప్రజలతో నెక్కువయనుభవము, సానుభూతి గలిగినలెలీగారు 1896 లో నిట్లు చెప్పెను. "ఇండ్ల అభివృద్ధి

చెందుట, జీవితము ప్రియమగుటకంటె ప్రజలు వీటికొరకు చేసినఋణభారము దుస్సహముగా నున్నది. మస్తుతుదారు తాలూకాలోనివ్యవసాయఋణము నూటికి రు 12 చొప్పున 33,76,000 అనగా సాలీనా 4,05,120 ధనప్రవాహమని యంచనా వేసెను. అతడు హెచ్చు చెప్పలేదని నాయభిప్రాయము. ఋణము లేకుండ స్వేచ్ఛగానున్నవ్యవసాయదారు దొరకుట బహుదుర్లభము. అధమపక్షము సగముభూమి మైనను తాకట్టులలో నున్నది.” ఈఋణగ్రస్తత చాలహెచ్చిపోయి భీనుభాయినాయిక్‌గారు చెప్పినట్లు కోటిరూపాయిలకు సమీపించినది. లెలీగారు జీవితము ప్రియమయ్యెననియు ఖర్చులు హెచ్చెననియు గ్రహించెను. జయకరుగారు దీనిని గమనింపలేదు. “ప్రస్తుతకాలము వారు వెనుకటివారివలె కష్టపడకపోవుటచే వారికంటె నెక్కువవ్యయపరిదములగు రుచులకు మఱగిరి; వాటి ననుభవించుటకు యింట్లో ధనము లేనిచో వారు షాహుకారువద్దకు పరుగెత్తుదురు. పూర్వము వ్యవసాయదారులందరును దేశీయవస్త్రములనే ధరించుచుండిరి. ఇప్పుడో! వారికి తళుకుబెళుకులుగల మ్యాంచెష్టరువస్త్రములు కావలెను. స్థానికముగా పండుచవుకధాన్యము, పప్పు, బెల్లమువగైరాలు నిత్యాహారమునకు చాలును. ఇప్పుడో! వివిధములైనశాకపాకములు, దిగుమతిమైనబియ్యము, సంస్కరింపబడినచక్కెర కావలెను. ఇంతకంటె భోగపురుషులకు

తాంబూలసామగ్రి, సారాకరులు, తినుబండములు, చుట్టలు, సిగరెట్లు, అమెరికాదేశపుగడియారములు మొదలగునవి కావలెను. విటికొరకు వారు అప్పుచేయుదురు."

6. రానిపరాజజాతి త్రాగుడు మానివేయుట, ఖద్దరు ధరించుట మొదలగు నాత్మసంస్కారవిధులను గావించుకొని యభివృద్ధిచెందినమాట సత్యమే. కాని వారికింకను బ్రతుకుటకుమాత్రము తగినంతకూలి దొరుకక నందరును ఋణములలో మునిగియున్నారు. వారియభివృద్ధి నాశించుదయగల ప్రభుత్వమేయైనచో వారిసంస్కారప్రియత్వమును శిక్షించుటకు మారుగ బొత్తిగా పన్ను చెల్లింపనక్కరలేకుండ వదలివేయవలెను.

7. ఆహారపదార్థములయొక్కయు, ప్రత్తియొక్కయు ధరలు పెరుగుట నిజమే. కాని ధరలు మరల పడిపోయె నని ప్రభుత్వమువారు కూడ నొప్పుకొనిరి. ధర యెంతయెక్కువగా విపరీతవత్సరములలో పెరుగునో యంత యధోగతికి మరల పోవునని యనుభవజ్ఞులు చెప్పినముక్కలు కేవలము సత్యములు. సెటిల్‌మెంటుఉద్యోగి తీసుకొనినయంకెలన్నియు 1914-1923 వరకుగల విపరీతసంవత్సరములకు చెందును. రెవిన్యూసభ్యు డిట్టిసంవత్సరములను లెక్కలోకి తీసికొనరాదనిస్పష్టముగా చెప్పెను. "విపరీతసంవత్సరములలోని మక్తా లెప్పుడును వదలివేయబడును." అని యతడు శాసనసభలో

నుడివెను. తాలూకాలోని పంటలవిలువ విపరీతముగా పెరిగె నను సిద్ధాంతమును సెటిల్మెంటు కమీషనరుగారే కష్టపడి చాటించిరి. ప్రజలవాద మేమనగా ఉత్పత్తికగుఖర్చులు విపరీతముగా పెరిగిపోయెను; పెద్దపెద్ద భూస్వాములకు గూడ ననేకచోట్ల నికరలాభ మెంతమాత్రమును మిగులుట లేదు; ఇక నార్థికముగా నిరుపయోగమగు ప్రదేశమాత్రపుభూము లు గలవారిసంగతి యేమిచెప్పవలెను? తాలూకాయంతయు సంచారముచేసిన కాంగ్రెసువిచారణసంఘమువారు వ్యవసాయము దండుగవ్యాపారమనియు, ఉత్పత్తి చేయుటలో పెరిగిన హెచ్చుఖర్చులు లాభమును మిగుల్చుట లేదనియు ఋజువుచేయుటకు ముఖ్యగ్రామములనుండి చాలసాక్ష్యమును తయారుచేసిరి. ధరవర లన్నింటికి హెచ్చినప్పుడు వ్యవసాయదారు, వ్యవసాయదారుకానివాడు కూడ సమముగానే బాధ నొందుదురు. తనకు కావలసినపంటల నన్నిటిని వ్యవసాయదారు పండించడు. చిన్నవ్యవసాయదారులు తమపంటల నమ్ముకొనక వాటితోనే కష్టముమీద పొట్టపోసికొందురు.

8. భూమిధరలు, మక్తాలు పెరిగెననువాదము మరల విపరీతసంవత్సరములకు చెందినలెక్కలపై నాధారపడుచున్నది; సెటిల్మెంటుగ్రంథము విధించినవిధమున నెట్టిపరిశోధనయు లేకుండ లెక్కలుతయారు చేయబడెను. సెటిల్మెంటు ఉద్యోగియు, కమీషనరును నిరాధారమైనట్టియు, నిజా

యితీలేనట్టియు లెక్కల నాధారము చేసికొని క్రొత్త సెటిల్ మెంటును తయారు చేయుచున్నా రని ప్రజాప్రతినిధు లనేక సార్లు ప్రభుత్వమువారికి తెలియజేసిరి. కమీషనరుగారి నివేదిక రాగానే యీగ్రంథకర్త నివేదికలోనున్న కొన్నివాక్యములనుబట్టియే యంగుఇండియాపత్రిక జయకరుగారియొక్క వాదము లవసరమైనపరిశోధనలు సలుపకుండ చేయబడినవని ఋజువుచేసెను. సెటిల్ మెంటుగ్రంథముప్రకార మీయాఫీసరుగారు "గ్రామగ్రామములోను, ఫిర్కావెంబడి ఫిర్కాలోను జాగ్రత్తగా స్థానికవిచారణలను గావింపవలెను." కాని యీక్రిందివిధముగా జరిగెను. అతనినివేదికమీద 30-6-1925 తేదీ కలదు. దీనిని వ్రాయుట కధమము పదిహేనుదినములు పట్టిన దని యనుకొనినచో నితడు విచారణను (చేయవలసిన పొలములమీదకాక తాలూకా కచేరీలో) పదిరోజులలో చేసినట్లు తాలూకా మస్తుదారు పెత్తందార్లకును, గ్రామమున సభలకును జారీచేసిన సర్క్యులరువల్ల తెలియగలదు. దీనిమీద 1-6-1925 తేదీ కలదు. "జయకరుగారు స్వయముగా నాల్గవతేదీ లగాయితు యిచ్చట మకాంచేసి మీచే తయారుచేయబడిన కొన్నివివరములను పరిశోధింతురు" కనుక పైసర్క్యులరు "అందినతోడనే" వారు రావలెనని యాజ్ఞాపింపబడిరి. ఈనివేదిక కమీషనరైన ఆండెర్సనుగారికి దిద్దుబాట్లకొరకు, అశాస్త్రీయముగా పంపబడెను. ఈయన

“యీనివేదికనంతను తిరిగి వ్రాసెను” అని ప్రభుత్వము వారే మనకు చెప్పిరి దీనినిజస్వరూపములో నిది 11-11-25 తేదీని పంపుకొనబడెను. అక్టోబరు 2 వ తేదీని తాలూకా వద్ద “నేను మీరు తయారుచేసినక్రియములను గురించిన లెక్కలను సరిచూడవలెను” కనుక హాజరుకావలెనని మస్లుతుదారు అక్టోబరు 23 వ తేదీని మునసబుల కాజ్ఞాపించెను. ఆండర్సనుగారు జయకరుగారిని మరింత జాగ్రతగా పరిశీలించవలసిన దని సూచించుటచేతనే యీసర్క్యులరు పుట్టెను. జయకరుగారప్పుడు కలెక్టరుగా నుండుటచే నీపని చేయజాలక మస్లుతుదారును చేయుమనెను. ఇది ఆండర్సనుగారి కెంత మాత్రమును రుచింపలేదు.

“ఇంతేగాక నీలెక్కలను చాలవరకు మస్లుతుదారే తయారుచేసి యతడే తిరిగి సరిచూచెనని యుత్తరప్రత్యుత్తరములలోని కొన్నివాఙ్మూలములవల్ల తెలియుచున్నది. ఈవిధముగా మస్లుతుదారు సరిచూచుట యనగా సాధారణముగా నతనిగుమాస్తాయో సర్కిల్ యిన్స్పెక్టరో సరిచూచుట; క్రియములు, మక్తాలుమొదలగులెక్కలసందర్భములో సెటిల్మెంటుఆఫీసరు స్వయముగా పరీక్షించవలసియుండగా నిట్లుచేయుటలో నర్థములేదు.” అని ఆండర్సను వ్రాసెను. ఈపరీక్షయంతయు నెంతనిర్లక్ష్యముగా గావింపబడినదో ఆండర్సను దొరగారే స్పష్టపరచిరి.

నావాదమును నేను బలీయమైన పరిస్థితుల సాక్ష్యము తో బలపరచి యుంటిని. సెటిల్‌మెంటు ఉద్యోగి తాలూకా లో పని ప్రారంభించినపుడు "తాలూకాలోనిపన్నులను సవ రించుటకు ఆఫీసరుగారు విచారణ సలుపుచున్నారు. కనుక నెవరుగాని యేసర్వేనెంబరుయొక్క ఆర్థికపరిస్థితులను గురిం చిగాని చెప్పుకొనవలసిన దేదైన నున్నచో వ్రాతమూలకము గగాని వాచాగాని వారికి తెలియచేయవలెను" అను విజ్ఞ ప్తిని ప్రజలకు పంపవలెను. జయకరుగా రిట్టిదేమియు చేయ లేదు. ప్రజలు చెప్పుకొనవలసినవిషయములకవకాశమీయ లేదు. 1924 డిశెంబరులోను 1925 జనవరిలోను మన్లుతువా రు మునసబుల కిచ్చిన ఆర్డర్లలో ననార్థికవ్యాపారములను వద లివేయవలె నని యుపదేశించి యుండ లేదు. ప్రభుత్వమువా రు చూపినలెక్కలు సరియైన వనుకొనినను భూములధరలు వాటినిజమైనవిలువను కాక భూములను కలిగియుండవలె నని కొనువారికున్నయుపద్రవకోరికనుమాత్రమే వెల్లడిచేయుచు న్నవి. దక్షిణాఫ్రికానుండి తిరిగివచ్చినవారు అన్నిటికంటె భూమిమీద పెట్టుబడి పెట్టుట శ్రేష్ఠ మనుకొనిరి. వీరు తెలివి తేటలు గలవ్యాపారస్తులు కాక భూమి కలవానికి పరువుప్రతి ష్టలు కలుగు ననుపూర్వకాలపువిశ్వాసము కలవా రగుటచే నిట్లు చేసిరి. ఐర్లండులోని వ్యవసాయదారులగురించి స్టైఫెను గ్విన్నుగారు చెప్పినదే బార్డోలీవ్యవసాయదారులకును వర్తిం

చును. "ఐర్లండులో వ్యవసాయదారుగ నుండుటయు చేతిపని వాడుగ నుండుటయు నెంతమాత్రము నొకటికానేరదు; ఇక కూలివాడుగ నుండుట కనీసము. వ్యవసాయదారురాబడి కూలివానిరాబడికంటె నెక్కువ లేకపోయినను నతడు మరియొక తరగతికి చెందుచున్నాడు. నీవొకవ్యాపారమును సాగించుచున్నచో ధనము నార్జించుటకే నీవట్లు చేయుదువు. నీ కందులో జయము చేకూరినచో నిన్ను మెచ్చుకొందురు. నీవు వ్యవసాయదారువైనచో నీసేద్యముయొక్క పరిమితియె నీసంపాదనను సంకుచితపరచుచుండును. తక్కువభూమిలో నెక్కువ పంటలు పండించుట బొత్తిగా తెలియదు. వ్యవసాయదారులలో పెద్దవాడ వనిపించుకొనవలె ననినచో, ఐర్లండుప్రజల యభిప్రాయముప్రకారము, నీవు యెక్కువభూమిని కలిగి యుండవలెను. కాని నీవు సంపాదించునట్టి లేక కొనునట్టి భూమి నీ కొకహోదాను కల్పించుచున్నదే కాని యంతగా ధనమును గూడబెట్టుట కది సాధనకాదు. ఐర్లండులో ప్రతిచోట భూమికొక కల్పితమైనవిలువకలదు. కమతముయొక్క పరిమితి తక్కువదై నష్టభూయిష్ట మైనకొలది దానిఖరీదుకున్ను నర్థకపువిలువకున్ను సంబంధ మేమియు నుండదు." పంటలు రు 15,000,00 ల వరకు హెచ్చిననని చెప్పువాద మన్నిటికంటె నధ్వాన్నమైన దని లెక్కలేనన్నిసార్లు ఘోషింపబడెను. జయకరుగారి లెక్కలప్రకారము క్రొత్తసెటిల్ మెం

టుకాలమునాటివత్సరములో మొత్తం వ్యవసాయపుపంట యొక్కవిలువ యంతయు 28 లక్షలరూపాయిలచిల్లర. ఇది మొత్తంపంట. ఇది 1896 లోని పంటకంటె 15 లక్షలు హెచ్చైనని జయకరుగారు వాదించిరి. కనుక 1893 లోని మొత్తపుపంటవిలువ రు 13 లక్షలే యైనచో ప్రభుత్వమువారి ప్రస్తుత "గోనెకు అంకెములు" లాగే దారుణపన్నులవిధానములో కూడ వెనుకపన్నుమొత్తమును సమర్థించుట కెంతమాత్రమును సావకాశములేదు. ప్రభుత్వమువారు మొత్తం పంటలో నూటి కిరువదికంటె నెక్కువ యెప్పుడును తమభాగముక్రింద వసూలు చేయలేదట; కనుక పంటవిలువహెచ్చినదని జయకరుగారు చెప్పినవాదము ఆండర్సనుగారు చూపించినదానికంటె కూడ చాల యథ్వాన్నముగా నున్నది.

కనుక జయకరుగారిమీద ప్రజలు మోపునింద లేవియనగా నతడు మునసబులు తయారుచేసినలెక్కలమీద నాధారపడెను. అతడు భూములమీదకు పోయి విచారణసలుపలేదు. అత డెట్టితనిఖీచేసియుండలేదు. ప్రజలయొక్క ఆర్థిక పరిస్థితులనుగూర్చి విచారణవంటిదానిని దేనిని సలిపియుండలేదు.

నూటి కిరువదిరూపాయిలచొప్పున పన్ను హెచ్చించుట కతడు చూపినకారణములు సత్యశూన్యములు. పరిహాస పాత్రములు. ఇక సెటిల్మెంటుకమిషనరుగా రాధారపడిన

వాదము కలదు జయకరుయొక్క నివేదిక నతడు త్రోసివేసి నట్లు వెనుకటియధ్యాయములో చూచి యుంటిమి. క్రియము లను గురించిన లెక్కతనిఖీ సరిగా జరుగలేదని యిత డాక్షే పించెను. ఆశ్చర్య మేమనగా నిత డిప్పుడ్వారిసి మక్తాలనుగురిం చిన యీలెక్కలనే పురస్కరించుకొని యివి 'ఒక్కటే యథార్థమైనతోవ చూపునవి' అని వీటిపై నాధారపడెను. మొత్తంపంట విలువయొక్క హెచ్చుదలపై నాధారపడుట నిరుపయోగ మని యిత డెఱుంగును. జయకరువలె దీనిపై నాధారపడి పన్ను హెచ్చించకూడ దని యిత డెఱుంగును. 'వ్యవసాయలాభములు' అనుపద మీయనకు గిట్టదు. భూమిపన్నును విధించునపుడు "వ్యవసాయలాభములను" గమనింపవలె నని విధించు 107 వ సెక్షనుకూడ నీయనకు గిట్టదు. కాని పన్నును హెచ్చుచేయుటకు శిఫారసు చేయవ లె ననిమాత్రి మీయనకు తెలియును. కనుక మార్గాంతర ములేక నీయన తప్పుడులెక్కలమీదనే యాధారపడవలసి వచ్చెను కాబోలు?

మక్తాలెక్కలు (ధనరూపమునగాని ధాన్యరూపమున గాని) "అతివిస్తారముగా నుండి" బాగుగా పరిశోధింపబడిన నేకాని పన్నులభారమును నిర్ణయించుటలో ముఖ్యాంశము లుగా తీసికొనబడరా దని సెటిల్మెంటు ఉద్యోగులకు స్పష్ట ముగా విధింపబడెను. అయినను యీలెక్కల నెక్కువలాభ

ముకొరకు వినియోగించుకొనవలె ననుత్తొందరలో నీయన యీసంగతి మరచిపోయెను. 1918 లగాయితు 1925 వరకు నున్న 7 వత్సరములలో 49,923 యకరములు కవులుకీయబడె నని జయకరు వ్రాసినలెక్కలను చూచి ఆండర్సనుగారుయివి "యతివిస్తారముగానున్నవి" అని యూహించి మొత్తంభూమిలో నథమపక్షము సగముభూమి స్వయముగా వ్యవసాయము చేయనిభూస్వాములది" అని యనుకొనెను. ఒకవంక జయకరుగారు సాగులోనున్న 97,500 యకరములలోను 22,995 యకరములుమాత్రమే వ్యవసాయముచేయనిభూస్వాములచేతులలో నున్నదనియు "వ్యసాయముచేయువారిచేతిలో రెండువంతులకు పైగా నున్న"దనియు వ్రాయుచున్నను వీరి బుద్ధి యిట్లు వక్రించెను. ఈతప్పునుగూర్చి పత్రికలలో నెలల తరబడి విమర్శనలు జరుగగా జరుగగా చివరకు ప్రభుత్వము వారు ఆండర్సనుగారితరఫున నొక హాస్యాస్పదమగు కుంటి సమాధానము నిచ్చిరి. "ఒకయకరము సంవత్సరముకు రు10 చొప్పునసంవత్సరముకు నొక్కొక్కప్పుడు రెండేళ్ళు, పదేళ్ళు. కవులుకు తీసికొనబడుచున్నట్లు జయకరుగారు కనిపెట్టిరి. ఆయన వీటిని వరుసగా యకరము రు 10 కు, రెండుయకరములు రు 20 కు, 7 యకరములు రు 70 కు కవుళ్ళు అని పేరు పెట్టెను. దీనివలన నొక్కొక్కపుడు యకరము యేడుయకరము లగును. కాని యన్నికవుళ్లు 7 వత్సరములకు లేవు. ఒక

సంవత్సరముకే యున్నకవుస్తు చాలా కలవు." ఒకసంవత్సరపు కాలము మనవాదము నెట్లుబాధింపగలదు? దామూషామీద పాలీనా కవులుకిందనుండు భూమి 42,923 ను యేడుచే భాగించిన తేలుచున్నది. కవులుకిందనున్న మొత్తంభూమి 42,923 యకరములని ఆండర్సనుగారు చెప్పినదానిని మనము విశ్వసించుచో నొకవిపరీతపరిస్థితి యేర్పడుచున్నది. గ్రామములో సాగులోనున్న మొత్తముభూమికన్న కవులుకిచ్చినభూమియే కొన్నిచోట్ల హెచ్చుకావచ్చును. ఈకిందిపట్టికను చూడుడు.

| గ్రామము | మొత్తంభూమి | కవులుకిందనున్నభూమి | |
|---|---|---|---|
| | య | మెట్టభూమి | పల్లంభూమి |
| ఉతార | 1,317 | 2862- 4 | 0- 0 |
| వాధ్వా | 794 | 1,186-21 | 36-11 |
| మియవాడి | 1,057 | 1,185- 0 | 18- 0 |
| ఛెనాన్డ్లా | 751 | 925- 3 | 37-33 |

ఇంతకంటె హాస్యాస్పదమైనది చేరొందుయుండబోదు. కాని ప్రభుత్వముతరఫున సంజాయిషీ యిచ్చు డైరెక్టరుగారు ఆండర్సనుగారు "పైవాజ్మూలమును స్థిరపరచుచున్నారనియు నది యింకను సత్యముకంటె తక్కువ మైపోయినదని వాదింపగలరు." అనియు చెప్పెను. పైవాజ్మూలమును సమర్థించుటకు 4.2,923 యకరములను యభూతకల్పనను విశ్వసింప

మనెదరు. ఈయేమువత్సరములయాంకెకూడ త్రోసివేయదగిన యనేకతప్పుడులెక్కలతో గుదిగుచ్చబడిన దని ప్రజావాదమై యుండ దీనికితోడు "పరిశోధింపబడి తిరస్కరింపబడినటువంటివిన్ని పరిశోధింపబడనటువంటివిన్ని" లెక్కలనుకూడా విశ్వసింపవలె నట! యథార్థ మేమనగా యేకొద్దిమంది అప్పిచ్చుధనికులో గ్రామములలో లేనిభూస్వాములో తప్ప బార్డోలీతాలూకాలో మంచిపాదుపు, మంచిపాటు, బుద్ధివిశేషము గలిగినవ్యవసాయదారులు కలరు. వారియొక్క శుభలక్షణములే ప్రభుత్వదృష్టిలో పాపపుంజము లయ్యెను. 1924 లో భూమిపన్ను విధించుకమిటీముందర అహ్మదునగరుకలెక్టరైన స్మార్టుగారు చెప్పినట్లు "రైతువారీ రాజధానిలో బహుకొద్ది భూమిమాత్రమే కవులు కీయబడును; ఈకొద్దిలోను నథమపక్షము సగమైనను కూడ అన్నిఖర్చులు పోను మిగులునికరలాభమునకు కవులు కీయబడుట లేదు."

కాని సెటిల్‌మెంటుకమీషనరుగారు సెటిల్‌మెంటుపద్ధతులను శాసించుపుస్తకమును త్రోసిపుచ్చి, సత్యములకు స్వస్తిచెప్పి ప్రభుత్వసేవలో తలలు నెరసినస్మార్టు, స్మిత్తు, గ్యారెటు, మ్యాక్సువెల్, మధేకరుగార్ల విస్పష్టమైన యభిప్రాయములను నిరాకరించి "మక్తాలవిలువలు అనునొక్కయథార్థమార్గదర్శి" నే పట్టుకొని వ్రేలాడిరి. అత డక్లేల చేయకుండును? పై నుదహరింపబడిన యనుభవజ్ఞులైన యుద్యోగులతో గూడిన భూమిపన్ను కమిటీవారి పండితాభిప్రాయ

మును తీర్చిపుచ్చిన ప్రభుత్వము తనకు మద్దతుగా నుండు నని యత డెరుంగును. కాని మక్తాలనే యాధారముగా తీసి కొనుచో తామే సెటిల్‌మెంటు ఉద్యోగస్తులకు చేసినబోధలనే గాక భూమిపన్నునుగురించినస్మృతి (code) నికూడ తుంగలో నూరద్రొక్కుచున్నట్లు ప్రభుత్వమువారికి తెలియును. ఏలననగా నందులోని 107 వ సెక్షనులో భూమిపన్నును విధించునపుడు వ్యవసాయలాభములను గమనించి తీరవలె నని స్పష్టముగా శాసింపబడి యున్నది. బార్డోలీ, ఛోరాసీ సెటిల్‌మెంటులనుగురించి 1927 వ జూలైలో ప్రభుత్వమువారు "ముప్పదివత్సరముల దీర్ఘకాలము వరకు మార్పుచేయకుండ నుంచుచున్నట్టి సెటిల్‌మెంటులను మాటిమాటికి మారుచుండునట్టి ధరలపైమాత్రమే గాక ముఖ్యముగా కవుళ్లు, క్రియములు మొదలగువాటిమీదనే కట్టుచుందుము." అని చెప్పి 1928 లో బార్డోలీ-త్యాగ్రహమును గురించి తమతో నుత్తరప్రత్యుత్తరములు జరుపుచుండిన యొకశాసనసభ్యున కిట్లు వ్రాసిరి. "30 వత్సరములక్రితము చేయబడిన సెటిల్‌మెంటు తేదీలగాయితు బార్డోలీతాలూకాలో వ్యవసాయలాభములు నూటి కిరువది రూపాయిలకంటె నెక్కువగా పెరిగెనని గవర్నరుదొరగారు తృప్తి పొందిరి. లాభములు ముఖ్యముగా ప్రభుత్వమువారి కృషివల్లనే హెచ్చినవి. కనుక పన్ను లాభములో భాగము కనుక నన్నియు పోను నూటికిరువై ప్రాప్తికి హెచ్చుపన్ను వడ్డించుట న్యాయము" జయ

కరుగారు సాగు కగుఖర్చులు మొదలైనవి తీసివేసి నికరలాభ మును తేల్చుట కెట్టిప్రయత్నమును చేయకుండుటయే కాక నిట్లు తమకు హక్కు కలదని ప్రభుత్వమువారు దబాయించు ట నేమనదగునో చదువరులే యూహింతురుగాక !

ఇది కేవలము సాహసము. వాదములచేతను, లెక్కల చేతను ప్రజావాద మెంత సమర్థింపబడినను చెవిటివానిముం దు శంఖూదినట్లయ్యెను. ప్రభుత్వవాద మంతయు తక్కువల తడక; బూమ్ఫీల్డుకమిటీవారు దీనినే రుజువు చేసిరి. కనుక ప్రజ లీక్రొత్తసెటిల్మెంటును రద్దు చేయవలసిన దనికోరు టకు హక్కుకలదు. ఇంతేకాక అసలుపన్నును తగ్గించమను టకు కూడ వారికి తగినంతబలము కలదు. సత్యాగ్రహము మంచితీవ్రముగా నున్నపుడు లిబరలుపక్షనాయకుడైన చిం తామణిగారు చూచి పన్నులను రద్దుచేయవలసిన దని సత్యా గ్రహు లేలకోరరాదా యని యాశ్చర్యపడెను. కాని సత్యా గ్రహు లెంతపట్టుదల గలవారో యంతమితమున గూడ గల వానినే తమనాయకునిగా నెన్నుకొనిరి. అతడు వారికి సరి యైనమార్గమును చూపి విషయము నంతను కూలంకష ముగా నిష్పక్షపాతముగా విచారించునట్టి విచారణకొరకు ప్రభుత్వమువారి నొత్తిడి చేయుటయందే వారిశక్తుల నుప యోగింపమని ప్రజలకు సలహా చెప్పెను. ఈవిషయము ముందు అధ్యాయములో చర్చింపబడును.

---

# బార్డోలీ విజయము.



## అయిదవయధ్యాయము.



"ఫిబ్రవరి 12."

"ఓ స్వాతంత్ర్యదేవతా ! రమ్ము ! రమ్ము !
నేడు మామనఃపద్మములను పూరింపుము."

"14 వ జూలైనాటిఫ్రెంచిగీతము."

ప్రజ లింకనేమి చేయవలెను ? 1926 లగాయితు వారు జయకరుయొక్క నివేదికపై నాందోళన చేయుచునే యుండిరి. తాలూకాకాంగ్రెసుకమిటీవారిచే నేర్పరుపబడిన విచారణసంఘము పైనివేదికను పూర్తిగా విమర్శించుచు వ్యవసాయదారులకు భూమిపై ప్రస్తుతము విధింపబడినపన్ను లనైనను భరించుటకు తగినలబ్ధి వచ్చుట లేదని యంకెలతో సప్రమాణముగా రుజువుచేసియున్నారు. వారు 1927 లో ప్రథమచరణములు తమశాసనసభాప్రతినిధియొక్క నాయకత్వముక్రింద రెవిన్యూసభ్యుని దర్శించిరి. తరువాత వీరు ప్రజల యథార్థమైనయార్థికపరిస్థితులను తెల్లముచేయుచు పైనివేదికనుగురించి పూర్తిగా చర్చించుచు ప్రాతినిధ్యములను పంపించుకొనిరి. ప్రభుత్వతీర్మాన మీకొత్తసెటిల్మెంటును ఖాయపరచినతరువాత బార్డోలీలో 1927 సెప్టెం

బరుమాసములో శాసనసభాసభ్యుడగు దాదుభాయిదేశాయి గారి యధ్యక్షతక్రింద వేలకొలది వ్యవసాయదారులతోగూడినమహాజనసభ జరిగెను. పూర్తియైనరాద్ధాంత సిద్ధాంతములు జరిగినతరువాత వారు హెచ్చుపన్నుల నీయగూడ దని యేకగ్రీవముగా తీర్మానించిరి. దీనివలనకూడ లాభము లేకపోయెను. 1928 ఫిబ్రవరి 5 లగాయితు క్రొత్తపన్నులను వసూలు చేయవలసినదని గ్రామమునసబుల నాజ్ఞాపించిరి. వ్యవసాయదారులను చేతనైనది చేసికొనుమనిరి. వారిప్రతినిధులు మరియొకతరహాకు చెందిన నాయకునిగురించి యోచించిరి. అంతవరకు నడిపిననాయకు లిక చేయగలిగిన దేదియు లేకపోయెను. తాము విఫలు లైరనియు యికముందీగాడ స్తపు ప్రతినిధ్యములను మనవులను మాని నూతనవిధానమును త్రొక్కవలసినదనియు వారు సలహా యిచ్చిరి. 1921 లో బార్డోలీని తనయొక్క ప్రథమరంగముగా చేసికొనవలసినదని మహాత్ముని ప్రార్థించిన కళ్యాణజీ, కున్వర్జీ లిద్దరును తాలూకాకార్యదర్శియైన కుషాల్భాయితో కలసి శ్రీయుత వల్లభాయిపటేలువద్దకు వెళ్లి రైతుల నీసత్యాగ్రహసమరములో నడిపించవలసిన దని కోరిరి. రావుబహద్దరు భీమభాయి, రావుసాహేబు, దాదుభాయివంటివారు నడిపించుచున్నచోట తాను కలుగచేసికొనన నని యతడు నిరాకరించెను. వారు వెళ్లి వారిని నడిపించుచున్నవారిసలహాప్రకారం మతనివద్దకే

తిరిగి వచ్చిరి ఈసారి వల్లభాయి పెదమొగము పెట్టక వారిని బార్డోలీ వెళ్ళి మంచిపలుకుబడిగల వ్యవసాయదారులందరిని సంప్రతించి, యంతులేకుండ జరుపవలసియుండునట్టి సత్యాగ్రహసమరములోని మహోపద్రవమును వారి కెరిగించి యప్పుడు వారేమి చెప్పుదురో తనకు తెలియచేయ మనెను. అతనియాజ్ఞానుసారము వారనేకగ్రామములకు పోయి వారికీసంగతులను తెలియచెప్పి వారియభిప్రాయములను తీసికొని తిరిగి అహ్మదాబాదు వచ్చిరి. ఈసారి వారు తమతో దర్బారుసాహేబుగోపాల్దాసు, మోహనలాల్ పాండ్యా, రవిశంకరవ్యాస్ మొదలగు నారితేరిన యోధులను తీసికొని వచ్చిరి సత్యాగ్రహము ప్రకటింపబడినచో బార్డోలీ వచ్చుటకు సిద్ధముగా నున్నామని వీరు తెలిపిరి. సత్యాగ్రహము సల్పుట కందరు నేకగ్రీవముగా నంగీకరించుచున్నారనియు, నుత్సాహపడుచున్నారనియు కాని క్రొత్తగుండి నూతనముగా విధింపబడిన మొత్తముపన్నును గాక అదనముగా కట్టినపన్నునే చెల్లింపకుండవలెననియు చున్నారనియు వీరుచేసిన విచారణవలన తేలినసారాంశ మని వల్లభాయితో చెప్పిరి. "సరే! అంతయు బాగున్నది. మీరు వెళ్ళి 'బాపును' సందర్శించుడు. నేనుకూడ మీవెనుక వచ్చుచుందును. ఇటువంటి యుద్యమము 'బాపు' యొక్క యంగీకారము లేనిదే ప్రారంభింపబడనేరదు. కనుక వారుగాంధిగారివద్దకు వెళ్ళిరి.

ఆత డింతవరకును వారి నంతగా పాటింపక ప్రతిసారి వల్లభాయివద్దకు వెళ్ళుడని చెప్పుచుండెను. కాని యీసారి యతడు విద్యాపీఠమును ప్రతివారము చేయు యుపన్యాస మునకు నడిచి పోవునపుడు చాలసేపు వారితో మాట్లాడెను. కళ్యాణజీ సంభాషణను ప్రారంభించి తాము తాలూకాయంతయు తిరిగితిమనియు, సమరమునకు సంబంధించినంతవరకందరు నేకగ్రీవముగానే యున్నారనియు, కాని వెనుకటిపన్ను మీద వేసినహెచ్చుపన్నును మాత్రమే చెల్లింపకుండుట బాగుండు నని యనుకొనుచున్నారనియు చెప్పెను.

గాంధిజీ:—నాకిది బాగుగా అర్థము కాలేదు.

కళ్యాణజీ:—నూటికి 22 చొప్పున హెచ్చుపన్ను విధించిరి. ప్రజలు వెనుకటిపన్ను చెల్లించి యీహెచ్చుపన్నును చెల్లింప మని యనుచున్నారు.

గాంధిజీ:—ఇది చాలయుపద్రవకర మైనది. ప్రభుత్వమువారు మీ రిచ్చుధనముతోనే మీతో పోరి హెచ్చుపన్ను నొక్కనిమిషములో వసూలు చేతురు. హెచ్చుపన్ను రద్దగువరకు నెట్టిపన్ను చెల్లింపబడకూడదు. మీరు ప్రభుత్వముతో "హెచ్చుపన్ను రద్దుచేయబడిన దని ప్రకటించి వెనుకటిపన్ను తీసికొనుడు; దాని నిచ్చుటకు మేము సిద్ధముగనే యున్నార" మని స్పష్టముగా చెప్పుడు. ప్రజ లిట్టిదృక్పథమును తీసికొనుటకు తయారుగ నున్నారా?

కళ్యాణజీ:—బార్డోలీ, వాలడ్ మొదలగు పెద్ద పెద్ద చోట్ల నెట్లుండునో నేను చెప్పజాలను. ఇచ్చటనున్నవర్తకు లు ప్రభుత్వమువారు తను గ్రామముల నన్నిటిని లాగికొని రాని పరాజజాతివారి కిచ్చివేయుదురని భయపడుచున్నారు. కాని తక్కినగ్రామములు చాలగట్టిగా నున్నవి.

గాంధిజీ:—సరే! బాగున్నది. కాని వారివాదము న్యాయమైనదేనా? వారియభియోగ మభేద్యమైనదేనా?

కళ్యాణజీ:—విధిగా నట్టిదే. దీనిని నరహరి తనవ్యాసములలో విశదపరచెను.

గాంధిజీ:—నాకు తెలియదు. నే నావ్యాసములను జాగ్రతగా చూడలేను. కాని దేశమునంతను మీతో నుంచుకొనవలె ననుసంగతిని మాత్రము జ్ఞప్తియం దుంచుకొను డు. దీనికి మొట్టమొదటి షరతు మనవాదము పూర్తిగా న్యాయసమ్మత మగుటయే. ఇంకొకవిషయము కలదు. ప్రజ లు సమరమునకు సిద్ధముగా నుండవచ్చును. కాని వారికి సత్యాగ్రహముయొక్క యంతరార్థము తెలియునా? మీతో పాటు వల్లభాయిపటేలును కూడ తీసివేసి రనుకొనుడు. వా రప్పుడు చెదిరిపోకుండ నిలువగలరా?

కళ్యాణజీ:—ఇది నా కతీతమైనప్రశ్న.

గాంధిజీ:—సరే! మీరు దీనిని ధృవపరుచుకొనుడు. కాని వల్లభాయి యేమనును?

ఇంతలో శ్రీయుతవల్లభాయి వచ్చెను. అత డాసమ స్యను గురించి యోచించె ననియు నందులో న్యాయ మున్న దనియు చెప్పెను. "అయితే మంచిదే! మన మిక విచారిం పవలసిన దేమియు లేదు. గుజరాతుకు జయ మగుగాక!" అని మహాత్ము డాశీర్వదించెను. కాని శ్రీయుత వల్లభాయి చులకనగా నెట్టినిశ్చయమును చేసికొనజాలకపోయెను. అత డు వెనుక నాగపురము బోర్సదు సత్యాగ్రహమును నడిపిం చెను; కాని సమయము దొరకినపుడెల్ల నిట్టిసత్యాగ్రహము లను నడిపించవలె ననుదురద యతని కెంతమాత్రమును లేదు. 1923 లో నతనితోడిపరిచారకులందరును గుజరాతులో శాసనోల్లంఘనోద్యమమును ప్రారంభించుట కాతురపడిరి. కాని యతడు వారిని వారించుట కెంతమాత్రమును జంకలే దు. 1927 లో నాగపూరుశాసనోల్లంఘనమును నడుపవల సినదని చాలమంది కాంగ్రెసునాయకు లతనిని బలవంతపెట్టిరి. కాని పరికరములలో తగినంత సత్తువ లే దనుకారణమున నత డు దానిని నిరాకరించెను. అత డాలోచించుకొనవలసినవిష యము లింకను కలవు. గతనాలుగైదువత్సరములనుండి యతడు అహ్మదాబాదుపురపాలకసంఘాధ్యక్షుడుగ పని చేయుచుండెను; అతనిపనిని ప్రభుత్వోద్యోగులుకూడ నెక్కు వగా మెచ్చుకొనక తప్పినది కాదు. వారిలో కొందరి కతని యెడల స్నేహభావము, వ్యక్తిగౌరవము కూడ నేర్పడెను.

ఈయన్నిటిని మించినసేవ మఱియొకటి కలదు. అతడు కొద్ది మాసములక్రితమే ప్రభుత్వోద్యోగులతో కలసి గుజరాతులో ఘానునివారణకొరకై పనిచేయగా నతనికార్యాచరణయం దలి పటుత్వమునకు ప్రభుత్వాధికారులు డిల్లపోయి ప్రభుత్వ మువారినుండి మెప్పును బడయుట కంగీకరింపవలసిన దని అహ్మదాబాదుకలెక్ట రతనిని ప్రార్థించెను. ఇట్టిపరిస్థితు లలో నత డేమిచేయవలెను ? పీడింపబడుచున్న వ్యవసాయ దారురక్షణకొరకు తహతహలాడు హృదయముతో నిమేష ములో నిశ్చయమునకు రాగల యోధునివగిది నతడు బా ర్డోలీ పోవుటకు నిశ్చయించెను. అప్పుడయినను నతడు వ్యవ సాయదారులను బాగుగా పరిశోధించకుండ, నేమిసంభవించి నను వా రతనితో చివరవరకు నుందురో లేదో తెలిసికొన కుండ వ్యవహారములోనికి దిగలేదు. కనుక ఫిబ్రివరి 4 వ తేదీని, పన్ను చెల్లించవలసినమొదటివాయిదా కొకరోజు ముందుగా, బార్డోలీతాలూకారైతులసభ కత డగ్రాసనాధి పత్యమును వహించెను. ఒకప్రక్క తగినవ్యవధి లేదు; మరి యొకప్రక్క ప్రాణములతో చెరలాడుటవంటి నిశ్చయమును వేగిరపడి చేయరాదు. మొదట నతడొకప్రచారకులసభను పిలిచి భావికర్తవ్యమునుగురించి వారితో చర్చించెను. వా రేమియు తొందర పడక అధ్యక్షుడు ప్రజలను పిలిచి పరీ క్షలు, క్రాసుపరీక్షలు చేసి యొకనిర్ధారణకు రావలెనని కో

౯౪. కనుక గ్రామప్రతినిధులయొక్క యిస్తాగోష్ఠిసభ పిలువ బడెను. 79 గ్రామములు తమప్రతినిధులను పంపెను. వీరిలో నన్నిజాతులవారు నుండిరి. వీరందరకు ఆస్తులున్నవి; సత్యాగ్రహమువల్ల తమ కేమిసంభవించునో కూడ వీ రెరుగుదురు. భూమిపన్నుక్రింద రు 300 మొదలు రు 500 వరకు చెల్లించువా రిందులో చాలమంది కలరు; ఒకపారశీ యొక్కడే సంవత్సరమునకు రు 700 పన్ను యిచ్చెను వీరు మాటలను నమలలేదు. అయిదారుగ్రామములవారు హెచ్చుపన్నుల నీయకుండుటే తమధర్మమని తలంచిరి. కాని వారు పాతపన్నులను యధాప్రకారముగా చెల్లించి హెచ్చుపన్నువిషయమై ప్రభుత్వమువారిని సవాలు చేయవలె ననిరి. ప్రభుత్వమువారు తమతో సమాధానమును కుదుర్చుకొనువరకును క్రొత్తగా విధింపబడినపన్ను నంతను చెల్లింపరాదని తక్కినవారు నిశ్చయించుకొనిరి. రెండుగ్రామములయొక్క ప్రతినిధులు పరిస్థితుల నతినిర్మొగమాటముగ వర్ణించిరి. "మీరు మీగ్రామమంతటితరఫున మాట్లాడుచున్నారా ?" అని వారిని ప్రశ్నింపగా "నే నట్లే చేయుచున్నాను" అని వారిలో నొకడు దృఢనిశ్చయముతో పలికెను.

కాని మిగతయందరు పడిపోయినచో నీ వేమిచేయుదువు ?"

నేనొక్కడనే నిలబడెదను ! అని యతడు చెప్పెను.

ఇ కొకడు వచ్చెను. అతనినిగూడ నిట్లే ప్రశ్నించిరి. "నా గ్రామము, తాలూకాయంతయు నిలబడువరకు నిలబడును. తరువాత నిలువను."

మూడవవాడు యిట్లనెను. "హిందువులును, ముసల్మానులును కలసి మే మందరమును కృతనిశ్చయులమయి యే యుంటిమి. కాని నాలుగవవంతు ముసల్మానులుమాత్రము తటపటాయించుచున్నారు."

మరియొక డిట్లు వచించెను. "నలుగురు యథార్థమైన మనుష్యులు స్థిరముగా నుండగలిగినచో నేమివచ్చిన వచ్చుగాక! జయము నిశ్చయము."

"నాలుగు అనగా నర్థమేమి?"

"నలుగు రనగా పెద్దవారిలో నలుగురు."

"నీ వందులో నొకడవని యనుకొందువా?"

"నే నయిదవవాడను. నే నానలుగురను అనుసరింతును"

"ఈ హెచ్చుపన్నును నిరాకరించుటకు తమసమస్తమును కోల్పోవుటకు సంసిద్ధులగువారు మీలో నలుగురున్నారా?" అని అధ్యక్షుడు ప్రశ్నించెను. తోడనే నలుగురు తమనిశ్చయమును వెలిబుచ్చుటకు లేచిరి. ఇంతలో పాతపన్నులను చెల్లించవలెనని చెప్పిన మైదుగ్రామముల ప్రతినిధులను యితరులతో నాలోచించుకొని తాలూకాయంతటితో

ను తాముకూడ నుందుమని ప్రకటించిరి. ఇదంతయు జరిగిన తరువాత శ్రీయుత వల్లభాయిగారు మహాసభలో ప్రసంగించిరి. అతఁడు ప్రభుత్వతీర్మానమును గురించియు, వారిసాధారణపన్నుల విధానమును గురించియు వివరించి తమవాదములో నున్నన్యాయమువిషయమై యతని కెట్టిసందేహమును లేదనియు, క్రొత్త సెటిల్‌మెంటు అక్రమమని యతఁడెరుంగుననియు కాని తమబల మెంతవరకు గలదో సందేహాస్పదముగ నున్నదనియు చెప్పెను. 1921 లో వారిసత్తువను ప్రదర్శింపవలసినసమయ మాసన్నమయ్యెను. కాని కొన్ని యపూర్వపరిస్థితులచే నది యాపివేయబడెను. ఈసారి గంట మ్రోగెను. కాని ప్రజలిందుకు నిజముగా సిద్ధముగా నున్నారా? ఈసమస్య యొక్క-తాలూకాకుగాని యొక్క-జిల్లాకుగాని చెందినది కాదనియు భారతదేశమంతకును చెందిన దనియు ప్రభుత్వమువారు తమచేతిలో నున్నసర్వశక్తులను వినియోగించి దీని నణచివేయ జూతు రనియు నట్టిప్రభుత్వముతో ధర్మయుద్ధమును, దౌర్జన్యరాహిత్యమైన యుద్ధమును తా మెంత కాలమైనను సరే సాగింపగలరాయను విషయమును గురించి హృదయముపై చేయివేసుకొని యాత్మపరీక్ష చేసికొనవలసిన దనియు నతడు వారిని హెచ్చరించెను. తొందరపడి యెట్టి నిశ్చయమును చేసికొనవలదనియు వారముగోజులు వ్యవధి నిచ్చెద ననియు నీలోపుగా ప్రభుత్వముతో నుత్తరప్రత్యుత్త

రము లను జూపి వారిని మరల యోచింపవలసిన దనియు నిష్ప క్షపాతమైనవిచారణచేయు మని ప్రకటింపవలె నని హెచ్చ రింతు ననియు నతడు చెప్పెను. ఈమహాసభలో శ్రీయుతులు భీమభాయినాయిక్, దాదుభాయిదేశాయి, డాక్టరు దీక్షితులు అనుముగ్గురు శాసనసభ్యులుండిరి. వారు తమచేతులోనున్న శాస్త్రీయపద్ధతుల నన్నిటిని ప్రయత్నించి చూచితి మనియు తాము విఫలు లగుటచే తమసనుస్యరు సత్యాగ్రహ ఆత్మా ర్పణమార్గములద్వారా పరిష్కరింపగలయోచనకు సంతో షపూర్వకముగా నప్పగించితి మనియు చెప్పిరి.

దీనితరువాత శ్రీయుత వల్లభాయి అహ్మదాబాదు వెళ్ళి స్థితిగతులను గురించియు, క్రొత్త సెటిల్ మెంటువలన ప్రజలకు గలిగిన విపరీతమైనయన్యాయమును గురించియు తెలుపుచు "ప్రజలు తమ వాదము నొక తగినంతయధికార ముగలిగి, నిష్పక్షపాతమైన న్యాయమూర్తిసంఘముయెదు ట వాదించుకొనుటకు తగునవకాశమును కలుగచేయవలె నని" సూచించుచు గవర్నరుగారి కొకలేఖను ఫిబ్రవరి 6 వ తేదీని వ్రాసెను. ఇది జరిగినగాని "ప్రభుత్వముతో తీవ్ర మైనపోరాటముకు తలపడకుండుటకు తా నెంత యిచ్ఛించు చున్నను ప్రజలను పన్నుల నీయవలదనియు తత్ఫలితముగా వచ్చుబాధలను శాంతముగాను, నిశ్చింతగాను ననుభవింప వలసినదనియు చెప్పుటకన్న మరియొక తరుణోపాయ మేదియు

లేదనియు " నతడు వ్రాసెను. " ఈవిషయములో మనము కలుసుకొనవలె నని మీరు కోరేయెడల నేను తప్పకుండ సంతోషపూర్వకముగ మిమ్ము కలసికొందును. " అని కూడ నతడు యుత్తరము చివర వ్రాసెను.

ఉత్తమశిక్షణనొందిన న్యాయవాదియొక్క బుద్ధి నుప యోగించి యత డీయుత్తరములో మరియొక యక్రమమును చూపెను. ప్రభుత్వమువారు సెటిల్ మెంటుఆఫీసరుయొక్క శిఫారసుల నామోదించిరి. ఇత డపూర్వమైన యొకనూతన సెటిల్ మెంటుపద్ధతి నవలంబించుటయే గాక వెనుకటి గ్రామ వర్గీకరణమునకు స్వస్తి చెప్పి నూతనవర్గమును స్థాపించెను. "దీనివలన ననేకగ్రామము లుత్తమవర్గములో జేర్చుకొనబడెను. ఇదియు మరికొన్ని యితరవిషయములును కలసి యీ గ్రామములలో నూటికి యేబది మొదలు అరువదివరకును పన్నులను హెచ్చించెను." అని యితడు స్పష్టపరచెను. దీనిని గురించి తుదియాజ్ఞ లామోదింపబడువరకును ప్రజల కెట్టి జ్ఞాపనమును చేయబడ లేదు. ప్రభుత్వమువారు సెటిల్ మెంటు ఆఫీసరుచే చేయబడిన నూతనవర్గీకరణము నామోదించి జూలై 19 వ తేదీని తుదియాజ్ఞల నమలు జరిపించిరి. జరుగుచున్నసంవత్సరములోనే యమలులోనికి తెచ్చేయెడల ఆగష్టు 1 వ తేదీలోపలనే తుదిరివిషను ప్రకటింపవలెను. ఇంతకంటె గొప్పయక్రమ మేమనిన ముప్పదియొక్క గ్రామములకు తమ

యభ్యంతరములను రెండుమాసములలోగా చెప్పుకొనవలసి న దసి జూలైచివరవారములో నోటీసు నములు జరిపిరి. కాని యథార్థమున కదియే తుదియాజ్ఞ. నోటీసువలన తుదియాజ్ఞకు తాత్కాలికలక్షణమే వచ్చెను. ప్రభుత్వమువారిది తుది యాజ్ఞ కాకపూర్వ మభ్యంతరములకు సమాధానము చెప్ప వలెను; ఆరునెలలకుముందుగా నోటీసు లేనిచో నిది ముందు పన్ను చెల్లించు వత్సరమువరకు నాచరణకు రాజాలదు." ప్రభుత్వమువారి కీవాదనలోని సారము తెలియుననియు కాని వారు దానిని వప్పుచుకొనరనియు చూపుటకే ఉత్తరములోని యింతపెద్దవాక్యమును బుద్ధిపూర్వకముగా మెత్తివ్రాసితిని. కాని యీయక్రమము బహుఘోరముగా నుండుటచే మార్చి శాసనసభలో 22 గ్రామములను పైవర్గములోనుంచి తగ్గించి వేసితిమని ప్రకటించి వారు కొంతతప్పు దిద్దుకొనిరి. ఉత్తరము "ఉద్యోగులు యోచనచేసి పంపివేయుటకుగాను రెవిన్యూ శాఖవారికి పంపివేయబడెను." అని గవర్నరుగారి కార్యదర్శి పొడిమాటలు వ్రాయుటకంటె గవర్నరుగా రెట్టిజవాబును వ్రాయుటకు నిరాకరించుటయు, శ్రీయుతవల్లభాయిపటేలు గారిసూచన ననుసరించి ప్రభుత్వమువారు చేసిరనినట్లు తెలియకుండ నుండవలెనను యాతురమును చూడ మొదట నుంచియు ప్రభుత్వమువారు శ్రీయుతవల్లభాయిపటేలుతో ప్రత్యక్షముగా నేట్టిసంబంధమును పెట్టుకొనకుండుటకు నిశ్చ

యుంచి రని తెలియుచున్నది. వరదలసందర్భములో సేవచేసి నపుడు గవర్నరుగారు వల్లభాయిగారిని కలుసుకొని వారిని వారిపనిని కొంత తెలిసికొనిరి. వల్లభాయిగారికోరికప్రకారము తనతో కలసి మాట్లాడుట కత డంగీకరించి యుండినచో విషమపరిస్థితులు బహుశః రాకుండెడివి. అది యన్యథా జరిగెను. ఇంతలో పన్ను చెల్లించవలసిన మొదటివాయిదా ఫిబ్రవరి 15 తేదీ యాసన్న మగుచుండెను. ప్రభుత్వమువా రేమైనను జవాబు నిత్తురేమో యని వల్లభాయి ఫిబ్రవరి 11 వ తేదీవరకు చూచెను. కాని లాభము లేకపోయెను. అత డు 12 వ తేదీని బార్డోలీలో మరల రైతులనందరను కలుసు కొనెను. ప్రజలు యీలోపున తమలో తాము పన్నుల నిరాకరణమును గురించి చర్చించుకొని పన్నులను నిరాకరించువారి సంతకములను తీసికొన నారంభించిరి. ఈసారి యా లోచనసభ కనేకవేలమంది వచ్చిరి. మరికొన్నిగ్రామములు తమ ప్రతినిధులను పంపెను. వీరందరును సంతకములను చేసిరి. ప్రతివాడును లేచి తమతమ గ్రామము లేమిచేసెనో వివరించి చెప్పినపుడు ప్రశాంతమైనయాలోచన, యనన్యమైన కృత నిశ్చయము వారివచనములలో పొడగాంచెను. పన్నులనిరా కరణ మనుశుష్కవాక్యమును వారు కేవలము చిలకపలు కులవలెనే యుచ్చరించి యుండినచో నాపలుకులకు విలువ లేక యుండెడిది. ఎవరికథను వారు చెప్పసాగిరి.

మా గ్రామములో 58 మంది సంతకములు చేసిరి; 12 గురు యింకను చేయలేదు. కాని దానిని లెక్క చేయనక్కర లేదు." అనియొకడనెను. "గ్రామపెత్తందారుతప్ప తక్కిన వారందరును సంతకములు చేసిరి. కాని యతడు మాకు వ్యతిరేకి కాడు" అని మఱియొక డనెను. "మాపన్నులు యిదివరకే చెల్లించెను. చుట్టుపట్లగ్రామములోని మఱియొకవర్తకుడు చెల్లించెను. కాని మేము వారినెన్నడును లెక్కించుకొనలేదు." అని మూడవవా డనెను. "మాలో మాకు వ్యతిరేకమైనవా రొకతెగవా రున్నారు. కాని వారు మాలోనివారు కారని మేము విశ్వసింతుము. ఏమిఱిజగినను జరుగునుగాక! మా తెగవారుమాత్ర మెన్నడును చెల్లింపరు. మిగతదంతయు యీశ్వరేచ్ఛ" అని నాలుగవవా డనెను. "అందరును తమసంతకముల నిచ్చిరి. జారిపోవువా డొక్కడును లేదు." అని బహుసంఖ్యాకులు వాగొనిరి. "నాగ్రామమంతయును నన్ను బాహ్యుని చేయుడు. నాగ్రాము మెట్టి సంకటములలో నైనను వెనుదీయదు" అని ముగ్గురు, నలుగురు, సగర్వముగా పలికిరి. అప్పుడు వల్లభాయి వారికిట్లుపన్యసించెను. "మీరిందులోని కురుకశమునుపు యింకను రెండుసార్లు బాగుగా నాలోచించుకొనుడు. మీకు నాయకుడుగా నావంటి యోధుడు దొరికెనని భావముచే నుబ్బిపోకుడు. నన్ను నాయనుచరులను మరచిపొండు. అధర్మమును నిరంకుశత్వమును నెదు

ర్కొనవలెనని మీరు భావించుచో పొరాడుడు. మీరు దీని నెంతమాత్రమును చులకనగా తీసికొనవద్దు. మీ కపజయము కలుగుచో మీ రిక ననేకవత్సరములు మరల తల యెత్తుకొనజాలనట్టి పరాజయమును పొందుదురు; మీరు గెలుతురేని స్వరాజ్యపునాదులను నిర్మించుటకు మీ రెంతయో తోడ్పడినవా రగుదురు. కనుక నిప్పుడు మీ రీతీర్మానమును మీ హస్తగతము చేసికొని మీరే దీనిని పరివేశపెట్టి మీరే బలపరచుకొని మీరే యామోదింపుడు. మే మెవరమును దీనిని గురించి మాట్లాడము; ఇది మీ స్వకీయేచ్ఛను, మీ యభిలషితమును వ్యక్తము చేయును." మరియొకసంగతి, ఈ సెటిల్‌మెంటు ఆఫీసరువలననే బార్డోలీవలెనే యన్యాయమును పొందిన ఛోరాసీతాలూకాప్రజలు శాస్త్రీయమైన యాందోళన చేయుచు కొందరు బార్డోలీతోపాటు ఛోరాసీని కూడ కలుపుకొనవలసిన దని వల్లభాయిని కోరుటకు వచ్చిరి. "మీకుకూడ నిట్టి యన్యాయము జరిగిన దని నే నెరుగుదును. కాని, రెండుతాలూకాలను నడుపుట కిపుడు నాకు శక్తి లేదని నేను భయపడుచున్నాను. బార్డోలీ జయించినచో మిమ్ముకూడ బార్డోలీవలెనే చూడక తప్పదు. మీరు పరిస్థితుల నవలోకించుచు వేచియుండుడు. మీతాలూకాలోనున్న పరిస్థితులు ప్రత్యేకచిక్కులను కలిగించుచున్నవి. మీ తాలూకాలో చాలమంది భూమికలవారు సూరతు, రేండరులలో

నివసించుచున్నారు. వారు వ్యవసాయదారులు కారు. వారు మీతో కలిసిరారు. మొట్టమొదట వారు పన్నుల నిచ్చివేసి మీకు సంకటపరిస్థితులను కల్పింతురు. కనుక మీరు సత్యాగ్రహమును గురించి తలంపవలదని నేను సలహా నిచ్చుచున్నాను. బార్డోలీకి న్యాయము కలుగుచో ఛోరాసీకికూడ న్యాయము కలిగితీరునని విశ్వసింపుడు."

దీనితరువాత బహిరంగసభలో శ్రీయుత వల్లభాయి యిట్లుపన్యసించెను.

"నేను మీతో వెనుక చెప్పినట్లు నిష్పక్షపాతమైన విచారణసంఘము నేర్పరచవలెనని గవర్నరుగారికి వ్రాసితిని. నాకొక జవాబుకానిజవాబు వచ్చెను. నాయుత్తరమును రెవిన్యూశాఖకు విచారణచేసి పంపివేయుటకు పంపించిరట! వారు దాని నెప్పుడు చిత్తగింతురో మనకు తెలియదు. మనము వారికొరకు వేచియుండనక్కరను లేదు. నాయుత్తరమును విచారించువరకును పన్నులను వసూలు చేయుట నాపివేసితిమనియు నంతవరకును మనసభ నాపివేయవలసినదనియు ప్రభుత్వమువారు వ్రాసినచో సంతోషపూర్వకముగా మనమట్లు చేసెడివారమే. నేనిపుడు మీ నిశ్చయముకొరకే వేచియున్నాను. నేను వెనుక మిమ్ము కలుసుకొనినతరువాత ప్రభుత్వమువారు పన్నును హెచ్చించుచు చేసినయాజ్ఞలు అన్యాయములే కాకుండ చట్టబద్ధములుగా నున్నవా యని

న్యాయశాస్త్రమును చూచితిని. అవి న్యాయశాస్త్రములో కూడ నాకెచ్చటను కాన్పించలేదు. అవి భూమిపన్నుకు సంబంధించినస్మృతిలోని 107 వ సెక్షనుకు కేవలము విరుద్ధములు. సెటిల్ మెంటుఆఫీసరు తననివేదికను ప్రస్తుతపద్ధతిమీదనే యాధారపరచెను. అతనినివేదికనుగురించి చెప్పవలెనన్న దానికొకయంతు కాన్పించదు. ఇప్పుడు ఓల్పాడు తాలూకాలో జరుగుచున్నట్లుగా నతడు గ్రామగ్రామమునకును బోయి వ్యవసాయదారులతో సంభాషించి యుండలేదు. ఆతడు వెనుకటిపుంతనే యనుసరించెను. సెటిల్ మెంటుకమీషనరుగారు మరియొకసూత్రము నవలంబించి దానిప్రకారము గ్రామములను నూతనవర్గములక్రిందకు దెచ్చెను. అట్టిమార్పును చేయునపుడు ప్రభుత్వమువారు క్రొత్తగా నోటీసులను పంపించుట విధియై యున్నది. కాని క్రొత్తపన్నుల నాచరణలోనికి తేవలె ననుహడావుడిలో వారిట్లు చేసి యుండలేదు. ఇట్టి పరిస్థితులలో ప్రభుత్వమువారు సమాధానమునకు వచ్చువరకును మీరు యావత్తుపన్నును నిరాకరింపవలసిన దని వినయపూర్వకముగా సలహా యిచ్చుచున్నాను. బాధపడుటకు మీకు గలశక్తియు, మీ తీవ్రనిశ్చయమును తప్ప ప్రభుత్వముయొక్క పశుబలముతో పోరుటకు మీకు వేరుదిక్కు లేదని జ్ఞప్తియందుంచుకొనవలెను. ప్రజలు బాధపడుటకు నిశ్చయించుకొనినచో నెట్టి మైరావణప్రభుత్వమైనను తలయొ

గ్గక తప్పదు. ఇప్పటిప్రశ్న కొద్దిలక్షలరూపాయలకు చెందిన ప్రశ్న కాదు. అది మన యాత్మగౌరవమునకు చెందినప్రశ్న. ప్రాతినిధ్యము లేనిదే పన్నులను చెల్లించుటయు లేదు. అనునది ప్రభుత్వముయొక్క ప్రధానసూత్రము. ఈవిషయములో మీయభిప్రాయములను తీసికొనకుండ వారేమియు చేయరాదు. ప్రభుత్వమువారి చిత్తమునుబట్టి వారి యిష్టమువచ్చినట్లు పన్నులను స్థిరపరచు నిరంకుశవిధానమును మీరు నిరోధించవలెను. దీనికిగాను మీరు స్వేష్టులై, యోర్పుగలిగి ధైర్యనిధులై యుండవలెను. ప్రభుత్వమువారు మీబలము ననేకవిధముల పరీక్షింతురు. అనేకవిధములగు యిబ్బందులను కల్పింతురు; మీలో విభేదములను కల్పించుటకు చెప్పరానిసాధనముల నుపయోగింతురు. ఎన్నికష్టములు వచ్చినను, యెంత నష్టము వచ్చినను పన్నులను చెల్లింప మను మీసూత్రమును మీరు వీడరాదు. ప్రభుత్వమువారు నిష్పక్షపాతమైన విచారణసంఘము నేర్పరచువరకును లేదా హెచ్చుపన్నులను తీసివేయువరకును యుద్ధము సాగుచునేయుండునని నే నొకషరతును పెట్టితిని. పన్నుహెచ్చుదల నిరంకుశము, అన్యాయము, దుర్భరము అనుటలో సందేహ ముండి యిట్లనుటలేదు. స్వతంత్రమైన విచారణసంఘము కొప్పుకొనునట్లు ప్రభుత్వమును మనము చేయగలిగినచో నిదియే తాత్కాలికమగు లేక శాశ్వతమగు ధనలాభముకంటె నెక్కువమైనది.

నే నింతకంటె చెప్పవలసిన దేదియు లేదు. మీరు చేయున దంతయు కండ్లు బాగుగ తెరచి, భగవంతుని సాక్ష్యముగా బెట్టుకొని, మీరు భరించవలసిన కష్టముల నన్నిటిని గుర్తించియే చేయుడు. ప్రభుత్వమువారు మీలో నాయకులైనవారినే యేరి, నేడు తీర్మానమును ప్రవేశపెట్టువారినే యేరి, వారిభూములను లాగికొనవచ్చును. ఈకష్టము లన్నియు మిమ్ము కదల్పజాలనిచో మీ రీయుద్ధమును చేబట్టి సాగింపుడు."

తరువాత నీక్రిందితీర్మానము తాలూకాలో నున్న వివిధగ్రామములలోని కాన్బిలు, అనన్లాలు, బనియాలు, పార్శీలు, ముసల్మానులు మొదలగు వివిధజాతులవారిచే ప్రవేశపెట్టబడి, బలపర్చపడి యామోదింపబడెను.

"బార్డోలీతాలూకామహాజనసభవారు బార్డోలీలోని క్రొత్త సెటిల్మెంటు నిరంకుశ మైనదనియు, నన్యాయ మైనదనియు, దుర్భర మైనదనియు తీర్మానించుచు ప్రభుత్వమువారు తమకు రావలసినపన్నులమొత్తముక్రింద వెనుకటిపన్నులనే తీసికొనుట కంగీకరించువరకు గాని, లేక రివిజనుసమస్యను భూమిమీదకు వచ్చి విచారణ సలుపుటకొక నిష్పక్షపాతమైన విచారణసంఘము నేర్పరచువరకు గాని క్రొత్తపన్నులను చెల్లించుటకు నిరాకరింపవలసిన దని భూములు కలవారందరకును సలహా నిచ్చుచున్నారు."

మొదటియుపన్యాసకుడు కొద్దిగా మాట్లాడెను. తరువాత వచ్చినయిద్దరు కొన్ని సూచనలను చేసిరి. తక్కినవారు తీర్మానమును బలపరచిరి.

తరువాత నుపన్యాసము లేవియు లేవు. కొరానునుంచియు బుక్కులనుండియు కొన్ని పవిత్రవాక్యములను చదివినతరువాత రామనామమును సంస్మరించినతరువాత (సభయంతయు పాల్గొనుచుండగా) తీర్మానము గంభీరమానముద్రిలో నామోదింపబడెను.

ఇది 12 వ ఫిబ్రవరినాటికథ.



---

# బార్డోలీ విజయము.



## ఆరవ యధ్యాయము.



"ఉద్యమసన్నాహము."

"నీటిలోనికి దిగినతరువాత మన మిక నీత నేర్చుకొనవలెను." "వల్లభాయి పటేలు."

వల్లభాయిగారిముందుపని బ్రహ్మాండమైనది. బార్డోలీరైతులను నడిపించినశాసనసభ్యులుపాతపన్నుల నిచ్చివేసి హెచ్చుపన్నునుమాత్రమే యివ్వవద్దని రైతులను సలహా చెప్పిరి. సత్యాగ్రహమువలన కలుగుబాధలను, త్యాగమును భరింపలేనికొద్దిమంది ఫిబ్రివరి 12లోపల పన్నుల నిచ్చివేసిరి; మరికొంతమంది తీర్మానమునకు వ్యతిరేకముగా పాతపన్నుల నిచ్చివేయవలె ననుయూహలనే కలిగి యుండిరి. మరికొంతమంది యిటునటు నూగులాడు చుండిరి. ఇప్పుడు వీరికి బోధపరచి వీరిని కూడ సత్యాగ్రహులలోనికి తీసికొనిరావలెను.

ఇక వివిధజాతులలో నొకసామరస్యము లేదు. పాటిదారుసంఘములో నొకవిధమగు దిట్టమైన సంఘీభావము కలదు; కాని, యితరులలో నేమియు లేదు. వీరు యీపాటిదారుసంఘముయొక్క బలమునుకూడ నెప్పుడైనను చెడ

గొట్ట వచ్చును. రాసిపరాజజాతివారు చాలవినయవంతు లగుటచే మొదటిదెబ్బకే లొంగిపోవచ్చును. అనేకయకరములు కలవారగుటచే నెక్కువనష్టమును పొందుట కవకాశము కలవర్తకులు చివరవరకు నిలువలేకపోవచ్చును. వీరిలో చాలమందికి ప్రభుత్వోద్యోగులతో సంబంధబాంధవ్యము లుండుటచే వారు వీరిని లొంగదీయుదురేమో యను భయము కలదు. వీరు పతితులగుచో వీరికి ఋణగ్రస్తులైన రానిపరాజజాతివారు కూడ లొంగిపోవుదురు. గర్విష్ఠులు, తిరస్కారస్వభావులు నగుఅనవ్లాజాతివారింకను నూగులాడుచుండిరి; గుణకారస్వభావముగలవారు యుద్యమము తీవ్రరూపమును దాల్చువరకు రంగములోనికి దిగుటకు సందేహించుచునే యుండిరి. 12 వ తేదీని ముసల్మానులు తమ సంసిద్ధతను వెలిబుచ్చిరి. కాని సూరతుపట్టణములోని వాతావరణ మంతగా బాగుండకపోవుటచే నావాసన బార్డోలీకి కూడ పాకవచ్చును. ఇక నమూయకులైన పార్శీలు కలరు. కాని వారినిగురించి యెవరు యిదమిద్ధ మని చెప్పగలరు? 1921-1922 లోని తాగుడును తగ్గించుప్రచారమువలన వీరిలో చాలమంది చల్లబడిరి. తాలూకాలోని యితరులతో కలసి పని చేయవలె ననినచో వీరు తిరస్కరించినను తిరస్కరింపవచ్చును.

మహాజనసభ యైనవెంటనే వల్లభాయిగారికి తాలూకాయంతయు తిరిగి పరీక్షించుచున్న మోహనలాల్ పాడ్యాగారినుంచి యీయుత్తరము వచ్చెను.

"నాచుట్టుపట్ల నున్న వాతావరణము నాలో నిరుత్సాహమును సందేహమును కలిగించుచున్నవి. కొద్దిరోజులలో ప్రభుత్వముతో నొకబ్రహ్మాండమైన పోరునకు తలపడనున్న స్త్రీపురుషులు వీరేనా? యుద్ధసన్నాహములో నున్నట్లు నా కెవరును కాన్పించరు. వీరు చీకు చిటుకు మనకుండగా తమతమ వ్యాపారములను చక్కబెట్టుకొనుచున్నారు. వివాహఋతువు ప్రారంభమై పెళపెళ లాడుచున్నది. ఏగ్రామములో చూచినను వివాహములే! మనుష్యులు షోకైనబట్టలను ధరించి తమబండ్లలో గ్రామగ్రామములకును బోవుచున్నారు. సత్యాగ్రహము జరుగుగాక! జరుగకపోవుగాక! కొంతమంది తమబిడ్డలవివాహవేదికలను మస్లుతుదారు తనరాకచే నలంకరింపవలె నని యాతురత పడుచున్నారు; దీనికితోడు వివాహవేడుకలు, సంతర్పణసమారాధనలు—దీనితో బార్డోలీపటము పూర్తి యగుచున్నది. వారు దేనినైనను మానుకొనవచ్చును గాని తమశిశుప్రాయుల వివాహములను మానుకొనరా దనిభావించుచున్నట్లున్నారు. ఒకబ్రహ్మాండమైన ప్రభుత్వముతో యుద్ధమునకు తలపడవలె నని వీరినేనా మీరు కోరునది? నాకు నిరాశ లేదు. కాని మనబలమును

మనము గోరంతలు కొండతలుగా నూహించుకొనరాదు. భగవంతుడు మీకీర్తిని కాపాడుగాక !''

ఈయుత్తరములో బాగుగా నాలోచించవలసినవిషయములే కలవు. కాని మఱియొకమార్గ మేమియు లేదు. ఒకటిమాత్రము నిజము. పన్నులను హెచ్చించుటలోని యన్యాయమును గురించి యొక్కడును వ్యతిరేకముగా మాట్లాడడు. రెండురంగములలో సంపూర్ణజయమును బడసినతమనాయకునియం దతిపిరికివానికిగూడ పూర్ణవిశ్వాసము కలదు. కాని యీనాయకుడు తనయందు ప్రజల కున్నవిశ్వాసమును చూచి మురియువాడు కాడు. తమయందే తమకు విశ్వాస ముండవలెనని యతడు వారిని హెచ్చరించెను. "ప్రాణములను విడుచువరకును పోరాడుయోధుల నొక్కనూరుమందిని మీరు నాకిచ్చినను జయము నిశ్చయ మని నేను మీ కభయహస్తము నీయగలను.'' అని యతడు బార్డోలీలో కలుసుకొనిన ప్రతినిధులతో చెప్పెను. కాని యతడు 17000 మంది భూస్వాములు కూడ నీధర్మయుద్ధము చేయవలసిన దనియు వందమంది యొక్క బాధలవలన కలుగుఫలితము నప్పనముగా ననుభవింపరా దనియు చెప్పెను. కనుక నత డనేకశిబిరముల నేర్పరచి తగు ప్రయత్నములను గావించెను. తాలూకాలో నదివరకే నాలుగు కేంద్రము లున్నవి. కళ్యాణజీ, యుగతారామ్, కుషాలభాయిగార్లు బార్డోలీలోను, సార్భానులో డాక్టరుత్రిభువనదాసు

గారును, సూధీలో మకంజీదేశాయియు, వేదచీలో చునీలాలు మెహతాయు సతనిభార్యయు-నీవిధముగా నాలుగుశిబిరము లేర్పడెను. శ్రీయుత వల్లభాయి యీపరిచారకుల నందరను పిలిచి బనియాలకు ముఖ్యపట్టణమైనవాలడ్, బుహారి (మరియొకవర్తకస్థలము) వాంకనరు (తాలూకాలోని పాటిదారులకు కేంద్రము) వాలడ్ (మరియొకపాటిదారు స్థలము)బామిణ్ణ (మరియొకపాటిదారుస్థలము,) బాల్డా (గాని పరాజజాతివారికేంద్రము) కమర్ ఛోడ్ మొదలగువివిధస్థలములలో శిబిరముల నేర్పరచవలెనని యాజ్ఞాపించెను. పరిచారకులకొరకు క్రొత్తవిజ్ఞప్తియు చేయబడలేదు. శ్రీయుత వల్లభాయి యట్లు చేయదలచుకొనలేదు. సేవ చేయదలచినవారదివరకే యచ్చట నుండిరి. ఉత్సాహముతో నుబ్బి గంతులు వైచునట్టి డాక్టరుచందూలాలు యెంతనీచపుపనినైనను చేయుటకు సిద్ధముగా నుండెను. అతడు వాలడ్, బుహారిలలోని రంగములను తీసికొని వెంటనే చిన్నచిన్న కేంద్రములను గూడ స్థాపించెను. తననాయకుడు సత్యాగ్రహమును ప్రకటించినపుడు మోహన్‌లాలుపాండ్యా చేతులు ముడుచుకొని యింటివద్ద కూర్చొనునట్టిమనిషి కాడు. అతడు వాలడ్, దానిపరిసరములను తనశిబిరముగా నెన్నుకొనెను. ఆత్మపారిశుధ్యము, బాధప్రధానములుగాగల యుద్యమములో రవిశంకర్భాయి లేకుండ నెట్లుండగలడు? అతడు సార్భాను

లో నుండెను. మోహన్‌లాల్ పాండ్యా, కళ్యాణజీలవలెనే దర్బారుసాహేబుదేశాయి శ్రీయుతవల్లభాయిని బార్డోలీ రావలసినదని ప్రోత్సహించెను. ఈయనను బామ్నాలో నుంచిరి. సూరతుఅల్లరులలో చెక్కుచెదరకుండ కడుసంతోషముతో ననేకదెబ్బలను తిని, సబర్మతిజయిలులో రెండువత్సరములు శిక్ష ననుభవించిన శ్రీయుతచినాయి బార్డోలీ పట్టణములో నుండెను. ఖద్దరుపనిలో మునిగియున్న శ్రీయుతకేశవభాయి తననాయకుడైన లక్ష్మీదాసుపురుషోత్తముని యాజ్ఞపుచ్చుకొని చందూలాల్‌తో కలసి వాలడ్ చుట్టుపట్టునున్న రానిపరాజప్రదేశమునకు బాధ్యత వహించెను. చందూలాల్, రవిశంకరులతో నాగపురములో జయిలుపక్షిగానుండి, మూడుయుద్యమములలో ననుభవము సంపాదించిన నడియాడువాస్తవ్యుడగు ఫూల్చందుబాపుజీషా మాఢికి వెళ్లెను. బోర్సదునుంచి వచ్చిన అంబాలాల్ పటేలు బార్డా వెళ్లెను. నారన్భాయి, మరియొక బోర్సదునివాసి, బుహారిలో నియమింపబడెను.

ఇక తాలూకాలోని ముసల్మాను లందరివిషయమై వలభాయి, దక్షిణాఫ్రికాకీర్తిని సంపాదించినసత్యాగ్రహాశ్రమమునకు చెందిన, అబ్బాసుసాహేబుత్యాబ్జీ, ఇమాంసాహేబుఅబ్దుల్ కాదర్ బవజీరుల సహాయముపై పూర్తిగా నాధారపడెను.

ప్రచురణశాఖ లేనిదే యిట్టియుద్యమము నిర్వహింప బడనేరదు. రైతులు దినపత్రికలను, నవజీవను వారపత్రికను తెప్పించుకొనజాలరు. మరియు పైపత్రికలు ఉద్యమముయొక్క బాహ్యరూపమునుమాత్రమే చిత్రింపగలవు. యుగత్రాందేవు నాయకత్వముక్రింద నొకప్రచురణకార్యాలయము ప్రారంభింపబడెను. చిత్రకారుని లేఖినివంటి లేఖినియు, నఖాగ్రములందు తాలూకాపరిజ్ఞానమునంతను, కలిగినయితడు నీటికి చొరబడుబాతువలె తనపనిని ప్రారంభించెను. ప్రతిదినము వార్తలను ప్రకటించుటకును, వల్లభాయియొక్క యుపన్యాసములను కరపత్రములుగా ప్రకటించుటకును వాటిని వ్యవసాయదారుల కుచితముగా పంచిపెట్టించుటకును యేర్పాట్లు చేయబడెను. నాలుగైదురోజులు సైక్లోస్టైలుప్రతులు పంచిపెట్టబడెను. వెంటనే సూరతులో నచ్చొత్తించుట కేర్పాట్లు గావింపబడి 5000 ప్రతులతో ప్రారంభింపబడెను. ఈయేర్పాటు అద్భుతముగా నడిచెను. గ్రామవాసులు ప్రతిదినము ప్రాతఃకాలమున పత్రికకొరకు కాతురపడుచు విషయముల నమృతఘుటికలవలె మ్రింగుచుండిరి. అన్నిగుజరాతుపత్రికలును, బొంబాయిలోని యాంగ్లదినపత్రికలన్నియును యీవార్తల నావంతయు విడిచిపెట్టకుండ ప్రకటించుచుండెను. ఉద్యమము పటుతరమైనకొలది గుజరాతులోని ప్రతిముఖ్యపట్టణము, ప్రతిగ్రామము నీటిచే నిండి బార్డోలీలో పంచిపెట్టబడు పదివేలప్రతు

లే కాక నాలుగువేలపత్రులకు పైప్రదేశములవారు చందా దారులుగ నుండిరి.

గుజరాతును విడిచిపెట్టిన స్వామిఆనందు బార్డోలీ పిలుపు నందుకొని వల్లభాయికి కార్యదర్శిగానుండి యుద్యమ మాఖరగువరకు నమూల్యమైనసేవ చేసెను.

ప్రధానప్రచారకులే గాక వ్యవసాయదారులు తమ లో తాము వలంటీర్లను సృష్టించుకొనిరి. వారు తమగ్రామ ములకే సేవ చేయుచు నత్యంతసమీపమున నున్నశిబిరముకు వార్తలను గొంపోవలెను. వారిలో నెన్నుకొనబడినవారు వార్తలనుపోగుచేయుచు తమ శిబిరములలోని నాయకులతో బోవుచు నొకచోటనుంచి మరియొకచోటకు రాయబారము లను తీసికొని పోవుచుండవలెను. రానిపరాజజాతి వీరిలో మెలికలంటివారిని కొందరిని పంపెను.

ఫిబ్రవరి 12 వ తేదీ సాయంత్రముతోనే యథార్థమైన పని ప్రారంభ మయ్యె నని చెప్పవచ్చును. రాత్రి సభ ముగి సినతరువాత రెండుగంటలకు వల్లభాయి వాంకనరుకు బయ లుదేరి యచ్చట నుపన్యసించెను. ఉద్యమమును ప్రారంభించి న రెండునెలలలో తాలూకానంతను నభేద్యమైనకోటగా మార్చి వేసినయతని యుపన్యాసములలోని సూత్రములన్నియు నిందులోనుండెను. ఈయుద్యమములో పురుషు లెంతశ్రద్ధ వహించవలెనో స్త్రీలుకూడ నంతశ్రద్ధ వహించవలె నని యతడు ముఖ్యముగా బోధింపసాగెను.

"ఏలననగా దీనితోను డంతయు వారికే హెచ్చుగా తగులును. తమకండ్లయెదుట ప్రాణతుల్యములగు పశువులను తీసికొని పోవుచుండ వారు చూచుచుండవలెను. జప్తులను చేయువారు తరచు వచ్చుచుంటను వారు సహింపవలెను. వీటిని మామూలుచర్యగా గ్రహించినగాని వారు మిమ్ము విడనాడవచ్చును. కనుక నీసభల కెందరు పురుషులు వత్తురో యంతమంది స్త్రీలుకూడ రావలె ననియే నేను కోరెదను."
"మీ రిప్పుడు మీపద్ధతులను మార్చవలెను; మీ రొకనూతన వాతావరణమును సృష్టించుకొనవలెను. మీవివాహవేడుకల నిక కట్టిపెట్టవలెను. ఒకబ్రహ్మాండమైన ప్రభుత్వముతో సమరము చేయగోరువా రిట్టివేడుకలతో పొన్నపుచ్చజాలరు. రేపటినుంచియే మీరు మీతలుపులను మూసికొని, తాళములు వేసికొని పొలములకు పోయి రాత్రిభోజనమాత్రమే యింటికి రావలసియుండును. ప్రభుత్వమువారు మీలోనుండియే కొంతమందినో చీలదీసి జప్తులనుచేయుటలో వారిసహాయమును బడయుదురు. వారి కెవరును దొరకకుండునట్లు మీరు చేయవలెను. మీసోమరితనమును మీ స్తబ్ధత్వమును పోద్రోలుడు. మీ రొకకీర్తిని సంపాదించుకొనిరి; కాని మీరు దానికర్హులగుట కెంతయో చేయవలసి యున్నది. ధర్మసమరము ప్రారంభమైనది. మన మిక వెనుకకు తిరుగజాలము. గాంధిమహాత్ముడు శాసనోల్లంఘనముకు మీతాలూకాను ప్రథమ

రంగముగా నెన్నుకొనెను. దానికి మీయర్హతను మీరిపుడు ప్రదర్శింపవలెను. భారతస్వాతంత్ర్యయుద్ధమను సల్పుటకు మీరు సంసిద్ధతను చూపిరి. మీ రిపుడీచిన్నయుద్ధమునుసల్పి పెద్దయుద్ధమును సల్పుటకు మీకు గలయర్హతను ఋజువుచేయుడు. నే నిపుడు మహాజనసభనుండి సరాసరి మీగ్రామము వచ్చితిని. ఏమన నేను సాధ్యమైనంతత్వరలో మిమ్మందరను చేర నుత్సహించుచున్నాను. నేను మీరందరును సమరసన్నాహములో నుండగోరుచున్నాను. మీలో భేదములను కల్పించుటకు ప్రభుత్వమువా రన్నిసాధనములను, మంచిచెడుగులతో పనిలేకుండ, గుండెలుతీసినబంటులవలె, ప్రయోగించి చూతురు. మీలో మీ కున్నభేదాభిప్రాయములను, స్వల్పతగుపులను విడనాడుకొనవలె నని మిమ్ము ప్రార్థించుచున్నాను. మీవివాదలు, కక్షలు మానుకొని మీగర్భశత్రువులతో కూడ స్నేహము చేసికొనగోరుచున్నాను. అట్లు చేసినపుడే మీరందరు నొక్కుమ్మడి ప్రభుత్వము నెదుర్కొనగలరు. మీలో కొంతమంది మీభూములను ప్రభుత్వమువారు వశపరచుకొందు రని భయభ్రాంతులై యున్నసంగతి నే నెరుగుదును. వశపరచుకొనుటయనగా నర్థమేమి? వారు భూములను ఇంగ్లండు మోసికొని పోవుదురా? జరిగే మహోపద్రవ మేమనగా యీభూములను పుస్తకములలో ప్రభుత్వమువారు తమ పేర వ్రాసికొందురు. కాని మీ రొక్కత్రాటిమీద నున్నచో నీ

భూములను దున్నుటకు వచ్చువా రెవరును మిమ్ము ధిక్కరింపజాలరు. ప్రభుత్వమువారు మీభూముల నన్నింటిని వశపరచుకొనవలెను. మీరు దీనికి సంసిద్ధతను చూపినపుడు గుజరాతుఅంతయు మీ కండగా నుండగలదని నేను మీకభయహస్తము నిచ్చుచున్నాను.

మీగ్రామమును కట్టుదిట్టము చేయుచో మీ రితరులకు మార్గదర్శకు లగుదురు. ఉద్యమము ప్రారంభింపబడినది. ప్రతిగ్రామము యుద్ధసంసిద్ధతను చూపుశిబిరము కావలెను. ప్రతిగ్రామమునుంచి ప్రతిదినము తూచా తప్పకుండ వార్తలు తాలూకా పట్టణమునకు చేరవలెను. అక్కడనుంచి వచ్చు యాజ్ఞల నన్నింటిని వెంటవెంటనే జరుపుచుండవలెను. శిక్షక్రమపద్ధతి యున్నచో యుద్ధము సగముపూర్తియైనట్లే యని గుర్తించుడు. ప్రభుత్వమువారికి గ్రామమున కొకొక్కక్క పెత్తందారు, ఒక్కమునసబుమాత్రమే గలరు. మనకో! గ్రామములో నున్నప్రతియువకుడును విధిగా వాలంటీరు కావలెను."

---

# బార్డోలీ విజయము.

## ఏడవ యధ్యాయము.

"ఉన్నస్థితిని స్పష్టముచేయుట."

"స్పష్టముగా మాట్లాడుకొనుట త్యవసరము. నిష్కల్మషముకాని యుద్ధములో పరాజయముకన్న విజయమే మరింత యవమానకరమైనది" "మ్యాక్స్వినీ."

బార్డోలీలో నీవిధముగా సమరసన్నాహము లొకవంక జరుగుచుండ శ్రీయుత వల్లభాయి జగడ మక్కరలేకుండ చేసికొనుట కింకను సావకాశ మున్నదేమో యని ప్రభుత్వమువారితో సంభాషణలు జరుపుచుండెను. ఆతడు 6 వ తేదీని వ్రాసినయుత్తరముకు ఫిబ్రవరి 17 వ తేదీని గవర్నరుగారు "ముందు సెటిల్‌మెంటుకాలములో తాలూకాచరిత్ర పెళపెళలాడునట్టినిరంతరైశ్వర్యాభివృద్ధితో కూడియుండు ననుటకు తనకెట్టిసందేహమును లేదనియు"—ప్రతిదోపిడిగాడు తాను దోపిడిచేయువాని భావియభివృద్ధినిగూర్చి యిట్టి జోస్యమునే చెప్పవచ్చును. "జయకరువంటి యనుభవముకల రెవిన్యూఆఫీసరు తాలూకాయంతయు పదిమాసములు తిరిగి ప్రతిగ్రామమును పరీక్షించె ననియు" రాజధానిలో భూమి

పన్నుచరిత్రలో మక్తాలవిలువలపై నాధారపడుసూత్రము
ను ప్రవేశపెట్టుట కిదియే ప్రథమమని "మీరు చెప్పిన
ప్రయాణమును కౌన్సిలుసభావిష్టులైన గవర్నరుగారు ధృవ
పరుపజాలరై రనియు", "తమ యుద్యోగస్తులు శిఫారసుచే
సినదానికన్న ప్రభుత్వమువారు తక్కువరేటులనే స్థిరపరచి
రనియు" "తామెట్టి సదుపాయమును చేయజాల మనియు"
బార్డోలీప్రజలు "తమ స్వబుద్ధిచేతగాని పైనుండి వచ్చినవారి
సలహాలకు లొంగిపోయిగాని" పన్నులను చెల్లింపకపోయి
నచో "దాని ఫలితమును వా రనుభవింపక తప్పదు." అనియు
మామూలుపాటను పాడిరి. శ్రీయుత వల్లభాయి యింతలో
నున్న కొన్ని విచిత్రవాదములకు బదులు చెప్పెను. మక్తాల
సూత్రమును గురించి యత డనేకమంది యనుభవజ్ఞులైన
ప్రభుత్వోద్యోగులయొక్క వాదములను వ్యక్తపరచెను. 'ఇం
తవర కెప్పుడును పన్నులను స్థిరపరచుట కిది పునాదిగా తీసి
కొనబడలేదు' అని యొక బాధ్యతగలరెవిన్యూయుద్యోగి
చెప్పెను. ప్రభుత్వమువారు నూటికి 22 చొప్పున హెచ్చుప
న్నుకు రాజీపడుటకు కారణముల నడిగి రానున్న ఫలిత
మును గురించి ప్రజలను భయపెట్టినందుకు ప్రభుత్వమువా
రికి వందనము లర్పించి రెవిన్యూకార్యదర్శిగారి కతడు "నిజ
ముగా మీరు ప్రాతినిధ్యమును వహించిన ప్రభుత్వమే" "పై
నుండి వచ్చిన వ్యక్తులచే" నిండియున్న దనుసంగతి జ్ఞాపకము

చేసెను. "నేను భారతదేశములోని యుత్తరప్రాంతముల కెం తగా చెందుదునో యట్లే బార్డోలీకిని చెందినను నేను దుర్భ రబాధ నొందుచున్న బార్డోలీప్రజలకోరికమీదనే యిచ్చ టకు వచ్చితిని; నాసేవతో నిమిత్తము లేదని వారేనిమిష మందైనను నాకు స్వస్తి చెప్పవచ్చును. అంత చులకనగానే, అంత సుసాధ్యముగానే పైనుండి బలవంతముగా నాయుధబ లముచేత వారిపై చొప్పింపబడినట్టియు, ప్రతిదినము వారిప్రా ణములను పీల్చుచున్నట్టియు పరప్రభుత్వమునకును వారు స్వ స్తి చెప్పగలుగుదురని నే నాశించుచున్నాను" అని వల్లభాయి ప్రభుత్వమునకు బదులు చెప్పెను. ఈ యుపన్యాసముతో నెవ నికైనను బుద్ధి కలుగును గాని స్మిత్తుగారికిమాత్రము కలుగ దాయెను. దీనికి బదులుగా స్మిత్తుగారు నిర్లక్ష్యముతో మొద టిజవాబును దిగతుడుపు తీసినట్టిజవాబు యిచ్చెను. "బార్డో లీప్రజలు దివాలా తీయలేదు. లేక వారట్టిస్థితికి సమీపము నను లేరు. జనసంఖ్య హెచ్చినది; హెచ్చుచున్నది; దివాలా చిహ్నము లేమియును గాన్పించుట లేదు." శ్రీయుత వల్లభా యిగా రుదహరించిన 'కొందరి ఉద్యోగస్థుల' యభిప్రాయ ములు 'ప్రభుత్వప్రమాణముతో కూడినప్రకటనలు కావు'; వల్లభాయిని 'పైవాడు' అని పిలుచుటలో తాను ప్రభుత్వకా ర్యదర్శివలె వ్రాయలేదనియు కాని "యిట్టి యుత్తరము కౌ న్సిలు సభావిష్టుడైన గవర్నరుగారి గంభీరాభిప్రాయములనే

వెల్లడించు ననియు దీని నక్లే తీసికొనవలసియుండు" ననియు వ్రాసి వల్లభాయి యుత్తరప్రత్యుత్తరములను జరుపనెంచుచో జిల్లాకలెక్టరుతో జరుపవలెనని తెలిపెను.

గవర్నరుగారియనుమతితో శ్రీయుత వల్లభాయి యీ యుత్తరప్రత్యుత్తరముల నన్నింటిని స్మిత్తుగారి చివర యుత్తరమునకు జవాబుతోసహా వార్తాపత్రికలకు పంపించెను. అతనిజవాబు ప్రభుత్వముయొక్క తల్లకిందులుదృష్టిని బయటపెట్టి బార్డోలీసత్యాగ్రహముయొక్క ప్రయోజనమును పూర్తిగా స్పష్టపరచెను. "కాని బార్డోలీ సత్యాగ్రహముయొక్క ప్రయోజనమున కొకమితి కలదు. ఇందులోనున్న యుత్తరప్రత్యుత్తరములవలన తెల్లమగునట్టి వివాదాస్పదమగు విషయములలో నిష్పక్షపాతమైన విచారణను కోరుటయే అనగా ప్రజలహక్కును స్థాపించుటే దీనిప్రయోజనము. బార్డోలీతాలూకాలో పన్ను హెచ్చించుట కెంతమాత్రమును కారణము లేదని ప్రజలవాదము. నేను యీవిషయమునంతగా గ్రుచ్చి యడుగుట లేదు. కాని నిష్పక్షపాతమైన విచారణను కోరుట ప్రజలయప్రతిహతమైనహక్కు. నేను సెటిల్ మెంటుఆఫీసరుయొక్క నివేదికను సవాలు చేసియుంటిని. సెటిల్ మెంటుకమీషనరుగా రేసూత్రముపై నాధారపడి పనిచేసిరో దానిని ఖండించితిని. ప్రభుత్వమువారు నా సవాలును తీసికొని నాది తప్పని రుజువుచేయవలెను. ప్రభుత్వమువారు పాతపన్నులను తీసికొని యూరుకొనినను లేక

నిష్పక్షపాతమైన విచారణ కేర్పాట్లుచేసినను వ్యవసాయదారులు సత్యాగ్రహమును మానివేతురు. మర్యాద నెరిగిన ప్రభుత్వ మీరెంటిలో దేనినైనను నంగీకరించుట కెట్టికష్టమును కాన్పించదు."

స్మిత్తుగారీవిధముగా నిందాస్పదమైన యుత్తరప్రత్యుత్తరములను జరుపుచు వల్లభాయిని 'పైనుంచి వచ్చినవాడు' అని నిందించుచున్నకాలములోనే బొంబాయిప్రభుత్వఆర్థిక సభ్యుడు గుజరాతులో వరదలసంరక్షణసందర్భములో నీ 'పైనుంచివచ్చినవాని' యొక్కసేవను కొనియాడుచు నీక్రింది విధముగా పొగిడెను. "వ్యాపారములో మునిగియుండు గుజరాతు, కొద్దిసంవత్సరములక్రితమువరకు, నాత్మసమర్పణముతోగూడిన ప్రజాహితకార్యమును చేసి యెరుగదు. స్వార్థమును పరిత్యజించి యాత్మార్పణబుద్ధితో సాంఘికసేవను (ముఖ్యముగా గ్రామములలో) చేయసమకట్టినట్టి సేవకవర్గమును సృష్టించుటకు మహాత్ముడు సలిపినకృషి యీవిధముగా ఫలించినందుల కతడెంతేని యానందింపగలడు; ఎక్కువగా గుజరాతుపీఠమునుండి వచ్చిన వాలంటీర్లు, తమనాయకుడనివార్యమైన దైవసంఘటనచే తమమధ్య లేకపోయినను, యింతశ్లాఘనీయముగా పనిచేయగలుగుట మహాత్మునకు సంతోషము నొసగగలదు. వల్లభాయిపటేలుగారీతెర నెట్లు తొలగించిరో, యతడు తనకార్యకలాపము నెంతటి చాకచక్యముతో నిర్వహించెనో యిప్పుడందరు నెరింగినవిషయిమే".

---

శ్రీగ్రంథాలయము
18-2-1934

# బార్డోలీ విజయము.

## ఎనిమిదవయధ్యాయము.

"గాంధిమహాత్ముడు ఉద్యమము నాశీర్వదించుట."

"అప్రత్యక్షమైననాయకుడు, ఉత్తేజకారియగు నుదాహరణము"

"శ్రీనివాసశాస్త్రిగారు."

శ్రీయుతవల్లభాయి తనసమస్యను స్పష్టపరచుట మంచిదయ్యెను. ఏలనన, యుద్యమము ప్రారంభమగుటతోడనే పత్రికలు తమయిచ్చవచ్చినట్లు వర్ణింపనారంభించెను. ఈవర్ణనలలో న్యాయముగా కొందరును, నన్యాయముగా మరికొందరును యథార్థమునుయథార్థముగ తెలుపజాలకపోయిరి. నానుభూతిగలపత్రికలుదీనిని "పూర్వపుబార్డోలీయుద్యమమును పునరుద్ధరించుట" యనియు "పన్నుల నిరాకరణోద్యమ" మనియు వర్ణించెను. సుహృద్భావము లేనిపత్రికలు శ్రీయుతవల్లభాయి గుజరాతువరదలసందర్భమున "మహత్తరసమయములో గావించినయనన్యసేవను" ఒప్పుకొనుచు నతడు "ప్రభుత్వమునకు సహాయము చేయుటకుమారుగ సరిగా దాని కభ్యంతరములను కల్పించుయుద్యమముకే నాయకత్వమును వహించె" ననియు "చట్టవిరుద్ధమైన యుద్యమములో ప్రాణోను మని

ప్రోత్సహించుటచే గుజరాతురైతుల కపారమైన యుపకార మును చేసె" ననియు వ్రాసెను. ఈసందర్భములో మరియొక దురభిప్రాయమును తొలుతనే పారద్రోలవలసి యున్నది. ఈయుద్యమము మహాత్మున కిష్టము లేకపోవుటచే నతఁడు జోక్యము కల్పించుకొనలేదని కొందరు స్వార్థకాములు పలు కజొచ్చిరి. దక్షిణాఫ్రికాలోనున్న శ్రీనివాసశాస్త్రిగారు మహాత్మున కీయుద్యమముతో గలసంబంధమును తమయనన్య వాక్ఛక్తితో నిట్లు వివరించిరి. "కొందరు వేదాంతులు చెప్పు నట్లు భగవంతు డొకబ్రహ్మాండమైన యచంచలసంసారచక్ర మును ప్రారంభించి తానిక ననవసరమువలె తోఁపించుభగ వానునివలె (దానిజీవితమున కత డుండక తప్పదు) మీరు అప్రత్యక్షమైన నాయకులు; ఉత్తేజకారియగు యుదాహర ణము; మీ రందరిహృదయములలోను దూరి తాండవ మాడు చు వారిని ఋజుమార్గమున నుంచుచున్నారు.'' ఈయుద్య మమునుగురించి మహాత్ము డెట్లు భావించెనో, యతఁడు యంగు ఇండియాపత్రికద్వారా వల్లభాయి కెట్లు ఉద్యమారంభము నుండియు తోడ్పడెనో యీక్రిందివ్యాపమువలన విశదము కాగలదు. మార్చి 8 వ తేదీని శ్రీయుత వల్లభాయిప్రభు త్వములమధ్య జరిగినదంతయు ప్రకటింపబడినవెంటనే యత డిట్లు వ్రాసెను.

"వల్లభాయిబొంబాయిప్రభుత్వములమధ్య బార్డోలీ పన్నులనుగురించి జరిగినసంభాషణ ప్రజాసేవకునకై తయో ప్రయోజనకారి కాగలదు; అది మన మేప్రభుత్వముక్రింద జీవించుచున్నామో దానినిజతత్త్వమును విశదము చేయుచున్నది. వల్లభాయి ప్రభుత్వమునకుగాని కీర్తికాంతకుగాని తెలియనివాడు కాడు. అతడు గొప్పప్రజ్ఞ, శక్తి, నిజాయితీ, పరిశ్రమ కలిగినప్రజాసేవకు డని ప్రభుత్వమువా రొప్పుకొనక తప్పినదికాదు. అతనియుత్కృష్టసేవను వారహ్మదాబాదు పురపాలకపరిపాలనములో నొప్పుకొనియే యున్నారు. కొద్దిరోజులక్రితమే గుజరాతువరదలసందర్భములో నతడుచేసిన మానవసేవ నందరు నైక్యకంఠ్యముతో పొగడిరి. కాని ప్రభుత్వమువారి కాందోళన, వారి పరువుప్రతిష్ఠలకు, ఆదాయమునకు భంగము కలుగునని వారనుకొనినకృషిలో నతడు పని చేయుచుండుటచే నతనిసేవయంతయు బూడిదలోపోసిన పన్నీరువలె పరిణమించెను. వారి దివిన్యూకొరకే వారికి పరువుప్రతిష్ఠ లవసరము. వారు శుష్కమైన పరువుప్రతిష్టలలో విశ్వసింపరు. కనుకనే మొట్టమొదటియుత్తరములోనే వారు వల్లభాయిని బార్డోలీలోనికి "పైనుంచి వచ్చినవాడు" అని వర్ణించి యతనిసదభిప్రాయమును సంశయించి యతనిని నిందించుటే యుక్త మనుకొనిరి. గవర్నరుగారుకూడ దీనిలో భాగస్వామియే యనుసంగతి చివరయుత్తరమువలన నెట్టి

సందేహముచు లేకుండ రుజువగుచు పైనిందనుద్విగుణము చేయుచున్నది.

గవర్నరుకూడ నీయక్రమమైననిందలో భాగస్వామి యగుట కొప్పుకొనుట చూడగా గవర్నరు లెంతసదుద్దేశ్యము గలవారైనను, యెంత నిష్పక్షపాతము కలవారైనను (ప్రస్తుతగవర్నరువలె) ప్రభుత్వాధికారులయుచ్చులలో పడక తప్ప దని విశద మగుచున్నది. 'నాశమునకు ముందు గర్వము, పడుటకు ముందు పొగరుమోతుతనము ఆవేశించును'

కానిప్రభుత్వాధికారులు తమసురక్షితప్రదేశములనుండి తనపై కురిపించు వాగ్బాణముల నన్నిటిని యవలీలగా భరింపగలశక్తి వల్లభాయికి కలదు. ప్రజాసేవకులలో నత్యుత్తమతరగతికి చెందినవానిని నిందింప సాహసించిన ప్రభుత్వము యొక్క కేవలబాధ్యతారహితప్రకృతిని చూపుటకే దీనిపై నే నింతగా వ్రాయవలసి వచ్చెను.

కాని ప్రభుత్వమువారి కిట్టిగంగవెఱ్ఱి లెత్తుటకు కారణ మేదియో కొంచె మాలోచింతము. ప్రస్తుతభూమిపన్ను చట్టమునకు సంబాధము లేని ప్రభుత్వమువారి స్వంతమాట. ఈపన్నును క్రమపరచువిధాన మంతయు కేవల నధికారుల చేతులలో నున్నది. దీనిని ప్రజాయుతము లేక న్యాయశాస్త్రబద్ధము చేయుటకు చేసినభగీరథప్రయత్నము లన్నియు నింతవరకు విఫల మయ్యెను. నానాటికి పెచ్చుపెరుగు

చున్న న్యాయమును యిందులో చాలవరకు సైనికవ్యయమే, ప్రభుత్వమువా రెట్లో యార్జించవలెను. అధికసంఖ్యాకులకు చెందినతరగతికి సంబంధించునదగుటచేతను, వారి కేమియు ప్రాతినిధ్యము లేకపోవుటచేతను, కిక్కురుమనకుండ పిండుటకవకాశ మున్నజాతియగుటచేతను భూమిపన్నును నిరంకుశముగా హెచ్చింపవచ్చును. తాము చెల్లించుపన్నులలో పాలితులకు ప్రాతినిధ్య మున్నను, లేక వానిని జయప్రదముగా నిరాకరించినను బాధ్యతారహితమైన ప్రభుత్వ మంతరింపగలదు. తనపన్నులలో చేసిన హెచ్చుదలను బార్డోలీ యంగీకరింప జాలదు. దానినిప్రజలు ప్రభుత్వమువారిని అర్జీలతోను విన్నపములతోను శాస్త్రీయము లనిపిలునబడు అన్నిసాధనలచేతను బ్రతిమాలియుండిరి. విఫలమనోరథులై వారు వల్లభాయిని సలహాకొరకు అవసర మగుచో సత్యాగ్రహోద్యమముద్వారా ప్రభుత్వమును సాధించుటలో వారిని నడుపుటకును ఆహ్వానించిరి.

వల్లభాయి వారిసమస్యను విచారించి దానిలో న్యాయమున్నట్లు కనిపెట్టినదు ప్రభుత్వమువారి కాందోళన కలుగకుండ తప్పించవలె ననియు, ప్రజలకు దీర్ఘకాల మనుభవింపవలసినబాధ లేకుండ చేయవలె ననియు, ప్రభుత్వమువారు ప్రజలవాదములో నున్నన్యాయము నంగీకరింపకపోయిన యెడల నొకనిష్పక్షపాతమైన విచారణసంఘము నేర్పాటు

చేసి యుభయపక్షవాదములను విచారించి తీర్పు చెప్ప నియమింపనలె ననియు, నట్టితీర్పును ప్రజ లంగీకరింతు రనియు, నభయహస్త మిచ్చి గౌరవప్రదమైనపద్ధతిని సూచించెను. సహేతుకమైన యీసూచనను ప్రభుత్వమువారు గడ్డిపోచవలె నిరాకరించిరి.

ప్రభుత్వమువారివాదనకు వ్యతిరేకముగా జనసామాన్యము చెప్పుకొనువాదము నంగీకరింపవలసిన దని ప్రజల కెనరును చెప్పలేదు. నిష్పక్షపాతమైన విచారణసంఘము నుమాత్రమే కోరవలసినదనియు, నిది విఫలమైనచో శాంతముగా పన్నులను నిరాకరించి తత్ఫలితముగా వచ్చుకష్టముల నన్నింటికిని చివరకు భూములను పోగొట్టుకొనుటకును తయారై తమవీరపురుషోచిత నిశ్చయమును ధృవపర్చవలె ననియు మాత్రమే బోధించిరి.

ఈసత్యాగ్రహమునకును స్వరాజ్యసత్యాగ్రహమునకును వల్లభాయి సరియైనభేదమును గుర్తించెను. దీనిని 1922 లో స్వరాజ్యసంపాదనకొరకు బార్డోలీ చేయబూనిన పన్నుల నిరాకరణవంటి దని తలంచుటకు వీలులేదు. ఈసత్యాగ్రహము యొక్క లక్ష్యము స్వల్పము; దీనికొకస్థానికప్రయోజనము కలదు. బార్డోలీరైతు లక్రమమని ఘోషించుచున్న పన్నువంటి యే అక్రమ, నిరంకుశపన్నునైనను నిరాకరించుట ప్రతివానిహక్కు కాదుకాదు. ధర్మము నై యున్నది. ఈసత్యా

గ్రహముయొక్క ప్రయోజనము స్థానికము, ప్రత్యేకము నైనను దీని కొకయావద్భారతప్రాముఖ్యత కలదు. బార్డోలీలో నేది యథార్థమో భారతదేశములో చాలభాగములలో నదియే యథార్థము. స్వరాజ్యసంపాదనకుగూడ నిది యప్రత్యక్షముగా తోడ్పడును. ప్రజల నేది తమకు జరుగునన్యాయములకు మేల్కొలుపునో, శాంతియుతమైన, శిక్షతో గూడిన నిరాకరణమున కేది బలము నొసంగునో, ప్రజలను సాంఘిక బాధ కేది యలవర్చునో యది మనలను స్వరాజ్యమునకు దరిఁ చేర్చును."

# బార్డోలీ విజయము.



## తొమ్మిదవ యధ్యాయము.



"మొదటి నెల"

శ్రీయుత వల్లభాయియొక్క మొదటి యుపన్యాసము ఫలించెను. నెలరోజులు కాకమునుపే వివిధశిబిరములన్నియు పూర్తిగా తయారయ్యెను. తనమాట అక్షరాల శిరసావహింపబడుచున్నదని యుద్యమనాయకుడు తెలిసికొనెను. బామ్నిలో దర్బారుసాహెబుకు సహకారియైన గోవర్ధనదాసు తమనాయకుడా శిబిరమును చూచుటకు వెళ్లినపుడు యీ స్టేటుమెంటు చదివెను. "మాడివిజనులో 17 గ్రామములున్నవి. ఇందులో రెండు బేచిరాకు గ్రామములు. నేడు మీ సందేశమును వినుటకు తక్కిన 15 గ్రామములవారును వచ్చియున్నారు. మా డివిజనులో ప్రస్తుతము రోగగ్రస్తమై యున్న కేడాడ్‌లో తప్ప ప్రతిగ్రామములోని ప్రజలు తమ సంతకములను చేసినారు. కేడాడ్ పెంకిప్రదేశము. ఇచ్చట కేవలము తటస్థభావము వహించువారే కాక యితరులకు స్వామిద్రోహము చేయువారు కూడ గలరు. ఇంతవరకు వార్తలను తెచ్చుట, మనుష్యులను రాయబారములతో పంపుట

మాపని. జప్తులనాటక మిప్పుడే ప్రారంభమగుటచే మేమి పుడు నిజముగా నుపయోగపడుచున్నాము. జపు ఆఫీసరులు వచ్చుసరికి తలుపులు మూతలు లేక తాళములు పడుచున్నవి. మా వలంటీర్లకు మేము మద్దెలలు, శంఖములు యిచ్చితిమి. ప్రభుత్వనౌకరు కాన్పించుటతోడనే మద్దెల లేక శంఖము ప్రజలను మేల్కొలుపును. ఈ యువకు లీపనియునిన చెవి కోసికొందురు.''

మొదటినెలలో సామాన్యశిబిరమెట్లున్నదో యిది విశదము చేయుచున్నది. కాని యీ నెలలో జరిగిన పనిని విచారింతము. దౌర్జన్యరహితమైన యుద్ధములో నొక పక్ష మిట్లున్నను ముఖ్యముగా సాత్త్వికముగా పన్నులను నిరాక రించుట వంటి బార్డోలీసత్యాగ్రహములో విరోధపక్షమే దౌర్జన్యమును ప్రారంభింపవలెను. ఫిబ్రవరి 18 వ తేదీని మొదటిగుండు వేలెను. ఏళ్లకొలది పన్ను బకాయిలు, ఏలం నోటీసులు యెరుగని గ్రామములలో పదిరోజులలో పూర్తిప న్నుల నీయునిచో నూటికి రు 25 శిక్ష విధింపబడునని ప్రభు త్వము వారు ప్రకటించిరి. చాలగ్రామములలో నూటికి రు25 చొప్పున పన్ను హెచ్చింపబడెను. ఈపనికి నుంచిముఖ్య మైన గ్రామములను యెన్నిరి. మొదటిదెబ్బ వాలడ్ లోనున్న పదిహేనునుంచి పలుకుబడి గలవర్తకులపై పడెను. మరియొ కటి వాజిపురవర్తకులపై గురిపెట్టబడెను. దీనికి కారణము

తాలూకా యంతటిలోను బనియాలు లోకువ; చులకనగా లొంగి పోవువారని ప్రతీతి.

ఇందులో విశేషముగాని దౌర్జన్యముగాని లేదు. కాని వారు మరియొక దుర్బలస్థలముపై బడినపుడు దుర్మార్గము, దౌర్జన్యము నవలంబించిరి. బెడ్కువయను గ్రామములో నొకమునసబు రానిపరాజనైతు నొకనిని చావమోదెను. అతడు మొదట తిట్లతో ప్రారంభించి యతడు లొంగకపోవుటచే తన్నులు పిడిగుద్దులు కురిపించెను. మరియొకచోట యిద్దరిని చట్టవిరుద్ధముగా నిరోధించి పన్ను యిచ్చినతరువాత వదలివేసిరి. ప్రభుత్వముతరఫున చిన్న యధికారులీవిధముగా నాటకమును ప్రారంభించిరి. ఆండర్సనుగారు ప్రభుత్వము ను పన్నులు స్థిరపరచుటలో ముక్కుకు త్రాడు పోసి తనయిచ్ఛ వచ్చినట్లు లాగినట్లే యనుభవశూన్యుడైన యొక డిప్యూటి కలెక్టరు యీసమయములో మొదట యింతకంటె కొంచెము మంచిపద్ధతులతో ప్రారంభించెను. అతడు ముఖ్యులను రావించి వారితో వాగ్వాదమును చేసి పన్నులో కొంతభాగమును యిమ్మనెను. "నన్ను సంతోషపెట్టుటకైనను ఒక్క రూపాయి చెల్లింపుడు" "అయ్యా! మీయందు మాకెట్టిగారవమున్నను గ్రామమంతటి సమ్మతిని తీసికొననిదే మేమేనెట్లు చేయగలము?" అని వారనిరి. "నేను మిమ్ము జయిలులో పెట్టెదననుకొనుడు" అని యతడు వారిని బెదరించెను.

"మీ రక్లెందుకు చేసెదరు ? నేను రాజద్రోహమును చేయ లేదు" అని రైతు పలికెను. డిప్యూటీకలెక్టరు నవ్వి గ్రామములో మంచి పలుకుబడిగల యారైతును క్షమార్పణకోరి పంపివేసెను.

ఈ రెండుపద్ధతులును వాటిని ప్రయోగించినచోట్ల కాక నితరస్థలములయందు కొంతపనిచేసెను. మొదటనుంచి యు నూగులాడుచున్న కేడాడ్‌లోని కొందరు బనియాలు నోటీసులు రాకుండగనే కొంతపన్ను యిచ్చివేసిరి. ఇది చాలా శోచనీయమే మైనను ప్రజలలో నవిసితిని కలుగచేయ లేదు. ఊగులాడుచున్నవారందరును ప్రథమముననే జారిపోవుట చాలమంచిదని వారు శాంతముగా పలికిరి.

ప్రజలు భయపడుటకుమారుగా పరిస్థితులతీవ్రతను ప్రతిదినము గుర్తించుచుండిరి. వివిధ శిబిరాధిపతులును వలంటీర్లును సత్యాగ్రహదీక్షను తీసికొనువారి సంతకములను తీసికొనుటలో నిమగ్నులైరి. నూతనగ్రామములు కలియుచున్న వనియు సంతకములు చేయువారిసంఖ్య ప్రవర్థమానమగుచున్నదనియు రోజురోజు వార్త లేతెంచుచుండెను. సత్యాగ్రహపత్రముపై సంతకముచేయుట పవిత్రమైన కార్యము. మార్చి మొదటి వారములో రెండుమూడు గ్రామములుమాత్రమే తక్కినవాటితో పూర్తిగా నేకముకాలేదు. అక్కడక్కడ కొద్దిమంది భూస్వాములింకను మనోనిశ్చయము చేసికొనలేదు.

ప్రతిచోటను చిన్నచిన్న భూస్వాములు సంతకములు చేయుట కాతురతపడుచుండిరి; పెద్దవారు కొన్నిచోట్ల వెనుకముందు లాడుచుండిరి. ఇట్లుండగా వల్లభాయియొక్కయుపన్యాసము లత్యద్భుతముగా పనిచేసెను. రైతుభాషలోను, రైతుమాటలోను నద్వితీయకౌశలము సంపాదించిన యతనియుపన్యాసములు ప్రజల నుత్సాహపరవశులను జేసెను. ఇచ్చట నొక యుదాహరణము నిచ్చెదను.

"ఈ పదిహేనుదినములు మీ హృదయములలోనున్న భయమును పారద్రోలుడని మీకు బోధించినట్లు నేను గ్రహించితిని. కాని మీరింకను దానినుండి పూర్తిగా మోక్షమును పొందలేదు. ఇంకను మీలో నింకు లో బేడవంతు మిగిలియున్నది. దీనిని పోద్రోలుడు. మీకు భయముండనేల? ఉండవలసినభయము ప్రభుత్వమునకు గాని మీకుగాదు. ప్రజల యంగీకారములేనిదే యేనాగరికప్రభుత్వమైనను పాలింపజాలదు. మీరంధప్రాయులై యున్నారు. కనుకనే ప్రస్తుతము వారు మిమ్ము పాలించుచున్నారు. వారు మీకు శాంతిని నైశ్వర్యమును సమకూర్చుచున్నారను దుర్భ్రమలో మీరు మునిగియున్నారు. ఇది శాంతియుతమైన పాలనకాదు. భయోత్పాతమైనపాలన. అధర్మము డీకొనుటకు వలసినసత్యాగ్రహశక్తిని మీరు కోల్పోయిరి. అదిలేకపోవుట పిరికితనము. నేను కొన్నిసమయములం దర్ధరాత్రివేళ మీగ్రామముల

గుండ పోవుచుండును. కాని యెక్కరైనను "ఆగుము! ఆవెళ్లువారెవరు?" అని యడుగువారు లేరు. ఈగ్రామములోనికి క్రొత్తవారెవరైనను వచ్చునపు డొకకుక్కయైనను మొరగదనియు, నొకదున్నపోతైనను కొమ్ములు విసరదనియు రవిశంకరు ఆశ్చర్యముతో నాకు చెప్పెను. మీ సభ్యత్వమే మీ నాశమునకు కారణ మయ్యెను. నేను మీశరీరములోనిక నిర్భయత్వమును నెక్కింపదలచుకొంటిని. నేను మీకు ప్రాణప్రతిష్ఠ చేయనెంచితిని. మీనేత్రములలో నధర్మముపట్ల నుండవలసిన యాగ్రహజ్వాలలేవియు నాకు కాన్పించలేదు."

ఈయుపన్యాసమైన తోడనే సంతకములనుచేయుటకనుజ్ఞ నొసంగవలసినదని యింతవరకును సందేహమనస్కులును, ఊగులాడుచున్నవారును నతనిచుట్టు మూగిరి. అనవాజాతివారి కేంద్రమైన సార్భానులో నద్భుతమైనఫలితము కలిగెను. మొదట సన్నకారంతసంతకములు చేసిరి. తరువాత పెద్దలందరు గద్దెలు దిగివచ్చిరి. చివర కాగ్రామములో నొకరిద్దరు ప్రభుత్వనౌకరులుమాత్రము మిగిలిరి. ఈప్రభుత్వనౌకరులుకూడ తాము సంతకములు చేయకపోయినను చివరవరకు నెట్లు స్థిరముగా నిలచిరో మున్ముందు చూడగలము.

రానిపరాజాతిలో ప్రబోధము నెమ్మదిగానున్నను స్థిరము సాగుచుండెను. ఎట్టినోటీసులులేకుండ పన్ను చెల్లించిన కొందరు పనియాలు తా మప్పిచ్చినకొందరురానిపరాజ

జాతివారి పేరకూడ తామే చెల్లకట్టిరి. ఇది యనుకొనినట్లే జరిగినను వీరిలోకూడ నెక్కువమంది పూర్తియైననిశ్చయముతో నుండిరి. నేనొకగ్రామమునకు శ్రీయుత వల్లభాయితో వెళ్ళియుంటిని. అది ఖద్దరుగ్రామము. సభకు వచ్చినవారిలో ఖద్దరుకట్టినవారు, త్రాగుడు మానినవారుమాత్రమే కాక నీరెండును చేయనివారుకూడ కలరు. రానిపరాజవాలంటీర్ల కృషిచే నిట్టిభేదములేవియు లేకుండ వీరందరు చేతులుకలిపిరి. మహాత్మునిముందర మూడుసంవత్సరములక్రితము ఖద్దరుదీక్షను తీసికొని తమ నగల నన్నిటిని త్యజించినస్త్రీలందరును క్షీరధావళ్యమును బోలుఖద్దరును ధరించి యుత్సాహతరంగములలో నోలలాడుచు సత్యాగ్రహగీతములను పాడుచు నచ్చటకేతెంచిరి.

సత్యాగ్రహగీతములనుటతోడ నేయీమాసములో జరిగిన యొకటిరెండువిషయములు జ్ఞప్తికి వచ్చుచున్నవి. స్థానికముగా వాలంటీర్లు దినదినాభివృద్ధి గాంచుచుండిరి; కాని దూరముననున్నకఠియవాడునుండి కూడ వారాకర్షింపబడిరి. ఫూల్చందు కస్తూర్చందుషా తనభార్యతోను శివానందు రామనారాయణలతోను నచ్చటకు వచ్చెను. ఫూల్చందుభాయి కొన్ని గీతములను సిద్ధముచేసెను. వీటికితోడు తాలూకాలోనున్న కోలాహల మతనినుండి యనేకనూతనగీతములను కురిపించెను. ఈస్నేహితులను వాలడ్‌లో నుంచిరి. వీరిభజనలను

చూచితీరవలెను. వీటినందరును కావలెననెడివారేరీ? రసభరితమై హృత్తోషకమైన యీపాటలు సత్యాగ్రహసందేశమును మూలమూలలకును గొంపోయెను. పురుషులు, స్త్రీలు, శిశువులు వీటి నామూలాగ్రముగ వల్లెవేయుచుండిరి. ఫూల్చందు భాయి సేవనుకాని యతనిగీతములనుకాని మనమంతగా పొగడజాలము. స్త్రీలు వేలకొలది సభలకు వచ్చెడివారు. కాని వారిని నడుపగలనాయకురా లెవరును లేకపోయెను. ఇట్టి సమయములో శ్రీమతి మితుభాా పెటిట్ రంగములోనికి వచ్చెను. ఈమెయు శ్రీమతి భక్తిభానుదేశాయియు (దర్బారుసాహెబుధర్మపత్ని) మరికొందరు, స్త్రీలును స్త్రీలలో నీ సందేశమును వ్యాపింపజేసిరి. శ్రీమతి మితుభాా గొప్ప ఖద్దరుప్రచారకురాలు. ఆమె యెచ్చటకుపోయినను తనతో ఖద్దరును తీసికొనిపోవుచుండెను. బొంబాయిలోని గొప్పపార్శీ కులమునకు చెందిన యీసుకుమారవనిత పాదరక్షలు లేకుండ గ్రామములలోనికి మైళ్ళకొలదీ నడిచివెళ్ళి భుజముపై ఖద్దరుగుడ్డలను వేసికొని పెదవులతో ఖద్దరుసందేశమును విడచిమ్ముకొనిపోవుచు నద్భుతమైనప్రచారము చేసెను.

ఈలోపల డిప్యూటీకలెక్టరు వాలడ్లో కొంతచీలికను కలుగచేసెను. ఇతడు బనియాలను పట్టుకొనెను. ఇద్దరు భూస్వాములను చేరదీసి వారిని కొంతసొమ్ము సిద్ధముచేసి యొకచోటనుంచవలసినదనియు, మహాల్కారీ (రెవిన్యూయినస్పె

ు) తనమనుష్యులతో వచ్చి జప్తుచేసికొనిపోవుటకు వీలుం
పనట్లు చేయవలసినదనియు నేర్పాటుచేసి గ్రామస్థులకండ్లలో
దుమ్ముపోయదలచిరి. ఏర్పాట్లు యీవిధముగా కట్టుదిట్టము
చేసి మహల్కారి వారిద్దరియిండ్లకును జప్తువారంటులతో
వెళ్ళెను. రు 1500 లును 785 విలువగలకరెన్సీనోట్లు దొరి
కెను. వాటిని జప్తుచేసిరి. కాని ప్రజలీనాటకమునుకనుగొనిరి.
గ్రామస్థులలో నీవార్త దవానలమువలె వ్యాపించెను.
వాలడ్‌లో నేయాగ్రహజ్వాలలు రేగసాగెను. వీరిని బహి
ష్కరించుటకు ప్రజలు వెంటనే కూడిరి. ఈవార్తవినుటతో
డనే శ్రీయుత వల్లభాయి యచ్చటకువచ్చెను. అతడు కొంచె
మురాత్రిపడినతరువాత వచ్చి యాగ్రహపరవశులై యున్న,
గ్రామస్థులను శాంతింపచేసెను.

"మీరు కోపమునకు తావీయరాదు. మీదీక్షమిమ్ము
అహింసచే బంధించుచున్నది. అహింస కోపమునకు తావీ
యదు. దురదృష్టవంతులైన యీమనసోదరుల తప్పిదము
మీనిశ్చయమును మరింతదృఢతరము చేయునుగాక ! మీకిది
యొకగుణపాఠము. ప్రభుత్వాధికారులయుచ్చులలోపడిన యీ
స్నేహితులపై మీరు కినుక వహింపకుడు. మీచేయిదాటి
పోయినదానికొరకు నిష్ఠురపడి లాభములేదు. ఇది దుర్గంధ
పూరితము. దీనినికదపకుడు. అట్లుచేసినచో నిది మిమ్మంటు
కొనును. ఈయుద్యమములో జారిపోవువారుండరని మీరె

న్నడును యూహించియుండలేదు. వీరిని విడిచిపెట్టినచో ప్రజలలో నవినీతి ప్రబలునని మీరు భయపడుచున్నారు. ప్రమాణపత్రముపై సంతకముచేసినవారు నాలుకను తాటిపట్టివలె భావించి వాగ్దానభంగమొనరించుచున్నపుడు మీ రెంత కాలము వారినాపగలరు? వారిపై మీ రెట్టికఠినచర్యను తీసికొనవలదని మిమ్ము నేను ప్రార్థించుచున్నాను. మీలో నెవ్వరైనను తులసివనములో గంజాయిమొక్కలవంటివా రున్నచో వారిని ముందుగానే పన్నుచెల్లింపుమని ప్రోత్సాహపరచుడు. ఏమిజరిగినను జరుగునుగాక! భయపడవలసినయగత్య మేమియు లేదు. రెవిన్యూయినస్పెక్టరు తనకు దొరకినదానికి కులికిన కులుకు చుండునుగాక! త్వరలోనే ఆయనచేతి కేమి పనియును దొరకకపోగలదు.”

ప్రజలు శాంతించిరి; కాని తప్పిదముచేసినవారు తగిన పరిహారమునొసంగువరకును వారు వారితో శాంతిచేసికొనలేదు. వారు వారివద్దకు వెళ్ళి వారితో వాదించి వారివద్ద క్షమార్పణతీసికొని మిగతపన్నును చెల్లింపను వాగ్దానమును తీసికొనిరి. వారిలో నొకడు తనపశ్చాత్తాపమును వెలిబుచ్చుచు నాత్మపవిత్రతకొరకు తనయంతట తానే రు 800 శిక్షవిధించుకొని సత్యాగ్రహోద్యమమునకు సమర్పించుకొనెను.

ఈవిధముగా చెడుగునుంచి మంచియే బయలుదేరెను. చెడుగును త్వరలోనే మరచిపోయిరి. కాని ప్రజలాయాత్మ

పారిశుధ్యకలాపమునే స్మరించుచువచ్చిరి. మొత్తముమీద నెలయంతటిలోను యేకొద్దిమందిమాత్రిమో జారిపోయిన వారుండుటచే ప్రజలకొక నూతనబలము చేకూరెను. వెంటనే వారు తమకులకట్టుబాటులను మరింతకట్టుదిట్టము చేసికొనసాగిరి. పెత్తందారులు తమకాలముకూడ సమీపించుచున్నదని గ్రహించిరి. నిర్బంధవిధానమింకను అమలులోనికి తేబడలేదు. కాని శిక్షవిధించుటకొసంగినగడువు దాటిపోయెను. కనుక జప్తుల నమలుజరుపుటకు వీరిసహాయమునడుగక మానరు. శ్రీయుత వల్లభాయి ప్రతియుపన్యాసములోను నొక్కివక్కాణించుచున్న "పెత్తందారుగ్రామమునకు ముఖి అనగా ముఖమువంటివాడు. ప్రభుత్వముతో గ్రామముతరఫున మాట్లాడుటయే యతనిధర్మము. ఒక అక్రమపన్నును రాబట్టుటకతనిసోదరులయాస్తిని జప్తుచేసి బాధించుట యతని పనికాదు; ధర్మముకాదు. జప్తులుచేయుట తనయాత్మగౌరవమునకు, హోదాకు తగనిపనియని యతడు ప్రభుత్వముతో నిర్మొగమాటముగ చెప్పుటయే యతనిధర్మము." ఈ యమృతవాక్కులను వారు పానముచేసియే యుండిరి. 60 మందిపెత్తందారులు బార్డోలీలో సమావేశమై వల్లభాయితో హృదయపూర్వకమైన సంభాషణలు సలిపి యేకగ్రీవముగా యీనీచకర్మను సహాయపడరాదని తీర్మానించుకొనిరి.

ఇట్లే రానిపరాజులు, దూబ్లాలు, ధేడులు మొదలగ జాతులవారందరును సభలుచేసికొని జప్తుచేసినయాస్తినిమో, కొనిపోయి యుద్యోగస్తులకు తోడ్పడరాదనియు, జప్తుసందర్భములలో నెట్టిసహాయమును చేయరాదనియు తీర్మానించుకొనిరి.

ఇక వార్తాపత్రికలు తమపనిని తాముచేయుచుండెను. జిల్లాలోని యితరతాలూకాలు సభలను జరిపి తమసానుభూతులను పంపించిరి. ప్రక్కనున్న జలాల్పూరుతాలూకాలోని గొప్పగొప్పవ్యవసాయదారు లందరును సభచేసి బార్డోలీవ్యవసాయదారుల కన్నివిధముల తగినసహాయము చేయుటకు సాధనముల నారయుచుండిరి. వారు వల్లభాయిపటేలును తమ సభకాహ్వానించిరి. కాని యతడు పోజాలక మరియొకరినిపంపి వారియభినందనములను పొందుటకు బార్డోలీవ్యవసాయదారులేమియు ఘనకార్యములను చేయలేదనియు, వారికను తమ తాలూకాలోనే యెట్టినిధినిచేకూర్చనపుడు వారెట్టికష్టములను, నష్టములను పొందనపుడును యితర తాలూకాలనుండి సహాయము నంగీకరించుట కెంతయో సందేహింపవలసియున్నదని సందేశమును పంపెను. బార్డోలీవ్యవసాయదారులయెడల సానుభూతిచూపుటకు మార్చి 4 వ తేదీని సూరతులో జిల్లా సభ జరుగవలసియుండెను. ఈసభను జరుపనెంచినవారికి వల్లభాయి దీనినిపుడు జరుపవలదనియు, ప్రభుత్వమువారు నిర్బం

వవిధానమును నమలుజరుపువరకు బాధననుభవించుటకు సత్యాగ్రహులకు గలశక్తిని సానపెట్టువరకు దీని నాపవలసిన దనియు సలహాచెప్పెను.

"ప్రపంచమునకు చాటుకొనుటకు తగిన ఘనకార్యమును దేనిని మే మింకను చేయలేదు. మేము త్యాగాగ్నిసంస్కారసుస్నాతుల మగువరకును మాస్నేహితులు తమ యభినందనములను, సహాయమును దాచియుంచుదురు గాక !" అని యతడు వారికొకసందేశమును బంపెను.



# బార్డోలీ విజయము.



## పదియవ యధ్యాయము.



" కొంతసద్దుపాటు—తుమార్పణ. "

" సత్యభ్రంశ మెప్పుడు నొంటరిగా నుండజాలదు. "

"రిఛార్డుసన్."

మొట్టమొదటియుత్తరములోనే వల్లభాయి తాలూకాలోని ముప్పదిరెండుగ్రామములకు జరిగినయక్రమమును గురించి ప్రభుత్వముకు వ్రాసెను. ప్రభుత్వమువారు నీళ్లునమలుచు తక్కువవర్గములోనుండి పైవర్గములోనికి జేర్చుకొనిన గ్రామములవిషయమై క్రొత్తగా నోటీసులను పంపనక్కరలేదని చెప్పసాగిరి. కాని ప్రజాబల మూరకపోలేదు. ప్రభుత్వమువారీముప్పదిరెండుగ్రామములలోను యిరువదిరెండుగ్రామములను తక్కువవర్గములోనికి తగ్గించుచు నొకనోటీసుచేసి సెటిల్‌మెంటు కమీషనరుగారితప్పను కొంతవరకు సవరించిరి. ఈనోటీసుఫలితముగా నూటికి యిరువదిచొప్పున హెచ్చుకట్టబడిన మూడుగ్రామములు వెనుకటిస్థితికిని, నూటికి నలుబదియైదు మొదలు యేబదివరకు హెచ్చుకట్టబడిన మూడుగ్రామములు $18\frac{3}{4}$ మొదలు

20 వరకుచు నూటికి 58 వరకు హెచ్చుకట్టబడిన రెండు గ్రామములు యిరువదివరకుచు నూటికి యేబది హెచ్చు కట్టబడిన పదునాల్గుగ్రామములు 25 వరకును తేబడెను. కాని యిది జ్ఞానోదయమున కింకను చాలదూరమనియే గ్రహింపవలెను. పైదానికి మరొకయర్థమును చేసికొందురని ప్రభుత్వమువారు తమతగ్గింపు తా మిదివరలో సూచించినవర్గ ములకుమాత్రమే చెందుననియు "హెచ్చుపన్నుకు సంబంధించి నది కా"దనియు స్పష్టపరచిరి.

ఈనోటీసు సాంకేతికప్రమాదము నొకదానిని దిద్దినను విషమపరిస్థితులకు కారణమైనమూలదోష మట్లే నిలచియు న్నదని ప్రజలుగ్రహించిరి. ఎట్టివిచారణయు సలుపక తప్పుడు లెక్కలనాధారము చేసికొనియు సెటిల్ మెంటుకమీషనరుగారి "భూమియొక్కమక్తాలవిలువ" అనుపిశాచమును పుర స్కరించుకొనియు హెచ్చుపన్ను శిఫారసుచేయబడెను. ఈ మూలరోగమట్లే యుండెను.

ఇంతవరకుచేసి సెటిల్ మెంటుకమీషనరున్ను, రెవి న్యూసభ్యుడున్ను ప్రభుత్వమువారిని సమర్థించుటకొక నిష్ప్ర యోజనమైనవాదమును చేసిరి. భీమభాయి నాయిక్ గారు వేసి నప్రశ్నకు రెవిన్యూసభ్య డీక్రిందిమొండిజవాబు చెప్పెను. "భూమిశిస్తును స్థిరపరచుసెటిల్ మెంటులకు సామాన్యఆర్థిక విచారణ విధాయకముగా నుండనవసరము లేదు. పన్నువిధిం

చుటకు మక్తాలవిలువలే యథార్థమైనయాధారము. అవసరమైనఆర్థికాంశములన్నియు నిందులోనే జేరుచున్నవి." 'మక్తాలవిలువలు' అను పిశాచగ్రస్తుడైనమనిషి ప్రభుత్వము నెట్లు తనయుపద్రవకరమైనపిచ్చితో విషపూరితముచేసెనో దీనివలన తెలియుచున్నది. బార్డోలీ సెటిల్‌మెంటుసమస్యమీద నారిమన్‌గారు శాసనసభలో కోతతీర్మానము నుపపాదింపగా నితడులేచి తానే సిగ్గుపడవలసినసమర్థనముతో ప్రభుత్వమును కాపాడసాహసించెను.

ఇతని విచిత్రవాదములలో నొకటి యేదనగా కల్లుత్రాగుట మానివేసి రైతు చాలాకూడబెట్టెను. కనుక నతడు ప్రభుత్వమునకు జాస్తిపన్ను చెల్లింపవలెను! మరియొకవాదమేమనగా ? "యీసంవత్సరమునుండి వేయబడినపన్నులు 1833 లో వేయబడినపన్నులతో పోల్చి చూచినచో 117 కు నూరుకు గలసంబంధ మున్నది. అనగా 100 వత్సరములక్రితము అమలులోనున్నపన్నులకంటె నూటికి 17 మాత్రమే హెచ్చినవి" ఇది కేవలము తుంటరితనము ఆండర్సనుగారి ప్రకారము 1833 లో నాక్రమింపబడి వ్యవసాయములోనున్నభూమి 30,000 యకరములు. 1928 లో 1,30,000 యకరములు. ఆక్రమింపబడినభూమిలో నింత హెచ్చుదల యెట్లు సంభవించెను? 1833 తరువాత వ్యవసాయములోనికివచ్చిన భూమి కొంత బంజరుభూమి; చాలాభాగము వెనుకటిసెటిల్

మెంటులో 'వ్రాస్' అనివర్ణింపబడినగోభూమి. 1833 కు పూర్వము ఆచారమేమనగా వ్యవసాయముచేయుప్రతిరైతుకు తనసాగులోనున్నభూమినిబట్టి కొంతగోభూమిని యుచితముగా పశువులమేత కిచ్చివేసెడివారు. 1833 లగాయితు 1866 వరకు బీగాకు (1 యకరము) రు 1-0-0 పన్ను గట్టిరి. 1866 లగాయితు దీనిని జిరాయితీలోనికి జేర్చి జరాయితీపన్ను విధించిరి. ఆండర్సనుగారు "నూరువత్సరములక్రితము అమలులోనున్నవాటికంటె నిపుడు నూటికి రు 17-0-0 మాత్రమే హెచ్చుచేయబడెను" అని యుత్సాహముగా పలికినదాని కర్థ మేమియో చూతము. బాగ్లోలీతాలూకాలోని సార్భానుడివిజనులో నున్నరైతు 20 యకరములు సాగుచేసినచో 6 యకరము లుచితముగా పశువులమేత కనుభవించెడివాడు. అనగా 1833 వరకు బీగాకు రు 5-0-0 పన్నుక్రింద చూచినచో రైతు 26 యకరములకు $(20\times5)+(6\times0)=$ రు100 చెల్లించవలసియుండెడిది. ఇప్పుడో! అతడు 26 బీగాల మీద నూటికి 17 చొప్పున హెచ్చుపన్ను యిచ్చుకొనవలెను. అనగా $(20\times5.85)+(6\times5.85)=$ రు 152.1 1833లో 26 బీగాలకు రు100 చెల్లించిన వ్యవసాయదారు యిపుడు ఆండర్సనుగారు సెలవిచ్చినట్లు 117-0-0గాక 152.1 యిచ్చుకొనవలెను. కాని వ్యవసాయదారు కింతకంటె నెక్కువ నష్టమే వచ్చును. గోభూమి యుచితముగా వచ్చినపుడు రైతు

కావలసినన్ని పశువులను సుఖముగా మేపుకొనుచుండెడివాడు పశువులు బలిసి యుండెడివి; మంచియెరువును చేకూర్చెడివి. ఇప్పుడతని కుచితముగా మేపుకొనుగోభూములు లేవు; ఇప్పుడు రైతు యెంతబీదగా నున్నాడో పశువుకూడ నంతకంటె యెక్కువబీదగా నున్నది. "అట్లయిన రైతు భూమి నెందుకు వదలివేయడు?" అని ఆండర్సనుగారు పృచ్ఛించుచున్నారు. "ఒక్కడును భూమిని వదలివేయడు సరికదా యీముప్పది వత్సరములలోను యీనిర్బంధవిధానము లేవియు నమలు జరుపబడలేదు; వాటిఅవసరమే లేకపోయెను. అయినప్పటికిని పన్నులు దుర్భరముగా నున్నవని మీరు మాకు చెప్పుచుందురు.'' అని వారు వాదించిరి. పన్నులభారము హెచ్చుగానున్నదనుసంగతి ఆండర్సనుగారి కాశ్చర్యమును కలిగించెను. ఏలననగా నీకాలములో నిర్బంధవిధానము నమలు జరుప వలసినయవసరము లేకపోయెను. కాని జయకరు నివేదికను విమర్శించుచు తా నేమి వ్రాసెనో దాని నతడు మరచిపోయెను. "కార్యపూర్వకముగా నున్నలెక్కలద్వారా తేలుచున్నసారాంశ మేమనగా 1896 లో తాలూకాలో మితిమీరినపన్నులు విధింపబడెను. లేదా నికరాదాయము లో సగమువరకు (చివరమితి) విధింపబడెను.'' ఈలెక్కలను బార్డోలీసత్యాగ్రహులు మొదటనుంచియు సవాలు చేయుచునే యున్నారు. వ్యవసాయదారు భూమి నేలవిడిచిపె

ట్టెడు? అను ప్రశ్న బ్రిటిషు ప్రభుత్వమంత నిరంకుశముగా నున్నచో భారతీయులేల వెంటనే వారికి స్వస్తి చెప్పరు? లేక ఆండర్సను, జయకరుగార్లవంటి బాధ్యతాహీనులైన యధికారులున్నచో వ్యవసాయదారులు వారిని యుద్యోగముల నుండి యేల బర్తరపుచేయరు? అను ప్రశ్నవలెనున్నది. దీనిలోనున్న విరుద్ధమును ప్రభుత్వమునారి రెవిన్యూకార్యదర్శియు 1924 లో ఖేడాకలెక్టరుగానున్నట్టియు స్మిత్తుగారు భూమిపన్ను విధించుకమిటీముందర యిట్లు చెప్పెను. "ఇట్టిపరిస్థితులలో వ్యవసాయదారు లెట్లు జీవింపగలుగుచున్నారు? అని ప్రశ్నించుచో దీనికి జవాబు యేమనగా పనిలేనికాలములో కూలిపనిచేసికొనుటచేతను, బండ్లను అద్దెలకు తోలుకొనుటచేతను, నెయ్యి, పాలు, పెరుగు, పిడకవగైరాల నమ్ముకొనుటచేతను వారి యాదాయము కొంతవరకు భర్తీ చేయబడుచున్నది."

ఇక మన మీవిషయమును తరచవద్దు. మనమూ పరిశీలించినవాదములవంటివాదములతో మనకు పోరాట మవసరములేదు. కాని ఆండర్సనుగారు సిగ్గుపడవలసినవిషయ మొక్కటి ఆయుపన్యాసములో కలదు. చివరనతడు "ప్రభుత్వబలము పదిమందిబలముతో సమానము. ఏలనన వారిపక్షము ధర్మపక్షము" అనిచెప్పి యిట్లు ముగించెను. "కొద్ది సంవత్సరములక్రితము బార్డోలీ శాసనోల్లంఘనమునకు జగద్వి

ఖ్యాతిని బడసెనని మనము వింటిమి. అధ్యక్షా! అది యట్టి కీర్తిని బడసెనని నే నంగీకరింతును. కాని మనలో చాలమంది యట్టికీర్తికొఱకు ప్రాకులాడము, దానిని సంపాదింపవలెనని ప్రయత్నింపము. కేవలము నిష్ఫలము, పరిహాసాస్పదమునయిన కీర్తి మనకక్కరలేదు. ఈయుద్యమము నిప్పుడు నడిపించుచున్నవారు భూములను వేలమువేయుట ప్రారంభించుసరికి కొనువారనేక వేలువత్తురని తెలిసికొందురుగాక! గొప్పగొప్పఆస్తులు ఊరకపోవుచుండ వానినప్పనముగా తీసికొనవలెననివచ్చువారిని దౌర్జన్యముకాని దౌర్జన్యరాహిత్యముకాని యాపజాలవు. కనుక వారు మరిరెండుసార్లు బాగుగా నాలోచించుకొందురుగాక! ఏలననగా వారు ధర్మాపలీయుద్ధరంగమునకు పోవుచున్నారమనుకొని పానిపట్టురంగములో తేలవచ్చును.

ఆండర్సనుగారి పరమానందమునకెవడును యీర్ష్యనొందడుకాని బుద్ధితక్కువగా తీసికొనివచ్చినపానిపట్టుయుదాహరణముచు సహించుచు నూరకున్న ప్రభుత్వమును చూచి యాశ్చర్యపడకతప్పదు. తనకీర్తిని చూచుకొని బార్డోలీ యెన్నడును గర్వపడి యెఱుగదన్నసంగతి ఆండర్సనుగారికి తెలియదు. దీనికిబదులుగా కొన్ని దృగ్గోచరములుకాని పరిస్థితులు వచ్చి చరిత్రలో కీర్తిప్రతిష్ఠలను పొందవలసిన తనయవకాశమును పోగొట్టెనని యది విచారించుచున్నది. పాని

పట్టుశాపమును మనకు ప్రసాదించుచు బ్రిటిషుప్రభుత్వమును
ఎందిపోటుగాడైన అహ్మదుషాదురానీతో పోల్చుచు పాపమా
దురానీ భారతదేశములో కొద్దిరోజులుమాత్రమే యుండెనని
మఱచిపోవునంతటి యంధత్వ మీాయన కెట్లు ప్రాప్తించెనో
కదా! ఇక బార్డోలీప్రజలు పానిపట్టునేర్పిన గుణపాఠము నె
న్నడును మఱువజాలరు. ప్రజలకు ముఖ్యముగా బార్డోలీప్ర
జలకు దక్షిణాఫ్రికాలో జరిగిన యనేకయుద్ధములును మొన్న
మొన్నటి చంపరాను, ఖేడా, నాగపూరు, బోర్సదు యుద్ధ
ములును కళ్లకుకట్టినట్లు కాన్పించుచునే యున్నవి.

---

# బార్డోలీ విజయము.



## పదకొండవ యధ్యాయము.



"భయోత్పాతము మొదటిప్రదర్శనము."

"ప్రపంచములో నత్యుత్తమమైన యుద్యోగశాఖ తన గొప్పతనమును భయముమీదనే పునాదుల నేర్పరచుకొనెను."

"మహాత్మాగాంధి"

మనకథకు వత్తము. బనియాలమీద నమలుజరిపిన నోటీసులు బుట్టదాఖలయ్యెను. ప్రజలుయీకాగితములను పసుపుపచ్చని ప్రకటన పత్రములక్రిందను, చిత్తుకాగితముల క్రిందను చూడసాగిరి. మునసబులు జపువారంటులను తీసికొని గ్రామములకు పోయిరి. కాని ఫలిత మేమియు కలుగక పోయెను. వాటినెట్లు యెదుర్కొనవలెనో మోహనలాల్ పాండ్యా, రవిశంకర్భాయి, దర్బారుసాహెబులు ప్రజలకు చక్కగా బోధించిరి. మునసబు, వెట్టివాడు తమయిండ్లకు వచ్చుచో నేమిచేయవలెనో గ్రామములలోని చిన్నపిల్లలకు కూడ తెలిసిపోయెను. స్థానికముగానున్నవలంటీర్లు శ్రీయుత వల్లభాయియుపన్యాసములోని వాక్యములను చదివి మునసబు, వెట్టియానులకు వినిపించెడువారు. "మీకు కావలసినదంతయు

నిర్భయత్వమే" అని రవిశంకర్భాయి ప్రజల కుద్బోధించెడి వాడు. "ఖేడాజిల్లాలోని యన్నిగ్రామములలోను బాబర్దేవు పేరు చెప్పుచో ప్రతివాడును భయపడెడివాడు. బోర్సదు యుద్యమము ధారలాలహృదయములనుండి భయమును పారద్రోలెను. చివరకు బాబర్దేవుకూడ దాగి యుండవలసివచ్చెను." దినదినము తమబల మభివృద్ధియగుచున్నట్లు వారు తెలుసుకొనిరి. ఒక రానిపరాజజాతిపెత్తందారు రెవిన్యూయిన్స్పెక్టరుతో జపులు చేయుపనికి తాను తోడ్పడజాల ననియు తనకు కూలీలుగాని, నౌకరులుగాని జపుఆస్తిని తీసికొనిపెళ్లువారు లేరనియు నిర్మొగమాటముగ చెప్పెను.

ప్రతిగ్రామములోను వాలంటీర్లు కుప్పతిప్పలుగా చేరుచుండుటచే వివిధశిబిరములబల మంతకంతకు హెచ్చజొచ్చెను. దర్బారుసాహేబుశిబిరము దర్బారుకు తగినట్లుగా రాజఠీవితో రాణించుచుండెను. బానిస్నాలో నొకవిఖ్యాతపురుషుడు తనదివ్యభవనము నతని కిచ్చెను. అచ్చట ప్రతిసాయంత్రము ప్రార్థనలు జరుగుచుండును. వాటిలో గ్రామములోని ప్రజలందరును పాల్గొందురు. నవజీవన్ పత్రికగాని మహాత్ముని స్వీయచరిత్రముగాని పఠింపబడును. చివర ఫూల్చందుభాయి యొక్క సత్యాగ్రహగీతములను పాడినతరువాత రాత్రి సభ ముగింపబడును. ఇది పాటిదారుగ్రామములోని శిబిరము. బాల్డాలోనిశిబిరము దాని రానిపరాజపరిసరములకు తగినట్లే

యుండెను. ఎండిన జువారిపరకలతో తయారైన యొకచిన్న పాక, వరిగడ్డితో కప్పబడిననేల, ఇదియే శిబిరము.

నాలడ్‌లో తప్పటడుగువేసినవారిలో నొకడు పశ్చాత్తాపమును వెలిబుచ్చినట్లు మనము చూచియే యున్నాము. రెండవవాడు తనంత తా నిపుడెచ్ఛికముగా రు 651-0-0 శిక్ష విధించుకొని చెల్లించెను. దీనితో ప్రజలయుత్సాహమునకు మేర లేకపోయెను. ఇంకను ఉద్యమములో జేరని కేడాడ్‌గ్రామములోని యిద్దరు భూస్వాములచర్య ప్రజలను చీకాకుపరచెను. ప్రజలను వెక్కిరించుటకో యనునట్లు వారు వివిధగ్రామములలో వారికున్నభూములమీద పన్ను చెల్లించుచు వచ్చిరి. ఒకరోజున యీగ్రామములలోనిప్రజ లందరును వీరి భూములను వ్యవసాయము చేయకూడదనియు, వీరికి వ్యవసాయపుకూలిని సరఫరా చేయకూడదనియు, గ్రామములోని యితరులెవరును వీరిని యదుపులోనుంచుట కెట్టిప్రయత్నములను చేయకుండుటచే కేడాడ్‌నే బహిష్కరింపవలె ననియు, తీర్మానము చేయుటకు సభ చేసిరి. అతికష్టముమీద మోహన్‌లాల్ పాండ్యా తీర్మానములోని తుదిభాగమును తీయించి వేసెను.

వివిధకులములవారు తమతమసభలను చేసికొని సత్యాగ్రహమును సమర్థించుచు, జప్తుచేయబడుఆస్తులను కాని భూములను కాని కొనరా దనియు, సత్యాగ్రహముకొరకు

ప్రజలు వసూళ్ళు చేయవలసినదనియు తీర్మానములు చేసిరి. ప్రతిదినము ధాన్యాదిదినుసు లప్రయత్నముగా వచ్చి పడుచుండెను. వివిధశిబిరములకు కావలసిన యాహారపదార్థములకు సంబంధించినంతవర కీయేర్పాట్లు బాగుగనే యుండెను. కాని ధాన్యాదుల నమ్మివేసి లెక్కలను సరిగా నుంచుట చాల కష్టముగా నుండుటచే తరువాతనిచ్చు చందాదారుల ను సాధ్యమైనంతవరకు ద్రవ్యరూపములోనే యివ్వవలసిన దని ప్రార్థింపవలసి వచ్చెను.

ఒకవంక ప్రభుత్వమువారు శిక్షలను విధింతు మనునోటీసులను వందలకొలదిగ నమలు జరుపుచునే యున్నను ప్రజలు తమకు సంబంధము లేనట్లావంతయు చలింపకుండిరి. రానిపరాజజాతివారుకూడ భయమునంతను పారద్రోలి పేగ్గాంచిన డిప్యూటీకలెక్టరంతవానికి మగతనమును కనపర్చునట్టి జవాబుల నిచ్చిరి.

"మీ రెందుకు చెల్లింపరు?" అని దొరగా రొకరానిపరాజును ప్రశ్నించెను.

"మీరు హెచ్చుపన్నును రద్దుచేయుచో మేము చెల్లింతుము."

"మీరు కొద్దిహెచ్చుపన్నుమాత్రమే చెల్లింపవలెను"

"దానినైనను మే మెట్లు చెల్లింపగలము? మేము బియ్యముకు పదిరెట్లు నీళ్ళుపోసి జావ కాచుకొని దానిమీద

జీవించుచున్నాము. దీనికికూడ మీరసూయ పడుచుందురు కాబోలును ?"

"మీరు చెల్లింపనిచో మీభూములను పోగొట్టు కొందురు."

అప్పు డావ్యవసాయదా రొకచిన్నద్విపదను జవాబుగా చదివెను. దొరగారి కది యర్థము కాక దానియర్థము నడిగెను.

"పువ్వులలోని కెల్ల ప్రియపువ్వు రాజు.
తక్కినవన్నియు నిష్ఫలములు.
రాజులలోని కెల్లరాజు వరుణదేవుడు.
తక్కినవారందరు విగ్రహాపుష్టికిమాత్రమే !
ఏరాజుమాభూములను లాగికొనజాలడు.
వరుణదేవునికృప తప్పిపోవు
టొక్కటియే మాకు దుఃఖభాజకము."

ఈబలము, యీకట్టుబాటులు ప్రభుత్వశాంతిని పోగొట్టెను. ప్రభుత్వముతరఫున యుద్యమమును నడుపుచున్న డిప్యూటీకలెక్టరు పిరికివర్తకులపై రెండునోటీసుల నమలు చేయుటతోడనే యంతయు చప్పబడు ననుకొని ప్రభుత్వమున కిట్టివాగ్దానమునే యిచ్చియుండవచ్చును. ఇంతటితో నతనిభ్రమ వీడిపోయెను. ఆండర్సనుగారు కౌన్సిలుసభలో "ప్రభుత్వమువా రీవిషయములో వెనుకకు మరలరు" అని చెప్పిరి. మొ

దటిదెబ్బలు తప్పిపోయెను. కనుక తీవ్రవిధానము నవలంబింప వలెను. కనుక మార్చి 26 వ తేదీని బాజిపురవాసియగు వీర్భందు చినాజీయను నొకసేట్‌తలుపుకు రెవిన్యూయిన స్పెక్టరు సంతకముతో నొకనోటీసు అంటించబడెను. వాలడ్ లోనున్న భూమిమీద నతడు రు 160-15-4 ఏప్రిల్ 12 వ తేదీలోపల చెల్లించకపోయినచో నతనిభూమి ప్రభుత్వము వారి లెక్కలలోనికి చేర్చుకొనబడు నని యందులో కలదు. ఆరోజుననే వాలడ్‌లోనున్న మరియేడుగురిమీద నోటీసు లమలు చేయబడెను. సేట్‌వీర్భందు యెంతమాత్రమును చలింపక రెవిన్యూయినస్పెక్టరు కొకధైర్యమైన యుత్తరమును వ్రాసెను. అందులో నిట్లుండెను.

"ఈ డివిజనుకంతకును మీరీనోటీసును జారీచేయుటకు నన్నే యెన్నుటకు కారణము : నేనందరిలోను దుర్బలుడనని మీరు తలంచి రని నేను విశ్వసించుచున్నాను. కాని నే నొక్కసంగతిని మీకు స్పష్టము చేయవలసి యున్నది. ఈ తాలూకానంతను ప్రభుత్వమువారు లాగుకొనినను సరే హెచ్చుపన్నును రద్దుచేయువరకును లేదా సరియైనవిచారణ కంగీకరించువరకును మీకు లొంగువా డొక్కడును లేడు. మీరు ప్రభుభక్తిపరాయణులమైన సేవకుల మని యనుకొందు రేని తాలూకాలోని నిజపరిస్థితులను వారి కెరింగించి ప్రజల యెట్ల జరుగునన్యాయమును తొలగించుటకు తోడ్పడుటయే

మీధర్మము. మీరు శిక్షను తీసికొనుటకు సిద్ధముగా నున్న యిట్టిసమయములో ప్రజల నక్రమముగా నొత్తిడిచేయవలసిన యీదుష్కర్మనుండితప్పుకొనుసూత్రమునుదేనినైనను చూచు కొనవలసిన దని మీకు వినయపూర్వకముగా మనవి చేయు చున్నాను. వ్యవసాయదారులభూములను లాగుకొనుకర్మను తాము చేయుటకన్న రాజీనామా నిచ్చుటయే మంచిదని నేను మీకు సలహా యిచ్చుచున్నాను. మీ రనుభవించవలసిన జీత నష్టము లేనిశలవురోజు లెన్నియో మీకు గలవని నేను దృఢ ముగా చెప్పగలను. మీ శ్రేయస్సును కోరినవాడ నగుటచే మీ కుచితముకానట్టి యీయపాత్రపుపనులను చేసి మీ గౌ రవమును మలినము చేసికొనుటకంటె శిక్షను పుచ్చుకొనుట కు పూర్వము శలవు తీసికొను డని మనవిచేయుచున్నాను. ”

ఇతరస్నేహితులు “ వైశ్యులు దుర్బలులు, పిరికివారు అనుచెడ్డపేరును పోగొట్టుకొనుటకు బద్ధకంకణులైరి. దీనిని యింతకంటె యెక్కువదుర్బలత్వమును మనము చూచియే వ్య వహారములోనికి దిగితిమి. ప్రభుత్వమువా రేమిచేసినను చే తురు గాక! ” అని హెచ్చరించుచు శ్రీయుత వల్లభాయి గారికి వ్రాయుచుండిరి.

ధైర్యసాహసములతోగూడిన పైజనాబులు తాలూకా లో నద్భుతమైనఫలితమును కలిగించెను. ప్రభుత్వమువారిచే నీవిధముగా గౌరవింపబడిన యా యెనమండ్రుగురను చూచి

యు, వారికి ప్రీతిచోట నిచ్చుచున్నయభినందనములను చూచి యు ప్రతివాడును యసూయ పడుచుండెను. కాని ప్రజాహృదయ మిట్లుకాక నట్లుడికిన ట్లుడికిపోవుచుండెను. మహాత్ముని యంగుఇండియాపత్రికలోని యీక్రిందిపేరా దేశముయొక్క దృష్టిని వెలిబుచ్చుచున్నది.

"హంటరుకమిటీసభ్యు లొకరు ప్రశ్నింపగా జనరల్ డయరు సమాధానము చెప్పుచు జలియనువాలాబాగ్ ప్రజలలో భయోత్పాతమును కలిగించుటకే పన్నబడెనని యంగీకరించెను. ఇట్లొప్పుకొనుటలో నితడు నూతనసిద్ధాంతమును దేనిని బోధించుట లేదు. 'ప్రపంచములోకెల్ల నిపుణులైన ప్రభుత్వోద్యోగులు' తమగొప్పతనమునంతను భయముమీద నే నిర్మించుకొనిరి. ఈజగద్విదితసిద్ధాంతమును పురస్కరించుకొనియే, ముద్రణకు పూర్వమువచ్చిన సమాచారమును బట్టి, బార్డోలీరైతులను లొంగదీయుటకు సమ్మోరీపద్ధతు లవలంబింపబడుచున్న వని తెలియుచున్నది. కొందరు బార్డోలీసత్యాగ్రహులపైన భూములను ప్రభుత్వవశము చేసికొందు మను 8 నోటీసులు జారీచేయబడెను. ఈపేర్లను బహునిపుణతతో నెన్నినట్లు కాన్పించుచున్నది. అందరను పేరెన్నికపొందిన బనియాలను వెదకిరి. వైశ్యులు దుర్బలులు, పిరికివారు అను ప్రతీతిచేత నీనోటీసులను చూచి భయపడుదు రని వారిపై వీటిని ప్రయోగించినట్లు తోచుచున్నది. బనియాలు పడిపో

వుటతోడనే తక్కినవారును పడిపోవుటకంటె సహజ మేము న్నది? అని యధికారులు గుణించుకొనిరి. సత్యాగ్రహులు భయమును పురికొల్ప పన్నినయిట్టి మొదటినాటకమునకు భయపడ నక్కరలేదు. భూములను ప్రభుత్వమువారు లాగుకొనుదురనియు, నంతకంటె నధ్వాన్నమైనపనులు జరుగుననియు వారి కనేకసారులు బోధింపబడెను. వారిలో బలమున్న యెడల దానిని వారిపుడు చూపింతురుగాక!"

నవజీవనుపత్రికలో బార్డోలీసత్యాగ్రహుల కిచ్చిన సందేశములో మహాత్ముడు 'భయమును పురిగొల్పుట' యనుదాని కర్థమేమియో విస్తరించివ్రాసెను. ప్రతిగ్రామము యీ వ్యాసము నందుకొని దీనిని పునశ్చరణము చేయుచుండెను.

" సేట్ వీర్చందు చెల్లించవలసిన రు 160 లకు ప్రభుత్వమువారు జప్తుపెట్టినచో మన మంతగా లెక్కచేయకపోదుము. కాని యీస్వల్పసొమ్మునకు వేలకొలది విలువచేయు భూములను ప్రభుత్వవశము చేసికొనుట దయరుత్త్వముకంటె వేరు కానేరదు. ఈనీతి మోసెసుచెప్పిన 'గుడ్డుకుగుడ్డు' నీతిని మించిపోవుచున్నది. ఒకరూపాయిబాకీకి వేయిరూపాయిలు గుంజుకొనువానిని నిరంకుశుడు, రావణుడు అని పిలువదగును. తమకుతామే చేసికొనినచట్టములప్రకారము ప్రభుత్వవారు మీభూములను లాగుకొనుట ఖయిదుచేయుట మొదలగునవి చేయవచ్చు నని వల్లభాయి మీ కెన్నియో సారులు చెప్పియే

మున్నాడు. ప్రభుత్వమువారు తమయధికారములను వినియోగించుట కెంతమాత్రమును వెనుదీయ రనికూడ నతను మాకు చెప్పెను. కనుక నిట్టినోటీసులకు వారెంతమాత్రమును భయపడ నవసరము లేదు.. ప్రభుత్వమువారు కాని, యీభూములను కొనవచ్చినద్రోహి కాని భూమిని మ్రింగివేయలే డని గ్రహింపవలెను. ఇది వారిపై కెదురుతిరుగు హాలహాలవిషము వంటిది. పవిత్రప్రమాణము, ఆత్మగౌరవములకంటె భూమి యెక్కువవిలువయైనది కాదు. ఈదేశములో జేనెడుభూమియైనను లేనివా రనేక వేలు కలరు. గతసాలున ననేకమంది భూములు వరదలవలన నదీపాతమై యిసుకదిబ్బలతో కప్పివేయబడెను. గుజరాతు యొకదివ్యశక్తిచే పంపబడినయీకష్టమును ధైర్యముగా భరింపగలిగినపుడు మనుష్యమాత్రునిచే జరుపబడునట్టికష్టములను ధైర్యముగా నెదుర్కొని బార్డోలీ తన పవిత్రప్రతిజ్ఞలను కాపాడుకొనునుగాక!"

---

# బార్డోలీ విజయము.

## పన్నెండవయధ్యాయము.

"1921 వ నాటి సంస్మరణము"

"సత్యాగ్రహము సన్నగిలుసూచన లేవియును కానరావు."

"టైమ్సుపత్రిక."

మన మిప్పుడు యేప్రిల్ మాసములో నున్నాము. టైమ్సు పత్రిక "సత్యాగ్రహము సన్నగిలుసూచన లేవియును కానరావు" అని విలపించుచున్నది. "ప్రభుత్వమువారి యీచర్య ఫలితము మూడువారముల వరకును కాన్పించకపోవచ్చును; వలనన భూమిపన్నునుగురించినస్మృతి (Code) లో భూమిని ప్రభుత్వవశము చేసికొనుటకు విధింపబడినక్రమ మంతయు యథావిధిగా జరుగవలెను. దీనికి కొంతకాలము పట్టును. ఇంతవరకు కొంతచరాస్తి లాగుకొనబడెను. కాని ప్రభుత్వమువారు తలపెట్టిన భూములను ప్రభుత్వవశము చేసికొనుపద్ధతియే వ్యవసాయదారును నలిపివేయగలదు. వారనుకొనినఫలితము సత్యాగ్రహమువలన చేకూరనేర దని వారు గ్రహించినపు డీయుద్యమముచల్లారి పోవచ్చును." ఉద్యమానంతరమువరకును. ప్రభుత్వముకు

'ముఖ' వలె ప్రవర్తించినయీపత్రిక ప్రభుత్వమువారి యాశా. భయములను వెల్లడిచేయుచున్నది. కాని యెట్టిభయమును లేదు. ప్రభుత్వమువారు పన్నగలచర్యల నన్నిటిని ధిక్కరించి బార్డోలీ నెమ్మదిగానైనను స్థిరముగా నిలువగలిగెను. అది ప్రజలలోని యన్నితరగతులవారిని యాకర్షింప మొదలిడెను. బార్డోలీచుట్టునున్న తాలూకాలలో, బ్రిటిషు రాష్ట్రములోనే కాక బరోడారాష్ట్రములో కూడ, సత్యాగ్రహులయెడల సానుభూతి చూపుచు సత్యాగ్రహులను లొంగదీయుటకు ప్రభుత్వమువారు చేయుకృషి కాయాప్రాంతముల వారు జప్తుచేసినయాస్తిని తీసికొనిపోవుట, ఇండ్లను అద్దెకు తోలుట, పొలమును వేలంపాడుట, మొదలగుపనులద్వారా తోడ్పడరాదనియు, సభలు జరుపబడెను. గుజరాతు వెలుపల బార్డోలీపరిస్థితులను చర్చించుటకు ప్రత్యేకసభలు జరుపబడుచుండెను. నేడు పూనాలో బార్డోలీసత్యాగ్రహము నామోదించుచు సభజరిగినచో రేపు షోలాపూరులో ప్రభుత్వచర్యలను ఖండించుచు సత్యాగ్రహుల నభినందించుచు సభజరుగును. డాక్టరు సుమంతుమెహతాప్రోత్సాహముచే 'బరోడాప్రజామండల' సంస్థ బరోడాసంస్థానములోని ప్రజలను తమయిరుగువారిపట్ల తాము చేయవలసినధర్మమునకు మేల్కొలిపెను. శ్రీయుతవలభాయి ధనము కావలెనని కోరక పోయినను ధనము వర్షింపసాగెను. ఒకబొంబాయిస్నేహితు,

డు రు 1000, ఒకమోటారుకారు యిచ్చెను. జొనెస్బర్గ్ దర్బనులనుండి స్నేహితులు సానుభూతితంతులను, ధనమును పంపించిరి. ఇంతవరకు సత్యాగ్రహముతో సానుభూతిని చూపి యెరుగనివర్గములుకూడ కదల నారంభించెను. ఎప్పుడును 'శాస్త్రీయము'గానే యుండు ననుగర్వముతో నుండు 'బొంబాయిరాష్ట్రసంఘము' బార్డోలీమొదలగు తాలూకాలలో "కేవలయధికారులచేష్టలచేతనే భూమిపన్నును హెచ్చించుటను" తీవ్రముగా ఖండించుటకు జాకక "శాసనసభలకు భూమిపన్నులను రివెజు చేయుసందర్భములో నధికారమిచ్చునట్లు భూమిపన్నుకోడ్ ను సవరించుటకు బిల్లును ప్రవేశపెట్టవలె ననుభూమిపన్నుకమిటీవారిసూచన నమలు జరుపువరకును బొంబాయిరాజధానిలో భూమిపన్నురివిజనునాపి వేయవలెను" అని కూడ తీర్మానించెను.

ప్రభుత్వమువారు తమపరిసరములనున్న వాతావరణమును పరకుగొనక జాగ్రత్తగా నాటక మాడింపబడిన మార్చి 13 న తేదీనాటిశాసనసభలోని వోట్లద్వారా తమపక్షమును సమర్థించుకొనజూచిరి. వారు 1924, 1927 శాసనసభలతీర్మానములను మరచిపోయిరి; కాని వారి కనుకూలముగా 44 వోట్లును ప్రతికూలముగా 35 వోట్లును వచ్చుటచే (44 లోను ఉద్యోగస్థులు, నామినేషనుసభ్యులును కలసి 30 మంది కలరు) తాము నెగ్గిన యీసభావిషయమున్నవ్వా

శ్రిమే ప్రచారము చేసెదరు. శాసనసభ బార్డోలీ సెటిల్‌మెం టు నంగీకరించిన దనునోటీసులు బార్డోలీలోని యన్నిగ్రామ ములలోను చురుకుగా పంచిపెట్టబడెను. వారిట్టి యెడతెగని యసత్యప్రచారముకు గడంగిరి. ప్రభుత్వపద్ధతి, ప్రజాపద్ధతి యుత్తరదక్షిణధృవములను పోలియుండెను. ఒకరివి రహస్య ము, తప్పుడుపనులు, అసత్యము, కఠినచర్యలు. రెండవవారి వి బహిరంగమై నిష్కల్మషమైన పౌరుషవాక్కులు, పట్టపగ లుచేయు బహిరంగకర్మలు. ప్రభుత్వప్రతినిధులైన డిప్యూటీ కలెక్టరు, మన్లతుదారు, మహాల్కారీ మొదలగువారెవ్వరు ను సభలకు హాజరుకారు. వారు ప్రజలతో బహిరంగసభలను గాని, సంభాషణలనుగాని చేసియెరుగరు. కాని వారు అజాగ రూకులును, అజ్ఞానులును నైన రైతులను భయముచే నొక్కొ కపుడును, అసత్యములచే నొక్కొక్కపుడును మోసపుచ్చ ప్ర యత్నించుచుండురు. "ఫలానివాడు పన్నుయిచ్చివేసెను. నీవు కూడ యెందుకు చెల్లింపవు?" అనుపచ్చియబద్ధముతో ప్రజ లను ప్రోత్సహింపజూచిరి. ఈ "ఫలానివాడు" ఒకగొప్పవా డు. అతడు ప్రభుత్వమనిషి యని ప్రఖ్యాతిబడసెను. కాని కులకట్టులకు వెఱచి యిత డూగులాడుచుండెను. ఒకచాకలి చెల్లింపవలసిన పన్నుక్రింద కొద్దిఅణాలను చెల్లింపవలసియుం డెను. మునసబు పన్ను తాను చెల్లకట్టి రసీదు చాకలివాని జేబులో పడవేసెను. ఈవిలువకు కొన్నిబట్టల నుతికించుకొన

వచ్చునని యతనియుద్దేశ్యము గాని ప్రజలు శాసనసభలో నెక్కువవోట్లు వచ్చినవను ప్రచారముకుగాని, యితరపన్ను గడలకుగాని లొంగిపోకుండ చాలజాగ్రతగ నుండిరి. వారు సాధారణముగా నధికారులసంపర్కమునే వదలివేసి వారి న్యాయములతో వారే యుడికిపోవుట కవకాశమునిచ్చిరి. వారికట్టుబాట్లు పూర్తి యయ్యెను. ఏగ్రామము కాగ్రామములో నైచ్ఛికభటులు సిద్ధముగానుండిరి. మునసబు, పెత్తందార్లు జపుదోపిడీలకు బయలుదేరినచో వీరు వెంటనే శంఖములను పూరింతురు; తప్పెట్లను వాయింతురు. స్త్రీలు తలుపులకు తాళములు వేసికొని గుమ్మములముందర నవ్వుచు నిలుచుందురు.

ఇక నారిసభల కంతమే లేదు. నెలరోజులకిందట కొద్ది వందలైనను లేనిచోట నిప్పుడు వేలకొలది సభలకు హాజరగుచుండెను. నెలరోజులకితము స్త్రీలంతగా లేనిచోట్ల నేడు పురుషులతో సమముగాను, హెచ్చుగానుకూడ సభలకు హాజరగుచుండిరి. నేను రెండురోజులలో నర్ధరాత్రివేళ ముఖ్యపట్టణమును వచ్చుచు, పదిసభలకు హాజరైతిని. పట్టణగలెంతనుంచి స్త్రీపురుషులుండెడివారో రాత్రిలందు ప్రొద్దుపోయినను కూడ నంతసందియు నుండెడివారు. నిప్పులురాలువేళ వారు మైళ్ళకొలది నడచి సభలకు వెళ్ళెడివారు. రా

గ్రిలుకూడ స్త్రీలు, పురుషులు, బిడ్డలు తీర్థయాత్రలకువలె చుక్క గ్రామములకు పోయెడివారు.

ఒక్క కేడాడ్ గ్రామము తప్ప ప్రతిగ్రామము మితిలేని యుత్సాహముతోను సహాయసంపత్తితోను పొంగుచుండెను. కేడాడ్‌లో నింతవరకు సందేహించుచున్నవారు చింతిల్లుచు 50 మంది సత్యాగ్రహపత్రముమీాద సంతకము చేయుటకు ముందుకు వచ్చుటచే వల్లభాయి పటేలుగారిని సభ కావించ వలెనని కోరిరి. నేను వల్లభాయిగారితో నాసభకు వెళ్లితిని. కాని నాకదియంత ప్రోత్సాహకరముగా కాన్పించలేదు. కాని యితర సభలవిషయమై చెప్పవలసినదేమున్నది! అవి దేవతలు చూచి యానందించవలసిన దృశ్యములు. అవి నాకు 1921 నాటిపుణ్యదినములను జ్ఞప్తికి తెచ్చినవి. ఒకవిధముగా నవి యంటి ని మించినవి. అప్పుడు దేశమంతటను యుత్సాహము ప్రబలి యుండెను. వేనకువేలు సభలకు దినచర్యకువలె వచ్చెడివారు. ప్రజలు సత్యాగ్రహమువలన కలుగు బాధలను, కష్ట, నిష్ఠూ రములను పూర్తిగా గ్రహించియుండలేదు. అప్పుడు దేశ ములో నొకవిధమైన త్యాగాగ్ని ప్రబలి ప్రతిగ్రామమునకు పాకిపోయెను.

నేడు దేశములో నెట్టి వాతావరణమును లేనప్పుడు వేలకొలది జప్తునోటీసులు, వేలకొలది ఖరీదుచేయుభూము లను ప్రభుత్వమువారు వశము చేసికొందురను నోటీసులుత మ్మెదుర్కొనుచుండ బార్డోలీలోని వ్యవసాయదారులు,

స్త్రీ పురుషులు, అద్భుతబలప్రదర్శనమును చూపిరి. నే నొక రంగమును చిత్రించెదను. ఒకనాడు సాయంత్రము 9 గంటలకు మేము నానీఫేలడ్ అనుయొకకుగ్రామమును దర్శించితిమి. అచ్చట నొక గొప్పయుత్సవముతో స్త్రీపురుషు లూరేగుచుండిరి. పురుషులు సత్యాగ్రహగీతములను పాడుచుండిరి. స్త్రీ లొక పూర్వఋషి కృతమగు 'ప్రభుసందర్శనమైనది. మాదుఃఖములన్నియు గట్టెక్కినవి' అను పల్లవిగల గీతమును పాడుచుండిరి. మేము కూర్చొనియుండగా మాకు ముదమును పవిత్రతను చేకూర్చునట్టిదియు శ్రీయుత వల్లభాయికొక కథ వంటిదియు నగుదృశ్యము చూపట్టెను. వృద్ధులు, పడుచులు శిశువులుగల యొక నారీమండలము వచ్చి శ్రీయుత వల్లభాయికి మ్రొక్కి పుష్ప,చందనాగురుపూజాద్రవ్యములను సమర్పించి, నుదుట విజయకుంకుమ తిలకమును దిద్ది తమశక్తి కొలది సమరమునకు కానుకల నర్పించిరి. ఈ పవిత్రవిధాన మొకయరగంటకాలము జరిగెను. ఒకస్త్రీ రు 5-0-0 కానుకను నందించి తన స్వహస్తముతో నొక చిన్నచీటి వ్రాసెను. అందులో నిట్లున్నది.

"మే మసాధారణమైనదానిని దేనిని చేయుటలేదు. మాస్వార్థముకొరకు, మాయిండ్లు, వాకిండ్లకొరకు మేము పోరాడుచున్నాము. మీరు నాభర్తవద్ద సత్యాగ్రహదీక్షను తీసికొనినందులకు నే నెంతయు కృతజ్ఞురాలను. మే మిద్దరము

నుకూడ చరస్థిరాస్తులను పోగొట్టుకొనుట రూపముగా మాకు సంభవించు సమస్తకష్టములను హృదయపూర్వకముగా సహించెద మను మరియొక దీక్షాపత్రమును మీా కందించుచున్నాను. నాభర్తకు ఖయిదుకు పోవునట్టిభాగ్యముకూడ లభించుచో నేనాయన నభినందించెద నను వాగ్దానమును కూడ చేయుచున్నాను."

ఈరోజులలో శ్రీయుత వల్లభాయిపటేలు యిచ్చిన యుపన్యాసములలో నొకదానిని పొల్లుపోకుండ నివేదింపగల శక్తి నాకుండిన యెంత బాగుండెడిది! అతని యుపన్యాస మొకవిందు, వైద్యము కూడనై యుండును. ఆభాషాచమత్కృతి, యాపదములపొందిక, ఆనేలకు చెందిన సహజసుగంధముతో మిళితమై యొప్పునని యిదివరకే చెప్పియుంటిని. వీటి నన్నిటిని తర్జుమా చేయగలిగినను ఆ యుపన్యాసకుని నేత్రద్వయమునుండి జలజలరాలు ప్రజ్వలితాగ్నికణములను, మేఘనినాదగంభీరమగు నా పౌరుషకంఠధ్వనిని యెవడు గ్రహింపను చేయగలడు? అతని యుపన్యాసములు ప్రజలొకజీవితకాలములో నేర్చుకొనగలిగినంత విద్య నిచ్చుచుండెను. "ప్రభుత్వము పిచ్చియెత్తిన అడవియేనుగువలె గంతులు వేయుచున్నది. అది సమస్తమును తన కాళ్లక్రింద పెట్టి నలిపివేయగలదని యనుకొనును. ఇట్లే పిచ్చియేనుగుకూడ తాను వెనుక నెప్పుడో పెద్దపులులను సింహములను త్రొక్కి

చంపివేసితిననుగర్వముతో తనను ధిక్కరించు దోమను తృణీక రించును. ఈ పిచ్చియేనుగును తన యిచ్చవచ్చినట్లు రెచ్చి గంతులు వేయనీయుడనియు, సమయము చిక్కినపుడు దాని తొండములో దూరవలెననియు నేడు నే నీ దోమకు బోధించుచున్నాను. దోమ యేనుగును చూచి భయపడనవసరము లేదు. ఏనుగు దోమను త్రొక్కి చంపజాలదు; కాని దోమ నిశ్చయముగా యేనుగును ముప్పతిప్పలు పెట్టి యేడ్పించగలదు.

'ఒక పెద్దకుండముందర చిళ్లపెంకు యెట్లుండును! కాని యది కుండను చూచి భయపడ నక్కరలేదు. ఏలనన చిళ్లపెంకు కుండను ముక్కముక్కలుక్రింద చితుకకొట్ట కలదు. కుండ చిళ్ళపెంకు నేమియు చేయజాలదు."

"రెండు మాసములక్రితము మీరు భయభ్రాంతులై యుండిరి. అప్పుడు నేను యింతమంది పెద్ద సభలను పోగుచేయుట యసాధ్యముగా నుండెను. సోదరీమణులు సభల కతి యరుదుగాను పలచగాను వచ్చెడివారు. నేడు మీగ్రామము లస్థితి యంతెయు మారిపోయినది. నేడు మీరందరు నొక్క మనిషివలె నిలుచుచున్నారు. అగ్నిపరీక్ష లింకను ముందు రానున్నవి. మీ రింకను దేనిని పోగొట్టుకొన లేదు; ముందుముందు మీరు మీసర్వస్వమును పోగొట్టుకొనవలసి యుండును. కాని మీ రొక్కవిషయమును గ్రహించవలసియున్నది. చిట్టచివరకు వ్యవసాయదారుకు కలుగు నష్టమేమియు నుండజాలదు.

వ్యవసాయదారు, కూలివాడు ప్రభుత్వమునకు రెండు స్తంభముల వంటివారు. వారిద్దరే యథార్థమైన యైశ్వర్యము నుత్పత్తిచేయువారు. కాని వారైశ్వర్యము ననుభవించుట లేదు. మీ రిట్టి పరిస్థితుల నెట్లు సహింపగలరు? మీతాలూకాను మీరు కట్టుదిట్టము చేసికొనినచో నది యితరతాలూకాల కాదర్శప్రాయము కాగలదు. ఈ సమర మెంతదీర్ఘకాలము పట్టిన మీ కంత మంచిది; ప్రభుత్వము కంతప్రాణకంటకమైనది. ఇంకను మీ కేమియు పోలేదు. మీరు మీభూములను ఆస్తులను పోగొట్టుకొనవలసినను నిర్భయత్వమును సంపాదింతురు; స్వల్పవిలువతో మీయాత్మగౌరవమును సాధింపగలుగుదురు. మీరింతవరకును కష్టెలుకొట్టుకొనువారు, నీళ్లు త్రోసుకొనువారుగ నున్నారు. ఈసమరము మిమ్ము మీనిజస్థితికి తేగలదు."

మరియొక యుపన్యాసములో నత డిట్లు చెప్పెను.

"ప్రకృతిధర్మమును జ్ఞప్తియం దుంచుకొనుడు. కొన్ని ప్రత్తిగింజలు భూమిలో పాతిపెట్టబడి నశించినవనుచు మీకు కాన్పించునట్టి యాప్రత్తిబేస్లు ఉత్పత్తిబీజాలవు. కాని యవి దీర్ఘజీవితముతో మరల పుట్టుచున్నవి. దుఃఖములు, కష్టములు మీకు నూతనములు కావు. భూమిని దున్ను కృషీవలునివలె చలికి, వానకు, గాలికి, యెండకు నన్ని శీతోష్ణస్థితులకు నోర్చుకొనువా రెవరు? వ్యవసాయదారులవలె

గ్రామములలోనుండు దోమలు, నుసమలు మొదలగు నితర క్రిమికీటకములను సహించువా రెవరు? మీ రిదివరకే సహించుచున్న కష్టనిష్ఠూరములకన్న ప్రభుత్వమువారు మీ కెక్కుడుకష్టములను కల్పించజాలరు. దానినంతను మీరు బుద్ధిపూర్వకముగను నుత్సాహముతోను భరింపుడు; చివర కంతయును చక్కబడగలదు."

రానిపరాజప్రజలముందర నతని యుపన్యాసములు సామాన్యభావములను వెల్లడిచేయుచుండును. ఆస్త్రీలు ధరించు యిత్తడిమురుగులను, గాజు, రాయినగలను చూపుచు "వారు మీయాస్తులను జపుచేయుటకు వత్తురేని వారిని ధైర్యముగా నాహ్వానముచేసి వారికి మీనగలను యిచ్చివేయుడు. మీగాజులనిచ్చి యిష్టమున్నచో వాటిని ధరింపుమనుడు." అని యత డుపన్యసించెను.

పురుషుల నత డిట్లు హెచ్చరించెను. జపుచేయుటలో మిమ్ము సహాయముచేయుమని కోరుదురని మీరు భయపడవచ్చును. అట్టి భయమును పారద్రోలుడు. మీరు మానవులు; మీరు దూబ్లాలుకారు. ఈయవమానకరమగు నామమును తిరస్కరింపుడు. దూబ్లాయనగా దుర్బలుడు, పిరికివాడు. మీనుండి బలవంతముగా పనితీసికొనువారే దుర్బలులు, పిరికివారు. మీకు పొలములలో పనిచేయుటకు తగిన బలము కలదు. మీకొరకును, యితరులకొరకును బరువులను మో

యుటకు మీకు తగినబలము కలదు. మిమ్ము దుర్బలు లని పిలుచు టెట్లు? మీపక్కగ్రామములో నున్న యొకపెత్తం దారును రెవిన్యూయినస్పెక్టరు జప్తుచేసిన ఆస్తి మోసికొనిపో పుటకు కూలీలు దొరకనిచో నీవే మోసికొనిపోవలెనని బెది రించెనట! పెత్తందారు యీయవమానమును దిగమ్రింగి యూరుకొనరాదు. "అది నాపనికాదు. ఆపని చేయవలసినవా రానీచకార్యమునుచేయ తిరస్కరించుచున్నారు. నేను కూడ నట్లే చేయుదును. అయ్యా! మీరు గొప్పజీతము ననుభవిం చుచున్నారు. ఈఛండాలపుపనిని మమ్ము చేయుమనుటకంటె మీరే యేలచేయరు?" అని యత డడుగవలెను.

ఈయుద్యమమువలన ననేకయప్రత్యక్షఫలితములు కూడ కలవు. హిందువులకును, మహమ్మదీయులకును, ఋణ దాతలకును, ఋణగ్రస్తులకును, నానాకులములోని వివిధతెగ లకును నెక్కుడు సహకారమును సంబద్ధమును యేర్పడెను. రానిపరాజజాతిలో వర్జితులు అనగా త్రాగుడును నిషేధిం చినవారు. అవర్జితులు నిషేధించనివారు కలరు. నేను వెళ్ళి నసభలో వీరు సగముమంది కలరు. వా రొకసగముమంది కలరు. మొదటివారు స్వయముగా తయారుచేసికొనినఖద్దరు దుస్తులతోనుండిరి; స్త్రీలు తెల్లనిఖద్దరు చీరలను ధరించి నగలనుపూర్తిగా వర్జించియుండిరి. రెండవవారి నీసందేశము లింకను తాకలేదు. శ్రీయుత వల్లభాయి వీరి కిట్లు యుపన్య సించెను.

"సోదరీమణులారా ! మీపాదముల్లందును, చేతులం దును కాన్పించునట్టి యాదాస్యచిహ్నములు నా కంతగా రుచింపవు. భారమైన యీయిత్తడిమురుగులు కావలసినంత మురికిని పోగుచేసి యనేకచర్మవ్యాధులను పుట్టించును మీరు స్వేచ్ఛగా తిరుగుట కభ్యంతరములను కల్పించును. మీరు వాటిని తీసివేయవలెను. నిర్మలమైనఖద్దరుదుస్తులను ధరించి మీయెదుట కూర్చొని సత్యాగ్రహగీతములను పాడు చున్న మీజాతిపడుచులనే చూడుడు ! వారివలె కాన్పించు టకు మీరు యిష్టపడరా? (ఒకరు: ఏల యిషపడము? వారు ప్రతిరోజున స్నానముచేసి తమబట్టల నుతికికొందురు. వారు వడుకుకొని తమ గుడ్డలను తామే తయారుచేసికొందురు.) (మరియొకరు: వారు ఆశ్రమముకు పోయి పాటలను నేర్చుకొం దురు. మాస్త్రీలుకూడ నట్లు చేయవలెననియే మేము కోరు దుము) మీ కీభేదము తెలిసినందుకు నాకు సంతోషముగా నున్నది. మీ రీయుద్యమములో ప్రవేశించిరి. కనుక మీరు తగినభటులు కావలెను. ఈవిదేశవస్త్రములు యోధులకు పనికిరావు. ఖద్దరు ధరించిన యీపడుచులకువలెనే మీకును బలమైన చేతులు, కాళ్ళుకవు. మీరు ఆశ్రమమునుండి రా టములను తెప్పించి వడుకుట నెందుకు ప్రారంభింపరు ? కొద్ది రోజులలో మీబట్టలకు సరిపోయినంత మీరు వడుకుకొనగ లగు. మీరు కల్లును స్పృశింపరాదు. మాసలహా వినకుండ

నింతవరకు వీరు దూరముగా నుండిరి. వీ రిపు డీయుద్యమములో ప్రవేశించిరి. కనుక తాగుడును మానివేసి వీ యర్హతను సంపాదించుకొనవలెను." మరియొక ఫలితమేమనగా వెట్టియానులు వచ్చుచుండునట్టి దూబ్లాలుమొదలగు సంఘములలో జ్ఞానోదయము కాజొచ్చెను. వెట్టియానులు గ్రామనౌకరులు. వీరు గ్రామటపాలు మోయుట మొదలగు పనులు చేయుచుందురు. ఈపనిచేయుటకు వీరికిపన్ను లేకుండ చిన్న చిన్న నౌకరీభూముల నిచ్చెదరు. కాని యివి వారిపొట్ట కెంతమాత్రమును చాలకపోవుటచే వారు యితరసాధనములద్వారా పొట్టనింపుకొనక తప్పదు. కనుక వారు పక్షులవలె స్వేచ్ఛగ నుండిరి; వీరిలో చాలమంది ప్రభుత్వనిర్బంధ విధానమునకు తోడ్పడ నిరాకరించిరి. వారి మగతనము వెంటనే యితరులకు గూడ ప్రాకెను. పెత్తందారులు వెట్టియానులకు వెనుకబడి యుండుట తమ గౌరవమునకు భంగమని తలంచిరి. సామాన్యదూబ్లాలు జప్తులసందర్భములలో సహాయమును నిరాకరించుటతోడనే వారికిని వారు యెవరికింద పనిచేయుచుండిరో యట్టి భూస్వాములకును అద్భుతమైన సంబంధ మేర్పడెను. ఇంతవరకు నెవరు నీచులక్రింద, బానిసలక్రింద చూడబడిరో వా రిపుడు మిత్రులవలె సోదరులవలె చూడబడిరి. ఈయుద్ధములో భూస్వాముల కెంతభాగమున్నదో వీరికి నంతప్రధానభాగమే యుండెను.

మఱియొకఫలిత మేమనగా తాలూకాలో ఖద్దరుప్ర చారము దినదినాభివృద్ధి నొందుచుండెను. మితుభెన్ పెటిట్ కన్య కేవలము ఖద్దరుప్రచారమునే లక్ష్యమం దిడుకొనెను. ఉదయము మొదలు సాయంత్రమువరకు నలసటయనున దే ట్టిదో యెఱుగకుండ నామె గ్రామగ్రామము తిరుగుచు ఖద్దరు అమ్ముచు స్త్రీలను నూలు వడకుడని ప్రోత్సహించుచుండెను. ఆమె స్త్రీలలో సాటిలేని విధమున సత్యాగ్రహ ప్రచారమును గూడ చేయుచుండెను.

---

# బార్డోలీ విజయము.



## పదమూడవ యధ్యాయము.



"వ్యవసాయదారుల సర్దారు."

"అతడు మాట్లాడునట్టి ప్రతియగ్నిహోత్రపు వాక్యము నిండుకోపముతోను, నిండు దుఃఖముతోను పలుకుచుండును."

శ్రీయుత వల్లభాయికి వ్యవసాయదారులసర్దారు అను బిరుదము నెవరిచ్చిరో నాకు తెలియదు. కాని దానిని ప్పుడు ప్రతివాడును అప్రియత్నముగా నిచ్చుచు తీసికొనుచుండిరి. ఇంతకంటె నర్హతతో పొందబడిన బిరుదు మొకటి కానరాదు. సర్దారు బార్డోలీలో నఖండవిజయమును పొందుట కొకకారణ మతనికి వ్యవసాయదారునందు గల యద్వితీయమగు ప్రేమ; అతనిని దుఃఖములనుండి తరింపచేయవలె ననెడు నిరుపమానమగు యనురాగము. శ్రీయుత వల్లభాయి 1917—1918 లో యథార్థభారతము గ్రామములలోనే కాన్పించు ననియు, వ్యవసాయదారే దానికి కేంద్రము, కీలకమునియు, ప్రత్యేకము లేక పూర్తిగా వ్యవసాయదారుకు సంబంధములేని యేస్వాతంత్ర్యపథకముకు గాని, పనికిగాని

యర్థమే లేదనియు మొదలగు భారతజాతీయ తత్త్వములోఁ మొదటి సూత్రమును మహాత్మునివలన తెలిసికొనెను. ఈపాఠమును అక్షరాల యాచరించుటకు జీవితమును ధారపోసిన వారిలో కీర్తిశేషుడగు మగల్‌లాల్‌గాంధి, శ్రీయుత వల్లభాయిగార్లు ముఖ్యులు. గురువుగారు సూత్రములను స్థాపించిరి; శిష్యులు వాటి నాచరించుపద్ధతులను తలపోసి. తమ యావత్కాలమును, శక్తిని వాటిని వివిధశాఖలంలో చొప్పించుటకు వినియోగించిరి. ఇందులో గురువుగారికి కూడ లేని సమసాయ మొకటి వల్లభాయికి లభించెను. రైతుబిడ్డయైన వల్లభాయిని తండ్రి పొలములలోనికి తీసికొని పోవుచు బాల్యములో నోటిలెక్కలు చెప్పుచుండెడివాడు. బాల్యమునాటి యాదినములు, భూపుత్రులతోటి యా దగ్గరస్నేహము రైతుజీవితముపట్ల నతని కొకయనురాగమును కల్పించెను. ఇప్పటికి పదిసంవత్సరములనుండి నాకు సర్దారుతో నెక్కువసంబంధము కలదు. నే నతనితో నన్నియుద్యమములలోను యుంటిని. కాని రైతులనుగురించి హృదయములు కఱగునట్లు బార్డోలీలో మాట్లాడిన ట్లతడు మరెచ్చటను మాట్లాడియుండ లేదు. దీనికి కారణమేమన ఖేడారంగములో మనవలె నతడును నొక సైనికుడు. అతి అరుదుగా మాట్లాడుచుండెను. బోర్సదులోని సమస్య ప్రత్యేక స్థానికసమస్య. కాని బార్డోలీలో వ్యవసాయ

దారుయొక్క దారిద్ర్య మూలహేతువులతో నతడు పోరాడ వలసి వచ్చెను. ఈపని యతనికి ప్రాణప్రదమైనపని. ఖేడా వ్యవసాయదారు నానాటికి గర్భదరిద్రుడగుచుండుట నతడు కండ్లార చూచెను; అతని నిస్సహాయతకు కన్నీటిని జలజల రాల్చెను. కనుక నతనికి బార్డోలీ భగవన్నిర్మితమువలె నచ్చెను. అతడు గుజరాతు కంతకును బార్డోలీ ద్వారా గుణ పాఠమును బోధింపనెంచెను.

ఆతడు వ్యవసాయదారులను దేవతాగణములో జేర్చె ను. యథార్థమైనసాంఘిక ఆర్థికస్థితిలో వ్యవసాయదా రత్యు న్నతస్థానము నలంకరించుచున్నాడు. కాని యతడు దుర్భర మైన యార్థికదుస్థితికి తేబడెనని సర్దారు వగచుచుండును. "ఈ పృథ్విలో తలయెత్తుకొని తిరుగ నర్హుడైనవాడున్నచో నతడొక్క వ్యవసాయదారే! అతడు నిర్మాత, యితరులు పందికొక్కులవంటివారు" అని యత డనేకసార్లు ఉపన్యసిం చెను. కాని యత డెట్టిదుస్థితికి తీసికొనిరాబడెను! "ఓకృషీవ లుడా! ఓకర్షకుడా! ప్రపంచమంతయు మీ యిరువురి మీద నాధారపడియున్నది. కాని ప్రపంచములో మిమ్ము చూచునంతహేయముగా మరెవ్వరిని చూచుటలేదు. మీరు తేబడిన దుర్భరమైననిస్సహాయస్థితిని చూచుచో నాక డుపు తరుగుకొనిపోవుచున్నది. ఒక నిర్భాగ్యపుప్రభుత్వ బంట్రోతును చూచుచో మీరు గడగడలాడుదురు. ఆతడు

తనయాజ్ఞలను శిరసావహించునట్లు మిమ్ము నిర్బంధింపగల డు. ప్రభుత్వమువారు తమ యిచ్చవచ్చినట్లెల్ల మీపై పన్ను లను విధింతురు. మీ రందులో నోరెత్తుటకు వీలు లేదు. భూమిపన్ను, నీటిపన్ను, ప్రత్యేకనీటిపారుదలపన్ను, ప్రత్యేక భూమి క్రిందపారు నీటిపన్ను-యిన్ని పన్నులున్నవి. ఇవి చాలక మీఖర్చులతో మీరు చేసికొన్న మరమ్మతులమీదను, మీ స్వంతపాటుమీదనుకూడ పన్ను విధింపబడుచున్నది. మీరు మీ పశువులవలెనే యుదయము మొదలు సాయంత్రమువరకును చేతులు కొంకరలుపోవు కటికచలిలోను నెత్తి భగ్గునమండిపోవు నడివేసవియెండలోను, పిడుగులమధ్య కొండ చిల్లుపడునట్లు కురియువర్షధారలలోను పనిచేయుచుందురు. మీరు తేళ్ళు మొదలగు విషజంతువులతో పోరాడి, రొమ్ములోతు రొంపిలో దిగబడి మీకొరకును మీ బిడ్డలకొరకును ధాన్యాదులను పండించుకొందురు. కాని యీ ధాన్యముకుకూడ పన్ను విధింపబడుచున్నది. మీరింత భయభ్రాంతులుగా నుండనేల? మీ రింతనోరు, వాయి లేకుండ నుండనేల? మీదుస్థితికి నేను సిగ్గుపడుచున్నాను; తలవంచుకొనుచున్నాను. మీరు మీనిజస్థితికి వచ్చి తలయెత్తుకొని నడువగలదినమును నేనుచూచిన నాడు నాజన్మ ధన్యమైనదనియు, నాపాటంతయు ఫలించినదనియు భావించెదను." రానిప రాజ సభలో నతడిట్లు మాట్లాడెను "కాలూనుటకు కొమ్మగాని,

రెబ్బకాని లేక నాకాశమార్గమునపోవు తాటి, కొబ్బరిమొదలగుచెట్ల నెక్కుటలో మీప్రాణములను కోల్పోవుటకు సాహసించు ధైర్యరాసులైనమీవంటివారు యిట్టి సాహసకృత్యమును చేయజాలనివారిని చూచి భయపడుట యేలకో నాకర్థముకాకున్నది! సహింపశక్యము కాకున్నది." "భూమినిదున్ని యితరులప్రాణములను పోషించునట్టి సాధనములను కల్పించువారిని తిండిలేకుండ మాడ్చి చంపివేయునట్టి చావుకళను యిప్పటిరాజకీయవేత్తలు తమయద్భుతరాజనీతిలో కనిపెట్టిరి" అని రూసో చెప్పినదాని నితడు విశ్వసించుచుండెను. వ్యవసాయదారు నిట్టిదుస్థితికి తెచ్చినపద్ధతిని, దానికి బాధ్యులైనవారిని గురించి మాట్లాడునపు డతడు కోపముతో నుడికిపోవుచుండును. "ప్రభుత్వమువారు భూమికధిపతులని, వ్యవసాయదారు కేవలమొక యద్దెమనిషియని శాసించినవాడెవడు ? రైతును పీల్చి పిప్పిచేయునట్టిపన్ను యీసిద్ధాంతమునునుసరించియే విధింపబడుచున్నది. ఈవిషాదచరిత్రను పూర్తిచేయుటకు విద్యాధికు లీరక్తసావిధానములో ప్రభుత్వముకు తోడ్పడుచున్నారు."

వ్యవసాయదారు గుణములప్రోవు. పరిపూర్ణతకాదర్శప్రాయుడు. "వ్యవసాయదారువంటి సత్యసంధుడు, దురాచారదుర్గుణదూరుడు, నిష్కల్మషుడు, దైవభీతికలవాడు, చెమటూడ్చి జీవించువాడు మరియొకడెందుకలడు? అట్టివాడు

మానవమాత్రునకు భయపడనేల?" ఇది పైకి విరుద్ధముగా కాన్పించుట లేదా? అంతపవిత్రుఁడు, అంతనిష్కపటియైనమనుష్యుఁడు నిర్భయుఁడు కాకుండ నుండజాలఁడు. ఏదియెట్లున్నను వారికి భగవంతునియందు కొంతవిశ్వాస మున్నదని వల్లభాయి యెరుంగుచు. వారు తమధర్మమును శిరసావహించుటకు, తమప్రమాణములను పట్టుదలతో సాధించుటకు నిదియే కారణము. ఈనిరాడంబరప్రజలే వల్లభాయిలో నంతర్గతముగానున్న భగవద్విశ్వాసమును ప్రజ్వలింపచేసి దానికి నామరూపములను కలిగించిరి. మహాత్ముఁడు చెప్పినట్లు "వల్లభాయి బార్డోలీలో తన వల్లభను (భగవంతుని) కనుగొనెను." వేల కొలది స్త్రీపురుషులు తమ ప్రమాణములను పాలించునట్లు చేయగలుగునది యీభగవంతునియందలి విశ్వాసమే! నిరాడంబరమైన, విద్యలేనియీప్రజలహృదయముల నతఁడు మతముద్వారముననే చేరగలిగెను. "భూమి ప్రతిచోట దొరకగలదు. కాని యొకవ్యవసాయదారు తనప్రమాణమును భంగపరచెనా మేఘుఁడు వర్షించుట మానివేయును. వ్యవసాయదారు వాగ్దానభంగమును గావించెనేని యతఁడు ప్రపంచమునంతను నాశముచేయును." అని యతఁడు చెప్పుచుండును. నిష్కపటులైన యీప్రజ లతని నెఱుంగుదురు; అతనిభావము నెఱుంగుదురు. నాయకునకింతకంటె యోగ్యులైనయనుచరులుగాని యనుచరులకింతకంటె యోగ్యుడైననాయకుఁడుగాని కాన్పించఁడు.

---

# బార్డోలీ విజయము.



## పదునాల్గవ యధ్యాయము.



"రెండవ రంగము."

"మీ పరిశాంతపరివర్తనముచే పోలీసువారిని పూర్తిగా నిష్ప్రయోజనము గావింపుడు." "వల్లభాయిపటేలు."

ప్రజాబల మొకవంక నీవిధముగా పెరిగిపోవుచుంటను చూచి ప్రభుత్వమువా రోర్వజాలరైరి. భూములను లాగుకొనుట కిచ్చినగడువు గతించెను. ఒకవంక ప్రభుత్వహడావుడి హెచ్చజొచ్చెను. శివదాసనీ, దాసుభాయి దేశాయి, భీమభాయినాయిక్, దీక్షితులు మొదలగునలుగురుశాసన సభ్యు లీసమయములో బార్డోలీయంతట తిరిగి ప్రజాసభలను కొన్నింటిని చూచి వారిసంఘీభావమును, బలమును కనుగొని యాశ్చర్యపడసాగిరి. 1922 లో అసిస్టెంటు కలెక్టరుగానుండి మహాత్ముని నిర్బంధించిననాడు రాజీనామానిచ్చిన శివదాసనీగారు బార్డోలీలో నొకగ్రామములో పెద్దసభలో నుపన్యసించుచు నిట్లుచెప్పెను. "బార్డోలీ నేడు తయారైనట్లు తయారగునని వల్లభాయిపటేలుకూడ నూహించియుండలేదు. చివరవరకు బార్డోలీ స్థిరముగా నిలుచుచో నీసమరమే బ్రిటిషు

శవపేటికలో కొట్టబడిన మొదటిచీల కాగలదు. కొన్నివత్స రములక్రితము నారెన్నికసందర్భములో నేను మీతాలూ కాలోతిరిగినపుడు మీరు గోవులవంటివారమనియు మిమ్ము యీసింహమునుండి రక్షించవలెననియు చెప్పియుండిరి. సింహమునుండి మీరిపుడు భయమును పారదోలుటేకాక మీరే సింహపుపిల్లలైపోయిరి. మీరొక్క వల్లభాయికే గాక దేశమంతకును ప్రమాణమునుచేసియుండిరి. దీనినిపాలించుడు. మీరు మీకునుమీదేశముకొరకునుగూడ విజయలక్ష్మిని చేబట్టగలరు." ఈశాసనసభ్యులందరును సంతోషాంతరంగులై తమసానుభూతి నెట్లుచూపగలమాయని తమలోతాము తర్కించుకొనుచుండిరి.

ఈలోపుగా వల్లభాయి పరిస్థితుల నవలోకించుచు తానదివరకే ప్రభుత్వముతో నుత్తరప్రత్యుత్తరములను జరుపుచుండినవిషయములలో నొకయడుగు ముందుకు వేసెను. ఈ నాముభూములకున్నక్విటురెంటుకు హెచ్చుదల నెన్నడును లేదు. కనుక నీపన్ను నెందుకు చెల్లింపగూడదు! కాని యీ సందర్భములోనే పన్ను చెల్లించవలెనని యతడు చెప్పినదానికపార్థములు కల్పింపబడవచ్చును. ఇది కొంతయవినీతికి కారణముకావచ్చునని యతడు భయపడెను. కాని ప్రజలకిప్పుడు నిర్భయత్వము పూర్తిగానేర్పబడెను; ఈసమరములోని సిద్ధాంతములు, వివరములు బోధింపబడెను. కనుక నిట్టిభూ

ములుకలవారు యేభూములకు పన్ను చెల్లించుచున్నారో ఆ భూములకే జమకట్టుషరతుమీద, సరియైనరసీదులనిచ్చేయెడల పన్ను చెల్లించవలెననుయాజ్ఞను పొందిరి. మొత్తపు రెవిన్యూడిమాండు 6 లక్షలలోను యిట్టిపన్ను 8756-12-0 మాత్రమే యుండెను.

ప్రజాబలముకును, దానియందు సర్దారుకుగల విశ్వాసముకును నింతకంటె వేరునిదర్శన మేమికావలెను? సర్దారుపైనుదహరింపబడిన నలుగురుశాసనసభ్యులుగల యొకసభలో తనయుద్యమనీతిని గురించి యిట్లు స్పష్టపరచెను. "శాసనసభ్యులందరును మనమనుష్యులే కాని యొకవిధముగా నేడు వారు మనయతిథులు. వారు పనిచేయుపద్ధతి, వారియుద్ధపద్ధతివేరు. ప్రభుత్వమువారితో వారియావరణలలోనే పోరాడుచుందురు. నాకది యుపద్రవకరమైన చెలగాటము. అదియొక జూదపుకొంప. దానిలో ప్రభుత్వమువారు పాచికలను నింపు కొని తమయిష్టమువచ్చినపుడు మనపై కురుకుదురు. మనశాసనసభ్యులు దీనిని శాస్త్రీయమైనపోరాట మందురు. ఈశాస్త్రీయపోరాటము నాకక్కరలేదు. వారికింకను భ్రమతొలగకుండుట నాకాశ్చర్యముగా నున్నది.ఏలనన వారి కృషియంతయు బూడిదలోపోసినపన్నీరు వంటిది. నాయుద్యమమును నేనే పన్నితిని. నేనిందులో నల్లేరుపైబండివలె నడువగలను. మనకింతకంటెవేరుమార్గము లేదని యీశాసనసభా

స్నేహితులుకూడ నాతో నంగీకరింతురు. నేడు వ్యవసాయదారులగతి ఆండర్సనుయావిరియంత్రముచే మెత్తగా చితుకగొట్టబడురోడ్డుకంకరవలెనున్నది. బార్డోలీలోనైనను యీ యావిరియంత్రము మనలను నలిపివేయకుండుటకే మనము పోరాడుచున్నాము. ఒకలక్షమీద కొద్దివేలు మిగుల్చుకొనుటకుమాత్రమే యీపోరాటము ప్రారంభింపబడలేదు. హెచ్చుకట్టుట కవకాశము కలదని నన్ను యొప్పించగలిగినచో ప్రజలు పన్ను చెల్లించివేయవలెనని నేనే సలహాయిచ్చియుందును. గతిసంవత్సరము వరదలచే నాశము గావింపబడినగుజరాతులో పన్నులరెమిషనుకొరకాందోళన జరుపవలసినదని నాకు సూచించిరి. నేను అట్లు చేయరాదంటిని. దానికేమియు కారణము లేదని వ్యవసాయదారులతో చెప్పితిని. వారికిపంటలు బాగుగా పండినవనియు వరదలవలన నష్టము కలిగెననిచెప్పుటకు వీలులేదనియు, తమకిదివరకే యొకకోటి రూపాయిలు అప్పుయివ్వబడెననియు, ప్రభుత్వమువారు 10లక్షల రూపాయిలును, ప్రజలకు కరువులకొరకేర్పడిననిధిలోనుండి 20 లక్షల రూపాయిలును కరువుబాధను నివారించుటకు ప్రభుత్వమువారిచ్చియుండిరనియు వారితోచెప్పియుంటిని. అయినను గుజరాతుప్రాంతికసమితివారు మంచి సమయములో తమమనుష్యులను పంపి సహాయము చేయకపోయినను, వారు విత్తులను చకచక పంచిపెట్టించకపో

నను పంట లుండెడివికావు; ప్రభుత్వమునకు 50 లేక
) లక్షలరూపాయిలు నష్టము వచ్చెడి వని సవినయము
నా మనవి చేయుచున్నాను. అయినను బార్డోలీ యుద్య
మును ప్రారంభింపకముందు వ్యవసాయదారుగతి ప్రతి
చోట నానాటి కధ్వాన్న మగుచున్న దనియు కొద్దిగా
బాగున్నతాలూకాలను తదితరతాలూకాలతో సమముగా
తేసికొని రా కూడ దనియు నేను ప్రభుత్వమువారికి వ్రాయ
గా వారు నన్ను 'పైనుంచి వచ్చినవాడవు' అని శలవిచ్చిరి."
కాని యిట్టి తర్కములకిపుడు సావకాశము లేదు. ప్రభుత్వ
మువా రింకను తగినంత "శాస్తి చేయలే దనుకొనుచుండిరి.
జప్తులు, ఆస్తులను ప్రభుత్వవశము చేసికొనుట మొదలగు
బెదిరింపునోటీసులు నిష్ఫల మయ్యెను. కనుక నంతకంటె
కఠినపద్ధతు లవలంబింపబడెను. సముద్రవిహారములతో కులు
కుచున్న ఆడివిజనుకమీషనరుగారిని జిల్లాకేంద్రస్థానమైన
సూరతు వచ్చి మకాం చేయవలసిన దని యేప్రిల్ 14 వ తేదీ
ని తంతిద్వారా యాజ్ఞాపించిరి. అట్లే సమీపములో నున్న
స్వదేశసంస్థానకొండలమీదనున్న కలెక్టరుకు గూడ వచ్చెను.
ఉద్యమ మారంభమైనతరువాత కలెక్టరు మొదటిసారి బార్డో
లీలోని పరిస్థితులను చూచుటకు వచ్చెను. ఇంతవరకు నతడు
తనడిప్యూటీకలెక్టరు కండ్లతో మాత్రమే చూచుచుండెను.
బార్డోలీలో దుకాణము లన్నియు కట్టివేయబడుట నతడు

చూచెను. జప్తులనుండి తప్పించుకొనుటకు దుకాణదారుల పగలెప్పుడును కొట్లు తీయకూడ దని తీర్మానించుకొనిరి. అతడు మరియొకచోటకు వెళ్ళవలె నని నిశ్చయించుకొనెను. వెంటనే పోలీసువారు బండికొరకు పరుగెత్తిరి. ఒకబండిని సత్యాగ్రహు లదివరకే కుదుర్చుకొనుటచే బండివాడు తన బాసను జవదాటజాల ననెను. అతనిలైసన్సును యివ్వమని డబాయింపగా నతడు లైసన్సుయిత్తడిబిళ్ళను చూపెను. వా రాబిళ్ళను తీసికొనిరి. మరియొకనిబండిని వల్లభాయికుదు ర్చుకొనగా నాబండివాని లైసన్సు తీసుకొనిరి. చివరకు కలెక్ట రు రాత్రికి సార్భాను చేరుకొనెను. వెంటనే గ్రామములో నున్నయువకు లందరును గబగబ డప్పులను ప్రయోగించి యుత నిరాకను ప్రజల కెరిగింపగా వారు తమతలుపుల నన్నిటిని మూసికొనిరి. పెత్తందారును పిలిపించిరి. అతడు వచ్చెను. అతడు పన్నులను చెల్లించినదీ లేనిదీ ప్రశ్నించిరి. అతడు సత్యాగ్రహుల కేంద్రాలయమునుండి వచ్చినయాజ్ఞల ననుస రించి తన యీనాంభూములమీాద పన్ను చెల్లించితి నని చె ప్పెను! అతనిని తన మిగతభూములమీాద పన్ను యిచ్చివేసి యితరులను కూడ ప్రోత్సహింపమని చెప్పిరి. “దానివలన ప్రయోజన మేమియు లేదు. నేను పన్ను చెల్లింపజాలను. ప్రజలు నామాట వినరు వారు జప్తులను గిప్తులను ఖాతరు చేయరు.” అని యతడు బదులు చెప్పెను. కలెక్టరు వానిని

వదలివేసిమరియొకగ్రామము వెళ్లెను. మరువాడు మునసబుల ను పిలిపించి భూములను గ్రూపులక్రింద విడదీసి ప్రభుత్వము వారు వశపరచుకొని యితరుల కమ్మివేయుటకు తగినట్లు పటములు తయారు చేయమని యాజ్ఞాపించి యతడు కోపము తో నుడికిపోవుచు సూరతు వెడలిపోయెను.

అత డక్కడకు వెళ్లినవెంటనే టైమ్సుపత్రికావిలేఖరి తో నిట్లు చెప్పెను. "చాలమంది వ్యవసాయదారులు తా మీయవలసినభూమిపన్నులను తదితరపన్నులను యిచ్చివే యుటకు సిద్ధముగనే యున్నారు. కాని సాంఘికబహిష్కార ము, దౌర్జన్యము, కొంప లంటించుట మొదలగు భయముల తో వీరిని భయభ్రాంతులను చేయుచున్నారు. ఈయుద్యమ మును పైనుంచివచ్చి నష్టపోవుట కేమియు లేనట్టి యస హాయవాదులు నడుపుచున్నారు. వీరిదుర్మార్గపుసలహా ను వ్యవసాయదారులు వినిన ట్లయినచో చివరకు చె డిపోవువారు వ్యవసాయదారులే యగుదురు. అసహా యోద్యమనాయకులచే నడుపబడుచున్న యీయుద్యమము వలన తాలూకాలో నల్లరి జరుగుట కవకాశ మెంతేనికలదు."

ప్రజలు దౌర్జన్యము, కొంపలంటించుట, సాంఘిక బహిష్కారము మొదలగు నకార్యములచే నితరులను భయ భ్రాంతులను చేయుచున్నా రనుట వారిపై నొక కళంకము నాపాదించుటవంటిది. కలెక్టరుగారు వెళ్ళిన ప్రతిచోట తలు

పులను బిగించిన సంగతి మన మిదివరకే చూచి యున్నము. అతడు మోపిననిందకు తనక్రిందినౌకరులు చెప్పినమాటలే యాధారము కాని ప్రజలు కారు. ఏది యెట్లున్నను తనతప్పువల్లకాని, ప్రభుత్వమువారి తప్పువల్లగాని తాలూకాలో నల్లరి లేకుండ నుండుటకు చర్యల నారంభించెను. దున్నపోతులను జప్తు చేయుట యిదివరకే ప్రారంభ మయ్యెను జప్తుఆఫీసరుల కిప్పుడు యిండ్లు పగులగొట్టుట, జప్తు చేయుట మొదలగు టూకీపద్ధతులకు ప్రత్యేకాధికారముల నిచ్చి నియోగించిరి. పోలీసుబలము చాల హెచ్చింపబడెను. దున్నపోతులను తోలుకొని వచ్చుటకు, జప్తు చేయుటలో సహాయపడుటకు పఠానుమూక్కలను జప్తుఆఫీసరులక్రింద నుంచిరి. ఏరోజు కారోజు యుద్యమమును నలిపి వేయుదు మని డాబులు కొట్టుచుండిన యుద్యోగస్థులు స్థానికముగా కూలీలను సంపాదింపజాలక బొంబాయివరకుపోయి పఠానులను తెప్పించుకొనవలసినదుర్గతి నేమనవచ్చును ? హిందూ రెవిన్యూయినస్పెక్టరు తనపనిని సరిగా నెరవేర్చుట లేదని బదిలీచేసి ముసల్మాను వ్యవసాయదారులను చీలదీయుట కొరక మహమ్మదీయుని నియమించిరి. సర్దారుయొక్క యుపన్యాసములను వ్రాసి పంపుకొనుచున్న మునసబులబదులు తాలూకాలో గూఢచారబృందమును దింపిరి.

ఈ యట్టహాసమును లక్ష్యము చేయక ప్రజలు తమ కట్టుబాటులను మరింత బలపరచుకొనుచుండిరి. ఇంతవరకు దూరముగా నున్న కేడాడుగ్రామము బుద్ధి తెచ్చుకొని గ్రామ ప్రముఖులైనవారందరును సర్దారువద్దకు వచ్చి క్షమార్పణ కోరి దానిని కూడ సత్యాగ్రహగ్రామములలో జేర్చుకొనవలె నని ప్రార్థించిరి. సర్దారు దీని నంగీకరించెను. కాని యతడాగ్రామములో నుపన్యసించుటకుపూర్వ మనేకగ్రామముల ప్రముఖులు వచ్చి యితరగ్రామములలో నాలోచింపకుండ తగినప్రాయశ్చిత్తము, హామీ లేకుండ యిుదుకొప్పుకొనరాదని సర్దారుకు తెలిపిరి. శాంతమును వహింపవలె ననియు, క్షమింపవలె ననియు కేడాడును ముక్తహస్తములతో నాలింగనము చేయవలె ననియు యథార్థమైన పశ్చాత్తాపమే వారి భావిప్రవర్తనకు తగినహామీ యనియు సర్దారు వారికి నచ్చజెప్పెను. కేడాడు క్రొత్తగా రంగములోనికురికిన దగుట చే నితరగ్రామములను మించవలెనని, యచ్చటనున్న జప్తుఆఫీసరుకాహారపదార్థములను సరఫరా కాకుండ చేయవలె నని తీర్మానించిరి. సర్దా రొకదీర్ఘమైన గంభీరోపన్యాసము నిచ్చి యిది సత్యాగ్రహసిద్ధాంతమునకు పనికిరా దని వారికి బోధించి తీర్మానమును రద్దుచేసికొనమనెను. "సత్యము, దౌర్జన్యరాహిత్యములే పూర్తిగా పునాదులుగాగల యుద్యమములో మనము క్రోధముతో దేనిని చేయరాదు. అది మన దుర్బలత్వ

మునే సూచించును. మనపై చోప్పింపబడుబాధల నన్నిటిని సంతోషముతో ననుభవించుటలోనే మనబలము కలదు. జపులు చేయుటలో నాఫీసరులకు సహాయమును మీరు తిరస్కరించుటలో నర్థము కలదు. అది మీధర్మము. కాని వారి జీవితాధారమునకు కావలసిన మామూలు సౌకర్యములను మాత్రము తిరస్కరింపకుడు. బజారుధరలకు వారికి కావలసిన వన్నియు వారికి దొరకవలెను.

కలెక్టరుగారు క్రైమ్సుపత్రికాప్రతినిధితో చెప్పినసంగతులను నేను వింటిని. నేను గ్రామగ్రామము గత రెండు నెలల పదిహేనురోజులనుండి తిరుగుచుంటిని. కాని యీ యక్రమపన్నును చెల్లించుటకు సమ్మతించినవా డెవడును నాకు కాన్పించలేదు. కలెక్టరు వచ్చినతరువాత ప్రజలను చట్టవిరుద్ధముగా ననేకయనవసరనిర్బంధముల పాలుచేసిన ట్లనేకరిపోర్టులు నాకువచ్చినవి. ముఖ్యముగా పార్శీవ్యవసాయదారులను (వీరికి సారాదుకాణములు కలవు.) చాలబాధలుపెట్టిరి. వీరిని నిర్బంధములపాలు చేయుటకు సాల్టుఉద్యోగస్తులసహాయమును బడసిరి. ఒక్క పారశీవ్యవసాయదారైనను బుద్ధిపూర్వకముగా తా నీయవలసినపన్ను నివ్వలేదు. దౌర్జన్యమునకుగాని, కొంపలంటింతు రనిగాని భయపడి వా రెవరును పన్ను చెల్లించుట మానలేదు. వారికి ప్రజలతో నెట్టి సాంఘికసంబంధములును లేవు. మీలో భేదములను కల్పించుటకు వా

రెంత ప్రయత్నించినను (వారికున్న నక్కాశ యిదియే) మీరు దానిని నమ్మి చేయుదు రని నే నెరుంగుదును. వా రెంత పోడిచినను మీరు యుద్ధము కప్రతిష్ట తెచ్చుపనులను చేయరని నే నెరుంగుదును. వారిని మీతలుపులను మీతాళములను పగులగొట్ట నిండు; మీయావదాస్తిని తీసికొని పోనిండు. చిరునవ్వు నవ్వుచు మీరు దీనినంతను సహింపవలెను. వారియిష్టమువచ్చినట్లు వారిని చేయనిండు. మీస్వాస్థ్యమును పోగొట్టుకొనకుడు. ఈతాలూకాలో పన్ను చెల్లింపవలె నని యుండి దౌర్జన్యము, కొంప లంటించుట మొదలగు వాని భయముచే జంకువా రుండినచో వారు నాదగ్గరకు నచ్చినచో నేను వారిని స్వయముగా రెవిన్యూయినస్పెక్టరుదగ్గరకు తీసికొని వెళ్ళి పన్ను చెల్లగట్టింతును. నేను వారికి కావలసినంత రక్షణ నొసంగెద నని యభయహస్త మిచ్చుచున్నాను. కాని యిట్టివారు శేరని నేను చెప్పగలను. దౌర్జన్యమును, భయమును చూపుట కపారసాధనసామగ్రి గల యీప్రభుత్వముముందర బలవంతము, భయపెట్టుట పునాదిగాగల యీయుద్ధమము యింతకాలము నిలువజాలను మీప్రశాంత ప్రవర్తనమువలన నీతాలూకాలో నున్నపోలీసుబలము నంతను పూర్తిగా నిరుపయోగము గావింపవలె నని నే నాశించుచున్నాను. దీనికి మీరు నాకు సాయపడెద రని నే నెరుంగుదును. వారికి పని లేకుండ చేసినచో వారు త్వరగా వెళ్ళి పోవుదురు."

సర్దారుఉపన్యాసము లిపుడెంతసేపు నీతిబోధతో కూడి కొంచెమించుమించు మతావేశభరితమై యుండెను. ఇంతవరకు నిర్భయత్వము బోధింపబడెను. ఇప్పుడు శాంతిని వీడకుండు డని బోధింపబడుచుండెను. ప్రభుత్వ మెంత రెచ్చగొట్టిన నంతశాంతి ప్రబలవలె నని బోధింపబడెను. పోరాట మిపుడు రెండవరంగమును దాల్చెను. ప్రజలు తా మింతవరకు ననుభవించినబాధలకన్న నెక్కుడుబాధల ననుభవింపవలెను. సర్దారు ప్రతినిమిషము ప్రతిఘడియ యొక్కశాంతి స్థాపననే ప్రజలకు బోధించుచు వారిని యగ్నిపరీక్షకు తయారుచేసె నని చూపుటకు మరియొకయుపన్యాసమును పొందుపరచుచున్నాను. “మనయుద్ధము రెండవరంగమును దాల్చెను. మన దౌర్జన్యరహితయుద్ధమునకు కావలసినసాధనములను, ఆయుధములను గురించి యిప్పుడు నేను మీ కంతగా బోధింపనక్కర లేదు. నాతోడి ప్రచారకుల నందరను యుపన్యాసములను కట్టిపెట్టి వాటిని నా కొక్కనికే (అవసరమున్నట్లయితే) వదలివేయవలె నని చెప్పుచున్నాను. ఇప్పుడు భగవన్నామసంకీర్తనమొక్కటియే చేయవలసినసమయము. కనుక మీరు సమరగీతములను పాడుట మానివేయవలెను. మన త్యాగము ప్రారంభమైనది. అది పవిత్రమై నిష్కళంకముగా నుండునుగాక! నేడు మనము కళంకరహితులమై, బుద్ధిపూర్వకముగా నాహుతి కాబడవలసి యున్నది. ప్రభుత్వము

ఇంతకంటె గొప్ప త్యాగమును మన మూహింపజాల ము. ప్రభుత్వనౌకరులు తమ ధర్మములను నెరవేర్చు టలో నాటంకపరచె ననియు, హక్కులేనిచోట కక్రమ ముగా వచ్చె ననియు నితనిమీద కేసు పెట్టబడెను. ఇతను నేరస్థుడగుటకు మూల మిది. డిప్యూటీకలెక్టరుగారి పరుపు లు మొదలగుసామానును బార్డోలీఠాణానుండి వాలడ్ కు తీసికొని పోవుటకు మూడుబండ్లకు కబురు పంపిరి. బండ్లయ జమాని తనతప్పును గ్రహించి రవిశంకరుతో తనమనుష్యు లను తిరిగిరమ్మని పిలుచుటకు వెళ్ళెను. యజమానిని చూచుటతోడనే యొకబండివాడు తమకెంతమాత్రమును యిష్టము లేదనియు బలవంతముగా తీసికొనివచ్చి రనియు చెప్పెను. వారి కిష్టము లేనిచో వారిని బలవంతపెట్టుట న్యా యము కాదని రవిశంకరు రెవిన్యూయినస్పెక్టరుతో వాదిం చెను. అతనిని ఠాణాలోనుండి వెళ్ళిపోవలసినదని యుద్యోగి యాజ్ఞాపించెను. అత డట్లు చేసెను. బండివాడు కూడ బండిని విడిచిపెట్టి యతనితో వచ్చివేసెను. తక్కినయిద్దరును అట్లే చేసిరి. ఇది యక్రమముగా హక్కులేనిచోట ప్రవేశించుట యెట్లగునో తెలియకున్నది. ఉద్యమము ప్రారంభమైనదిలగా యితు ఆటంక ముండనే యున్నది. సత్యాగ్రహులను లొంగ యుటకు చేసినప్రయత్నములు భగ్నమగుట, ఆస్తిని జప్తు ుటకు, జప్తుచేసిన యాస్తిని విడుదలచేయుటకు చేసిన

ప్రయత్నములు భగ్నమగుట, యిదంతయు ప్రజాసేవకులవలన కలిగినయాటంకమే! బార్డోలీలో వందలకొలది యున్న ప్రచారకు లందరిని శిక్షాస్మృతికి్రందకు తీసికొని రావచ్చును. కాని రవిశంకరు నొక్కనినే వేరు చేసిరి. ఆత డీగౌరవమునకు పాత్రుడే యగును. ఏలనన సర్దారుతప్ప గుజరాతులో నింత టిపలుకుబడియు కార్యశూరుడు నగునాటంకకారుడు (శాంతియుతమైనవాడు) మరియొకడు లేడు.

ప్రభుత్వమువారి న్యాయశూన్యతవలన నుత్పన్నమగుచున్న కేసులను ప్రత్యేకముగా విచారించుటకు నియమింపబడిన బార్డోలీమేజిస్ట్రేటువలన నతడు విచారింపబడి 5 నెలల 10 రోజులు కఠినశిక్ష విధింపబడెను. దీనినిగురించి మహాత్ముడిట్లు వ్రాసెను. "విధివశమున ప్రాప్తమగు నేయాహారమునైనను మహానందముతో స్వీకరించుచు, శీతోష్ణములను ధిక్కరించుచు, గుడ్డపీలికలతో శరీరమును కప్పుకొనుటతో తృప్తిపడుచు నిప్పుడు మరల నందరికంటె ముందుగా జయిలుకు పోవుభాగ్య మబ్బిన నీ వదృష్టవంతుడవు. మనస్థానములను మార్చుకొనుటకు భగవంతు డనుగ్రహించుచో, నీవు కూడ నుదారస్వభావమును చూపుచో తప్పకుండ నేను నీస్థానము నలంకరింప గోరుచున్నాను. నీకును నీదేశముకును జయమగుగాక! బాపుయాశీర్వాదముల నందుకొనుము."

వెంటనే తాలూకాలోని ముఖ్యపట్టణములలో నపరియత్నముగా హర్తాళములు జరుపబడెను. పరిచారకులు తమ తమునంతులకొరకు ఎదురు చూచుచుండిరి. బరోడాసంస్థానములో పారిశుధ్యశాఖకు కమీషనరుగాచుండి ప్రజాసేవ చేయవలె నని దానికి రాజీనామా నిచ్చి 10 వత్సరములనుండి సేవచేయుచున్న డాక్టరు సుమంతుమెహతా యీయుద్యమమును పరీక్షించుచుండెను. రవిశంకరును నిర్బంధించుటతోడనే యితడుద్యమములోని కురికెను. సర్దారు యితనికి రవిశంకరుస్థానము నిచ్చెను. ఇతడు తనభార్యయగు శ్రీమతిశారదాగాంధితో సార్భానులో స్థిరపడెను. గాంధిమహాత్ముని మూడవకుమారు డగురామదాసుగాంధితో మరియేడుగురు సేవకులు బార్డోలీలో వాలంటీరులవలె పనిచేయుటకు వచ్చిరి.

ప్రభుత్వమువా రిపుడు రెండు పోలీసునోటీసులను జారీచేసిరి. ఒకటి కలెక్టరు జిల్లాపోలీసుఆక్టు సెక్షను 39 (1M) క్రింద నెనరుగాని ఆరుమాసములవరకును ప్రజలందరును వచ్చుటకు వీలున్నరోడ్లు, వీధి లేక చోటులలో నితరులను భయపెట్టుట, లేక నపకారము చేసెద మని బెదిరించుట, మొదలగుపనులద్వారా యితరులు తమవిధులను నెరవేర్చుకొనుట కాటంకమును కల్పించరా దనియు, గవర్నమెంటు లేక, లోకలుబోర్డు ఆవరణ లేక భవనము లేక ప్రజలు వెళ్ళుట కవకాశమున్న ప్రభుత్వనౌకరు ఆవరణ లేక యింటిసమీప

మున న్యాయబద్ధమగు వ్యాపారమును చేసికొనబోవువారి నె వరును ఆటంకపెట్టరాదు లేక భయపెట్టరాదు అనియు, నెవరుగాని పశువులు, బండ్లు రోడ్లమీద, వీథులలోను, బహిరంగప్రదేశములలోను నడుచుట కాటంకపరుపరా దనియు; రెండవది జిల్లాపోలీసుసూపరెంటెండెంటు వంతకముతో నుండెను. అది డప్పులు వాయించకూడదని బహిరంగప్రదేశముల దగ్గిర లేక రోడ్లదగ్గిర లేక గవర్నమెంటుభవనముల దగ్గిర డప్పులు వాయించకూడదని, సంగీతము పాడరాదని, శంఖములను పూరించరాదని, బూరాల నూదకూడదని నిషేధించెను.

ఈనోటీసులు ప్రభుత్వబలమును గాని వారిబుద్ధివైశద్యమును గాని వారి దివాలాస్థితినే చాటుచున్నవి. ఇది వారు పట్టియానులను, బండ్లను, వేలం పాడువారిని తెచ్చుకొనజాలకపోయి రనియు, తమసాకరులే తమచేతులలోనుంచి జారిపోవుదు రని భయపడి రనియు ప్రకటించుచున్నది. మొదటి నోటీసు ప్రోత్సాహమునుకూడ నిషేధించుచున్నది. భయపెట్టుటను నిషేధించుటలో నర్థ మున్నది. కాని యట్టికేసు ఒక్కటియు లేదు. ఆహా! చిన్నపిల్లల డప్పులు, తప్పెట్లువాయించుట నాపివేయుటకు పోలీసునోటీసులు కావలసివచ్చెనా! అవి తుపాకులు, మందుగుండుసామగ్రిమధ్య నిరాఘాటముగా సాగింపబడెను.

కాని యీనోటీసుల నిచ్చుటలో ప్రభుత్వమువారు లెవరితో వ్యవహరించుచుండిరో మఱచిపోయిరి. సర్దారు తప్పుమార్గమును త్రొక్కువాడు కాడు. అతని నణచివేయుటకు భయపెట్టుటకు యెవరితరమును కాదు. సత్యాగ్రహము తన నేదిచేయమనునో దాని నతడు చేసితీరును. అతడు గ్రామస్థులను డప్పులు వాయించుట, శంఖములు పూరించుట, మానుకొనుమనెను. కాని మామూలుగా ప్రజలను ప్రోత్సహించక తప్ప దనెను. శాంతియుతమైనప్రోత్సాహమును చట్టముచే నణచివేయుట న్యాయవిరుద్ధము.

కాని న్యాయశూన్యత బార్డోలీయొక్కరూపమును మార్చివేయుచుండెను. సర్దారు పురపాలకసంఘాధ్యక్షతను బలవంతముగా మానుకొనుటవలన యుద్యమారంభములోవలె వారముకు మూడురోజులు కాక నిపుడు కాలమంతయు దీనికి వినియోగించుచుండుటచే బార్డోలీలోని ప్రతి గ్రామము నితడు స్వయముగా పోవుటయు నితని పలుకుబడి క్రిందకు వచ్చుటయు సంభవించెను. ఇతనియుపన్యాసములు వారి కదివరకే చేరుచుండెను. కాని యతనిసంపర్కము కొంతమందికి కలుగలేదు. ఇప్పుడు వారి కాయదను దొరకెను. ఇతడు నవ్విన యితనితో వారును నవ్విరి. ప్రతిదినము వారిపై వర్షింపబడినబాధలను వారతనిహాస్యప్రభావముచే వేదాంతులవలె నానందముతో నెదుర్కొనుచుండిరి. అతడు

బార్డోలీలో నిచ్చినయొకయుపన్యాససారాంశము నిందు పొం
దుపరచెదను.

"బార్డోలీ యప్రతిమానమైన గౌరవమును పొంద
చున్నది. సాయుధపాణులగు రక్షకభటులు బారులు తీరి నడ
చుచుందురు. తుపాకులతో గుఱ్ఱములపై నెక్కి గుఱ్ఱపుదళ
ము బార్డోలీవీథులలో ప్రదక్షిణము చేయుచుందురు. కొద్ది
రోజులక్రితము మిమ్ము తృణీకరించినప్రభుత్వము నేడు మీ
గ్రామములలో పైకి క్రిందకు పరుగులెత్తుచున్నది. జిల్లాపోలీ
సుసూపరింటెండెంటుకూడ యీనడివేసవికాలములో మి
మ్ము దర్శింపవచ్చుచున్నాడు; ఇది యొక స్వల్పవిషయము
కాదు. సంవత్సరములకొలది జప్తుల నెరుగని మీతాలూకా
వంటి తాలూకాలో మీయాస్తిని జప్తు చేయుటకు ముగ్గురు
ప్రత్యేకాధికారులను నియమించుట స్వల్పగౌరవమా? మీ
యిళ్ళలోనుండి తీసికొనిపోబడినయాస్తిని మోసికొని పోవు
టకు సూరతునుండి ప్రత్యేకమోటారులారీలను తెప్పించవల
సివచ్చుట స్వల్పగౌరవమా? ఎద్దుబండియే మహాభోగముగా
నెంచునట్టి చిన్నబంట్రోతులు, పఠానులు నేడు ప్రభుత్వము
వారి మోటారుకారులలో కులాసాగా తిరుగుచుంట బార్డోలీ
వల్లనే కదా!"

మరియొకయుపన్యాససారాంశమును చూడుడు. "మీ
కులకట్టుబాటులను మరింతబలము చేసికొనుడు. దీనికి వ్యతి

లేకను చెప్పువా రెవరు నుండజాలరు. 6000 మైళ్ళదూర
మునుండి వచ్చుయీకొద్దిమంది తెల్లవారు వారి కొలకుల స్థి
డి యుండబట్టియే మనలను పరిపాలించుచున్నారు. వారి
చిన్నసంఘము వారిలో తప్పుచేయువారిని కూడ రక్షించు
టకు తగినట్లు పన్నబడెను. అట్టిచో కలెక్టరు మనకట్టుబాటు
కె ట్లభ్యంతరపెట్టవలెను? ఎప్పుడును పశుబలముమీద నా
ధారపడియున్నవారి కట్టుబాటుకు దుర్బలులను దోచుకొను
టయే పరమావధి; మనదానియాదర్శము కేవలము ఆత్మర
క్షణము.”

మరియొక యుపన్యాససారాంశము చూడుడు. “ప్రభు
త్వమువారు అల్లరిని కోరుచున్నారు. వారు మనలను దౌర్జన్య
మునకు పురికొల్ప జూచుచున్నారు. డప్పులకు శంఖములకు
భూమిపన్నుతో నెట్టిసంబంధమును లేదు. వారినోటీసులతో
మనము తగవు లాడనక్కర లేదు. అవి మన కపకారమును
చేయవు. అవి సమస్యను చక్కచేయవు. వారు మిమ్ము రెచ్చ
గొట్టినచో రెచ్చకుడు; కంగారుపెట్టినచో కంగారు పడకుడు.
వారు మిమ్ము అణచివేయుటకు చూచినచో లొంగకుడు.
వారికి మతి చెడినది. ఎఱ్ఱగా కాచినయినుపముక్క వేలకొ
లది నిప్పుకణములను వెదజల్లకలదు. కాని సుత్తి యట్లుచేయ
జాలదు. సుత్తి యెరుపెక్కినచో దానిపిడియే మాడిపోవును.

ప్రభుత్వమువారు తమయిష్టమువచ్చినట్లు మెరుపెక్క వచ్చును. ప్రజలు (సత్తి) అట్లు చేయజాలరు. వారు తమస్వాస్థ్యమును వీడకున్నచో ప్రభుత్వమును చల్లార్పగలరు ! ప్రభుత్వమును లొంగదీసి దాని కొంకయాకారమును కల్పించగలరు.

---

# బార్డోలీ విజయము.

## పదునాఱవ యధ్యాయము.

" న్యాయశూన్యమైన పరిపాలన—2. "

" భగవంతుడు తనరత్నములను మెఱుగుపెట్టుటకు సునితమగు ననేకపరికరములను, మోటఆకురాళ్ళను కలిగియున్నాడు. "

" లైటన్ "

అసలుకథకు వత్తము. భూమిని ప్రభుత్వవశము చేసికొనెద రని యిచ్చిననోటీసులు వేలసంఖ్యకు వచ్చెను. క్రొత్త సెటిల్‌మెంటుప్రికారము వసూలుకావలసినపన్ను కనేకరెట్లు విలువగలభూమి కిట్టినోటీసులు వచ్చెను. ఇంతవిలువగలభూమి ప్రభుత్వవశములో నుండ వారు న్యాయవిరుద్ధమైనచర్యల కేలగడంగవలెనో యాశ్చర్య మగుచున్నది. దీనికి జవాబు స్పష్టమే. ప్రజలు తమనిరంకుశేచ్ఛకు జోహారు లొనర్పవలసిన దని వారికోరిక. భూమితో తా మేమియు చేయజాలరని వా రెఱుంగుదురు. కొనువారిని సంపాదించితి మని వా రెంత కోసినను ధైర్యరాశియగు వ్యవసాయదారుని భూమిలోనుండి లేవగొట్టజాల రని వా రెరుంగుదురు. వారికి భూము లక్కర

లేదు; వారికి కావలసినది నోరెత్తకుండ జోహారుల నర్పించు టయే !

ప్రత్యేకజపు ఆఫీసరులు, పోలీసుబలము, పశువుల నెత్తుకొనిపోయి కాపుకాయుటకు పఠానుబలగము—యివి చాలక ప్రభుత్వమువారు దున్నపోతులను కొనుటకు కసాయి వాండ్రను తీసికొనివచ్చి యొక్కపాటలోనే మందలను అమ్మి వేసిరి. ఇది ప్రజల కతిప్రియమైన భావములను భంగపరచి వారి నుద్రేకపరచుట గాక మ రేమగును? ఠాణాఆవరణలో నుంచినపశువులబాధ మితిమీరుచుండెను. తగినజాగ్రత తీసి కొనకపోవుటచేతను, నీరు మేత లేకపోవుటచేతను వాటిలో నొకటి చనిపోయినట్లు మన మిదివరకే వినియుంటిమి. ఈదు రదృష్టపశువులకు సరియైనపోషణ జరుగగలందుల కొక ప్రము ఖుడు కొంతవిరాళము నిచ్చెద నని రెవిన్యూయిన స్పెక్టరువద్ద కు వెళ్లెను. ఆయుద్యోగి దానిని తిరస్కరించుచు “ప్రభుత్వ మువారిబొక్కసములో కావలసినంత ధనము కలదు. వారికి మీసహాయ మక్కర లేదు ” అని చెప్పెను.

ఇందుచే ప్రజలు రాత్రింబవళ్ళు తమతోపాటు తమ బిడ్డలనువలె ప్రేమించునట్టిపశువులను కూడ తమయిండ్లలోనే దాచియుంచుకొనవలసి వచ్చెను. పఠానులదయకు వాటిని విడిచివేసి నీరుమేతలు లేకుండ మాడ్చి చంపుటకు గాని చివ రకు కసాయివానికత్తికి గురిచేయుటకుగాని వా రంగీకరింప జాలరైరి.

ఈవ్యవహార మంతయు నెంతలజ్జాకరముగ సాగింపఁ బడెను? ఒక కుట్టుపనివాని గేదెలు మూడు తప్పిపోయెను. అతనికి భూమిలేదు. పన్ను చెల్లింప నవసరము లేదు. అతడు మూడురోజులు వెతికి చివరకు వాలడ్‌తాణాలో మరికొన్నింటితో నివి బంధింపబడినట్లు కనుగొనెను. అతడు మహాలుకర్రీని కలుసుకొని గేదెలను గురించి యడిగెను. "మేము రెండురోజులనుండి వీటిని జాగ్రత పెట్టితిమి. వీటిని పోషించినందుకైనఖర్చును మీరు చెల్లించి తోలుకొని పొండు" అని యతడు బదులు చెప్పెను. "అయ్యా! యిది చాలవింతగానున్నది. చేసినపనికి నాకు ముజరా యిచ్చుటకు బదులుగా మీరు నాకే వడ్డింపజూచుచున్నారు" ఆయుద్యోగి యతనితో వాదింపనోల్లక దయచేయ మని తలుపు చూపెను. "సరే! నే నాయెదుటనున్న తెల్లటోపీధరించినవాలంటీరుతో నాలోచించి మీకు తెలియచేసెదను." అని యాకుర్జి చెప్పి వెళ్ళిపోజొచ్చెను. వాలంటీరుపేరు చెప్పుటతోనే యాయుద్యోగి భయపడి దర్జీని వెనుకకు రమ్మని పిలిచి పశువులను తీసికొనిపొమ్మనెను. ఇటువంటి వనేకములుజరిగెను.

ఇచ్చట మరియొకయుదాహరణ మీయబడుచున్నది. అతిదరిద్రులను నిరపరాధులను కూడ నీదోపిడీగాండ్రు మెట్లు పిండిరో యతివినయవిధేయతలు కలవారుకూడ తననిజశక్తి నెట్లు గ్రహింపగలిగిరో యిది తెలియచేయుచున్నది. వాలం

లో నొకకుమ్మరివానితలుపు తీసి యుండగా మహల్కారీ పోలీసులతోను పఠానులతోను అందులోనికి దూరి యొక చిన్నపెట్టె, కుర్చీ కాన్పించగా పోలీసువారిని వాటిని పట్టుకొనమని యాజ్ఞాపించెను. ప్రేమియను యింటియజమానురాలు వారియుద్దేశ్యము నెరుంగదాయెను. "మీ రేమి చేయబోవుచున్నారు. నాకు భూమి లేదు. నే నేమియు చెల్లింపనక్కరలేదు. మీ రిచ్చటకు వచ్చుటకు కారణ మేమి? బయటకు పొండు!" అని యామె యఱచెను.

మునసబు—భూమి లేకేమి? నీవు రు 15-5-5 యివ్వవలెను. దీనిని చెల్లింపుము.

ప్రేమి—ఏమి మతిలేనివాచాలత! అయిదువత్సరములనుండి మాకు సెంటుభూమియైనను లేదు.

మునసబు—అట్లయినచో కేశవయువకునియొక్క యిల్లెక్కడ?

ప్రేమి—నే నెట్లు మీకు దానిని చెప్పగలను?

మహల్కారీ—అయితే యీయిల్లు యెవరిది? నీ భర్త పే రేవరు?

ప్రేమి—నేను మీకు యిదేమియు చెప్పను. నాకు భూమి లేదు. మీ రిచ్చోటును వెంటనే విడిచి పొండు?

మహల్కారీ—(తనమనుష్యులతో) మనము దొడ్డిగుమ్మమునుండి పారిపోదము.

"మీ రట్లు వెళ్ళరాదు" అని ప్రేమి కేక వేసి కు గా ర్డుతో దొడ్డితలుపు మూసివేయ మని చెప్పెను. అప కు వారు కోపముతో వెడలిపోయిరి. వెనుకటివాలడ్ గ్రావ వా సియగు పార్శీదుకాణదారు సేట్ దొరాబ్జీకథకు మరల స్తా ము. మహల్కారీ తనమనుష్యులతో వెళ్ళి కాపలావా సి తీసివేసి దుకాణమును యథాప్రకారముగా నడుపు న వలసిన దని దొరాబ్జీని యాజ్ఞాపించెను. జప్తు న సారాను తీసికొని పోవువరకు తా నట్లు చేయజాల నని యతడు చెప్పెను. అప్పుడు వారు దుకాణములోనున్న కొ న్ని కాళీపీపాలను జప్తుచేసి సారాను వాటిలోనికి నిం పా గిరి. వాటికి చిల్లులుండుటచే చాల సారా కారిపోయెను. ఈనష్ట మంతయు దొరాబ్జీకే కట్టిరి. తరువాత వారు కా పీపాలను సంపాదించి యొకబండిలో నీదోపిడీసొత్తును వేసి తీసికొనిపోయి తమయొద్దిలోనున్న మరియొకపార్శీదు కాణ దారుకు వేలములో గొకుండ రు 98 చిల్లర కమ్మివే రి. మూడు నెల లన్యాయశూన్యమైనపరిపాలనలో జప్తుచేయ బడి నయాస్తిలో నితనియాస్తి యొక్కటి మాత్రమే అమ్ముడ య్యె ను. ఈవిధముగా 2000 రూపాయిలవిలువగలసారాను కాని విలువలో నిరువదవవంతు కమ్మివేసి పైగా నతని రు 3( )00 విలువగలభూమిని రు 144-6-8 పన్ను బాకీయున్నదని చెప్పి చు ప్రభుత్వవశము చేసికొందు మని నోటీసు జారీచేసిరి. ఎం

తమాత్రిమును భయపడక ఆపార్శ్వీరుడు ప్రభుత్వోద్యోగులు సల్పినదుర్న్యయముల నన్నింటిని తెలుపుచు జప్తుచేయబడిన యాస్తి వివరములను, వసూలుచేయబడినరొఖమును తెలియ జేయవలసినదని డిప్యూటీకలెక్టరుకు మరియొకయుత్తరమును వ్రాసి యెంతటిభయము కాని, నిర్బంధములు కాని తనయొక్కయు తనతాలూకాయొక్కయు దృఢసంకల్పమును కదల్ప జాలవని స్పష్టపరచెను.

రవిశంకరు నిర్బంధింపబడెను. వెనువెంటనే బార్డోలీలో నున్నయనేకసంఘములను, ప్రయోజనములను నభేద్యమగు నట్లుగా నేకముచేసిన శ్రీయుతచినాయి నిర్బంధింపబడెను. శిక్షాస్మృతి 186, 189 సెక్షనులక్రింద నితనికి మమ్లతుదారును తనప్రజాధర్మమును నెరవేర్చుచుండ నాటంకపరచె ననియు, పెట్టియానులను సాంఘికబహిష్కారముతో భయపెట్టె ననియు కేవల మొకబూటకపుసాక్ష్యముపైన మొదటిసెక్షనుకు రెండుమాసములయిరవైరోజులు కఠినశిక్షయు, రెండవదానికి 6 మాసములు కఠినశిక్షయు వేసిరి.

వీరితరువాత వాలడ్ వాసియగు శ్రీయుతషణ్ముఖలాల్ అనునొకప్రముఖునివంతు వచ్చెను. ఇతడే వాలడ్‌నొక యభేద్యమైనకోటగా తయారుచేసెను. డాక్టరు చందూలాల్, ఫూల్‌చందుమొదలగువా రచ్చటనే యుండిరి. గాని షణ్ముఖలాల్ లేనిదే వా రంతకార్యమును నిర్వహింప జాలరు. సమ

రముఖమున నిలబడి సమస్తమును భరించుచు తనసంఘము ం
తను (బనియాలు) కూడగట్టిన దీతడే! అందరిలోను బహు చి
న్నవాడైనను అతిపూజ్యుడు. వృద్ధు లందరును యీర్ష్య ంక
తగినట్టి పలుకుబడి నితడు తాలూకాలో సంపాదించెను. ! క
నితో కూడ కథియవాడ్ వాసులగు శివానందు, అమృతలా ల
లిరువురును అధికారులను నిరోధించుట ఆటంకములు మొ ద
లగు నితరములు చేసి రనునేరములకై తీసికొనిరాబడిరి. వీ ం
దరిని సాగనంపుటకు చేయబడినప్రత్యేకసభకు హాజరగు ట
కు నేను వాలడ్ వెళ్ళితిని. ఈసభ నే నిదివర కచ్చట చూ చి
నవాటికంటె చాలపెద్దది; సభ జరిగినగంటన్నరకాలములో సు
చీమచిటుక్కు మనలేదు. అంతయు నిశ్శబ్దముగా నుండెను.
కథియవాడుసేవకు లిద్దరే నిర్బంధింపబడినచో తాను వాల
రాకపోయియుండెడివాడ ననియు వాలడ్ వాసులలో గౌర వ
నీయుడును, ప్రధానసేవకుడును, తాలూకాలో నీవిధమైన గౌ
రవమును పొందినవారిలో ప్రథముడును, అగుషణ్ముఖలా
లును గౌరవించుటకే తా నచ్చటకు వచ్చితి ననియు వ
భాయి చెప్పెను. షణ్ముఖలాలుయొక్క వృద్ధురాలగుమాత
తనకుమారుని తాలూకాకు ప్రథమకబళముగా సమర్పించి
నని గర్వించుచుండెను.

రవిశంకరు, చినాయిగార్ల యుపన్యాసముల నిం
పొందుపరచ నక్కరలేదు. వా రారితేరినయోధులు. కను

వారి కీనిర్బంధములు నిత్యకృత్యము లైపోయినవి. షణ్ముఖ లాల్ భోగముల ననుభవించుచుండినకుటుంబములో పుట్టెను అతనికిని తల్లికిని జయలుకు పోవుట క్రొత్తవిషయము. కాని నిరాడంబరుడైనయీయువకుడు తనవ్యవసాయము వర్తకము సాగించుకొనుటకు తగినవిద్యాబుద్ధులు నేర్చెను. అతడు సత్య పూరితము, పౌరుషవంతము నగు యీక్రిందియుపన్యాసము నిచ్చెను. "ఈతాలూకాకంతకును జయిలుకు పంపుటకు ప్రథమునిగా నన్నే యెన్నుకొనినందుకు నే నెంతయు గర్వించు చున్నాను. నాపై 189 వ సెక్షనుక్రింద ఛార్జి తీసికొనిరాబడి నను నే నెంతమాత్రమును దోషిని కా ననువిషయమే నాసంతోషమును మరింత యినుమడింప చేయుచున్నది. నేను హానిచేసెద నని యెవరిని భయపెట్టి యుండలేదు; అది నాతత్త్వములోనే లేదు. నాస్నేహితులును బంధువులును న్యాయవాదులను పెట్టి వాదించమని నన్ను బలవంతపెట్టు చున్నారు. నన్ను శిక్షింపదలచుకొనినమేజిస్ట్రేటును నూరు మందిన్యాయవాదులైనను కదల్పజాల రని నేను వారికి మనవి చేయుచున్నాను. నాకు కలిగినయీగౌరవమును, నాపై విధింపబడునెట్టిశిక్షనైనను నేను మహానందముతో స్వీకరింప నున్నపుడు నే నెందుకు వాదించుకొనవలెను? ఈమెత్తని బనియా తనతాలూకా కెట్టియపకీర్తిని తీసికొని రా డని తాలూకాకును ప్రభుత్వమునకును గూడ నెలుగెత్తి చాటు

చున్నాడు. దినదిన ప్రవర్ధమాన మగుచున్న యీసమరము లసమరములో నిక నేను ప్రాణ్గానజాల నను విచార మొక్క టియే నన్ను బాధించుచున్నది. నాభోగజీవితము కారాగా రకష్టముల ననుభవింపజాల దని మాబంధువుల భయము. భగవన్నామసంకీర్తనము చేసికొనుచు నేను పోవుచున్నా నని యు నాకు రాబోవు విపత్పరంపరల నన్నిటిని యతడే తరింప చేయగలడనియు వారి కభయహస్తము నిచ్చుచున్నాను.

న్యాయ, సత్యములకొరకు గావింపబడుచున్న ంగా సమరములో వాలడ్ అగ్రస్థానము నలంకరించినందులకు నే నెంతయు సంతసించుచున్నాను. సోదరసోదరీమణులారా! ఈధర్మయుద్ధమును సాగించి నిరంతరసత్యాగ్రహాప్రవాహ మును జయిలుకు పంపవలె నని మిమ్ము కోరుచున్నాను. మనల నెప్పుడును విభజింపవలె ననియే చూచుచుండు నీ ప్రభుత్వపుమాయలలో చిక్కకుడు. మీయాస్తులను మీ మా ములను మీసమస్తమును పోగొట్టుకొనుడు! కాని మహానా యకునిమాత్రి మొక్కనిమునమైనను విడనాడకుడు. ఇంక ముందు రానున్నయగ్నిపరీక్షలో నారితేరుటకు తగిన బల మును భగవంతుడు మనకు ప్రసాదించుగాక!''

ఈధీరత్వమును మరునాడు జరిపింపబడిన నాటకమందు చూడుడు! ప్రభుత్వసేవకునికి హాని చేసెద నని భయపెట్టె నని షణ్ముఖలాల్‌పై కేసు పెట్టిరి. కాని ప్రధానసాక్షియైన

మునసబు మణ్కుఖలాల్ యొక్క బెదరింపులకు గాక తనపై యుద్యోగస్థు లీకేసులో తమ కనుకూలముగా సాక్ష్యము చెప్పనిచో నుద్యోగమును పీకివేసెద మని చేయుచున్న ధాముధూములకే వడకుచుండెను. ప్రాసిక్యూటరుగారు యీ సాక్షినోటిలోను తరువాత వచ్చిన సాక్షులనోళ్ళలోను మాటలను, వాక్యములను కుక్కుచుండగా మేజిస్ట్రేటుగారే చివరకు సాక్షులనే మాట్లాడనీయవలసిన దనియు వారి తరఫున తాను జవాబుల నీయరా దనియు ననేకపర్యాయములు వీరిని మందలింపవలసి వచ్చెను. ఈనాటకానంతరము మణ్కుఖలాల్ కు 6 నెలలును, శివానందు అమృతలాలులకు 9 నెలలచొప్పనను కఠినశిక్ష విధించిరి. ఆహా! ఒకనేరముకు రెండు సెక్షనులక్రింద రెండువరుసశిక్షలు! ఇది మే 15 వ తేదీని జరిగెను.

---

# బార్డోలీ విజయము.

## పదునేడవ యధ్యాయము.

" న్యాయశూన్యమైన పరిపాలన—3. "

"నేను మీకు శ్రమ, కష్టములు, యుద్ధములు మొద లగువాని నెన్నింటినో వాగ్దానము చేసెదను. కాని మనము జయింపవలెను. లేదా రణరంగములో చావవలెను."

'గారిబాల్డీ'

భూములను ప్రభుత్వవశము చేసికొందు మని యిచ్చిన నోటీసులు యిప్పటికి 1500 మించెను. ప్రతిదినము న్యాయ విరుద్ధములైనపనులు జరుపబడుచునే యుండెను. వాటినన్నింటిని యేకరుపెట్టుట యసాధ్యము. కనుక మచ్చుకు కొన్ని చూపెదను.

ఒకగ్రామములోని యొకయింటి పెరటిదొడ్డిలోనికి నొకకైస్త్రవజపుఆఫీసరు దుమికెను. ఆయింటియజమాని వృద్ధురాలైన యొకవితంతువు. ఆమె తనకున్నకొద్దిభూమి నతివరకే దానము చేసివేసెను. మునసబు దానపత్రి మింకను రిజిష్టరు కా లేదనియు భూమి యామెపేరనే యున్నదనియు చెప్పి యామె నాలుగురూపాయిలు బాకీ యున్నదని 00

రూపాయిలగేదెను పట్టుకొని పన్ను చెల్లించినచో దానిని విడిచివేసెద ననెను. ఆమె గేదెను పోగొట్టుకొనెను. కాని పన్ను చెల్లింపలేదు.

ఒకరోడ్డుదగ్గిరనున్న యొకదొడ్డిలో నొకబండి యుండెను. జప్తుఆఫీసరు దానిని చూచి తనపఠానుసిపాయిని కంచెదూకి దొడ్డిలోనికి పొ మ్మనెను. కాని బండిని తీసుకొని వచ్చు టెట్లు? అచ్చట గ్రామపెత్తందారు కాని మరెవరు కాని లేరు. ఆబండి నిక నేమిచేయవలెనో వారికితోచలేదు. "ఈబండిని పెత్తందారు తనవద్దిలోనుంచుకొనవలెను. తాము దీనికి బాధ్యులగుదు రని యందరును తెలిసికొందురుగాక" అని యుద్యోగస్థుడును పఠానులును గాలిలో చప్పట్లు కొట్టుకొనుచు నచ్చోటు వీడి పలాయను లైరి.

ప్రభుత్వనౌకరు లన్యాయవిరుద్ధప్రవర్తనమే తనకు పేరు తెప్పించిన సేట్‌పీర్చందుభూములను ప్రభుత్వవశము చేసికొంటి మని ప్రకటించుటతో వా రతనిని విడిచిపెట్టక నత నిగుజ్జములను కూడ జప్తు చేసిరి. ఒకనాటియుదయమున నొకజప్తుఆఫీసరు పాడుపడియున్నయతనియింటిలోని యొకభాగములోనికి జొరబడి రేకుతో కట్టినగదిని యూడబెరికి దొడ్డిలోనికి పోయి గిన్నెలు, బిందెలు, పాత్రిసామగ్రి, ధాన్యము మొదలగువాటిని (న్యాయముప్రకారము జప్తు చేయకూడని వాటిని) జప్తు చేసెను.

ఒకనాటియుదయమున 6 గంటలకు బరోడారాష్ట్రము లోని పిసాడ్‌గ్రామవాసులగు నిద్దరుపాటిదారుకులస్థులు బార్డోలీలో 4 గేదెలను దూడలను కొని తమగ్రామము పోవుచుండిరి. కొంతమంది పఠానులును, సాయుధులగుపోలీసువారును నొకచోట పొంచియుండి వాటిని చూచినతక్షణమే మీదపడి యాజంతువులను పట్టుకొనిరి. ఆయజమానులు తాము బరోడాసంస్థానప్రజల మనియు ప్రభుత్వమువారికి శిస్తు మివ్వవలసిన దేమియు లేదనియు చెప్పిరి. "పోండి! మస్తేదారుతో చెప్పుకొనండి" అని జప్తుఆఫీసరు వారికి బదులు చెప్పెను. పాపము వారు తిరిగి బార్డోలీ వెళ్ళిరి; కాని మస్తేదారు అచ్చట లేడు. వారు తిరిగి జప్తుఆఫీసరుదగ్గరకు రాగా నతడు వారిని మరల యచ్చటకే పొమ్మనెను. వారు తిరిగి బార్డోలీ వెళ్ళిరి. చాలయాలస్యము చేసిన తరువాత నీ మహాయుద్యోగస్థుడు వారియర్జీని తీసికొని జప్తుఅఫీసరుకు వ్రాతమూలకముగా తెలుపుకొనమనెను. తలుపులను పగుల గొట్టి యిండ్లలో ప్రవేశించినయుదాహరణములు కొన్ని యీక్రింద నుదహరింపబడుచున్నవి.

ఒక జప్తుఉద్యోగస్థుడు తనపరివారముతో డెలాడ్ లో నున్నయొకయింటిదొడ్డిలో ప్రవేశించి తలుపు గడియను తీసివేసి యింటిలోనికి దూరెను. చివర కాయింటియజమాని వ్యవసాయదారు కాకపోగా వారు వెడలిపోయిరి.

ఈయుద్యోగస్థుడే యొకయింటితలుపుల నుతకమొత్తి తీసి యింట్లో ప్రవేశించి యొకకాళ్ళ బల్లను, గిన్నెలను, పాత్రలను యజమాని లేనిసమయమున తీసికొనిపోయెను.

ఒక వెర్రియుత్సాహముగల జప్తుఉద్యోగియు నతని పరివారమును తాళముచెవులగుత్తియొకటి తీసికొని బయలు దేరిరి. దానిలోనితాళముచెవితో వారొకయింటితాళమును తీసి యింట్లో ప్రవేశించి యొకగేదెను తోలుకొని పోయిరి.

ఇట్లనేకయుదాహరణముల నీయవచ్చును. ఒకజప్తు ఆఫీసరు తనపఠానుపరివారముతో తెల్లవారకమునుపే మాఢీ యనుగ్రామము వెళ్లెను. ఒకపఠాను యొకయింటిలోని పెర టిదొడ్డిలో ప్రవేశించి యింటిలో చొరబడుటకు ప్రయత్నిం చుచుండ యజమానునిభార్య యింటిలోనికి పరుగెత్తి తలుపు మూసివేయుచుండెను. పఠాను ఆమెను వెంటాడించి తలుపు గెంట యామె తిరిగి వేయుచుండగా నామెచేయిపట్టుకొని పయికి లాగి అయిదుపశువులను జప్తుచేసెను.

ఈఘోరము జరిగినరంగమునందే యున్నమణిలాల్ కొఠారి యాస్త్రీయొక్క వాఙ్మూలమును తీసికొని ప్రచురిం చినతోడనే తాలూకాయంతయు దేశమంతయు నీదుర్భర వార్తతో ప్రతిధ్వనింపసాగెను.

ఈపశువులను కసాయివాండ్రకును పైనుంచి తీసికొని వచ్చిన చిల్లిగవ్వ విలువచేయనివారికిని యతిస్వల్పవిలువ కిచ్చి

వేయుట; కొనువారు లేకపోవుటచే చరాస్తిని పఠానులకు పోలీసులకు, బంట్రోతులకు నామమాత్రపువిలువకు ఇచ్చివేయుట; కొన్నికేసులలో వీరిని బహిరంగముగా పాడి కొనవిచ్చుట; వీరికొరకు వేలము వేయువారు తరుచు ఖర్చులు చేయుచుండుట; నెలకు రు 150 మొదలు రెండువందలవరకును జీతము పుచ్చుకొనుజపుఆఫీసరులే పోలీసులతోను, డబ్బిచ్చితెచ్చిన పఠానులతోను పగళ్ళందే కాక రాత్రులందుకూడ ఛోఛో యని యీపశువులను తోలుకొనుచ పోవుచుండుట !—ఆహా ! యేమి దృశ్యము !

"వాటియెడమవైపున పఠానులు
వాటికుడివైపున పఠానులు
వాటిముందర పఠానులు
వాటితోకల నంటి పోలీసులు
దున్నపోతులపటాల మిట్లు తరలిపోయెను."

పఠాను పైనుదహరింపబడినదౌర్జన్యమును జరిపినకాలమందే వాంకనరులో 19 మంది దొమ్మిచేసిరి; ఆటంకపరచిరి యను నెపముమీద నిర్బంధింపబడిరి. కొంతమంది జామీను మీదవిడుదలైరి. కాని కొందరు నిరాకరించిరి.

వాంకనరులో మహామ్మదీయులను చీలదీయుటకు ప్రయత్నించుచుండిన ముసల్మానుముల్లతుదారు కొంతవరకు సఫ

లత నొందెను. వారిలో కొంతమంది పన్ను చెల్లించిరి. కాని వీ రెవరును సత్యాగ్రహపత్రముపై సంతకము చేయలేదు. మోతాలో నుద్యోగస్తులు సంతకములుచేసినకొంతమంది భూస్వాములనే చీలదీసిరి.

ఈదిష్టిపిడతలవలన యుద్యమము క్షీణింపక దినదినాభివృద్ధిని, బలమును చేకూర్చుకొనుచుండెను. చిన్నపిల్లలుకూడ నీసంగ్రామతత్త్వము నెట్లు గ్రహింపగలిగిరో మలిక్పూరు మొదలగుగ్రామములలోని సభలవలన మనకు రుజువగుచున్నది. పదమూడేండ్లవయసుగల మొరార్బాయిభికాభాయియొక్క కుమార్తె సర్దారు నాహ్వానము చేసి యాగ్రామస్త్రీలతరఫున రు 41 యిచ్చి తేనెలొలుకుపలుకులతో నిట్లు మాట్లాడెను. "మాడివిజనుకు చెందినపెద్ద (రవిశంకరు) జయిలుకు పంపబడినను మాగ్రామ మచంచలముగానే యున్నది. ఈగ్రామసోదరీమణులతరఫున మీరీచిన్న మొత్తమును తీసికొన ప్రార్థించుచున్నాను. నేడు మాగ్రామములో భూములను ప్రభుత్వవశము చేసికొందు మనుయనేకనోటీసు లంటించబడెను. మేము దీని కెంతయు సంతోషించుచున్నాము. మొట్టమొదటియవకాశము దొరకగానే జయిలుకు వెళ్ళవలసినదని నేను నాసోదరియు మాతండ్రిగారితో చెప్పియుంటిమి. అతడు లేనిసమయమున మేమే పొలములను దున్నెద మని మే మతని కభయహస్తము నిచ్చితిమి."

ఒకవంక శ్రీయుతవల్లభాయియొక్క యుపన్యాస పరంపరలు రైతులహృదయకుహరముల నాక్రమించి రైత లోకము నాకర్షించుచుండెను. చుట్టుపక్కలతాలూకాలలో నున్న రైతులును, బరోడారాజ్యములోనివారును సర్దారుగారియొక్క యుపన్యాసములను వినుటకు బార్డోలీలోని గ్రామములకు వచ్చి మూగుచుండిరి. ఒకచోట సర్దారు యిట్లు చెప్పెను. "మనమనుష్యులద్వారా ప్రభుత్వమువారు తాలూకాలో చల్లగలుగునంతవిషమును వెదజల్లవలెనని సర్వవిధముల పని చేయుచున్నారు. ఈమనుష్యులు మనవారే! కాని వారు వీరి నొకకంటితో చూడవలెను. రాత్రిలందు దొంగలవలె మనసంఘములో చీలికలను కలుగచేయవలెనని వీరు యత్నించుచున్నారు. వీ రెల్లపుడును మనమర్మములకొరకే వెదకుచున్నారు. వీరు వాటిపైననే వృద్ధిచెందుచున్నారు. త్రాగుబోతు మనలోనున్న త్రాగుబోతులను త్రాగుడుతో మభ్యపెట్టును. దుండగీండ్రు మనలోనున్నపిరికివారిని యనేకవిధముల భయపెట్టుచుందురు. వీరియసత్యములను వీరిని జ్ఞప్తియందు చుకొనుడు. వీరిని కొన్నిమైళ్ళదూరములో నుంచుడు. ఒకవేళ మీలో కొద్దిమంది చెదరిపోయినను భయపడకుడు; నీ గాంధిశ్చయమును జారవిడువకుడు. విజయభేరి మ్రోగించిన కటకాలములోగూడ చనిపోయినవారు, పారిపోయినవారు నుండుట లేదా ? ఇట్టిదిక్కిపిడతలు మీకు కాన్పించినచో వినాలోని

కల్మకము, కుర్రిళ్ళు పోయిన దనుకొనుడు. ప్రభుత్వమువారిని మీ భూములు తీసికొనవలసినదనియు, చేతనైనచో వాటిని యింగ్లండు తీసికొని పోవలసినదనియు సవాలుచేయుడు. తాలూకానంతను వాయువిమానములతోను, మరఫిరంగులతోను నింపివేయ మని సవాలు చేయుడు. వారి నెదుర్చుటకు మన కాయుధబలము లేదు; కాని మనకంతకంటె పవిత్రమైనట్టియు శ్రేష్ఠమైనట్టియు ధర్మబలము ప్రతిజ్ఞాబలము కలవని వా రెరుగుదురుగాక ?" "వారు మీ పశువులను యితరఆస్తులను తీసికొనిపోవచ్చును; కాని మీయాత్మలను స్పృశింపజాలరు. సర్వమును దిగమింగవలె ననెడికాంక్ష మంచిది కాదు. మానవున కెంతభూమి కావలెను? ముసల్మానులకు రెండు స్నరమూరలు చాలును; హిందువుల కంతేభూమి రెండుగంటలుమాత్రమే కావలెను. ఎక్కడ ధర్మముండునో అచ్చట భగవంతు డున్నాడు." సర్దారు యిట్లుపన్యసించుచుండగా సమీపముననున్న ఠాణాదొడ్డిలో పెట్టబడినదున్నపోతుల యఱపు లతనికి వినవచ్చెను. వెంటనే యతడు ప్రభుత్వరిపోర్టరుల నిట్లు హెచ్చరించెను. "రిపోర్టరులారా! మీ రాధ్వనిని మీరికార్డులలో నెక్కించుకొనుడు. దున్నపోతులు నూట్లాడుచున్నవి. న్యాయసూత్రములపై స్థాపింపబడినప్రభుత్వము ను డప్పులు తిరగదోయు నని ప్రభుత్వమువా రనుకొనిరి. వాటికంటె హెచ్చుగా నఱచుచున్న యీదున్నపోతులు మ

రింత చెడ్డవని మీకు మనవి చేయుచున్నాను. మీకింకన తెలియనిచో న్యాయధర్మము లీసామ్రాజ్యములో నంతరించి పోయిన వని మీకు చెప్పుటకే యవి యంతగట్టిగా నఱచు చున్నవి." "మీలో నెవరికేని పొరపాటుఅభిప్రాయము లున్నను లేక నిర్బంధాగ్నికి భయపడువారు మీలోనున్నను వారు పెందలకడనే తీర్థయాత్రలకు గాని, పర్వతసీమలకు లేక సముద్రప్రాంతములకు గాని పోవుట మంచిది. ఒక్కవిషయ మును మీరు గ్రహించవలెను. చైత్రవైశాఖములలోని రోహిణీకార్తె యెండదెబ్బలను మీరు చవి చూచినతరువాతనే వర్షగర్భితము లగుకారుమబ్బులు మీకన్నుల కానందమును గలిగించుచున్న వని వ్యవసాయదారులగు మీకు వేరుగ చెప్పనక్కర లేదు. మేఘములు, ఉరుములు, పిడుగులు, తుపానులు మొదలగు భయానకాట్టహాస మంతయు జరిగినతరువాతనే యమృతసమములగు వర్షధారలు పడుచున్నవి. అట్లే ప్రభుత్వమువారును మిమ్ము అగ్నిపరీక్షకు పాలుచేసినగాని మీకు న్యాయధర్మములను కలిగించరు. వారు మిమ్ము స్తోత్రపాఠములతో నుబ్బించ జూతురు. మీరు వీటి నెదుర్కొనినచో మీపై వారియినుపముష్టిని ప్రయోగింతురు. ప్రభుత్వ సమస్య కొన్నిలక్షలరూపాయిలభూమిపన్నును నష్టపోవుటమాత్రమే కాదు. కావలసినచో వారు నిరంకుశముగా పన్ను విధించి నేడొకకోటిరూపాయిలను వసూలు చేయవచ్చును.

కాని మన మనమే జయించినచో రేపు హిందూదేశమంతయు బార్డోలీ చేసినట్లే చేయవచ్చు నని వారిభయము. ఇందులో సత్యమెంతేని కలదు. కనుక మీరుకూడ మీ యొక్క రక్షొరకే గాక హిందూదేశమంతటిగౌరవముకొరకును ప్రాతినిధ్యమును వహించుచున్నట్లు గుర్తింతురుగాక! నిర్బంధములు హెచ్చినకొలది ప్రజలసైర్యము యినుమడించుచుండెను. వారిలో కొందరు ప్రభుత్వోద్యోగస్తుల ప్రయత్నములను భంగపరచుటకు త్రోవలో ముళ్ళకంచెలు, గసిగెలు, మేకులు మొదలగునవి కొట్టి మార్గావరోధమును కల్పింపనెంచిరి. సర్దారు యిట్టికృత్యములను మనసా, వాచా యెన్నడును ప్రోత్సహింపలేదు. అత డిట్లు చెప్పెను. "ఎప్పుడైనను దౌర్జన్యము పొడచూపినచో మొదట యెగరవలసినది నాతల యనియే నేను కలెక్టరును నమ్మించగోరుచున్నాను. ఈసమరము దౌర్జన్యరహితమైన దనియు, నిందులో మీ రంతకంతకు ప్రశాంతబలమును సంపాదింతు రనియు, మరలమరల వేయవసారి చాటుచున్నాను. మందస్మితకాంతులతో మీరు మృత్యువు నాలింగనము చేయవలయుననే కాని యొక్కరక్తపుచుక్కనైనను స్రవింపచేయరాదని మీకు బోధించుటకే నేను వచ్చితిని. ఇంతకును మీకు బుద్ధులు గఱపుటకు నే నెవడను? ఈ పాఠమును ముందర మీరే నేర్చిరి. తరువాత నేను నేర్చుకొంటిని. భారతదేశము కహింసామంత్రమును తొలుత బోధించిన

వానిధ్వజముక్రిందదక్షిణాఫ్రికాలో పోరునట్టిభాగ్యము మీలో కొందరికి లభించెను. కనుక మీరు ప్రాతవిద్యార్థులు; నేను నిన్నమొన్నటివాడను, నేను మీకు క్రొత్తపాఠమును దేనిని బోధింపజాలను." "నే నీ తాలూకాలోని శాంతికి బాధ్యుడనైన కాపలామనిషి నని సవినయముగా చెప్పుకొను చున్నాను. తనప్రశాంతశబర్మతీపవిత్రసలిలములనుండి యుద్యమమును పరీక్షించుచున్నవానికి నేను బాధ్యుడ నని భావించుచున్నాను. నే నన్నింటికంటెను అతనిపేరును అతనికార్యమును నెక్కుడుగా మన్నింతును. ఒక్కచిన్నప్రమాదముచే గాని, పొరపాటుచే గాని నే నట్టినామమును, కార్యమును మలిన మొనరింప జాలను."

# బార్డోలీ విజయము.



## పదునెనిమిదవయధ్యాయము.



“ ఒకకమీషనరుయొక్క పిచ్చియెత్తులు. ”

“ ఒక తీక్ష్ణమైనగ్రుద్దుకంటె నొక చిన్నతలవెంట్రుక నిరంతరముగా సలుపుచుండుటచే నెక్కుడుబాధ కరముగా నుండును.” “ లవెల్ ”

చరాస్తి జప్తులు, స్థిరాస్థిని లాగుకొనుట మొదలగు క్రియలందు యథేచ్ఛగా సంచరించుటతో తృప్తిచెందక రెవిన్యూయుద్యోగులు బార్డోలీలో నితరశాఖలద్వారా నిర్బంధములను సాగించిరి. వ్యవసాయశాఖ, ఆబ్కారీశాఖవారికి యుపకరణములుగా దొరికెను. చాలకేసులలో సారాలైసెన్సులకొరకు కట్టినసొమ్ము భూమిపన్నుక్రింద జమకట్టుకొనబడెను. సేట్ దొరాబ్జీని పెట్టినబాధలన్నియు నాబ్కారీయుద్యోగస్తులద్వారానే జరిగెను. వ్యవసాయశాఖకూడ నెట్లు తోడ్పడెనో చూడవలసియున్నది. తాలూకాలోని కొంతమంది వ్యవసాయదారులు వ్యవసాయశాఖలవారివద్ద పత్తివిత్తులు బదులు తీసికొని తమపత్తిని వారిద్వారానే అమ్ముచుందురు. వ్యవసాయదారులు అమ్మకొనుటకు తెచ్చినపత్తిని వ్యవసా

ంశాఖవద్ద దాచుకొనెడివారు. ఈవిధముగా వ్యవసాయశా
వారి నమ్మకముక్రింద దాచుకొనబడిన పత్తిబేళ్లనుకొన్నిం
ంవి మన్లుతుదారు జపుచేసెను. ఈపత్తి బేళ్ళను అమ్మగా
చ్చిన 73,000 రూపాయిలను వాటియజమాను లనుకొనిన
గా రీయవలసిన రెవిన్యూబాకీక్రింద జమకట్టవలసిన దనివ్యవ
సాయశాఖడైరెక్టరుగారి నాజ్ఞాపించిరి. డైరెక్టరు యీవిధము
గా కీలుబొమ్మక్రింద నాడింపబడుట కిచ్ఛగింపక నిట్టి నమ్మిక
స్వామిద్రోహము చేయజాలనని తిరస్కరించెను. కాని లాభ
ము లేకపోయెను. చాలకేసులలో నాయుధములైసెన్సు
లును, ఆయుధములును లాగుకొనబడెను. పింఛనుదారుల
పింఛనుహక్కులను లాగివేతు మని భయపెట్టిరి.

కమిషనరు పాప మొకముసలిసూరతుడాక్టరును ప
ట్టుకొనెను. ఇతడు సదభిప్రాయములు కలవాడు; కొంతసాం
ఘికసేవ చేసినవాడు. ఇతనిని కమిషనరు యెట్లు బుట్టలో
వేసికొనెనో మనము చెప్పజాలము. కాని యితనిదయాంతః
కరణము నతడు తనపనికి వినియోగించుకొనెను. అతడు యిత
నిచేత తన కొకయుత్తరమును, పత్రికల కొకవ్యాసమును
వ్రాయించెను. మొదటిదానిలో తా నిట్టిక్లిష్టపరిస్థితులలో
తన కెట్లు సాయపడగలడో తెలుపవలె ననియు రెండవదాని
లో బార్డోలీరైతులు మొదట పన్నులను చెల్లించి తరువాత
చట్టబద్ధమైన యాందోళన జరుపవలె ననియు, నితడువ్రాసె

ను. ఈయుత్తరములను గూర్చి మనము చర్చింప నవసరము లేదు. కాని వీటి నితడు తనంతతాను వ్రాయలేదని తెలిసికొనిన చాలును. కాని కమీషనరు జాబునుమాత్రము పరీక్షింపవలసి యున్నది. ఇది స్వల్పవిషయమే యైనను స్వల్పములే యొకొక్కప్పుడు కొంపలు త్రిప్పుచుండును. 'తీవ్రమైనదెబ్బకంటె తలవెంట్రుకసలుపే యెక్కువ బాధకరముగా నుండును' అని లవెల్ వ్రాసినట్లు యీకమీషనరుఉత్తరమే బార్డోలీసమస్యను యావద్భారతసమస్యగా మార్చివేసి జాతియొక్కదృష్టినంతను దీనిపైకి మరల్పగలిగెను. ఆయుత్తరమీవిధముగా నున్నది.

మకాం సూరతు, మే, 1928.

"ప్రియమైన డాక్టరు ఎడల్ బ్రెహాంగారికి,

మీయుత్తరము కనేకవందనములు. మీరు వ్రాసిన వ్యాసములు మీజీవితము నంతను దరిద్రులగు కుష్ఠురోగుల కొరకే యర్పింప మిమ్ము ప్రోత్సహించిన మీసదయహృదయమువలననే ప్రేరేపింపబడెను గాని యేప్రభుత్వోద్యోగి వలనను కాదని నేను గట్టిగా నమ్ముచున్నాను.

ప్రభుత్వబాకీలను వసూలు చేయుటకు కఠినపద్ధతుల నవలంబించుటకుపూర్వము కైరానుంచి వచ్చిన యాందోళనపరులను తమయుద్యమమును మానుకొనవలసిన దని నాశక్తికొలది ప్రోత్సహించితిని. గూఢచారు లనుమానించుచుం

ంట, ప్రజలు గుమిగూడి మూకగా చేరుచుండుట మొదల
ఎ నితరయవమానము వలన ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వ
ముువారివాదము బార్డోలీప్రజలముందు పెట్టజాలకపోయిరి.
రిదగ్గరకు వెళ్ళినవారి నందరను యనుమానించి సాంఘిక
బహిష్కరణముతో భయపెట్టుచుండిరి. శాసనసభలో ప్రభు
త్వమువారు చేసినవాదముకు ప్రజలచెవులు తాళము వేయ
బడెను. ఆవాదమునుబట్టి శాసనసభలో ప్రవేశపెట్టిన విశ్వా
సరాహిత్యతీర్మానమోడింపబడెను.

'బీదలగు వ్యవసాయదారులమీాద పడి జీవించుచు
వారిని తప్పుడుమార్గముల నడిపించుచున్న యాందోళనప
రుల గుంపువలన వ్యవసాయదారులు నాశమై పోకుండ నుం
డవలె నని నాకున్నవిచారము మరెవ్వరికిని లేదు. తాలూ
కాయంతటను మహాలులోను కట్టబడిన అదనపుపన్నును చె
ల్లింపమను ప్రయత్నమును మానినచో నేగ్రామమైననుతప్పు
వర్గములో చేర్చబడె నని చెప్పుటకు తగినకారణము లున్న
చో నేను తగిన విచారణను చేయింతు నని భీమభాయినా
యిక్ గారికి విశదపరచి యుంటిని.

రెవిన్యూబాకీని వసూలు చేయుటకు ప్రభుత్వము
వారు సాధ్యమైనప్రతిపద్ధతిని యవలంబింపక మానరు. చట్ట
బద్ధముగా ప్రవేశపెట్టబడిన ప్రతిక్రొత్తసెటిల్మెంటును
యిన్లే సవాలు చేయుచుందురు. 1918 లో కైరాజిల్లాలో

పన్నులనిరాకరణమును సాగించిన యాందోళనపరులే నేడు బార్డోలీలోను నదేపద్ధతులమీాద పన్నుల నియ్యగోరువారిని సంఘ బహిష్కరణము, వెలివేయుట, జుల్మానాలు మొదలగు తర్జనభర్జనములతో వారించుచున్నారు.

ఈయాందోళనపరులు కైరాజిల్లాలోని యయిదుతాలూకాలనుండి వచ్చుచున్నారు. వరదలవలన నచ్చట రెండువత్సరములవరకును క్రొత్తసెటిల్మెంటులు ఆపివేయబడెను. గతయేడెనిమిదిమాసములలోను కైరాజిల్లాలో వరదలనష్టపరిహారముకుగాను ప్రభుత్వమువారు సుమారు 50 లక్షలు పెట్టుబడి పెట్టి యున్నారు. బార్డోలీలో వారు జయించినచో కైరాజిల్లాలో ప్రభుత్వపన్ను, టకావివసూలగుట దుర్ఘటమగును. మీారీయుత్తరము నేపనికైనను యుపయోగించుకొనవచ్చును. నేను వ్రాసినదానిలో రహస్యము లేవియు లేవు. ఇవి యందరకును తెలిసినయథార్థవిషయములు."

మీాశ్రిద్ధావయుడు,
డబ్ల్యూ, డబ్ల్యూ, స్మార్టు."

స్మార్టుగారు యీవిధముగా వల్లభాయిపటేలుగారిమీాద నేరియేరి కురిపించినవిశేషణముల కత డాగ్రహము నొందలేదు. కొద్దిరోజులక్రిందటనే స్మార్టుగారతనికి వ్రాసిన లేఖలో "ప్రత్యేకస్నేహితుడు" అని యతనిని వర్ణించి యుండెను. 10 వత్సరములక్రిందట ఖేడాజిల్లాలో ప్రభుత్వముతరఫున

ఎంతకంటె నెక్కువగా పోవు సాగించిన డివిజనల్ కమీషన రైన పేటు గాంధిగారిని 'స్నేహితుడు' అనియు 'అకళంక మైన పవిత్రజీవియనియు, శ్రీయుతవల్లభాయిని "మెహర్బాన్ వల్లభాయిసాహేబు" అనియు వర్ణించి యుండెను. తనయెదిరిని బూతులతో తప్ప మరొకవిధముగా తలపెట్టుట యసంభవ మని స్మార్టుగారు భావించి యుండవచ్చును. ఇంతకును శ్రీయుతవల్లభాయికి స్మార్టుగారి కున్నసంస్కారముతో పోట్లాడ నవసరము లేదు. కాని ఆయుత్తరములో నున్నపచ్చి యబద్ధముల నన్నిటిని యతడు బయటపెట్టెను. ఇంతవరకు నుబార్డోలీని చూచుటకైనను, తీరికను చేకూర్చుకొనజాలని కమీషనరు "గూఢచారు లనుమానించుచుండుట, మూక లుమూకలుగా ప్రజలు వచ్చి మీదపడుచుండుట మొద లగు నవమానములచే ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వవాద మును బార్డోలీప్రజలకు తెలుపజాలక పోయిరి. అని యనుటకు సాహసించుట నేమనవలెను ? కమీషనరుగా రుపన్యసించునెడల బార్డోలీలోని 17,000 వ్యవసాయదా రులను తాను హాజరు పెట్టెదనని యొకబహిరంగసభ లో శ్రీయుత వల్లభాయి చాటుటయేకాక ననుమా నము, అపనమ్మకములతో నిండిన యట్టివాతావరణము లో ప్రజలు స్మార్టుగారితాబేదారులను, డబ్బిచ్చితెచ్చి నవారిని వా రంతటివారికి వదలివేయక తప్పదనియు

చెప్పెను. కాని కొద్దిరోజులకిందట కలెక్టరుగారు బార్డోలీ. జలపై కొంప లంటించుట, దౌర్జన్యము చేయుట మొదల దోషములనారోపించినట్లు కమీషనరుగారు చేయనందుకు వా రికి వందము లర్పింపబడెను. ఇక ఖేడాలో పన్నులవసూళ్ళ ఆందోళనపరులు ' భంగపరచి రనువిషయమై స్మార్టుగారి వల్లభాయిగా రీక్రిందివిషయమును జ్ఞాపకము చేయుచున్నా రు. ఖేడానుంచి వచ్చినయాందోళనపరులని పిలువబడువారె వరదలచే నష్టపడిన గుజరాతులోనికి ప్రాణములపై నాసవీడి దుమికి తరుణములో యాహారమును, దుస్తులను, విత్తులను సరఫరాచేయకపోయినచో ప్రభుత్వజంఝాట మంతయు పరి స్థితుల నెదుర్కొనజాలక యుండెడి దనియు ప్రభుత్వమువా రు వరదలచే నింపబడిన ప్రాంతములనుండి యీవత్సరము లక్షలకొలది భూమిపన్నును వసూలుచేయజాలక యుండెడి వా రనియు, చురుకైన సహాయము తరుణములో లేనియెడల ప్రజలు పంటలను పండింపజాలక యుండెడివా రనియు నత డు స్పష్టపరచెను. ఇంతేకాక ప్రభుత్వమువా రితడు నిందించి నయాందోళనపరులద్వారానే యనేకచోట్ల చవుకవిత్తనము లను, కలపడిపోలను నడిపించి చాలడబ్బును కూడబెట్టుకొ నగలిగిరి. ఇట్టివారు బార్డోలీలో జయించినచో టకావి భూమి పన్నువసూళ్ళను భంగపరతు రని కమీషనరుగా రనుట

కేవలము క్రూరము. దీనిని గురించియే మహాత్ముడీక్రింది
వ్యాసమును ' ఎంగు ఇండియా ' పత్రికలో వ్రాసెను.

" బార్డోలీయుద్యమము కులాసాగా జరుగుచున్నది. ప్రభుత్వవశము చేసికొనబడు నని యివ్వబడుచున్న నోటీసుల రేటునుబట్టి బార్డోలీతాలూకాయంతయు ప్రభుత్వమువారిదే యగును. అప్పుడు వారు తమకు తాము వేయిరెట్లు యెక్కువపన్ను చెల్లించుకొనవచ్చును. బార్డోలీప్రజలు, తాము ధైర్యవంతులే యైనచో, నిట్లు నిరాస్థిపరులగుటవలన నేవిధముగను నధములు కాజాలరు. వారియాస్థులు పోవచ్చును; కాని సత్పురుషులకును, స్త్రీలకును ప్రాణప్రదమగు వారిగౌరవమును రక్షించుకొనినవారగుదురు. బలముగలచేతులు, స్థిరముగలహృదయము గల పురుషులెన్నడును ఆస్థులు పోయెనని భయపడరు.

కాని పైబెదిరింపునోటీసులవలన లాభము లేకపోవుటచే ప్రభుత్వమువారిపుడు వాటికి దేశసేవకులనిర్బంధములను జతచేయుచున్నారు. పంజాబుమూర్ఖులులారోజులనాటి విచారణనాటకమే నేడును జరుపబడుచున్నది. ప్రాసిక్యూటరు కఠినశిక్షలను వేయుమని యడుగుట; మొగమాటస్తుడైన ప్రత్యేకమేజిస్ట్రేటు వర్తించుచుండుట-ఇవికూడ నైచ్ఛికముగా బాధననుభవించుచున్న పురుషులకు మంచినే సమకూర్చును. ఐచ్ఛికముగా నొందుబాధ బాధపడువాని కెన్నడును హాని

కలుగచేయ నేరదు. కాని ప్రకృతికి విరుద్ధమైనవి రెండు వు. ఒకటి నిజాయితీ లేకపోవుట; రెండు అధికారమదాంధ కమీషనరు వ్రాసినయుత్తరమునిండ యసత్యములు, నిం గర్భిత దోషారోపణములు కలవు.

ఉద్యమము ఖేడానుంచి వచ్చిన యాందోళనపరుల నారంభింపబడినదనుట కేవల మసత్యదోషారోపణము దా ని బార్డోలీప్రజలే ప్రారంభించిరి. వా రొక్క శ్రీయుతవ: భాయిపటేలుయొక్క సహాయమును సలహాను మాత్రమే కోరిరి. కమీషనరు యీాయన నెరుగు ననియే నేను తలం దను. కమీషనరుగా రుపయోగించిన భావములో నీయనః నిజముగా నాందోళనపరు డనదగునేమో ప్రజలే యోచింప వలసి యున్నది. ప్రభుత్వోద్యోగస్తులు గూఢచారుల యనః మానములు, ప్రజలు మూకగాచేరి గుమిగూడుట మొదలగః నితరయవమానములకు పాలుచేయబడి రనుమాట కేవల మసత్యము.

దేశసేవకుల 'నాందోళనపరుల గుంపనియు, ప్రజల మీాద పడి తిరుచు వారిని తప్పుమార్గముల నడిపించుచున్నా' రనియు నితడు వర్ణించెను. ఇట్టి నిందారోపణకు కాలము మంచిదై యుండి, జాతి తనబలమును గుర్తెరింగి యున్నచో కమీషనరువద్ద బహిరంగమైన క్షమార్పణను పుచ్చుకొన బడెడిది. అతడు కోపముచేతను అధికారముచేతను 'ఆందోళ

వహరులగుంపు' అని పేరు పెట్టినవా రుచితముగా పని చేయు చున్న దేశసేవకు లనియు, ననేకత్యాగములకు లోనై బార్డోలీ కుచితసేవచేయుచున్నారనియు తెలిసికొనుచుగాక; వీరిలో బారిష్టరు వల్లభాయిపటేలు, వెనుక బరోడా లో ప్రధానజడ్జిగా పనిచేసిన మరియొకబారిష్టరు, పరిణతవయస్కుడు, నగు అబ్బాసుత్యాబ్జీయు, బార్డోలీవలన నెట్టి సహాయము నక్కరలేని కేవలము ఫకీరుగానున్న ఇమాంసాహేబుబవజీరు, డాక్టరు, సుమంతుమెహతాయు, నతనితో సమానమైన సంస్కారముగల భార్యయు కలరు. డాక్టరు సుమంతుమెహతా చాలకాలమునుండి వ్యాధిగ్రస్తుడైనను తనయారోగ్యము నమ్ము చేసికొని బార్డోలీకి వచ్చెను. ఈనలుగురును ఖేడానివాసులు కానే కారు. ఇక ధానానివాసులగు దర్బారుసాహేబు, వీరపత్నియగు నతని భార్య భక్తిబా దేశముకొరకు తమసంస్థానమును పోగొట్టుకొనిన త్యాగమూర్తులు కలరు. వారు బార్డోలీప్రజలపై జీవించుటలేదు. డాక్టర్లుచందూలాల్, త్రిభువనదాసులు ఖేడావాసులు కారు. ఫూల్చందుషా, అతనిభార్య, అతనికి కుడిభుజ మగుశివానందు వీరును ఖేడావాసులు కారు వీరు తమజీవితముల ననేకవత్సరములక్రిందటనే నిరాడంబరసేవకై యర్పించిరి. బార్డోలీయొక్క దుస్సహదుస్థితియే వీరినే గాక మరి యెందరినో బార్డోలీ రప్పించెను. కమీషనరు కేమాత్రము

గౌరవభావ మున్నను యీస్త్రీలకును పురుషులకును తనంతానను క్షమార్పణ చెప్పుకొని యుండవలెను. యథార్థమకిచ్చుట పనిచేసిన సేవకులలో ఖేడానుంచి వచ్చినవారు బహు స్వల్పము.

కమీషనరు బొంబాయిశాసనసభలో వ్యతిరేకముగా వచ్చినవోటునే ఘనముగా చూపి యంతకుపూర్వము ప్రభుత్వముకు వ్యతిరేకముగా వచ్చినరెండుసభలవోటులను కప్పిపుచ్చెను. ప్రభుత్వమువారు వాటిని నీచముగాను ఖాతరుచేయనవసరము లేనివిగాను చూచిరి. బార్డోలీప్రజలలు ప్రత్యక్షచర్యకు దిగకమునుపు చట్టబద్ధమైన ప్రతిసాధనముల నుపయోగించి విఫలులైరను యథార్థమును కమీషనరు కప్పిపుచ్చుచున్నాడు.

అగ్నిపరీక్షకు పాల్పడుచున్న బార్డోలీప్రజలు తమ యుద్యమమును మానివేసినచో పొరపాటుచే తప్పువర్గములో చేర్చబడినగ్రామ మేదైన నున్నచో తాను విచారణచేయింతు నని సూచించుటలో కమీషనరు ప్రజలకళ్ళలో దుమ్ము పోయుచున్నాడు. అసలుసమస్య ఒకగ్రామము నొక వర్గములో చేర్చుటయు మరియొకగ్రామము నింకొకవర్గములో చేర్పుటయు కాదు. పన్నువిధించువిధానమే పూర్తిగా తప్పనియెడుసత్యము నితడు కప్పిపుచ్చుచున్నాడు. బార్డోలీ ప్రజలు తమమాటే చెల్లవలె నని పట్టుపట్టుట లేదు. వారివా

దములో నున్నన్యాయాన్యాయములను విచారించుట కొక నిష్పాక్షికమైన స్వతంత్రవిచారణసంఘము నేర్పాటు చేయ వలసిన దనియు, నాసంఘమువారితీర్మాన మెట్టిదైనను తాము దానికి బద్ధుల మగుదు మనియు నారు చెప్పుచున్నారు. ఇందులో పన్ను నెగగొట్టవలె ననెడితలంపు గాని, వ్యక్తులకు గలిగిన కష్టములకు పరిహార మనిగాని లేదు. అసలు సమస్య ముఖ్యసిద్ధాంతమును గూర్చియే. ఎట్టియుక్తమైన విచారణయు లేకుండ ప్రభుత్వమువారికి పన్నులను హెచ్చించు నిరంకుశాధికారము గలదని బార్డోలీప్రజ లంగీకరింప జాలరు. ఇది రాజకీయోద్దేశములతో ప్రారంభింపబడినపన్నులనిరాకరణము కాదు. ఇది యొకతాలూకా కంతకును చెందిన ప్రజలను బాధించునట్టి యిదమిద్ధ మని నిర్ణయింపబడిన బాధను నివారించుటకే సంకల్పింపబడినది.

"బీదలగువ్యవసాయదారులమీాద పడి జీవించుచు వారిని తప్పుడుమార్గముల నడిపించుచున్న యాందోళనపరులగుంపువలన వ్యవసాయదారులు నాశమై పోకుండ నుండవలె నని నా కున్నవిచారము మరెవ్వరికిని లేదు. ఈయాందోళనపరులు కైరాజిల్లాలోని యయిదుతాలూకాలనుండి వచ్చుచున్నారు. వరదలవలన నచ్చట రెండువత్సరముల వరకును క్రొత్తసెటిల్మెంటులు ఆపివేయబడెను. గత యేడెనిమిదిమాసములలోను కైరాజిల్లాలో వరదలనష్టపరిహార

ముకు గాను ప్రభుత్వమువారు సుమారు 50 లక్షలు పెట్టు బడి పెట్టిరి. బార్డోలీలో వారు జయించినచో కైరాజిల్లాలో ప్రభుత్వపన్ను టకావి వసూలగుట దుర్ఘట మగును? అని కమీషనరు వ్రాయుట కేవలము పచ్చికల్ల, పొగరుబోతు తనము.”

‘ఆందోళనపరులు’ జయించు నెడల ఖేడాలోని టకావి కెంతమాత్రమును నష్టము వాటిల్లదు. బాకీదారులు చెల్లింపనిచో నాందోళనపరులకు గురువైన వల్లభాయిపటేలు ప్రభుత్వమువారికి జీత మక్కరలేని కలెక్టరుపని చేసి బాకీలు వసూలుచేయు నని ప్రభుత్వమువారు కనుగొనగలరు. ఆందోళనపరులు జయించుచో జరుగున దేమనగా కమిషనరువలె ప్రభుత్వనౌకరు లుచితముగా సేవ చేయుప్రజాసేవకులను నిందించుటకును, అసత్యము లాడుటకును సాహసింపరు. ప్రజలకు బార్డోలీలో వలె కేవల మక్రమము నన్యాయము నగుపన్నులసందర్భమున కొంతయుపకారము జరుగును.

ప్రజల కింకొక్క మాట చెప్పవలసియున్నది. “ప్రభుత్వమువారు తమ బుద్ధినయినను వినియోగించియు యాప్రభుత్వము విడదీసి పాలించుపద్ధతిపైననే యాధారపడి యున్న దనుసత్యమును రూఢిచేయుటకును హిందూజనసంఖ్య చాల హెచ్చుగా నున్నచోట ముసల్మానుఉద్యోగస్తులను, డబ్బిచ్చి తెప్పించినపఠానులను పెట్టిరి. సత్యాగ్రహులైనప్రజలు

ప్రభుత్వపుటాటను చులకనగా కట్టివేయగలరు. ఉద్యోగస్తులను, పఠానులను ప్రజలు స్నేహితులవలె చూతురుగాక. వారిని విశ్వసించుచు వారనిన భయపడక వారి సవిధమునను చిక్కులు పెట్టకుండవలెను. ఉద్యోగస్తులు మనదేశస్తులు; పఠానులు మనయిరుగువారు. అనతికాలములోనే ప్రభుత్వమువారు తమతప్పిదమును గుర్తించి హిందువునిగౌరవము హిందువునకెంతప్రియమో ముసల్మానుకు గూడనంతే ప్రియమనియు, నట్టె ముసల్మానులగౌరవము కూడ హిందువులకును ప్రియమనియు, తెలిసికొనెదరుగాక; దీనిని బార్డోలీప్రజలు ప్రత్యక్షముగా రుజువు చేయగలరు. అట్టితరుణము వారి కిప్పుడు చిక్కినది. వారు సత్యాగ్రహసూత్రము అనగా ప్రేమసూత్రముయొక్క న్యాయమును రుజువుచేసినచో వారొకనిరంకుశుడగు కమీాషనరుయొక్క రాతిగుండెను కూడ కలగించగలరు."

# బార్డోలీ విజయము.



పందొమ్మిదవ యధ్యాయము.



"సర్వనేత్రాకర్షకస్థానము"

"ఒకచిన్న ఒకటియే వేయి యగుచున్నది. ఒకచిన్న జాతి బలవంతమైనజాతి యగుచున్నది."

మే మాసాంత మగుసరికి భారతదేశమంతయు బార్డోలీ నామము నుచ్చరింపసాగెను. ఎవ్వరు నూహింపనట్లుగా నది యగ్నిపరీక్షలో గెలుపొందెను. సంశయాస్పదులయొక్కయు నేడుపుమొగములవారలయొక్కయు దౌర్భాగ్యపు జోస్యమంతయు నబద్ధమయ్యెను. నిరంతరము నిందింపబడు బార్డోలీవైశ్యుడు నిందించువారల కాశ్చర్యముకలుగునట్లు ప్రవర్తించెను. ఒక పార్శీవానిని బాధించుటతోడనే పార్శీజాతిదృష్టి యంతయు నాకర్షింపబడెను. ముసల్మాను తహసీల్దారుయొక్క కపటనాటకమంతయు నుద్యమమునకు నిజమైన పట్టుకొమ్మలనదగు ధైర్యనిధులగు నిద్దరు ముసల్మానువ్యవసాయదారుల ముందు విఫలమైపోయెను. నిరాడంబరులు, నిష్కపటులు నగు బార్డోలీస్త్రీల ధైర్యస్థైర్యములు దేశములోనున్న యితరస్త్రీలలో నద్భుతసంచలమును కలిగించెను.

అహమ్మదాబాదునుండి బార్డోలీపోవులోపల బార్డో లీసత్యాగ్రహమును గురించి ప్రజలలో బయలుదేరిన కోలాహలము నెవడు చూడకుండ నుండగలడు? బొంబాయిలోని ప్రతిగుజరాతీయు బార్డోలీవార్తలనుగురించియే నిన్ను ప్రశ్నించును. బార్డోలీనుండి ప్రచురమగుకరపత్రము నేదేని నీవు చూడకపోవచ్చును. కాని నీ బొంబాయిస్నేహితుడుమాత్రము వాటనన్నింటిని మ్రింగుచు ముందువార్తల కాతురపడుచుండును. మే ప్రారంభమువరకును సర్దారు ప్రజలను ధనముకొరకర్థింపవలె ననుసూచనలను తిరస్కరించెను. కాని బార్డోలీ తనవిధిని చక్కగా నెరవేర్చుచుండుటచే నతడు మే తొమ్మిదవతేదీని యొకవిజ్ఞాపన చేసికొనెను. అంతవరకు నొకటిరెండు చందాలు 2000 వరకును పైనుంచివచ్చెను. తక్కినదంతయు బార్డోలీలోనే యెట్టివిజ్ఞప్తియు నవసరము లేకుండ పోగుబడెను. ఇట్లు 10000 దాటెను. ఇందులో బార్డోలీలోని ప్రతి గ్రామములోనుండియు స్త్రీలచందాలు వచ్చి పడుచుండెను. సర్దారువిజ్ఞప్తిని మహాత్ముడు బలపరచెను. తోడనే కనకవర్షమారంభించెను. నేను బొంబాయిలో కలుసుకొనిన యనేకమందిస్నేహితులు చందాలుపంపుట కాతురపడుచు నెవరికి పంపుటో తెలియక బాధపడుచుండిరి. బొంబాయిలోని యొక స్త్రీ మొదటివాయిదాకు రూ 500 పంపించి సమరమంతమగువరకును నెలకు రు 500 చొప్పున

పంపించెదనని రెండవవాయిదా చెల్లించుచు వాగ్దానము చేసెను.

"నీవు వాలడ్‌కు పోవు రైలుబండి నెక్కుచో బార్డోలీనిగురించి ప్రయాణీకులు చేయుచర్చలే నిన్ను నిద్రనుండి మేల్కొలుపును." "ఈగ్రంథమంతయు చివరకెట్లు పరిణమించునో?" అని యొకడడుగును. ఆరంగమును కండ్లారచూచిన మరియొకడు తాలూకాలోని పఠానురాజ్యమునుగురించి పూసగ్రుచ్చినట్లీక్రిందివిధమున నతివివరముగా వర్ణించుచుండును. "మనము సమస్తమును భరింపవచ్చును; సహింపవచ్చును. కాని మనగేదెలను దున్నలను పఠానులు నిలువున చీల్చుచుండగా చూచి భరింపజాలము. ఇప్పుడు వారన్నిమర్యాదలను విడిచిపెట్టి సంచరించుచున్నా రనుసంగతి మనకందరకును తెలిసినదే! మాఢీలోని యొక వ్యవసాయదారుని పెరటిదొడ్డిలోని కొకపఠాను ఉరికెను. ఆయింటియజమానిభార్య పరుగెత్తుకొనివచ్చి లోపలనుంచి తలుపువేయుచుండగా పఠాను బలవంతముగా తలుపుతోసి యామెమీదకుబోయి చేయిపట్టుకొని బయటకీడ్చెను. దీనిభావమేమి? ఈదురంతములకంతు మెచ్చటకలదు?" "సార్భానులోని జప్తుఆఫీసరు అనవ్లాబ్రాహ్మణుడు. పాప మతనికి భార్యయూ లేదు! కొడుకు మొన్ననే విషముత్రాగి చనిపోయెను! అతనికిక దిక్కెవ్వరును లేరు. ఇకనత డీదారుణములనెవరికొరకాచరించుచు

న్నాడు ?” అని నవసారిలో బండియెక్కిన మరియొకడనును. నేనొకరోజున పగటిబండిలో ప్రయాణముచేసితిని. ప్రయాణీకుల చేతులలో బార్డోలీనుండి వెలువడుకరపత్రములున్నవి. వారిలోకొంతమంది శ్రీయుత వల్లభాయిపటేలుగారి యుపన్యాసమును బిగ్గరగాచదువుచు పరిస్థితులనుగురించి చర్చించుచుండిరి. నేను నాసంచిని భుజముమీద వేసికొని నవసారి వీధులగుండ పోవుచుండ నొకపార్సీ నా వెనుక గుండెలదరునట్లు పరుగెత్తుకొనుచు వచ్చి “నీవద్ద బార్డోలీకరపత్రములున్నవా ?” యని పృచ్ఛించెను.

ప్రచురణశాఖవారి కరపత్రములు గుజరాతులో నిప్పుకు నీరుపోసినట్లు కనబడనిప్రబోధమును కలుగచేయుచున్నట్లు దీనివలన విశదమగుచున్నది. సర్దారు ధనముకొరకు ప్రజలకు విజ్ఞాపనచేసియున్నను సమస్యను కేవలమొక్క బార్డోలీకి చెందిన స్థానికసనుస్యగానే సాగింప నిశ్చయించెను. రాజగోపాలాచారి, గంగాధరరావు దేశపాండ్యాగారలు అహమ్మదాబాదులోనుండిరి. వారు బార్డోలీలోని పరిస్థితులను స్వయముగా చూడవలెనని యాతుర పడుచుండిరి. గాంధిజీ వారిని వెళ్లవలదని వారించెను. సర్దారు దానియంతరార్థమును గ్రహించెను. ఈసమయములో మగన్‌లాల్ గాంధి ‘మహాత్ముని కుడిభుజము’ చనిపోయెను. పిడుగువంటి యీవార్త వినుటతోడనే సర్దారుఅహమ్మదాబాదు వెళ్ళుట కావేదనపడుచుం

డెను. మహాత్ముడు రావలదని యతనికిట్లు వ్రాసెను. "ఇది గొప్పనష్టము. కాని యిది నీకార్యక్రమమును చెడగొట్టకూడదు. ఈసమయములో నీవు బార్డోలీనుండి కదలుటకు వీలు లేదు. నీ కేసహాయము కావలసినను నాకు వ్రాయుటకెంత మాత్రమును సందేహింపకుము. నేను నీపిలుపు కెదురుచూచుచు నీవు కోరినపుడు వచ్చుటకు సిద్ధముగానున్నాను." గాంధిజీ బార్డోలీ రావలెనని సర్దారు కెంతకోరికయున్నను అతనిరాక భారతదేశమంతయు బార్డోలీకి పరుగెత్తవలెనను పిలుపుగా భావింపబడునని యతడు నిగ్రహమును చూపెను.

సర్దారు ప్రియత్నము లిట్లున్నను సమరము దేశమునంతను తనవైపు కాకర్షింపసాగెను. సర్దారును అతనితోడి సేవకులను "బార్డోలీప్రజలమీదపడి బ్రతుకునట్టి యాందోళనపరులగుంపు" అనివర్ణించుచువ్రాసిన కమీషనరు యుత్తరము జాతినంతను దూషించుటగా పరిగణింపబడి బొంబాయిలో నమావేశమైన కాంగ్రెసుకార్యనిర్వాహక వర్గమువారీ క్రింది తీర్మానమును గావించిరి.

"బార్డోలీతాలుకాలో నన్యాయముగను అధర్మము అక్రమము నగులెక్కల నాధారము చేసికొనియు చేయబడిన పన్నుహెచ్చుదలను గురించి స్వతంత్రము, నిష్పక్షపాతము నగు విచారణను సలుపవలసినదని బార్డోలీసత్యాగ్రహులు చేసినవిన్నపమును బొంబాయిప్రభుత్వమువారు త్రోసి పుచ్చు

చే ప్రభుత్వముపై తీసి కొనిన వీరపురుషోచితచర్యను బార్డోలీసత్యాగ్రహులను భారతజాతీయ కాంగ్రెసుకార్య ర్వాహకవర్గసమావేశ మభినందించుచు బార్డోలీసత్యాగ్రహుల కనేకత్యాగములకు లోనై మంచిసమయములో తోడ్పడిన శ్రీయుతులు వల్లభాయిపటేలు, వారి యనుచ రులు మొదలగువారికి వందనముల నర్పించుచున్నది; బొం బాయిప్రభుత్వమువారి నిరంకుశవిధానమును నిరసించుచు బొంబాయిశాసనసభలో తమ సభ్యత్వములకు రాజీనామా లనిచ్చిన కౌన్సిలుసభ్యుల నభినందించుచున్నది.

ఈకమిటీవారు బొంబాయిప్రభుత్వమువారిచే లేక వారితరఫున తీసికొనబడినచర్యలను పూర్తిగా గర్హించుచు న్నారు. ఆచర్య లీకమిటీమివారి కనేకసందర్భములలో న్యాయ శూన్యముగను, నెవ్విధముగ విచారించినను యవసరమును మించినవిగను కన్పట్టుచున్నవి.

కమీషనరు వల్లభాయిపటేలు, అబ్బాసుత్యాబ్జీ, సుమం తుమెహతా మొదలగు ఆణిముత్యములవంటి దేశసేవకులను "బార్డోలీప్రజలపై బ్రతుకుచువారిని తప్పుడుమార్గమున నడి పించు ఆందోళనపరులగుంపు" అని వర్ణించుచు నొకడాక్టరుకు వ్రాసినయుత్తరము నీకమిటీవారు చదివినారు. అందులో నసత్యముల సమీపించుయుత్ప్రేక్ష లెన్నియో కలవు. ఆయు త్తరములోనిధోరణి అతిగర్హ్యముగను, గొప్పయుద్యోగస్తుని

కెంతమాత్రము ననుచితమును గనుక కమీషనరు నాయు-
మును తీసివేసికొని బహిరంగముగా క్షమార్పణకోరుకొ
నట్లు బలవంతపెట్టవలె నని యీకమిటీవారు బొంబాయిప్రభు-
త్వమువారిని కోరుచున్నారు.

"స్వతంత్రమైనట్టియు నిష్పక్షపాతమైనట్టియు విచార-
సంఘము నేర్పరచవలె" నని సత్యాగ్రహులుచేసిన యుక్తమై-
కోరికను నెరవేర్చవలెనని యీకమిటీవారు బొంబాయిప్రభు-
త్వమువారిని కోరుచున్నారు. సమరమునకు యావద్భారతప్ర
ముఖ్యత,లక్షణములు యేర్పడెను గనుక ప్రజలందరును సత్యా
గ్రహులకు మానజాతికి శక్యమగునైతిక, ఆర్థికసహాయము-
నంతను చేయవలె నని యీకమిటీవారు హెచ్చరించు
చున్నారు."

బార్డోలీని గురించిన ప్రభుత్వనీతిని నిరసించుచు చాల
మంది బొంబాయిశాసనసభ్యులు రాజీనామాల నిచ్చినట్లు
యీతీర్మానమువలన విశదమగుచున్నది. శ్రీయుతులు దాదు
భాయిదేశాయి, భీమభాయినాయిక్, శివదాసనీ, డాక్టరు
దీక్షితులుగారలు బార్డోలీని దర్శించినట్లు మన మిదివరకే
చూచియుంటిమి. రావుబహదరు భీమభాయినాయిక్‌గారు అద
నపుపన్నుసంగతి ప్రచురమైనదిలగాయితు ప్రభుత్వముతో
నుత్తరప్రత్యుత్తరములు జరుపుచునే యుండెను. రెవిన్యూ
సభ్యునిసలహా ననుసరించి యతడు మే 5 వ తేదీని కమీషన

-ను చూచెను. క్రొత్తపన్ను చెల్లించినమీదట వ్యక్తులకు
ందినవాంశము లేపైన నున్నచో నాలోచింపబడునను
ుక్తసరిజవాబు వచ్చెను. తరువాత నతడు తనతరఫునను
ుతర గుజరాతుసభ్యులకు గోడమీదిపిల్లివాటపుయుత్తర
ములను, పొగరుమోతు జవాబులను బడసి ప్రాణము విసిగిన
మీదట వా రందరును కలిసి యొక్కుమ్మడి రాజీనామాల
నిచ్చుటకు నిశ్చయించిరి. గవర్నరుకు వ్రాసినయుత్తరములో
వా రిట్లు వ్రాసిరి. "ప్రభుత్వము తమ బాధ్యతలను విస్మరించి
న్యాయవిచ్ఛేదమున కుపక్రమించినప్పుడును, యిట్టి యుదార
స్వభావులును, చట్టబద్ధులును అగు ప్రజలను దయాదాక్షిణ్య
శూన్యముగా కాలిక్రిందపెట్టి నలిపివేయ ప్రయత్నించినప్పుడు
ను ఆతాలూకాలోని ప్రభుత్వ నిరంకుశపద్ధతిని నిరసించుచు
బొంబాయిశాసనసభలోని మాస్థానములకు రాజీనామాల
నొసంగుటే న్యాయమును యుచితమును కనుక మీరు మారా
జీనామాల నంగీకరింపకోరుచున్నాము."

సర్దారు బొంబాయిలో నొకదినముండెను. అప్పుడతడు
కాంగ్రెసుకార్యనిర్వాహకసభ్యుల నందరను కలుసుకొనెను.
అతడు కోరినచో వారందరును బార్డోలీకి పరుగెత్తెడివారే.
పండిత మోతీలాల్ గారతనిని హృదయపూర్వకముగా నాశీ
ర్వదించి లాలాగిరిధరలాల్‌ను (భీమాపనిచేయుచున్నవానిని)
శ్రీయుత వల్లభాయియొక్క స్వేచ్ఛ నెంతకాలము భీమా

చేసెదరని వేళాకోళముగా ప్రశ్నించెను. ప్రతివాడునుసర్దా కొద్దిరోజులలో చక్రవర్తిగారి జయిళ్ళలో నెచ్చటకో యతి గా వెళ్ళవలసి వచ్చుననియు, గాంధిజీ వారిస్థానము నల కరింపవలసియుండు ననియు, బార్డోలీ యావద్భారతస స్యగా మారుననియు త్రికరణశుద్ధిగా నమ్ముచుండిరి. కాని సర్దారు మర్యాదకైనను నాయకుల నెవరిని బార్డో లీ కాహ్వానము చేయలేదు. వారిరాకవలన బార్డోలీకి మరికొద్ది ప్రకటన కలుగవచ్చును. కాని దానికి యెదిరివర్గమువారు తమ యిచ్చవచ్చినయపార్థములను కల్పించవచ్చును.

అయినప్పటికిని డాక్టరు అన్సారీ, మౌలానాషౌకతాలీ మౌల్వీ మహ్మదుబెలాల్ గారలు ముసల్మానుసత్యాగ్రహులను చూచుటకు సూరతు ముసల్మాను స్నేహితుల పిలుపు నంగీకరించి వెళ్లిరి. డాక్టరు అన్సారీ సూరతువెళ్లి యొక దినమంతయు నచ్చటనున్నముసల్మానులతో మాట్లాడి యొక గొప్పసభలో ముసల్మానుజాతియంతయు న్యాయము కొరకు పోరాడుచున్న బార్డోలీప్రజలతోనే యున్నదని చాటెను. మౌలానా షౌకతాలీ, మౌల్వీమహమ్మదుబెలాక్ గారలు బార్డోలీవెళ్లి యచ్చటనున్న నైకమత్యమును, దిట్టతనమును చూచి నిర్ఘాంతపోయిరి.

బరూచా, నారిమన్ గారలు పార్శీవ్యవసాయదార్లు చూపుచున్న ధైర్య, స్థైర్యములకు మెచ్చుకొనుచు ననేకగాం

ముములను సందర్శించి పరీక్షలను, క్రాసుపరీక్షలను చేసికొ నుచు రానున్నయగ్నిపరీక్షలో బార్డోలీ దిగ్విజయమును పొందగలదను సంతోషముతో నుప్పొంగుచు వెడలిపోయిరి. నారిమన్‌గారు ప్రభుత్వనిర్బంధచర్యలను గురించి బార్డోలీ సభలో తీవ్రముగా నిరసించెను.

"బ్రిటిషు ప్రభుత్వము శాంతిని, క్రమమును నెలకొ ల్పినదని మనకు చెప్పుదురు. బందిపోటులు, పిండారీలు రూ పుమాసి రందురు. ఇతరచోట్ల నేదియెట్లున్నను బార్డోలీలో నేడు పఠానులు, బొంబాయినుంచి వచ్చిన దుండగీండ్రు రాజ్యము చేయుచున్నారు. నేడు మీమీద స్వారిచేయు చున్న పఠానులు బొంబాయిలో రోజులోని 24 గంటలును పోలీసువారినిఘాలోనుండు మోటుజాతిలోనుండియే రప్పిం పబడిరి. ఈ పఠానులకు లంచములిచ్చి తెప్పించుటకన్న ప్రభుత్వముకు వేరొండు సిగ్గుమాలినపని యుండబోదు."

బరూచాగారు సంటోకు అను మరియొక గొప్ప బొం బాయివకీలుతో మరియొకసారి బార్డోలీ వచ్చిచూచి బొం బాయి వెళ్ళుటతోడనే పార్సీనాయకులసంతకములతో బార్డో లీలోని ప్రభుత్వచర్యలతో ప్రత్యక్షముగ గాని యప్రత్యక్ష ముగ గాని యెట్టి సంబంధమును పెట్టుకొనరాదని పార్సీసం ఘమంతకు నొకవిన్నపమును పంపుకొనిరి.

యువజనసంఘసభ్యులగు ఖేసానియాకన్యకలు బొం. బాయినుండివచ్చి బార్డోలీగ్రామములలోని పరిస్థితులను కండ్లారచూచిరి. వారుచూచినవిషయములను గురించి వ్రాసిన వార్తలు బొంబాయివిద్యార్థిలోకములోను, యువజనులోను భయోత్పాతమును, హాహాకారములను పుట్టించెను. వారిలో కలిగిన ప్రబోధముకును, తత్ఫలితముగా సాగిన గొప్పగొప్ప యుత్సవములు, యూరేగింపులు, సత్యాగ్రహనిధికొరకు చందావసూళ్ళు మొదలగువాటికన్నిటికిని యీ మొదటియాత్రికుల యాత్రలే కారణము.

సూరతుజిల్లామహాజనసభ కధ్యక్షత వహింపవలసినదని కోరబడిన జయరాందాసు దౌలతురాంగారు మొదట తమకండ్లతో పరిస్థితులను చూచినగాని యొప్పుకొనలేదు. అతడు చాలగ్రామములు చూచివచ్చి తనయుపన్యాసములో వాటినిగురించి పూసగ్రుచ్చినట్లు వర్ణించెను.

సిక్కులీసమరమును కడు సూక్ష్మముగా పరీక్షించుచు రెండు మూడుసారులు తమ శాంతిసైనికులను పంపెదమని తంతివార్తలనిచ్చిరి. సర్దారు కృతజ్ఞతతో వారిని వలదని చెప్పవలసివచ్చెను. సర్దారుమంగళసింగు బార్డోలీవచ్చి చూచి సంతుష్టాంతరంగుడయ్యెను. పంజాబురాష్ట్రీయకాంగ్రెసుకార్యనిర్వాహకవర్గమువారు ఉద్యమమును పరీక్షించి రమ్మని డాక్టరుసత్యపాలుగారినిప్రత్యేకముగా బార్డోలీపంపిరి. అతడు

చాలగ్రామములను చూచి, యనేకసభలలో నుపన్యసించుచు ప్రజలొనర్చుచున్న వీరయుద్ధమునకు వారిని మెచ్చుకొనుచు ననేకదినములు గడిపెను.

ఈయాత్రికులలో తానొకడనని చెప్పుకొనుటకు జమ్నాలాల్ బజాజిగారు గర్వించుచుండెను. అత డనేకసభలలో తాను ఆత్మపారిశుద్ధ్యమునకే వచ్చితిననియు నీపవిత్రాగ్నిజ్వాలలవద్ద కాచుకొనవలెనని యే వచ్చితిననియు చాటెను.

మహారాష్ట్రమునుంచి శ్రీయుతులు జోషి, పటాస్కరులు వచ్చిరి. వీరు శాసనసభ్యులు. వీరెన్నడును గాంధిజీతో గాని, సత్యాగ్రహముతో గాని అసహాయోద్యమముతో గాని యెట్టిసంబంధమును పెట్టుకొనలేదు. కాని వీరికి కేవలము వ్యవసాయసంబంధమైన యుద్యమమం దెంతయో యభిరుచి కలదు. మరియు సత్యాగ్రహమును ప్రత్యక్షముగా సాగుచుండ చూడవలెనని వారికోరిక. వీరిలో నొకరు బ్రాడ్లీని విడిచిపెట్టుచు సర్దారుతో "మేము వెక్కిరించుటకు వచ్చితిమి. కాని ప్రార్థనచేయుటకొరకాగిపోతిమి." అని చెప్పెను.

ఈస్నేతులందరు నేమిచూచిరి ? వీరినందరను నిర్ఘాంతపోవునట్లు చేసినదేది? వీరందరు నేకకంఠముతో నీసమరము అసమానమైనది, పవిత్రమైనది, వీరరసోద్దీపకమైనది అని చాటునట్లుచేసినదేది? దీనికి చాలకారణములు గలవు. తాలూకాలో కాన్పించిన యద్భుతమైన కట్టుబాటులు వారి నాశ్చ

ర్యచకితులను జేసెను. వ్యవసాయదారులలో నూటికొక్కడు తులసివనములో గంజాయిమొక్కవంటివా డుండునేమొ ? అయినను చాలగ్రామము లభేద్యములగుకోటలవలె నుండి యందులోని యొక్కయిటుకగాని, రాయిగాని మానవమాత్రులకు కదల్ప నశక్యముగా నుండెను. ఇస్రోలీ యను గ్రామములోని రైతులందరకును వారిభూములన్నియు ప్రభుత్వవశము చేయబడునను నోటీసులు జారీచేయబడెను. తాలూకాలో పన్నులను హెచ్చింపకుండనున్న నాలుగుగ్రామములలోను నిది యొకగ్రామము. బాహ్యముగా చూచినచో పన్నులను చెల్లింపకుండుటకు వీరికి కారణ మేమియు కాన్పింపదు. కాని వీరందరును తమ దున్నలు, గేదెలు జప్తుచేయబడినను, పొలములన్నియు తెగనమ్మివేయబడినను చలనము లేకుండ పెట్టనికోటవలె నట్లే నిలబడియుండిరి. శారద్, కువాడియా, చిత్రి అను మరిమూడు గ్రామములు కలవు. ఇచ్చటకూడ పన్నులు మామూలురేటుకు తగ్గింపబడెను. ఇవి అబద్ధములచేతను, అసత్యకల్పనలచేతను ప్రజలలో భేదములను కల్పించవలెనని పొంచియుండుప్రభుత్వోద్యోగులచే తరుచు ముట్టడింపబడుచుండు చిన్నకుగ్రామములు. అయినను వీటిలో నొక్కటియు కదలిపోలేదు. తాలూకాయంతటి గౌరవముకొరకే తాము సమరములోని కురికిరనియు, తాలూకాతో మునుగుటో లేక తేలుటో జరుగ

వలెననియు సర్కారు వాటిహృత్కమలము లందు స్థిరముగా సువర్ణాక్షరములతో లిఖించుటచే వాటిలో నొక్కటియు జంక లేదు. తాలూకాయొక్క గౌరవమున కందరును మొత్తము గాను వేరువేరుగాను బాధ్యులని గ్రామములలోనున్న వివిధ తెగలవారే గాక తాలూకాలోనున్న వివిధగ్రామములు కూడ భావించుచుండెను. కొంతసమయము సాగినతరువాత, చాలకాలము యోచనలు జరిగినతరువాత నాలస్యముగా రంగములోనికి వచ్చిన సార్వాభౌమమొదలగు కొన్నిపరిదేశము లు తాలూకా కెల్లనభేద్యములగు కోటలై పోయెను.

వీటివెనుక సర్కారుచే నమర్పబడిన యుత్కృష్టమైన సైనికసన్నాహ మంతయు కలదు. భూమిసన్నుస్మృతిలోని యనంతశక్తివంతములగు సూత్రములతో నొకవంక పోరవ లెను. మరియొకవంక నీసూత్రములను తమకున్నజ్ఞానము (అజ్ఞానమా ?) ననుసరించి యనులుజరుపుటకు మితిలేని యధికారములతో కూడిన విశ్వసైనికబృందముతో పోర వలెను. వారిని నేను పాఠకులకు పరిచయము చేయనక్కర లేదు. ప్రభుత్వమునకు స్తంభములగువీరే ప్రభుత్వపతనము నకు చాలవరకు తోడ్పడిరని చెప్పిన చాలును. "చిమ్మచీక టులు వీధుల నంధకారమయము గావించినపుడు మదిరాపాన మత్తులును, కన్నుమిన్నుగాననిపొగరుబోతులును అగుసై తానుసంతతి సంచారముసలుపుచుందురు" అని మిల్టను వర్ణిం

చిన ఘోరవర్ణనలకు వీ రతిస్వల్పులని, నిరపాయికులని చెప్ప వచ్చును.

కాని మంచియుద్యోగములలోనున్నవా రిట్టి వికార చేష్టలను చేయుట నెప్పుడును చూడని గ్రామవాసులు వీరి నాశంతతిలోనే చేర్చుకొనిరి. ఇట్టి యీస్నేహితులకృషిని ప్రయత్నములను భంగపరచుటకు సర్దారు విశ్వసనీయులును, సత్యసంధులును అగు తన సరదారులను నియోగించెను. ఇం దులో కొంద రతనిచే గౌరవింపబడుటయేగాక పూజింపబడు చుందురు. అయినను వా రతనియాజ్ఞలను గైకొనుచుండుట అత్యాశ్చర్యకరముగా నుండును. సార్భానుకోటను కాపా డుచు సుమంతుమెహతాదంపతు లుండిరి. డాక్టరుచందూ లాల్ తనబృందముతో నాలడ్‌ను సంరక్షించుచుండెను. శ్రీ యుతులు మోహన్‌లాల్‌పాండ్యా, దర్బారుసాహేబులు డిప్యూటీకలెక్టరుతో వ్యవహరించుచుండిరి. అబ్బాస్‌సాహే బుత్యాబ్జీ, యిమాంసాహేబుగార్లుమునల్మానుతహాసీల్దారుయొ క్కయు తోడిమతస్థులయొక్కయు అల్లరులను అణచుచుండిరి.

ఈయుద్యోగస్తులచేతిక్రింద నెచ్చటకుపడితే యచ్చ టకు రాత్రింబవళ్ళు యేగంటలోపడితే ఆగంటలో నుత్తర ములు తీసికొనిపోవుట, నూతినుండి నీళ్లుతోడుట మొదలగు నెట్టినీచధర్మమునైనను చేయుటకు సంసిద్ధులైనట్టి యనేకమం దిభటు లుండిరి. వారు తాలూకాలోనున్న 16 సత్యాగ్రహ

శిబిరములలోను 250 మందివరకు నుండిరి. నాయకుడు అమలుచేసినయాజ్ఞలను నెరవేర్చుటకు వారు రేయింబవళ్లెపుడును సంసిద్ధులుగా నుండవలెను. వారిలోచాలమంది తెల్లవారుఝామున మూడుగంటలకే తమతమయాజ్ఞలను తీసికొని వివిధగ్రామములకు పోయి ప్రచురణశాఖవారు ప్రచురించు దైనికవార్తలను పంచిపెట్టుచుండవలెను. కొంతమంది గ్రామపొలిమేరలలో కాచికొనియుండి జప్తుచేయుటకు వచ్చుఆఫీసరులు కాన్పించినను, మోటారుచప్పుడు వినిపించినను హుషారుగానుండి యావార్తను వెంటనే గ్రామప్రజల కెరుకచేయవలెను. వారిలో కొంతమంది యెప్పుడును చిఱుతకుక్కలవలె ప్రభుత్వోద్యోగస్తులను పసికట్టుచుండవలెను. వారు పన్నుచుండునట్టి పన్నాగముల నన్నిటిని పసిగట్టి గ్రామప్రజల కెరుకచేయుటే వారిపని. గ్రామములలోజరుగు సమస్తమును కేంద్రకార్యాలయమున కెప్పటికప్పుడు వారు తెలియచేయుచుండవలెను. అందరును వ్యవసాయదారులమధ్యకు పోయి వారియవసరములను, కష్టనిష్ఠూరములను కనుగొని వారిని యుత్సాహపరచుచు నాయకునియొక్క బోధలను వారికి విశదము చేయుచుండవలెను. రాత్రికి వారందరును తాము చేసినపనులనుగురించిననివేదికలతో తమతమ కేంద్రములకు వచ్చి యలసిసొలసియున్న యవయవములనేతాటియాకులచాపమీదనో విశ్రమింపచేసికొందురు.

వీరందరిపైన సర్దారు ఎప్పుడును తొందరకాని విశ్రాంతికాని యెరుగక, నెప్పుడును మౌనవ్రతమును వహించుచు, తన శిక్షణ నెంతమాత్రమును సడలింపక, తా నొక్కఁడే మిగుల్చుకొనిన ప్రత్యేకహక్కునకు (ఉపన్యాసముల నిచ్చుటకు) శిక్షగా నిశీథములందును, తరుచు రోజుకు మూఁడునాలుగు సారులును నుపన్యసించుచు చక్రము తిరిగినట్లు తిరుగుచుండెను. ఎవరో యొకరువచ్చి 'వారు మనమోటారుకారు లైసెన్సులను తీసివేసినచో మన మేమి చేయగలము?' అని యడుగును. సర్దారు ఫక్కుననవ్వి యిట్లనును 'మనము మనకాళ్ళను తాకట్టుపెట్టలేదు. మనము రోజుకు 25 మైళ్ళచొప్పున నడువగలము. వర్షకాలములో మనకారులు నిరుపయోగములని వేరుగ చెప్పనక్కఱలేదు. మనము బురదలోను ముండ్లమధ్యను ప్రయాణము చేయవలెను. అది మన కానందదాయకముగనే యుండును. ప్రభుత్వోద్యోగు లెవరును యిట్లు చేయజాలరని వేరుగ చెప్పనక్కఱలేదు. వ్యవసాయదారు లతనివద్దకు తమ తమ సందేహములతోను, పితూరీలతోను వత్తురు. "మనము రోడ్డుల కడ్డగట్టుల నేల వేయరాదు? లేక యుద్యోగస్థుల మోటారుకారుటైరులను పగులగొట్టుటకు రోడ్డులమీదగన్నెలను కొట్టి ప్రజలను శనిగాడివలె పీడించుచున్న యే యుద్యోగినో యిట్లు 'దాక్షిణ్యరహితముగా' నేల యూపకూడదు?" అతడు వారితో మెల్లగా చర్చించుచు, దాక్షిణ్యరాహిత్యము

యొక్క యవసరమును వారికి తెలియజేసి పరిజాబాధలోను ప్రజాకలయిక, కట్టుబాటులలోనుయున్న యనంతశక్తిని వారికి విశదము చేయుచుండును. "మీసమర మేకొద్దిలక్షలరూపాయిలకొరకో కాదు. అదియొక సిద్ధాంతముకొరకు. ప్రభుత్వమన్యాయముగా ప్రవర్తించునప్పుడు మీ రందరును కలసి యేకమై శాంతియుతముగా వారి నెదుర్చుటను నేర్చికొనినచో మీరు మీబిడ్డలకు కోట్లకొలది విలువగలయాస్తిని వప్పచెప్పినవారే యగుదురు. మీరాత్మగౌరవముకొరకు పోరాడుచున్నారు. ఇదియే చివరకు మిమ్ము స్వరాజ్యముకు తీసికొనిపోగలదు. వ్యవసాయదారులైన మీ రెల్లపుడును మర్దింపబడుచున్నారు; ఎల్లపుడును నలిపివేయబడుచున్నారు. మీరు చమటూడ్చి సంపాదించిన కష్టార్జితమును భుజించుచున్నారు. మీజీవిత మెడతెగనిబాధలతోను, కష్టములతోను కూడుకొనిన యొకవిషాదగాథమై యున్నది. కాని మీబాధయంతయు నజ్ఞానముచే కలుగుచుండుటచేత బూడిదలో పోసినపన్నీరువలెనున్నది. మీరు పడుబాధలలో పదవవంతు బుద్ధిపూర్వకముగాను, దాని యాధ్యాత్మికప్రభావమును స్పష్టముగా గ్రహించి యనుభవించుచు మీరు యధార్థతపస్సునేల చేయరాదు ? మీ రట్లుచేయుచో, మీరు పవిత్రులుగానుండుచో, దేవతలు మీత్యాగములమీద పూజాద్రవ్యములను కురిపింతురు; నిరంకుశులును, క్రూరులును మీముందు మో

కరించెదరు." గాని యన్నిటికంటెను స్త్రీలలోని ప్రబోధమే చూపరుల కత్యాశ్చర్యమును కలిగించుచుండెను. తమ పురుషులతోను, బిడ్డలతోను, పశువులతోను, యిండ్లలోనే యిరుకుకొనియుండుటతో తృప్తిపడుచు వారు సర్దారు వచ్చినపుడు యిండ్లువిడచి సభలకు యథేచ్ఛగా హాజరగుచుండెడివారు. వారు తమగ్రామములలోనే గాక చేరువలోనున్న యితరగ్రామములకు గూడ పోయెడివారు. చూపరు లడిగినప్రశ్నలకు వారిచ్చు నిష్కపటమైన, సరళమైన, సంశయరహితమైన జవాబులవలన యుద్యమము వెనుకనున్న బలము చూపరులకు కండ్లకుకట్టినట్లు కాన్పించుచుండెడిది. వా రందరిలోను వారడ్ స్త్రీలుమరింత సాహసికురాండ్రు. వారు వారిడివిజనులో జరుగు కొంచెమించుమించు ప్రతిసభకు హాజరగుచుందురు. వారిపాటలు ప్రత్యేకముగా వారివే! అందులో కొన్ని పురాతనబుషిసంతతివారివి; కొన్ని వారిసమరమునకు సరిపడునట్లుగా వారిచేతనే కల్పింపబడినవి. ఈక్రిందిపాటను వా రతిసంతోషముగా పాడుచు నుబ్బి గంతులు వైచుచుందురు.

"జ్ఞానివలె పరిపూర్ణజ్ఞానముతో మీాయాయుధములను తీసికొనుడు. పవిత్రత, తృప్తి మీాకు కవచమగునుగాక? ధైర్యమే మీాకు డాలు. శూరులైనవారు రణరంగమునకురికి పోరవలెను. చవటలు తన్నులు తిని పిక్కబలమును చూపుదురు. కనుక జ్ఞానివలె పరిపూర్ణజ్ఞానముతో యుద్ధరంగమున

సురుకుడు. రణవీధి పూలసెజ్జ కాదు. అది యసిధారవలె నతిని శితమైనది. అది సత్యయుద్ధము, ధర్మయుద్ధము. కనుక జ్ఞాని వలె మనమెల్లపుడును ప్రబుద్ధులముగానుండవలెను.......నిరంకుశునకు పిచ్చియెత్తి రైతును కాలిక్రిందపెట్టి న లిపివేసినాడు. మన మింతవరకును సుషుప్తిలోనుంటిమి. ఇప్పుడు మనగురువు మనకు లభించెను. మనకు జ్ఞానోదయమైనది.......నిరంకుశత్వమును,అన్యాయమును ధర్మముతోను, సత్యముతోను యెదుర్కొనవలసినదని యతడు మనకు బోధించెను. భగవంతుడు ధర్మమును కాపాడుటకు పరుగుపరుగున వచ్చును. అధర్మము నతడు అణచివేయును.......మననాయకుడైన వల్లభాయి చివరకు జయము మనకు నిశ్చయమని చాటుచున్నాడు. కనుక మనము మనదీక్షను పాలింపవలెను......."

ఈబోధలన్నియు తూచా తప్పకుండ శిరసావహింపబడుచుండెను. ఒకయుదాహరణమును తీసికొనుడు. ఒకజప్తుఆఫీసరు తనసిబ్బందితో నొకగ్రామమును ముట్టడింపమని యాజ్ఞాపించెను. పైకొక్కయింటినే ముట్టడించినట్లు కాన్పించినను యథార్థము కావీధియంతయు ముట్టడింపబడెను. ఆయింటి ముందర సాయుధపాణులగుపోలీసులును, సర్కిలుయినస్పెక్టరును యిద్దరుపఠానులును కాపలాయుండి వారిదృష్టిలో నెచ్చట యెవరు తలుపుతెఱచినను మీాదపడుటకు రేచుకుక్క

లవలె సిద్ధముగ నుండిరి. వీ రచ్చట ఉదయము 2-30 నిమిష ములు మొదలు సాయంకాలము 6 గంటలవరకు నుండిరి. అప్పుడే మే మచ్చటకు పోతిమి. ఆయిల్లు 75 వత్సరములప్రాయముఁగలిగినయొక ప్రభుత్వపింఛనుయుద్యోగిది. అతడు సత్యాగ్రిహపత్రిముపై సంతకముకూడ చేయలేదు. అయినను పింఛనుదారును లొంగదీయుట కిదియే యుపాయమని యాయుద్యోగస్తుడు తలంచెను. ఆవృద్ధునిభార్య మేడకిటికిటీలో కూర్చొని రుద్రాక్షమాలను చేతపుచ్చుకొని రామనామసంకీర్తనము చేయుచుండెను. అప్పుడు సర్దారు 'ఓవృద్ధజననీ! నీవు భయపడుటలేదని నేను తలంచెదను' అని యింటివెలుపలనుండి యామెను ప్రశ్నించెను. 'మమ్ము రక్షించుటకు నీ వచ్చటనుండగా నేనేలభయపడవలెను?' అని యామె బదులుచెప్పెను.

'నేనుకాదు, రాముడు' అని సర్దారు యామెతప్పును సవరించెను.

'నిజముగా రాముడు దయాసముద్రిడు' అని యామె తలయూపెను.

'కాని యీపఠానులును, పోలీసులును నీగుమ్మముముందరనుండుట నీకెట్లున్నది?' అని మాలో నొక డామెను ప్రశ్నించెను.

'వారికి నేను స్వాగతము నిచ్చుచున్నాను. వా రిచ్చుట లేనిచ్చో సర్దారు నాయింటికివచ్చుభాగ్యము నా కెట్లుకలుగును?'

ఆహా! ఆవృద్ధురా లాపదిహేనుగంటలును తనగుమ్మముదాటి పయికి పోజాలకపోయినను యొక్కచెడుపలుకుగాని యొక్కపరుషవాక్యముగాని యామె నోటినుండి రాలేదు.

# బార్డోలీ విజయము.



## ఇరువదియవ యధ్యాయము.



"ఇంద్రజాలము కాదు."

"అజేయులమగువరకును మనబలమును మనమడుగ డుగునకును చేకూర్చుకొనవలెను." "మాక్స్వినీ"

బార్డోలీవిజయ మొకయద్భుతకలాపము వలన చే కూరినదికాదు. అది యోపికతో కష్టపడి చెమటూడ్చి నిరంతరకృషిచే సంపాదించినఫలము. అది రేయింబవళ్లు సర్దా రు నూరిపోసినబోధలయొక్క ఫలము. మొదటి రెండుమా సములలోను నతడు బార్డోలీసమస్యకు వారమునకు మూడురో జులుమాత్రమే వినియోగించెను. అహమ్మదాబాదుపురపా లకసంఘు మతనిని విడిచిపెట్టుటతోడనే యతడు తన జాగ్ర త్కాలమునంతను బార్డోలీప్రజలకొరకే వినియోగించెను. సాధారణముగా నతనిదినము సాయంత్రము 5 గంటలకు ప్రా రంభమయి యుదయము రెండుగంటలతో దామాషాను నా లుగైదు యుపన్యాసములతో నంతమొందును. అతనివిజయ మున కొకరహస్యమును అనగా వ్యవసాయదారును దేవతా గణముగా పరిగణించుటను నేనిదివరకే సూచించియుంటిని.

తనబోధలనన్నిటిని యొకటొకటిగా ప్రజలలో ప్రవేశపెట్ట గలిగిన సర్దారుయొక్క యద్భుతయోరిమియే రెండవకారణము. అతడు వ్యవసాయదారులకు నేర్పిన మొదటిపాఠము నిర్భయత్వము. అన్నింటికి పైన సర్కారుయొక్క భయమొకటి బాధించుచున్నది. 'ఈ కౌరవిదయ్యము' వలని యీభయమేమిటి? ఈ ప్రభుత్వమనగా నేమిటి? దీని నెవరైనను చూచినారా? దీనిని నే నెప్పుడును చూచియుండలేదు. ప్రభుత్వమనగా తహసీల్దారా? లేక మునసబా? లేక పెత్తందారా? లేక వీరందరును కలసి ప్రభుత్వమా? సర్కారు అను వ్యక్తి యెవరును లేదు. కనుక మనము వ్యక్తులను ఘనులను చేసి వారిని సర్కారులక్రింద చేయనేల?' ఇట్టి యుపన్యాస పరంపరల నతడు కురిపించెను. 'రైతుకవసరసమయములో రైతుపక్షమున నుండువాడు అమల్దారు. తక్కినవారందరు హావల్దారులు (చిన్ననౌకరులు)' అని యతడు నిర్వచనము చెప్పెను.

అతని రెండవపాఠము ఐకమత్యమును బోధించెను. పొలములను దున్నువారు, పొలములను కవులుకిచ్చువారు రెండు విరుద్ధప్రయోజనములుగల సంఘములుగా పైకి కాన్పింతురు. రెండవవారికి యెక్కువ బాధ్యతకలదు. వారు పొలముదున్నువాని కండగా నుండనిచో సమరము నడలిపోవును. అదృష్టవశమున తాలూకాలోనున్న ప్రజలలో చాల

మంది స్వయముగా వ్యవసాయముచేసికొను చిన్నచిన్న భూస్వాములు. కవులుకిచ్చినవారు చాలతక్కువ; అచ్చటచ్చట చెదురులుగానున్నారు. అయినప్పటికిని సర్దారుయొక్క తొలి దండయాత్రలు వ్యవసాయము చేయని యీ చిన్నభూస్వాములకోట లనదగు వాలడ్, వాంకనరు, బార్డోలీలమీదకే సాగింపబడెను. 'పన్ను హెచ్చించుటకు భూమియొక్క మక్తా విలువ పెరుగుట యొక్కటే కారణము. ఈపెరుగుట యదార్థమైనను అయదార్థమైనను దీనికి మీరే బాధ్యులు.' 'మీ పాపములకొరకే తాలూకాయంతయు బాధపడుచున్నది. మీరు చేయవలసినది తక్కువతపస్సు వారికి మీరండగా నుండుటయే! మీరు సర్కారుకు భక్తితత్పరులై యుందురా? లేక భూమిదున్నువారిపట్ల భక్తిపరులై యుందురా? మిమ్ము సర్కారుకు బంధించునదేది? పన్ను చెల్లించుటయే! కాని మిమ్ము వ్యవసాయదారులతో బంధించునది యొక చైతన్యయుతమైన బంధనము. మీరు వారి పరిశ్రమమీదనే జీవించుచు మీ వ్యవహారములను నిర్వహించుకొనగలుగుచున్నారు. వారు నాశన మగుచో మీ రెచ్చటనుందురు? మీ ప్రాణాధారమైనవారిపట్ల ద్రోహులు కాకుడు.' మరియొకచోట నతడిట్లు చెప్పెను. "షాహుకారు వ్యవసాయదారుతో క్షీరనీరన్యాయముగా సమ్మేళనమునొందెను. ఈ రెంటిని విడదీయుట దుస్సాధ్యము. పాలను మరగబెట్టినపు డేమిజరుగునో మీ రె

నగుదురా? పాలను రక్షించుటకు నీరు క్రిందకు పోయి తాను మఱిగి పాలను పైకి నెట్టును. పాలు నిప్పునార్పివేయు టకు బుసబుసపొంగి నీటిని రక్షించును. మీరీవిధముగా నొ కరికొకరు సహాయపడుదురని నే నపేక్షించుచున్నాను."

వ్యవసాయముచేయు రైతులందరు నేకముగా నుందు రను పత్రిమే సత్యాగ్రహపత్రిము. ఈపత్రిములమీాద సంత కములు చేయించుటకు మొదటిమాసమంతయు పూర్తిగా వినియోగింపబడెను. వివిధశిబిరములనుంచి వచ్చిన నివేదికలు ప్రతిగ్రామమును గురించియు సంతకములు చేసినవా రెంద రో, తప్పించుకొన్నవా రెందరో, సణుగుచుండువా రెందరో మొదలగు పూర్తివివరములను తెలుపుచుండెను. ప్రతిదిన ము వచ్చుచుండు వార్తలనుబట్టి సర్దారు తనకార్యక్రిమమును నిర్ణయించుకొనుచుండును. సాంఘికబహిష్కరణము, వెలి వేయుట యను మహాస్త్ర మీాసందర్భములోనే విరివిగా నుప యోగింపబడెను. ఈ యస్త్రమే ప్రిభుత్వమును చిందులుత్రొ క్కించెను. కాని వారేమిచేయగలరు? శిక్షాస్మృతిలోనిది యొక నేరముక్రిందరాదు. ప్రిజల చేతులలోనున్న యీయొ క్కయస్త్రమునుకూడ నుపయోగించుకొనుటకు క్రుళ్లుచుం డుప్రిభుత్వమును సర్దారు వేళాకోళము చేయుచుండును. "మీామట్టుకు మీారేమిచేయుచున్నారు? మీాది ఆయుధబల ముచే కాపాడబడుచున్న యొక చిన్నసంఘము. దాని యుద్దే

శ్య మొకజాతినంతను దాస్యములోనుంచుటకంటె నుదార
మైనదికాదు. మేమో ! మమ్మేమేము కాపాడుకొనుటకు
మమ్మేమేము రక్షించుకొనుటకు మేమీయస్త్రము నుపయో
గించుకొనవలెను.' కాని దీనికున్నహద్దుల నెన్నడు నతడు
చెప్పక విడువలేదు. మొట్టమొదటిదేమనగా నెట్టి పరిస్థితుల
లోనైనను సరే యేసత్యాగ్రహియు బహిష్కరింపబడినవా
రికి కావలసిన శారీరకావసరములను తిరస్కరింపరాదు.
'నిర్బంధము, బాధించుట యెన్నడును పనికిరావు. మన మెవ
రికిగాని పాలు, నీరు, ఆహారపదార్థములు, అస్వస్థులుగానున్న
పుడు సహాయము తిరస్కరింపరాదు. మన మానవదయాం
తఃకరణను నాశము చేసికొని మనము బహిష్కరణమును సా
గింపనేరము.'

కాని పై తాలూకాలనుంచి వ్యవసాయదారులనుండి
వశపరచుకొనబడిన భూములను కొనుటకు వచ్చినవారిపట్ల
మాత్రము తీవ్రమైన బహిష్కరణము ప్రయోగింపబడెను.
ఈ బహిష్కరణములో ప్రధానమైనది వారి భూములను దు
న్నుటకు తిరస్కరించుటయే. ఇది నిశ్చయముగా సేవను నిరా
కరించుటే యగుచున్నది. కాని పైనుంచి వచ్చినవారి నిట్లుచే
యనిచో బహిష్కరణమున కర్థమేమియు లేదు. అట్టివారిని
క్రూరమైన కుచ్ఛితపన్నాగములనుంచి దూరులను చేయుటకు
తగినవైద్య మిదియే! వారికి కేవలముభూములే కావలసినచో

నా రాచోద్యము ననుభవింపవచ్చును కాని వ్యవసాయ ముచేయుట కవివారికి దక్కవను నమ్మకమును వారికి కలిగింపవలెను.

తాలూకాలోనున్న పార్టీలు మొదలగు చిన్నసంఘములపట్ల బహిష్కరణమును సడలింపవలసిన దని యత డెల్లపుడును చెప్పుచుండెను. మాంశీకప్పూరులో నొకపార్టీని యనేకవిధముల బాధించుచున్నా రనుసంగతి విని యత డచ్చటకుపోయి యొక యిష్టాగోష్టిసభ చేసెను. ఆసభ కాపార్టీనికూడ నాహ్వానముచేసిరి. వైద్యసహాయమును నిరాకరించి రనువార్త యసత్యమనియు తన సారాదుకాణముమీదకు వచ్చు కాతాదారులను త్రిప్పివేసిరనియు,మంగలిపని చేయుటకు నిరాకరించెననియు, వ్యవసాయపుకూలి నిరాకరింపబడెననియు నతడు చెప్పెన [illegible] ఘు సర్దారు ప్రజల కిట్లు చెప్పెను. "మీా రెవ [illegible] మీాదకు వెళ్ళుమని బలవంతపెట్ట జాలరు [illegible] మరియొకకొట్టుకు

చక్కగా బోధింపబడెను. ప్రథమములో జప్తునోటీసుల నందు కొనినవారే జప్తుఆఫీసరులు వచ్చినప్పుడు తలుపులు బిగించి కొనవలెను. తరువాత గ్రామములు గ్రామములే చీకటికొట్లుగా మార్చివేయబడెను. ఆబాధను సహింపలేనివా రున్నచో వారినందరును తీర్థయాత్రలకు పొమ్మని పరిహాసముగా చెప్పుచుండెడివారు. ఎంత కట్టుదిట్టములు చేసినను పఠానులు బండ్లనెత్తికొనిపోవుట, కంచెలనుదాటి దొడ్లలో కురుకుట, తలుపుల నుతకలెత్తుట మొదలగుపనులు చేసినప్పుడు సర్దారు 'మీబండ్లను ముక్క ముక్కలక్రింద నూడఁబెరుకుడు. మొండెము నొకచోట, చక్రముల నింకొకచోట, ఆకులను మరియొకచోట పారవేయుడు. మీకంచెలను బొమ్మచెముడు ముండ్లతోను, పొదలతోను మరింత బలకరముచేయుడు. మీతలుపులను గొడ్డళ్ళతో పగులగొ... కాని తెఱచుటకు వీలులేనట్లుగా బలముచేయుడు. ...గా ముప్పుతిప్పలు పెట్టుడు.'

కే యత డిట్లు చెప్పెను. 'వారీభూములను యింగ్లండుకు మోసికొనిపోజాలరు. పోలీసువారును, మిలిటరీయును వ్యవసాయము చేయలేరు. ఇక భూములతో వారేమిచేయుదురు?'
ప్రజలలో మంచి కట్టుబాటులు జరిగి వారిలో నెట్టి చీలికను కలిగించుట కవకాశము లేవియు లేవని తెలిసినతరువాత నతఁడు వారిని భూములను లాగికొనిరను నోటీసులను లెక్క చేయకుండ విత్తుట నారంభించమని చెప్పి వ్యవసాయదారుల భూమి నొక్కయంగుళమునైనను యెట్లు లేకుండ చేయగలరో చేయుమని ప్రభుత్వమును సవాలుచేసెను. ఉద్యమము పొడుగునను శాంతికెక్కువ ప్రాధాన్య మీయబడెను. కలెక్టరు 'అగ్నిహోత్రము, దాక్షిణ్యము' అను బూదిని తెచ్చిపెట్టినప్పటినుంచియు సర్దారు శాంతివచనముల నెప్పుడును చదువుచునే యుండెను. "ఈయుద్యమములో దాక్షిణ్య ముపయోగించునని మీ రెన్నటికిని తలంపవలదు. ఆయుధబలముతో బ్రిటిషుప్రభుత్వము నేప్రభుత్వము జయించజాలదు వారు తలచుకొనినచో తాలూకానంతను రూపుమాపవచ్చును. ఎంతకోపమునకు కారణమున్నను మీ చూపు వ్రేలునైనను చూపవలదు. ఆత్మసంరక్షణకు మన కధికారమున్నను (అది యతిపవిత్రమైనది) మిమ్ము నిందించినను, చావమోదినను కూడ మీరు ప్రతిక్రియకు బూనరాదు. ప్రభుత్వమునకు చీమకాలంత సందు దొరికినచో వారు దానిని దుర్వినియోగము చేయుదు

రు. మన మార్జించుకొనిన మంచియంతయు బూడిదలో పో
న పన్నీరుచంద మగును."

"ప్రధానమైన రణరంగమును చక్కగా పరిశోధిం
చుచుండుట, శత్రువులయొక్క నడకలను కనిపెట్టుచుండుట, మ
బలమును, శక్తిని సరిగా గుర్తించుకొనుట, అడుగడుగుకు
మన మజేయుల మగువరకు మనబలమును వృద్ధిచేసికొనుచుం
డుట-" యివియే యుద్యమములో నన్నిటికంటె ప్రధానమైన
వని సర్దారు గ్రహించెను.

# బార్డోలీ విజయము.



## ఇరువదియొకటవ యధ్యాయము.



"సమరము తుములమగుట."

ఒకవంక బార్డోలీ దినదినప్రవర్ధమానమగుచు తన శక్తిని తాను గ్రహించుచుండ ప్రభుత్వముకు గంగవెర్రి లెత్త నారంభించెను. ఇంతవరకును బార్డోలీలో నెదురైనను పెట్టనిస్మార్టుగారు రంగములోనున్న తన తాబేదార్ల యభయ హస్తమును పురస్కరించుకొని తుదకు యుద్యమము నలిపి వేయబడుననియు, కాలముకొరకు మాత్రమే వేచియుండవలె ననియు నూట లూరుచుండెను. తాలూకాచుక్కానివద్దనున్న యుద్యోగులు కేవలము స్మార్టుగారు చెప్పినవాక్యమును విశ్వ సించుచుండిరి. వారి కతడే రంగములోనున్న మనిషి. ప్రభుత్వ మండలములలో మే మాసాంతముకు ఉద్యమ మంతరించుననను నభిప్రాయములు ప్రచారము చేయబడుచుండెను. చివరకు వారి జోస్యములన్నియు విఫలమైనప్పుడు తీవ్రమైనచర్యలను తీసి కొనుట కొకయుద్ధాలోచనసభ జరుపబడెను.

దివానుబహాదరు హరిలాల్ దేశాయిగారి రాజీప్రయ త్నములకు పురిటిలోనే సంధికొట్టెను. మొదట హెచ్చుపన్ను

చెల్లింపవలెను. తరువాత విచారణ సలుపబడును. అను సూచనను ప్రజ లంగీకరింపజాల రని వల్లభాయిగారు స్పష్టపరచిరి. మే 31 వ తేదీని ప్రభుత్వమువారు 'బార్డోలీతాలూకాలోను వాలడ్ మహాలులోను భూములు కలవారి కొకప్రకటనను' జారీచేసిరి. అందులో దార్జన్యమును గురించి, యిండ్లు తగుల పెట్టుటను గురించి యేమియు లేదుకాని "జప్తుకు దొరకకుండ తప్పించుకొనుటకు మంచి కట్టుదిట్టములు చేయబడెననియు, నిండ్లకు తాళములు వేయబడెననియు, గ్రామపెత్తందార్లను వెట్టియానులను బహిష్కరింతుమనియు, వెలివేయుదుమనియు, భయపెట్టుచున్నారనియు" వాటివలన బాకీలను వసూలు చేసికొనుట సాధ్యముకాకపోయె ననియు వారు మొరపెట్టుకొనిరి. కనుక వా రయిష్టముగా 'భూములను లాగికొనుట కుపక్రమింపవలసివచ్చెననియు, దున్నలను, గేదెలను, చరాస్తిని జప్తుచేయక తప్పినదికాదనియు' చెప్పిరి. దీనికొరకే వారు పఠానులసహాయమును తీసికొనిరట ! 'పఠానుల ప్రవర్తన యన్నివిధముల నాదర్శప్రాయముగా నుండెనని ప్రభుత్వమువారు తృప్తిపడి'రట ! 'తమ భూములు ప్రభుత్వమువారి యనాక్రమణ బంజరుక్రింద లెక్కలలో జేర్చుకొనబడుననియు......నా విధముగా నొకసారి ఖర్చుపెట్టినభూము లికనెన్నడును వారికి తిరిగి యివ్వబడవనియు' నిదివరకే వ్యవసాయదారుల కిచ్చిన

ంచలింపును మరియొకసారి జ్ఞాపకము చేసిరి. 'ఇంతవరకును 400 యకరములు ఖర్చుపెట్టబడెననియు, త్వరలోనే మరి 200 యకరములు ఖర్చుచేసెదమనియు, 'సూరతుజిల్లాలో నున్న హిందువులు, మహమ్మదీయులు, పార్శీలు మొదలగు వరఖాస్తుదారు లందరును యీభూము లన్నిటికొరకును పరుగుపరుగున వచ్చుచున్నారనియు' 'ఇంతవరకును తాలూకా లోను మహాలులోను రావలసిన మొత్తపు ఆదాయములో లక్షరూపాయలవరకు వసూలు చేయబడెననియు' 'సాంఘిక బహిష్కరణము, వెలి, జుల్మానాలు' లేనిచో 'పన్నులు చెల్లించుటకు బోలెడుమంది కుతూహల పడుచున్నారనియు' కనుక కలెక్టరుగారు జూన్ 19వ తేదీనిగాని యాలోపలగాని పన్ను చెల్లించువారికి జుల్మానాలో నాలుగవవంతు విడిచిపెట్టుదురనియు ప్రభుత్వమువా రొకప్రకటనను చేసిరి.

అసత్యసూచనలు, యథార్థమును మఱుగుపరచుట, పదేపదే భయపెట్టుట మొదలగు వాటికి పుట్టినిల్లు అగు యీ ప్రకటనను ప్రజలు మరియొక దివాలాప్రదర్శనముగా పరిగణించిరి. శిక్షకు పాత్రులగుదురను నోటీసులు విఫలమయ్యెను; ఆస్తుల నమ్మివేయు తంతు విఫలమయ్యెను. భూములను లాగుకొను నోటీసులు, దున్నలను, గేదెలను జప్తులు చేయుట విఫలమయ్యెను. ఇక కొంతభూమి నిదివరకే యమ్మివేసితిమి ; చాలభూమిని ముందు అమ్మబోవుచున్నారమను

కోతలు ప్రభుత్వమువారు రైతుయొక్క అంగుళము భూమి నైనను తాకజాలరను విశ్వాసమును మరింత బలపరచెను. ఈ ప్రకటన శ్రీయుత వల్లభాయిలోనున్న సమరశక్తిని బయటకు తెచ్చెను. అతడు ప్రభుత్వమువారి తప్పుడు యంకెల నవలీలగా ఖండించివైచుటను చూచునపుడు లాయిడ్ జార్జి జీవితములోని యొకకథ జ్ఞాపకము వచ్చుచుండును. బోయరు యుద్ధము జరుగుచుండగా కిచనరుప్రభువు యాజమాన్యమున వార్తాశాఖవారు వారంవారము 1200 బోయరులు 2000 తుపాకులు పట్టుబడె ననుకరపత్రములు ప్రచురించుచుండెడివారు. లాయిడ్ జార్జి యుద్ధరంగములో నెంతమంది బోయరు లున్నారని మే మాసములో నడుగగా 15000 కు 20000 కు మధ్య నుందురని జవాబుచెప్పిరట. అక్టోబరులో లాయిడ్ జార్జి లెక్కప్రకారము చూడగా కిచనరుప్రభువు వారమున కిరువదిలక్షలపౌనులు ఖర్చుపెట్టి హాజరులేని మా యాశత్రువులతో పోరాడుచున్నాడనియు, శాంతిని ప్రకటింపవలెననియు పార్లమెంటుముందు మెల్లగా నొకతీర్మానమును తీసికొనివచ్చెను. ఏలననగా నావీరుని (కిచనరు) స్వంతలెక్కల ప్రకారము ప్రతివారము పట్టుబడినశత్రువులు మే మొదలు అక్టోబరులోగా 30,000 కు పైగా నున్నారు. ప్రభుత్వమువారు తమప్రకటనలో 1400 యకరములు అమ్మివేసినట్లును, యింకను 5000 యకరములు అమ్మివేయుదుర

నియు, లక్షరూపాయిలు వసూలు చేయబడెననియు ప్రకటించిరి. "ఈ భూములు యెంతసొమ్మునకు విక్రయింపబడెనో తెలుపవలసినదని నేను ప్రభుత్వమువారిని కోరుచున్నాను. వారి. సెటిల్‌మెంటు కమీషనరుగారి లెక్కలప్రకారమే భూములధరలు పన్నుకు 123 రెట్లున్నవి. కనుక వారు తమబాకీకంటె చాలరెట్లు యెక్కువమొత్తమునే రాబట్టినారు. లేదా ఆభూములను చాలతక్కువధరలకు పారవేసినారు. మొదటి విధముగా చేసినచో వారి కిక బాకీయేమియు లేనేలేదు. రెండవవిధముగా జరిగినచో వారెట్టి ఖరీదులను రాబట్టిరో ఆఖరీదులను బట్టియే భూమిపన్ను విధింపబడవలెను" అని శ్రీయుత వల్లభాయి సవాలు చేసెను. ఈవేళాకోళము ప్రభుత్వనటనలను పూర్తిగా బట్టబయలు చేసెను. ఇక పఠానుల యోగ్యతనుగురించి '... పఠానుల ప్రవర్తన సర్వవిధముల నాదర్శప్రాయ... నేనంగీకరించెదను. ఏలనందురా ... పఠానుల యుదాహరణము ...లు

యిట్లుచెప్పెను. "వీటిని వారు జీర్ణించుకొనజాలరని తెలిసి కొందురుగాక ! వీటిని కొనిన పార్సీలు తా మిందులో నొక్క చాలు దున్నుటకు పూర్వము తమ పార్సీ సోదరసోదరీమణుల సుకుమారగాత్రములను తుపాకిగుండ్లతో దున్నవలెననియు, తమపొలములను వారి యెముకలతో యెరువు కట్టవలెననియు, గ్రహింతురుగాక ! ఎవ్వరైనను మహామ్మదీయులుగాని, హిందువులుగాని యిందులోనున్నచో వారును యిట్టి విధినే యనుభవింపక తప్పదు" అతడు ప్రభుత్వమును పరిహాసాస్పదమైన బలప్రదర్శనములతో కాలయాపన చేయక తమఝుడి పింపుల నాచరణకు తెమ్మని కోరుచు వ్యవసాయదారులను మరిన్ని బాధలకు సిద్ధము కండని హెచ్చరించెను. "పరిహాసాస్పదమైన యీబలప్రదర్శనమువలన లాభమేమి ? వ్యవసాయదారుల నిట్లు పీడించుట, బాధి[illegible] వ ప్రయోజనమేమి? వీటివలన వారు లా[illegible] [illegible]కల్ల. ప్రభుత్వమువారు సైన[illegible]

[illegible]

చరుగాక ! గుండ్లు మనవ్యవసాయదారుల చెవులదగ్గిరనుండి రివ్వుమనుచు నలుదిశలకు పోవునాడే వారు మానవస్థితిలోని కి వత్తురు; అప్పుడే వారిశక్తి యభివృద్ధి చెందును.'

ప్రభుత్వమువారు సత్యాగ్రహుల దృఢసంకల్పమును భగ్నము చేయుటకు పన్నుచున్న వంకరమార్గములకన్న సాంఘికబహిష్కరణము, వెలివేయుట మొదలగు శాంతియుతమైన ఆయుధముల నుపయోగించుటకు ప్రజలకు హక్కున్నదనియు, నదియే శాస్త్రసమ్మతమైనదనియు నతడు సమర్థించెను. పఠానుల 'ఆదర్శప్రాయమైన ప్రవర్తన' ను గురించి సత్యాగ్రహప్రచురణశాఖవారు పఠానులచే నవమానింపబడినస్త్రీలనుండియు, బాలికలనుండియు ప్రమాణముపైని వాఙ్మూలములను తీసికొని సర్వమును వెల్లడిచేసిరి.

సర్దారు అమ్మివేయబడెనని ప్రకటింపబడిన భూముల మీదనే తన కూతురును, మితుభెను పెటిటు కన్యను, భక్తిలక్ష్మి దేశాయిని తమ తమ కుటీరములను నిర్మించుకొని స్థావరమేర్పరచుకొనవలెనని యాజ్ఞాపించెను.

ప్రభుత్వబెదిరింపులకు ప్రజ లనేక విధముల సమాధానము చెప్పిరి. ప్రభుత్వప్రకటనయే బార్డోలీసమస్యను యావద్భారతసమస్యగా చేసెను. దేశమంతటనున్న వార్తాపత్రిక లీసమస్యను యావద్భారతసమస్యగా పరిగణించెను. ప్రతిదినము బార్డోలీవార్తలతోను, దేశమంతటను యీస

మరము నభినందించుచు గావింపబడుచున్న వార్తలతోను యివి నిండిపోవుచుండెను. ఇట్టి సమయములో అసెంబ్లీ సభాధ్యక్షుడగు విఠల్‌బాయిపటేలుగారు గుజరాతీయు, గుజరాతు తరఫున అసెంబ్లీసభ్యుడును నగుటచే సమరమును మొదటనుంచియు జాగ్రతగా పరీక్షించుచు తనకున్న బాధ్యతను, అభిమానమును కార్యరూపమున చూపనెంచెను. అతడు తనవద్దనున్న యథార్థములను వైస్రాయి కెఱుకపరచి పరిస్థితులు చక్కబడనిచో తాను చేయనున్న పనినతనికి తెలియజేసి ప్రభుత్వప్రకటన వెలువడుటతోడనే గాంధీజీకొకయుత్తరమును వ్రాయుచు నెలకు రు 1000 సత్యాగ్రహనిధికి విరాళమును వాగ్దానముచేసెను.

ఈ యుత్తరము భారతదేశచరిత్రలో నొక యద్భుతపత్రిమనుటకు సందేహ మేమియు లేదు. దేశమంతయు దీనిని వేనోళ్ళ పొగడ నారంభించెను. దానిలోని ముఖ్యభాగము నిందు పొందుపరచుచున్నాను.

“ఈ సమరమును నేను పరీక్షించినంతవరకు బార్డోలీప్రజలు స్వతంత్రమైనట్టియు, నిష్పక్షపాతమైనట్టియు విచారణను కోరుటకు న్యాయమైనహక్కును కలిగియున్నారనియే నేను విశ్వసించుచున్నాను. తమ బాధలను నివారించుకొనుటకు వారిచేతులలోనున్న అన్ని యితరచట్టసమ్మతమగు మార్గములను వారు త్రొక్కిచూచినా రనియే నాకు

నమ్మకము కలిగినది. తాలూకాప్రజలకును ప్రభుత్వముకును వివాదాంశముగానున్నపన్ను వసూలుచేయుటలో ప్రభుత్వమువా రుపయోగించిన కొన్ని నిర్బంధచర్యలను కూడ నేను దుఃఖముతోను, కోపముతోను వీక్షించి యుంటిని. ప్రభుత్వమవలంబించినచర్య లనేకసందర్భములలో న్యాయమును, క్రమమును, సత్యతను దాటిపోయినవనియే నేను విశ్వసించెదను. కమీషనరుయొక్క పొగరుమోతు లేఖ పరిస్థితులను మరింత యధ్వాన్నము చేసెను.

ఇట్టిపరిస్థితులలో నే నూరక సోమరిగా నుండజాలను. నేను మాతాలూకాప్రజలయెడల నాకుగల గాఢాభిమానమును, నిర్బంధచర్యలయెడలను కమీషనరుయొక్క యుత్తరముపట్లను అసమ్మతిని ప్రస్తుతము సత్యాగ్రహనిధికి 1000 రూపాయిలు పంపుటకంటె నెక్కువకార్యరూపమున చూపజాలనందుకు చాలవిచారించుచున్నాను. సమర మంత మగువరకును నే నిట్లే నెలనెలకును పంపుటకు నిశ్చయించుకొంటిని. మొట్టమొదటియవకాశము చిక్కగానే న న్నీయున్నతపదవిలో నుంచినవారితో సంభాషణలు జరుపుచుందుననియు, బార్డోలీబాధితులకు సహాయముచేయుట కింకొకతగుచర్య నాకు కాన్పించుచో నెంతమాత్రమును వెనుదీయువాడనుగాననియు నే నభయహస్తము నిచ్చుచున్నాను."

గాంధిజీ చెప్పినట్లు 'అరిష్టమగు బానిససాంప్రదాయ మును పగులగొట్టిన' (అనగా ప్రభుత్వముతో ప్రజలెట్టిపో రాటములైన చేయునపుడు ప్రజలయెడ సానుభూతి చూపకుం డుట) అసెంబ్లీయధ్యక్షుని వానిశి తదితరులకు మార్గదర్శక మయ్యెను. అతనివంటిస్థితిలో నేయున్నవా రింకనుకలరు. అతని చర్య యుద్యోగములతో కులుకుచున్న వారికి కంటకప్రాయ మయ్యెను. కాని దాని కత డేమిచేయగలడు? నారిమన్, బలూభాయి దేశాయి, నారన్ దాస్ బేచార్, జయకాందా సు దాలత్రాం మొదలగు శాసనసభ్యుల రాజీనామాలును తరువాతవచ్చినరాజీనామాలును అధ్యక్షుని యుదారాదర్శము యొక్క ఫలితమనియే చెప్పవచ్చును. దీనివలన నితరప్రజా హితైషులు కూడ తమధర్మములకు పురికొల్పబడిరి.

కాని యీపెద్దలకన్న తక్కువస్థితిలో నున్నవా రెల్లు తమధర్మనిర్వహణముకు మేల్కొనిరో దేవతలే చూచి యా నందింపతగినదృశ్యము. తాలూకాలోని 63 మంది పటేళ్ళు ను 11 గురు తలాతీలును రాజీనామాల నిచ్చిరి. ఈత్యాగము లోనున్న గొప్పతనము కొత్తవానికెవనికిని గోచరముకాదు. 1921 లో నుద్యమము మంచితీవ్రముగాను, వాతావరణమం తయు త్యాగముతోను వీరకలాపములతోను నిండియున్నపు డు కూడ తలాతీ లెవరును రాజీనామాల నీయలేదు. పెద్దయు ద్యోగస్తులు రాజీనామాల నిచ్చుటకంటె యీచిన్నయుద్యో

గస్తులు రాజీనామా లిచ్చుటే బహుకష్టతరము. అట్టివీరు 20, 25 సంవత్సరములనుండి యనుభవించుచున్న పదవులను విడిచి పెట్టుటకు కలిగినత్యాగము ప్రజలనుభవించుచుండిన బాధల లోని పవిత్రతను, బలమును చాటుచున్నది.

తాలూకాబయటప్రజలలో కలిగిన ప్రబోధముకు మితిలేకయుండెను. గుజరాతులోని వివిధజిల్లాలలో సభలు జరుపబడెను. వారియాలోచనసభల కధ్యక్షతవహించుటకు బుద్ధిపూర్వకముగా 'బయటనుండి' మనుష్యులు రప్పింపబడిరి. సింధుశాసనసభ్యుడు జయరాంచాసు సూరతుసభ కధ్యక్షత వహించెను. ఖేడాలో శ్రీయుత ఖాడిల్కారు, బోరిదిలో నారిమన్, అహ్మదాబాదులో కెల్కారుప్రభృతు లధ్యక్షత వహించిరి. ప్రతిసభలోను వల్లభాయి నిర్దాక్షిణ్యముగా ప్రభుత్వమువారి న్యాయశూన్యమైన పద్ధతులను బయలుపెట్టుచు సకాలములో న్యాయముజరుగనిచో నీయాందోళన గుజరాతు అంతయు వ్యాపించుననిచాటెను. ఈసభలకు ప్రజలు నేల యీనినట్లు వచ్చుచుండెడివారు; ప్రతిసభలోను వేలకొలది రూపాయిలు వసూలుచేయబడెను.

జయరాందాసు సూరతులో జూన్ 12 వ తేదీని దేశమంతటను బార్డోలీదినముగా పరిగణించవలసినదనిసూచించెను. మహాత్ముడును, కాంగ్రెసుఅధ్యక్షుడును దీనిని బలపరచిరి. భారతదేశమంతటను ప్రతినగరమందును, గుజరాతులో

ప్రతిపల్లెయందును యీదినము ఉత్సవములతోను, హర్తాళ ములతోను, సభలతోను, భజనలతోను, వసూళ్ళతోను కోలాహలముగానుండెను. కీర్తిశేషుడైన లాలాలజపతిరాయి యీదినమున 2000 రూపాయిలు తంతిద్వారా పంపి తానుసే వచేయుట కవకాశమీయనందులకు విచారించుచున్నట్లు తం తివార్తద్వారా తెలియచేసెను. ఈయుద్యమమును బార్డోలీ కే నియమించుటకు గూడ నతడు విచారపడెను.

బొంబాయిలోని యువజనులలో మితిలేనిప్రబోధము కలిగెను. వారు యింటింటికి వెళ్ళి వసూళ్ళుచేయుచు జూలై మాసములో ప్రత్యేకముగా తామొక బార్డోలీదినమును సలి పి గొప్పయుత్సవముచేసిరి. ఒకప్రక్క వర్షము కుంభవృష్టిగా కురియుచుండ మరియొకప్రక్క సర్దారుమోటారు కారులో కనకవర్షము కురియుచుండెను. ఎంపైరుహాలులో జరిగిన సభలో మొత్తం రు 24,000 పైన సమర్పించి యువజనులం దరును తమనాయకుని గౌరవించిరి. అతడు వారినందరను ప్ర జాసేవలోని మొదటిపాఠములను బార్డోలీ విశ్వవిద్యాలయ ములో నేర్చుకొనవలసినదని హెచ్చరించెను.

సత్యాగ్రహనిధికి జాతీయచరిత్రలో కనివినియెరుగనం తటివిజయము చేకూరెను. చెక్కులు, మనియార్డర్ల ప్రతిదినము బార్డోలీలోను, సత్యాగ్రహాశ్రమములోను, నవజీవను, ఎంగుయిండియా ఆఫీసులలోను వచ్చిపడుచుండెను. చందాలు

ప్రతిరాష్ట్రమునుంచియే కాక దేశములోని యతిదూర ప్రాంతములనుండియు ఫ్రాన్సు, బెల్జియము, జపాను, చైనా మొదలగు దూరదేశములనుండియు, న్యూజీలండు, మలయా, ఫిజీ మొదలగు ప్రపంచములోని యత్యంతమూలమూలలనుండియు వచ్చుచుండెను.

అహమ్మదాబాదుకూలీలసంఘమువారు సభ్యుని కథమపక్షమొక్కొక్క యణావొప్పున చెల్లింపమనగా జూలై 15 వ తేదీకి వారిచందా రు 1300 మించెను. గురుకులములలోను, యితరపాఠశాలలలోను చదువుబాలబాలిక లుపవసించియు, ఖర్చులను తగ్గించుకొనియు పాలు, నెయ్యి, పంచదార మొదలగునవి మానుకొనియు, పనిచేసియు తమకుకూడబెట్టిన దానిని లేక సంపాదించినదానిని సత్యాగ్రహనిధికి పంపుచుండిరి. స్త్రీలు ప్రత్యేకసభలను పెట్టుకొనిరి. ఇట్టియుద్యమములలో నెన్నడును పాల్గొనని ముసల్మానుస్త్రీలు తమ వసూళ్ళను పంపించిరి. బ్రాహ్మణస్త్రీలు తమచందాలను, గుజరాతులోని యితరప్రాంతములందున్న స్త్రీలు తమవసూళ్లను పంపుచుండిరి.

ఆరితేరిన జాతీయబిచ్చకుడగు మగనిలాలుకొఠారి బొంబాయిలో ననేకయుపన్యాసము లిచ్చి బారిష్టర్లు, ప్లీడర్లు మొదలగువారివద్ద పెద్దసుంకములను వసూలుచేసెను. అతనికేదియైనను యంగీకారమే. "మీరుపెద్దపెద్ద చెక్కులనివ్వ

జాలని-చో మీమోటారుకారు నీయవచ్చును " అని యతడు లబ్జులు వేసి బార్డోలీసత్యాగ్రహులకు మంచితరుణములో నాలుగుమోటారులను సంపాదించెను. మేలో 10000 జూన్ నెలాఖరుకు 20000, జూలై 15 వ తేదీకి 30000 యీవిధముగా సత్యాగ్రహనిధి పెరిగెను.

ఒకమూల ప్రజలలో నుత్సాహము వెల్లివిరియుచుండ ప్రభుత్వమువారి నాటకములును, ఝడిపింపులును దినదినాభివృద్ధి నొందుచుండెను. జూన్ మాసాంతముకు లాగుకొనబడునని యిచ్చిన నోటీసులు 5000 లకు మించెను. కాని యిట్టి నోటీసులవలన లాభమేమియు లేదని ప్రభుత్వముకు గోచరించెను. కనుక వారికి నమ్మకమున్న క్రొత్తపద్ధతులను ప్రభుత్వమువా రవలంబించిరి. ఇస్మాయిల్ గాబాయను బార్డోలీ సత్యాగ్రహియొక్క రు 50000 విలువగలభూములు రు 1200 పన్నుకొరకు విక్రయింపబడెనని ప్రకటించిరి. ఇట్లు బార్డోలీలోని ముసల్మానునాయకునియొక్క యుత్సాహమును త్రుంచివేయవలెననియు తద్వారా చిన్నచిన్నముసల్మానులను బెదరింపవచ్చుననియు వారు చూచిరి. చివర కిదియు విఫలమయ్యెను.

వాలడ్ లోని పార్శీసారాదుకాణదారుని పెట్టినబాధలును యిట్లే నిరుపయోగ మయ్యెను. సేట్ దొరాబ్జీని లొంగదీయుట కెన్నివిధముల నతనిని బాధించిరో యిదివరకే వర్ణిం

పబడెను. అతని 2000 రూపాయిలు విలువగల సారాను ఒక్కపాటకు కొట్టివేయుటతో తృప్తిపడక, 30000 రూపాయిలవిలువగల భూమి లాగుకొనబడు ననునోటీసును జారీచేయుటతో తృప్తిపడక, రెవిన్యూ అధికారులీ 'మొండి' పార్శ్వానిని లొంగదీయుటకు ఆబ్కారీ యధికారులసహాయమును బడసిరి. 25 ఏప్రిల్ మొదలు తనదుకాణమును మూసియుంచుట కతనిపై యేలచర్య తీసికొనరాదో కారణములను చూపవలెనని యతనిపై నోటీసుల నమలు జరిపిరి. దీని కతడెంత మాత్రమును వణక లేదు. సరికదా దుకాణమును నడుపుట కతనివద్ద నొక్కపైసయైనను లేదనియు తాను కారణములను చూపుటకంటె తన నీవిధముగా బాధపెట్టినందులకు ప్రభుత్వముపై నేలచర్య తీసుకొనరాదో ప్రభుత్వమే కారణములను చూపవలసి యున్నారనియు ఆబ్కారీసూపరింటెండెంటుగారికి జవాబువ్రాసెను.

బార్డోలీలోని మేజిస్ట్రేటుగారుకూడ నీవిధముగానే న్యాయమును పంచిపెట్టుచుండిరి. జూన్ ప్రారంభములో ప్రోసెసుచట్టముక్రింద కేవలము పరిహాసపాత్రమైన పరిస్థితులలో ముగ్గురు వాలంటీర్లను నిర్బంధించిరి. ఆరోజున కలెక్టరు బార్డోలీ వచ్చెను. ఒకవాలంటీరు గవర్నమెంటువారి బంగాళాఆవరణలో కాని, బంగాళాకు కొద్దిగజములదూరములో కాని కాక బంగాళాగుమ్మమువద్దకు తీసికొనిపోవుచోద్యమిా

ద కూర్చొనెను. అతడచ్చట కలెక్టరుజాడలను కనిపెట్టుటకు నియమింపబడెను. ఒకపోలీసుబంట్రోతు వచ్చి యతనిని యచ్చటనుండి పొమ్మనగా నతడులిఖితపూర్వకమైనయాజ్ఞను తీసికొనిరమ్మనెను. పోలీసువాడు కలెక్టరుతో చెప్పుకొనెను. అతడు వాలంటీరును రప్పించి పోలీసుయినస్పెక్టరుకు వప్పచెప్పి తగుచర్య తీసికొనుమనెను. అతనిని మందలించి విడిచివేసిరి. ఈలోపున గుజరాతువిద్యాపీఠములోని విద్యార్థి దినకరరావు అతనిస్థానములో నుండెను. పరిభుభాయియను మరియొకవలంటీరుకూడ నచ్చటనే యాజ్ఞలకొరకెదురు చూచుచుండెను. ఈయిద్దరిని అరెస్టుచేసిరి. మొదట మందలించి విడిచిపెట్టిన చగన్‌లాలు వారిస్థానము నాక్రమింపగా నతనినికూడ తిరిగిపట్టుకొనిరి. పోలీసుచట్టములోని యీసెక్షనులో రౌడీలు, అనుమానింపబడినవారు, అల్లరిచేయుటకు యితరదుర్మార్గములను చేయుటకు పబ్లికుస్థలములవద్ద తిరుగుచున్నచో చర్య తీసికొనబడునని యున్నది. కాని యావనోత్సాహములతోను, సేవచేయవలెననెడు కుతూహలముతోను పొంగిపొరలుచున్న కలెక్టరంటివానిని ముఖాముఖిగా చూడగల ధైర్యసాహసములు గలయీకుర్రల నాయుద్యోగస్తుడు సహింపజాలక రౌడీలు, అనుమానింపబడినవారు అనుక్లాసు క్రింద వీరినిజేర్చెను. ఇక వీరివిచారణ మరింతపరిహాసాస్పదమైనది. మేజిస్ట్రేటు రాత్రిపూట కచేరీచేసెను. అట్టివేళల

ముందు కచేరీకివచ్చు యలవాటులేని సబుయినస్పెక్టరుగారు ప్పనితద్దినముక్రింద వచ్చి యప్పుడు సాక్షులకొరకు వేటా నారంభించి బహుకష్టముమీద కొన్నిబొమ్మలను తయారు చేసెను. ఇందులో నొకనివద్ద కల్లుకంపు కొట్టుచుండుటచే నతనికి కొద్దియడుగులదూరములో కూర్చొనుట ప్రాణకంటక ముగా నుండెను. ఇక నితడిచ్చుసాక్ష్యమునుగురించి వేరుగ చెప్పవలసిన దేమున్నది? మేజిస్ట్రేటుగారు "ఈముద్దాయిలు కలెక్టరు మకాంచేసియున్న బాన్ద్రాలీలో కలెక్టరుబంగాళా సమీపమున తిరుగుచు వ్యవహారములకొరకు పోవుచుండు మనుష్యుల నాటంకపరచుచున్నట్లు కనుగొనబడిరి" అనిరి. ఈయాటంక మెటువంటిదో సూచించుటకు ప్రయత్నింపలే దు; ఆటంకపర్చబడినవారిని పరీక్షింపలేదు. వారికి చెరి 50 రూపాయలు జుల్మానా, యివ్వనిచో రెండుమాసములు విడిఖయిదు విధింపబడెను. వారు సహజముగా ఖయిదుకు పోవుటకే యంగీకరించిరి. మరునాడు శిక్షింపబడినవారిస్థాన ముల కనేకమందిబాలురు వచ్చిరి. కాని వారిపై నెట్టిచర్య యు తీసికొనబడలేదు.

మరునాడే వాంకనరుకేసులో తీర్పుచెప్పవలసిన దిన ము. ఈకేసులో వాంకనరులోని కొందర తిమర్యాదస్తులైన వ్యవసాయదారులు, విద్యాపీఠములోని విద్యార్థి యొకడు, కొంతమంది వాలంటీర్లు దొమ్మిచేసిరనియు, ఆటంకమును కలి

గించిరనియు, బలమును ప్రయోగించిరనియు విచారింపబడిరి. కేసుయొక్క సారాంశ మేమనగా ముద్దాయిలు 19 మంది డిప్యూటీకలెక్టరుగారి సామానును తీసికొనిపోవు మూడుబళ్ళను అటకాయించిరనియు, బండివానిని ముందుకుపోకుండ చేసిరనియు. ముఖ్యముద్దాయి చేతిలో పొగబారి కనపడీకన పడనట్టు లాంతరొకటి యుండెను. దీనితో నత డమావాస్యచీకటిరాత్రిలో ముద్దాయీలను చూచెనట! సాక్ష్యమతినిస్సారముగ లేక బొత్తిగా శూన్యముగనుండుటచే నానవాలుపట్టువారు లేకపోవుటచే నయిదుగురిని విడిచిపెట్టవలసివచ్చెను. ముగ్గురిని నేరము లేదని విడిచివేసిరి. తక్కినవారందరకు 6 నెలలు కఠినశిక్ష. దొమ్మిచేయుట, ఆటంకపరచుట, యను రెండు సెక్షనులకు బలమును ప్రయోగించినందుకు, మాసమురోజులు. ఈశిక్షల నొకేసారి యనుభవింపవలెననిరి.

ఈవిచారణనాటకములు, కఠినశిక్షలు చాలక కాబోలును వీరిని జయిలుకు తీసికొనిపోవుటలో ప్రజలలో భీతిని కొల్పుటకు కొంతప్రదర్శనము గావింపబడెను. వీరందరిని యిద్దరిద్దరినికలిపి చేతులకు సంకెలలు వేసి, తాళ్ళతో కట్టివేసి బార్డోలీస్టేషనుకు తీసికొనిపోయిరి. కాని ప్రజలింతకుపూర్వమే యిట్టినాటకములను చూచి యుబ్బి గంతులునైచుచు నవ్వివేయునట్టి దిట్టతనము వలవర్చుకొనిరి. ముద్దాయిలు

మలోతాము పకపక నవ్వుకొనుచు, వేళాకోళములు చేసికొనుచు వారినిజూచి గందరగోళపడు ప్రజలతో 'ఆ లోచింపవలసినదేదియు లేదు. చేతిగడియారములకంటె శ్రేష్ఠమైన సరకునే సంపాదించుకొంటిమి' అనిరి. ఈమాటలు వినుటతోడనే ప్రజలుత్సాహభరితులై ముద్దాయిలు పోవుదైలు కదులుచుండ వందేమాతరధ్వనులతో నాకాశమును నింపివేసిరి. సర్దారు రాతిబింబవళ్ళెల్లపుడును యిట్టినిర్బంధచర్యలను తృణప్రాయముగా చూచునట్టిపాఠమును బోధించుచుండెను. దైనికవార్తలను ప్రచురించుచుండు కరపత్రములనిండ వేళాకోళము, హాస్యరసము కురిపింపబడుచుండెను. సర్దారు ఒకచోట గంటలకొలది మంచితీవ్రముగా నుపన్యసించుచుండగా నొకమనిషి వచ్చి"మస్లుతుదారుకును అతనిబృందముకును తేనీరు నీయవలసినదని యొకపటేలును బలవంతపెట్టిరి" అని చెప్పెను. "అదెట్లుజరిగెను?" అని సర్దారు ప్రశ్నింపగా నొకముసలిపటేలు వచ్చి "వారునాయింటి కిటికీదగ్గరకు వచ్చి తలుపు తీయవలసినదని నన్ను బ్రతిమాలుకొనిరి. నేను వారిని నమ్మజాలనని చెప్పితిని. వారొక్క-చీపురుపుల్లనైనను జప్తుచేయమనియు, వారికి కావలసినది యొక్క-చిప్పెడు తేయాకుమాత్రమే యనియు చాలసార్లు నన్ను నమ్మించిరి. నేను తలుపుతీసి వారికి తేనీరు యిచ్చి శలవుతీసికొనమని పంపివేసితిని" అని చెప్పెను.

ఇతడిట్లు చెప్పగానే మరియొక వ్యవసాయదారువచ్చి "మన ము దీనికంగీకరింపరాదు. ఇతడు వారికి మమ్లతుదారును చూచి భయముచేతనే తేనీరు నిచ్చెనుకాని వారినమ్మకముల చేతకాదు. మనమిపుడు నేర్చుకొనవలసినదంతయు భయము ను పారదోలుటకంటెను మరేమియు లేదు." అని చెప్పెను. వల్లభాయి పక్కుననవ్వి యీవిధముగా నొకరాజీ కుదిర్చెను. "సరే! వారు మిమ్ము తేయాకు నిప్పించవలసినదని బ్రతిమా లుకొనుచో మీ రీమాత్రము చేయవచ్చును. కాని వారు యుపద్రవకారు లనుసంగతిమాత్రము మరచిపోవద్దు. మీ పాలలో నొకయీగకాని దోమకాని కర్మముచాలక యున్న దనుకొనుడు. మీరు తెలియక వారికి పాలతో తేయాకు యిచ్చినచో నేమగునో మీ రెరుంగుదురా? ఏమైనను కొం చెమించుమించు వచ్చినచో దానికి మిమ్మే బాధ్యులందురు. కనుక నీయుద్యోగస్థుల నెంతదూరములోనుంచిన యంతమం చిది." ఇదివిని యందరును నవ్వుకొనిరి. ఒక్కనిమిషములో వారు జరిగినదంతయు మరచిపోయిరి. ఇంతలో సర్దారు అరె స్టుకాబడు ననువదంతులు ప్రబలసాగెను. అతనిసహచరులు కూడ కొందరిట్టిస్థితిలోనే యున్నారని విని సభలోనొకరు సర్దారును ప్రశ్నించెను. "నే నెందుకు నిర్బంధింపబడవలెను? అట్టియదృష్ట మేమియు కాన్పించదు. దున్నపోతు యేదైన నైనచో నేకొద్దిరూపాయిలో వచ్చును. నన్నుజప్తుచేసి ఆ

ష్టమైనచో నొక్కడమ్మిడీయైనను రాదే ?" అని యతఁడు బదు
లు చెప్పెను.

ఇతరులుకూడ నెమ్మదిగా బాధ ననుభవించుపాఠ
మును నేర్చుకొనుచు రానున్న యగ్నిపరీక్షకు తయారగుచుం
డిరి. ప్రభుత్వమువారినోటీసు వచ్చినవెంటనే నే నొక గ్రామ
స్తుని కలుసుకొంటిని. అతనితో మాట్లాడుట యొకవింమవలె
నుండెను. "మీరు ప్రభుత్వమువారి తుదిసమాచారమును
వింటిరా ?" అని నే నడిగితిని.

"వింటిని. సమర మింతవరకునున్న దానికంటె భీషణము
గా నుండునని యే దీనియర్థము."

"మీ రెంతకాలము నిలువగలరు ?"

"అంతు పొంతు లేనంతకాల ముండగలము. నా గ్రా
మము పూర్తిగా తయారైనది. నా గ్రామములో నొక్కడున్న
పోతు కాని గేదె కాని లేదు. కొద్దికాలములో ప్రభుత్వము
వారికి గడ్డిపోచయైనను అందకుండ చేయుదుము. సమరము
తుములమైనప్పటినుంచి నేను నాయిత్తడిసామగ్రినంతను
తీసివేసితిని. మేము మట్టికుండలతో వండుకొని మట్టిమూకు
ళ్ళలో తినుచున్నాము. కావలసినచో వారు వాటిని జప్తు చేసి
కొనవచ్చును. ఈరోజులలో పశుపులనుకూడ జప్తు చేయుచు
న్నారు. కనుక మేము బయట చాపలమీాదనే పడుకొను
చున్నాము. నాదృష్టిలో నిపుడు మరియొక కార్యక్రమము

కూడ కలదు. మేము మాయిండ్లలో పడియుండనేల? మే మొకయిల్లును ధర్మశాలగా మార్చివేయదలచుకొంటిమి. భూములు లేనివాడీధర్మశాలను ప్రజల యుపయోగార్థము నడుపును. అవసరమైతే భోజనసత్రమును కూడ స్థాపింపదల చుకొంటిమి."

"శ్రీయుత వల్లభాయి మిమ్ము మీయిండ్లు వాకిండ్లు విడిచి వెళ్ళిపోవలసినదని యాజ్ఞాపించుననుకొనుడు?"

"అత్యానందముతో వెళ్ళుదుము. మేము మాపిల్ల లను బంధువులయిండ్లకు పంపితిమి. కొంతమంది స్త్రీలు పశు వులతో కూడ వెళ్ళిరి. యథార్థముకు మాలో చాలమంది పడుకొనుటకు మాత్రమే యీగ్రామము వత్తుము." మరియు నత డిట్లనెను. "ఉద్యమము కేవలము దైవప్రసాదము. మాలో చాలమంది తేయాకు లేకుండ నుండజాలము. గేదె లు వెళ్ళిపోవుటచే పాలుదొరకక మేము తేయాకు అలవా టును బలవంతముగా మానుకొనవలసి వచ్చెను. ఇంకను కొంతమంది మేకపాలతో తంటాలుపడుచున్నారు. ఒకరిద్ద రకు ఆవులున్నవి. కాని మాలో నొకవిధమగు ఆత్మనిరోధ, ఆత్మత్యాగశక్తులు విజృంభించుచున్నవి. ఈయుద్ధములో మే మోడిపోయిననేమి? ఇంతకంటె నెక్కుడుశ్రద్ధతో, నెక్కుడు తెలివితేటలతో తరువాతయుద్ధమును సాగింతుము. ఈయుద్ధ ములో నేర్చుకొనినపాఠము లెన్నటికిని వృథాకాజాలవు."

చివరకు జయము తమకే కలుగునను విశ్వాసము, తా నవలంబించు పద్ధతులలోని విశ్వాసము వారికెక్కడ లేనిబలమును కలుగచేసెను. కనుక వారు ప్రభుత్వమువారి నోటీలను భూములను ప్రభుత్వవశము చేసికొందురను నోటీసులను ధిక్కరించుచు భూములను దున్ని విత్తనారంభించిరి. బహుశః దీనికే శాసనోల్లంఘనోద్యమమని ప్రభుత్వమువారు పేరిడిరి. బొంబాయిప్రభుత్వమువారు భారతశాసనముచే నిర్మితమైన కమీషనుయొక్క విచారణకొరకు తయారుచేసిన మెమొరాండములో బార్డోలీసత్యాగ్రహమును గురించి పూర్తిగా వివరించుచు "ప్రభుత్వమువారిచే వశపరచుకొనబడిన భూములలో ప్రవేశించి దున్నుకొని యీవిధముగా శాసనోల్లంఘనోద్యమమును సాగించుట కాందోళనపరులు తీవ్రముగా కృషి సలుపుచున్నారని విశ్వసింపబడుచున్నది." అను వాఙ్మాలములతో ముగించిరి. మునసబులు, పెత్తందార్లు రాజీనామాలనిచ్చుటచే యుద్యమస్వరూపమే మారిపోయెను. ఈసమయములోనే వ్రాయబడినపై మెమోరాండము "యిప్పుడు సంస్య అసహాయోద్యమములో నొకప్రయత్నముగాను శాసనోల్లంఘనము ద్వారాయొకనిర్ణీతస్థలములో ప్రభుత్వమును స్తంభింపచేయుటగాను విజృంభించెను." అని గోలపెట్టెను.

---



# బార్డోలీ విజయము.



## ఇరువదిరెండవ యధ్యాయము.

"ముద్దాయియే జడ్జీహోదా వెలిగించుట."

ఖేడా సత్యాగ్రహదినములలో ప్రభుత్వమువారు ప్రచురణశాఖను నెలకొల్పలేదు. బోర్సదు సత్యాగ్రహము లో యుద్ధము ముగియు సమయములో సమాచారమునిచ్చు డైరెక్టరుగారు బొంబాయి క్రానికలుపత్రికలో నారుకాలము లు తెగవ్రాసి ప్రభుత్వమును సమర్థించెను. దానికి వెంటనే తగిన సమాధానము వచ్చెను. తరువాత కొద్దిరోజులలోనే సర్ లెస్లీ విల్సనుగారు 240000రూపాయిల శిక్షార్థపుపన్నును రద్దుచేసికొనెను.

సత్యాగ్రహప్రచురణశాఖవారు 5 మాసములనుండి బార్డోలీలోని ప్రభుత్వనీతిని, పద్ధతులను తీవ్రముగా విమర్శించుచు తుత్తునియలుచేయుచుండ నెట్టకేలకు ప్రభుత్వమువారు తమ ప్రచురణశాఖను తెఱచిరి. జిల్లాకలెక్టరుగారొకటి రెండుసార్లు కరపత్రములను పంచిపెట్టించిరి. కాని వారిశుభవచనములవలన లాభమేమియు లేకపోయెను. తరువాతసమాచారడైరెక్టరుగారు ప్రభుత్వనీతిని, పద్ధతులను సమర్థించుచు

"బ్రాహ్మణేతర వాదము' అని నేను వ్రాసినవ్యాసములోని కొన్ని సత్యములను తల్లక్రిందులు చేయజూచెను. అతడు జయకరు, ఆండర్సనులను సమర్థించిన గొడవయంతయు నేకరుపెట్ట నక్కఱలేదు. ప్రభుత్వవాదమంతయు నిదివరకే కూలంకషముగా చర్చింపబడెను. కాని డైరెక్టరుగారు ప్రజలకండ్లలో నెట్లు దుమ్ముకొట్టుటకు ప్రయత్నించెనో చూపుట కొకటి రెండుదాహరణముల నిచ్చెదను. ఒకటి కవులుభూములను గురించి ఆండర్సనుగారు తెలిపినయంకెలను సమర్థించుట. "ఆండర్సనుగారు తమ వాఙ్మూలమును నిలబెట్టుకొనెదరు. అది యింకను సత్యముకంటె తక్కువయని రుజువుచేయుదురు." బ్రూమ్‌ఫీల్డుకమిటీవారిందులోనున్న యభూతకల్పనల నిపుడు బయలుపెట్టిరి. కనుక చచ్చినపామును మరల చంపనక్కఱలేదు. రెండవది మక్తాలనుగురించినసిద్ధాంతము. "భారతపన్నులవిచారణకమిటీవారు యీవిషయమును బహుశ్రద్ధగా చూచిరి. బొంబాయిప్రభుత్వమువారును, బొంబాయిభూమిపన్నుకమిటీలోని కట్టుదిట్టమైన మైనారటీసంఘమును వచ్చిన నిర్ణయముకే అనగా మక్తాలవిలువనే యాధారముగా తీసికొనుట యొక్కటే న్యాయమును ధర్మమును అను నిర్ణయముకే వీరును వచ్చిరి." దీనిని పన్నులవిచారణ కమిటీవారి నివేదికలోని యథార్థమైనవాఙ్మూలముతో పోల్చిచూడుడు. "కమిటీవారు శిఫారసుచేయునదేమనగా ముందు

నుంచి పన్నులను కట్టుటకు సాంవత్సరికవిలువయే పునాదిగ నుండవలెను. సాంవత్సరికవిలువయనగా మొత్తపురాబడిలో నుండి యుత్పత్తికైన ఖర్చులు తీసివేయవలెను. ఇందులో వ్యవసాయదారు యతనికుటుంబము యథార్థముగా భూమిమీద ఖర్చుపెట్టినఖర్చులు,యీకృషికి తగినప్రతిఫలము చేరవలెను." డైరెక్టరుగారీవిధముగా కమిటీవారియభిప్రాయము మాయ చేసి కమిటీవారి యభిప్రాయములోని "పన్నువిధించు రేటును చాలతక్కువయంకెకు స్థిరముచేయవలెను, "సాంవత్సరికవిలువలో నాలుగవవంతుకు మించకుండ"చేయవలెను అనుసత్యమును బుద్ధిపూర్వకముగా వదలివేసెను. పైగా నితడు భూమిపన్నుకమిటీలోని మైనారిటీనిర్ణయమును మాత్రమే చెప్పి మక్తాలవిలువను నిరాకరించి 'వ్యవసాయలాభములలో' నాలుగవవంతును హెచ్చుపన్నుగా శిఫారసుచేసిన మెజారిటీ నిర్ణయమువిషయమై బెల్లముకొట్టినరాయివలె నూరకుండెను.

మరియొకచోట నితడు మునసబులు, పెత్తందార్లు బలవంతముమీద రాజీనామాలనిచ్చిరని వ్రాసెను. మునసబులు పెత్తందార్లు అందరును కలసి పత్రికలలో నిందులోని యసత్యమును వెల్లడిచేసిరి. ఒకమునసబు "తనరాజీనామా నుపసంహరించుకొనవలసినదని చాలవరకు ప్రోత్సహించిన" డిప్యూటీకలెక్టరును బయటపెట్టెను. హెచ్చుజీతమిప్పించి బదిలీచేయించెదనని వాగ్దానముచేసి మోహపెట్టుట కతడు చాలక

ష్టపడెనని యీమునసబు రుజువుచేసెను. మరియొకసమాచారప్రకటనలో (ఇట్టిచెత్తచాలకలదు.) 'ఆదర్శపాత్రు'లగు పఠానులనుగురించి పొగడుచు డైరెక్టరు జడ్జీగారిభాషలో, "ముద్దాయి ఫిర్యాదులిద్దరును తనయెదుటనే యున్నట్లు, కొన్ని వాఙ్మూలములను నిరాకరింపజొచ్చెను. దొంగతనముచేయుచుండగా నొకపఠాను పట్టుబడెనని చెప్పగా డైరెక్టరు పోలీసువారికేసును అసత్యమను తరగతిలో చేర్చుటకర్హమైనదని కనుగొనిరి" అను బ్రహ్మాండమైన పర్యవసానమును ప్రజలపై రుద్దెను. ఒకపఠాను సత్యాగ్రహిని కత్తితో బెదిరించెనని చెప్పగా పఠాను బెదిరించెనని యొప్పుకొనిరి. కాని పొడిచెదననిమాత్రమే బెదిరించెనట. పఠానుల దుష్ప్రవర్తనలను గురించిన యీజవాబులలో పఠానులకృత్యముల నొప్పుకొనుచువారికి దురుద్దేశ్యముమాత్రము లేదనుచున్నారు. ఒకగేదెను చానమోదినసంగతిని డైరెక్టరుగారు చల్లగా దాటించినారు.

తనకువలెనే యెప్పుడును కార్యరంగముమీదకు పోనితాబేదార్లకు సమాచారములమీదనే యాధారపడుచు ముద్దాయియె జడ్జీహోదాతో తీర్పుచెప్పినట్టి యీడైరెక్టరుగారి యుదాహరణము లికచాలును! కాని గవర్నరు ప్రభుత్వనీతిని సమర్థించుచు తన ప్రభుత్వములో దోషములేదని యొక చాటభారతమును వ్రాసి దానిని మరింత నిందాభూ

యిష్టము గావించి పరిస్థితులను మరింత యథార్థస్థితికి తెచ్చెను.

బార్డోలీసమస్యలో ప్రజావాదమును సమర్థించినవారిలో శ్రీయుత కె. యం. మున్షీగారి పేరు ప్రథానస్థానము నలంకరించును. అతడు మే మాసాంతములో వెస్లీ విల్సను గారి కనేకయుత్తరములను వ్రాయుచు తాను శుద్ధశాస్త్రీయపద్ధతుల నామోదించువానివలెనే యీయుత్తరమును వ్రాసితిననియు 'పన్నుల నిరాకరణమును చేతుమని బెదిరించు అసహాయవాదివలె వ్రాయలేదనియు' ప్రత్యేకముగా నసేక సార్లు నొక్కి వ్రాసిరి. బహుశః అతడిట్లు తనస్థితినిగురించి నిర్వచించుటచేతనే కాబోలు గవర్నరుగారిని పైకి లాగగలిగెను. బార్డోలీసమస్యయొక్క స్వరూపము మారుట కవకాశము నీయవలదని మున్షీగారు గట్టిగా వాదించిరి. కాని గవర్నరు మొట్టమొదటియుత్తరములోనే సారాంశమును కప్పిపుచ్చుటకు, అబుద్ధిపూర్వకముగా, తన యాతుర్దాను వెలిబుచ్చెను. "బార్డోలీవిషయములో శాసనోల్లంఘనాస్త్రము నుపయోగించి ప్రభుత్వమును లొంగదీయుటకు నిశ్చయమైన ప్రయత్నము గావింపబడుచున్నది" అని వ్రాసెను. అట్టిప్రయత్నమేమియు లేదనియు, సంపూర్ణమైన స్వతంత్రవిచారణయే కోరబడుచున్నదనియు బార్డోలీనాయకులు రేయింబవళ్లు చాటుచుండెను. నిష్పక్షపాతమైనవిచారణ కావలెనని మున్షీ

ించినదాని కతను "ఇకనెట్టి విచారణయు క్రొత్తవిషయము -ను బహిరంగపరుపజాలదని నేను విశ్వసించుచున్నాను. మ కొంత విచారణకూడ చేయబడెను. రెవిన్యూ సభ్యుడైన హ్యాగారు శెలవుమీద వెళ్ళుటచే నుంచి యనుభవముగల హోచిగా రాయనస్థానమునకు వచ్చిరి. ఈయన కేవలము నిష్పక్షపాతబుద్ధితో కాగితములు నన్నిటిని పరిశోధించి ప్రభుత్వమువారిచే సూచింపబడినపన్ను చాలా తక్కువయను నిర్ధారణకు వచ్చిరి. ప్రభుత్వచర్యయొక్క న్యాయమునుగురించి సంపూర్ణమైనతృప్తిని పొందని ప్రభుత్వసభ్యుడొక్కడును లేడని నేను మీ కభయహస్తము నీయగలను. యథార్థమునకు న్యాయము అను పదమునకు బదులు ఉదారతయనుశబ్దమునే నేనుపయోగించవలె" కాని ప్రజలు కోరునది కేవలము న్యాయము; అకలంకమైన న్యాయముకాని యుదారత కాదని దొరగారు మరచిపోయిరి. కమిటీని నియమించినచో వారు మరింత హెచ్చుపన్ను కట్టవలెనని శిఫారసు చేసెదరని గవర్నరు వాదించెను. అట్లయినచో నుచితమైన యొక విచారణకమిటీ నేర్పాటు చేయవలెనను యుక్తమైన ప్రజల మొర నేల చెల్లింపరాదో తెలియకున్నది!

మున్షీగారు గవర్నరుకువ్రాసిన మరియొక యుత్తరములో ప్రజలయొక్క సహేతుకమైన కోరికను నిరాకరింపవలెనను ప్రభుత్వనిశ్చయము "బార్డోలీలోనున్న ప్రస్తుతవ్యవసా

యదారులనందరను తుడిచివేయుటయందో లేక రక్తపాతము నందో పరిణమించును. ఎట్లయినను, మరేఫలితము లేకపో యినను, అంతులేని నిరంతరద్వేషముమాత్రము తప్పదు. మీరు చెప్పునట్లు క్రొత్తపన్ను యుదారమైనదేయని యొప్పు కొనినను దానిలోనున్నన్యాయమును గుర్తించుటకు కలుగునట్టి యవకాశము నెన్నడును పోగొట్టుకొనరాదు" ఈయుత్తరముకు జవాబుయిచ్చుచు గవర్నరుగారు తమసహాజకోటలను చూపించిరి. "ప్రభుత్వమువారు తమకున్న నిస్సంశయమైన పాలనాధికారము నొక స్వతంత్రకమిటీయొక్క నిశ్చయము కేల విడిచిపెట్టవలెను? నేను వీలైనప్రతిమార్గముచేతను పరిస్థితులను చక్కబెట్టుకొనవలెననియే యాతురపడుచున్నాను. కాని యేప్రభుత్వమును తనవిధులను లాగుకొను నధికారమును వ్యక్తుల కొసంగజాలదు. అట్టి పరిస్థితుల కవకాశమిచ్చిన యేప్రభుత్వమును అట్టిపేరుకు తగియుండదు. దీనికి సమాధానము నిచ్చుచు గాంధీజీ మరల ప్రజలకోరికను వ్యక్తము చేయుచు నొకవ్యాసములో ప్రభుత్వమువారివాదములోనియసత్యమును వెల్లడిచేసెను.

"నిస్సంశయమైనపాలనాధికార మనగా భారతదేశము శుష్కోపవాసములచే కృశించువరకును రక్తమును పిండుకొనుటకు హద్దుపద్దులేని స్వైరాధికారము. ప్రజలకును ప్రభుత్వాధికారులకును మధ్యగలిగిన తగాదావిషయములను సరి

చేయుట కాక స్వతంత్రకమిటీని నియమించినచో నిట్టి స్వైరాధికారమునకు కొంతహద్దు యేర్పడును. స్వతంత్రకమిటీయనగా ప్రభుత్వముతో సంబంధము లేని స్వతంత్రకమిటీ యని యనుకొనకుందురుగాక ! అధికారుల బలవంతములకు లొంగని స్వతంత్రులగు వ్యక్తులతోకూడి, బహిరంగముగా విచారణ సలుపుట కధికారముండి, బాధపడుచున్న ప్రజలు చెప్పుకొనుటకు తగిన ప్రాతినిధ్యమున కధికార మిచ్చి ప్రభుత్వముచే నియమింపబడినకమిటీ యనియే దానికర్థము. కాని యిట్టి బహిరంగవిచారణ యనగా ప్రభుత్వముయొక్క రహస్యపు నిరంకుశపు భూమికన్న విధానమును పాతి వేయుటే యగును. ప్రజల స్వల్పకోరికలో 'ప్రభుత్వనిధులను లాగుకొనుట' యావంతయైనను లేదు. కాని ప్రభుత్వోద్యోగుల కేవల స్వాతంత్ర్యము కేకొద్దియాటంకము కలిగినను ప్రభుత్వమువారు రుద్రావతారమును దాల్చుదురు. బ్రిటిషుభారతదేశములో బ్రిటిషు సింహము రుద్రరూపము తాల్చినపుడు 'అమాయికపు హిందువును' భగవంతుడే రక్షింపవలెను. అవును ! దిక్కు లేనివారికి భగవంతుడే దిక్కు. మానవుడు పూర్తిగా నసహాయుడైనపుడే యతడు సహాయము చేయును. భారతప్రజలు సత్యాగ్రహములో నప్రతిహతమగు, దైవదత్తమగు నాత్మబాధయను రామబాణమును కనుగొనిరి. దానియొక్క ప్రబోధమువలననే భారతప్రజలు శతాబ్దములనుండి యనుభ

వించుచున్న కుంభకర్ణనిద్రనుండి నెమ్మదిగా మేల్కొనుచు న్నారు. దుర్బలులైనను బార్డోలీవ్యవసాయదారులు తమ విశ్వాసములకొరకు బాధ ననుభవింపగల ధైర్యసాహసముల ను కలిగియున్నారనిసూత్రిమే భారతదేశమును చూపు చున్నారు.

సత్యాగ్రహము నశాస్త్రీయమని పిలుచురోజులు గ తించినవి. సత్యము, దానితోనుండు ఆత్మత్యాగము న్యాయ విరుద్ధములైనపుడే యిది యశాస్త్రీయమగును. దక్షిణాఫ్రికా సత్యాగ్రహమును హార్డింజిప్రభువు ఆశీర్వదించెను. అనంత శక్తివంతమగు యూనియనుప్రభుత్వముకూడ దాని ముందు మోకరింపవలసి వచ్చెను. అప్పటి వైస్రాయి ఛెలుమ్సుఫర్డు ప్రభువు, బీహారు గవర్నరగు సర్ యెడ్వర్డుగెటు దాని పటు త్వమును, న్యాయమును గుర్తించి యొక స్వతంత్రకమిటీని నియమించి, ప్రభుత్వగౌరవమును హెచ్చించి యొక శతాబ్ద మునుండి వచ్చుచున్న తప్పితము నంతము చేసిరి. అప్పుడిది ఖేడాలో నంగీకరింపబడి ప్రభుత్వ యేజెంటులకును ప్రజల ను ఉద్యమమును నడిపించినవారికిని మధ్యనొకరాజీ—యిష్ట ములేకున్నను, హృదయపూర్వకము కాకున్నను, అసంపూ ర్తిమైనను చేసికొనబడెను.

మధ్యరాష్ట్రములలోని యప్పటిగవర్నరు నాగపుర సత్యాగ్రహులతో సంధిచేసికొనక తప్పినదికాదు. అతను

సత్యాగ్రహ ఖయిదీలను విడుదలచేసి వారు కోరినహక్కును గుర్తించెను. ఈ సర్ లెస్లీ విల్సనుగారే 'ప్రపంచములోని కెల్ల నతిపటుత్వము కల సేవకుల' గాలిసోకకపూర్వము బోర్సదులో దానిపటుత్వమును గుర్తించి బోర్సదుప్రజలను శాంతింపచేసెను.

గత పదునాల్గుసంవత్సరములలోను జరిగిన యీసత్యాగ్రహ ముల ను గుర్తించవలసినదని నేను గవర్నరుగారికిని శ్రీయుత మున్షీగారికినికూడ మనవిచేయుచున్నాను. బార్డోలీలోని సత్యాగ్రహము నిపుడు హఠాత్తుగా నశాస్త్రీయమనజాలరు. యధార్థ మేమన ప్రభుత్వముకు వాదమేమియు లేదు. వారు తమ భూమిపన్నుపద్ధతి బహిరంగవిచారణలో సవాలుచేయ బడుటకంగీకరింపరు. బార్డోలీప్రజ లీతుదియగ్నిపరీక్షకు నిలువగలిగినచో బహిరంగవిచారణ జరుపబడును. లేదా హెచ్చుపన్ను తగ్గింపబడును. తమబాధలనొక నిష్పక్షపాతమైన విచారణసంఘముముందర వినిపించుటకు వారికి నిస్సంశయమైన హక్కుకలదు."

---

# బార్డోలీ విజయము.



## ఇరువదిమూడవ యధ్యాయము.



"న్యాయభంగము."

అసలుకథకు వత్తము. వెనుకటియధ్యాయములలో బార్డోలీమేజస్ట్రేటుకోర్టులో జరిగిన విచారణలను చూచి యే యుంటిమి. ఇక నీతాలూకాలో న్యాయపరిపాలనమెట్లు శవాకారమును తాల్చెనో, జపు ఆఫీసరులపద్ధతులలో నిది కూడ ప్రభుత్వము కెంతటి కళంకమును, నవహాస్యతను తెచ్చి పెట్టెనే కొంతవివరముగా చర్చింపవలసి యున్నది. స్థానిక మేజిస్ట్రేటుకోర్టులోను, యితర కోర్టులలోను విచారింపబడిన యందరు ముద్దాయిల ముఖ్యనేరము పన్నులను చెల్లింపకుండుట, లేదా యట్టి ప్రచారమునుచేయుట, స్థానికమేజస్ట్రేటుగారికి తాము నిర్వర్తింపవలసిన విధిని నెరవేర్చుటకు తగిన ప్రత్యేకఅర్హత లేవియును లేవు. పైగా రెవిన్యూశాఖకు చెందిన మామూలు ఆఫీసరగుటచే నీయనపదవి రెవిన్యూ తగాయిదాలవలన కలిగినకేసులను విచారించుట కెంతమాత్రమును తగియుండలేదు. 1919లో మార్షలులా రోజులలో హైకోర్టుజడ్జీల యధ్యక్షతక్రింద జరుపబడిన ప్రత్యేకవిచారణాసంఘములతంతు మన మెరుగుదుము. ఆరోజులలో హైకో

ప్రజక్షిపదవ్రులలో నున్నవారుకూడ తమచుట్టునున్న వాతావరణమును తరింపజాలక సుప్రసిద్ధులగు నాగరికుల కసభ్యమైన శిక్షల నొసగిరి. తరువాత వీటిలో చాలవరకు పూర్తిగా కొట్టివేయబడెను. లేదా చాలవరకు తగ్గింపబడెను. ఇక బాడ్డోలీస్థానికమేజిస్ట్రేటు, వాతావరణ మొకమూల నుద్రేకముతో నిండియుండ తనవద్దకు వచ్చిన కేసులలో న్యాయమును ప్రసాదింపజాలకపోయె ననుటలో నాశ్చర్య మేమున్నది? అతని తీర్పులను కొంచెము చూచితిమేని ప్రతికేసులోను యీక్రిందవిధముగా నొకేమాదిరి తీర్పులే కాన్పించును. "ఫిర్యాదీ తనకథను సరళముగా చెప్పుచున్నాడు. అతనిని నమ్మకుండుటకు కారణము కాన్పించదు. ఫిర్యాదీకిగాని ప్రాసిక్యూషను సాక్షులకుగాని ముద్దాయితో నెట్టివైరమును లేదు. ప్రాసిక్యూషనుసాక్షులలో నెవరిని గాని నమ్మకుండుటకు కారణమేమియు కాన్పించదు." న్యాయస్థానములలో ముద్దాయిలలో చాలామందికి విశ్వాసము లేక వాదింపను లేదు సాక్షుల నెవరిని కోరుకొనను లేదు. కనుక స్థానికమెజిస్ట్రేటుగారికి "ప్రాసిక్యూషనుసాక్షులను నమ్మకుండుట కెట్టి కారణమును" కాన్పించుటలేదు. పన్నులను చెల్లింపని యుద్యమములోనియే చర్యయైనను సరే, ప్రతిచర్యయు పీనల్ కోడ్డులోని 189, 447, 186 సెక్షనుల క్రిందకువచ్చునట్లు అర్థముచేయబడెను. బాడ్డోలీలో నివసించుచున్న యొకమైనరు ఆస్తికి గార్డియను

గానున్న యొక నాజరును మైనరుతరపున పన్ను చెల్లింపవ-
దని వ్రాసినపోస్టుయుత్తరముకూడ ప్రభుత్వోద్యోగులును
బలవంతము చేయుచున్నారని వ్రాసిక్వ్యాపను చేయుటకొ
మిషగా తీసికొనబడెను. ఈకేసుతో స్థానిక మేజిస్ట్రేటుకు
సంబంధ మేమియు లేదు. సూరతు సెషన్సుజడ్జిగారు వెంటనే
యీనోటీసును రద్దుచేసెను.

తనఋషిజీవితమున కఖండగౌరవమును పొందుచుండి
నరవిశంకరు వ్యాసు, యేసత్యాగ్రహికైనను యెంతబాగు
గా తెలియునో ముద్దాయియైన తహసీల్దారు కంతబాగుగా తెలి
సినవాడు తహసీలుదారు ఆవరణలోనికి వచ్చుటకు సాహ
సించెను. కనుక (తహసీల్దారును బాధించుటకు అల్లరిపెట్టుట
కునుద్దేశ మేమియు లేదు) హద్దు దాటె ననునేరము చేసెనట;
186 సెక్షనుకు భయపెట్టుటకు చేసినచర్య యేదో యొకటి
యుండితీరవలెను. కాని యిట్టిచర్య చేసెనను రుజువే
దియు లేకుండగనే శ్రీయుతులు రవిశంకరు, చినాయి, ష
ణ్ముఖలాలుగార లీసెక్షనుక్రింద శిక్షింపబడిరి. చినాయికేసు
లో ముద్దాయిచేసినదంతయు జడ్జిగారిభాషలో "తహసీల్దారు
గారయెదుట కుశాల్ నాధును పన్నుబాకీ చెల్లింపవలదని ప్రో
త్సహించెను" మరియు "కుశాల్ నాధుతో జాహిర్నామాను
(జప్తుజాబితా) పారవేయమనెను."

కుశాల్నాథును అసలే పరీక్షింపలేదు. అతడు చేసిన ప్రోత్సాహమునుగురించి యిద్దరుప్రాసిక్యూషను సాక్షులిద్దరు అతనిమాటలలోనే వర్ణించిరి. "చినాయికుశాలుతో 'చెల్లింపవలెననియున్నచో చెల్లింపవలసినదనియు చెల్లింపవలెనని యతనికి లేనిచో లేదని' చెప్పవలసినదనియు చెప్పెను." ఈప్రోత్సాహము లేక నిరుత్సాహమును పీనల్ కోడ్ 186 సెక్షను క్రింద నేరమును చాలునని మేజిస్ట్రీటుగారు శలవిచ్చిరి.

189 వ సెక్షనుక్రింద షణ్ముఖలాలుమీద తెచ్చినకేసు వివరము లేవనగా ఫిర్యాదీ, రెవిన్యూబంట్రోతులు, ప్రత్యేక జప్తుఆఫీసరుగారు ప్రాణజీవన్ దాసు అనువానియింట్లో మూడుబస్తాలజొన్నలను జప్తుచేయుచుండగా ముద్దాయి బంట్రోతులను, మునసబును 'సాంఘికబహిష్కారమను అపాయముతో భయమును' పురికొల్పెను! 'వారిని జప్తుపనిచేయకుండ ప్రోత్సహించుటకే' అతడట్లుచేసెను.

మునసబు ఫిర్యాదీ, బంట్రోతులు ప్రాసిక్యూషను సాక్షులు, ప్రత్యేకజప్తుఆఫీసరుగారిని, అతనిసాక్ష్యము కేద్రైన కొంతవిలువయుండెడిది, సాక్షిగా పిలువనే లేదు. ఫిర్యాదీ "షణ్ముఖలాలు వచ్చి మీరు జప్తుపనిచేయుచున్నారు. కాని రేపుఉదయము దీనిఫలితమును మీరు చూచెదరు" అని చెప్పెను. ఈకేసు జరుగుచుండగా గ్రంథకర్త యచ్చటనుండుట తటస్థించెను. ప్రాసిక్యూటరుగారు నూరిపొయ్యగా, పొయ్యగా

సాక్షులలో నొకడు సాంఘికబహిష్కారభయము నొకదా నిని దేనినో చూపిరనిచెప్పెను. తీర్పులోనున్న భాషతో 'ప టావలా సోమునివలన' (రెండవసాక్షి) "గాంధివాలా ముద్దా యితోను బంధ్రొతులతోను విూరిప్పుడు చేయుదానిఫలిత మును రేపు చూచెదరని చెప్పినట్లు కాన్పించుచున్నది." సా క్షిని స్పష్టముగా గాంధివాలా యెవరనిప్రశ్నించిరి. 'అదే మొ! నేను వారినెట్లు యెరుగుదును?' అని యతడు బదు లుచెప్పెను. ప్రాసిక్యూటరుగారు షణ్ముఖలాలును 'గాంధి వాలా' యని చూపమనిసెగచేసెరు. పాప మాసాక్షి యీ సూచనను తిరస్కరించెను. ముద్దాయి తాను దోషికాదని వాదించి తనమీద తెచ్చినకేసు కల్పితమని చెప్పెను.

సాక్ష్యమును పరీక్షించుట కావంతయు శ్రమతీసికొన కుండ ముద్దాయి అపాయమును కలిగించెదననుభయమును కలిగించి నేరమును చేసెనని మేజిస్ట్రేటుగారు కనుగొని యా రువారములు కఠినశిక్షను వధించెను.

దాఖలుచేయబడినవిషయములన్నియు సత్యములే య నుకొనినను, ఫిర్యాదికూడ సత్యమునే చెప్పెననియనుకొని నను ముద్దాయి ఫిర్యాదీని బంధుమిత్రులను సాంఘికబహిష్కా రము చేయించెదనని భయపెట్టినట్లుమాత్రమే కాన్పించుచు న్నది. ఒకసాక్షి తమ్ము రెండుగోజులు బహిష్కరించిరనియు తరువాత మానివేసిరనియు చెప్పెను. పీనల్ కోడ్ 189 వ

సెక్షనుక్రింద సాంఘికబహిష్కారము నేరమగునా? ఎవరికి గాని 'యన్యాయముగా' కలిగించిన నెట్టినష్టముకైనను అపాయ మనెదరు. సాంఘికబహిష్కార మట్టియపాయ మగునా? సాంఘికబహిష్కారము నన్యాయమైన అపాయముగా గాని నేరముక్రిందవచ్చు బెదిరింపుగాగాని తలంపరాదని చట్టము స్పష్టముగా నిర్వచించుచున్నది. సాంఘికబహిష్కారములో నేమియుండునో కనుగొనుటకెట్టిసాక్ష్యమును దీసికొనబడలేదు. ముద్దాయిపై తేబడినదంతయు రుజువైనదని యనుకొనినను (ఏదియురుజువుకాలేదు.) నేరము మోపుటకును, శిక్షవేయుటకును నెట్టియధికారమునుకాన్పించదు.

అమృతలాల్, శివానందులకేసులోనితీర్పును తీసికొనుడు. ఈకేసులో ఫిర్యాది విగ్రహాపుష్టిగల యొకయుత్తరహిందూదేశపుముసల్మాను పోలీసుబంట్రోతు. ఒకమోటారుడ్రైవరు, ప్లీనరు సాక్షులు. ఫిర్యాదుయొక్క సారాంశమేమనగా ముద్దాయి 'ఫిర్యాదీతోను, యితరులతోను తాము నీచపుట్టుకపుట్టిన పాకీవానిపనిచేయుచున్నట్లు చెప్పెననియు' 'రెండవముద్దాయి చేతులనెత్తి మరియులేక ఫిర్యాదీమీదకు పరుగెత్తుకొనివచ్చెననియు' మరియు 'మొదటిముద్దాయి ఫిర్యాదీని తోపుకొట్టెననియు (ఇదిమేజిస్ట్రేటుగారి యింగ్లీషు తీర్పుకు తెలుగు. ధక్కామారా అనగా తోపుత్రోసెను. అను దానికాయన యిట్టియింగ్లీషు వ్రాసిరి) సారాంశము.

ఇద్దరుముద్దాయీలు నిర్దోషులమని వాదించిరి. మొదటిముద్దాయి తనసాక్ష్యముక్రింద యీకథయంతయు కల్లయనియు, రెండవముద్దాయి యచ్చట లేనేలేడనియు, ఫిర్యాదీసాక్షులు జప్తుఆఫీసరు అచ్చట లేనేలేడని చెప్పినట్లు కాక నీతంతునంతను చూచుచు నతడచ్చటనే యున్నాడనియు చూపుటకుగాను జరిగిన వ్యవహారమునుగురించిన ఛాయాచిత్రములను దాఖలుచేసెను. ఈసాక్ష్యము నిరుపయోగమని మేజిస్ట్రేటుగారు త్రోసివేసిరి. న్యాయముయొక్క లక్ష్యములను సేవించుటకే యీయన శ్రద్ధతీసికొనినచో ఛాయాచిత్రములు యథార్థవ్యవహారమును తెలియచేయుచున్నవా యని మేజిస్ట్రేటు ప్రాసిక్యూషనుసాక్షుల నడిగియుండవలసినది. ఆయన యిదేమియు చేయలేదు. కాని ముద్దాయిలు, ఫిర్యాదీతోను యితరులతోను 'తాము నీచపుట్టుకపుట్టిన పాకీవాని పనిచేయుచున్నట్లు' చెప్పుటచేత,ఆటంకమును కల్పించిరని కనుగొనిరట! మరియు ముద్దాయిలు చేతులెత్తి ఫిర్యాదీని ఒక్కపెట్టుతో ముద్దాయిలను పొడుముచేయగల యేనుగుశరీరమువానిని—'యథార్థముగా తోపుకొట్టి' రని కనుగొనెనట! విద్యాగరిష్ఠుడగు యీమేజిస్ట్రేటు వారికి 183 సెక్షనుక్రింద మూడునెలలు కఠినశిక్షయు 353 సెక్షనుక్రింద నారుమాసములు కఠినశిక్షయు విధించి శిక్షల నొకటి తరువాత నొకటిగా యనుభవించునట్లాజ్ఞాపించి న్యాయపరిపాలనమును గావించెను;

ఇక్కడకూడ ముద్దాయిలపై తేబడినదంతయు రుజు వైనదని మనమనుకొనినను (ఏదియు రుజువుకాబడలేదు.) ఆ టంకపరచిరను నేరముకు రుజువేమియులేదు. ఒకేవ్యాపారములో జరిగిన యీరెండునేరములును రుజువైనవని యొప్పుకొనినను పీనల్‌కోడ్ యొక్క 71 వ సెక్షనులో స్పష్టపరుపబడినప్రొవిషనుల ననుసరించి ముద్దాయిమీద 183, 353 సెక్షనులక్రింద వేరువేరు శిక్షలను విధింపరాదు. మేజిస్ట్రేటు తనయెదుటనున్న సాక్ష్యమును పరిశీలింపవలసిన విధిని విడిచిపెట్టుటయే కాక న్యాయశాస్త్రజ్ఞానములేనివాడని కూడ విశదము చేసికొనెను.

కలెక్టరు ఆవరణలోని బంగాళాగుమ్మము కెదురుగానున్నరోడ్డుమీద కూర్చొనినందులకు ముగ్గురుపిల్లకాయలకు రెండునెలలు విడికయిదు విధించినసంగతి యిదివరకే చూచితిమి.

వాంకనరునుంచి 19 మంది మనుష్యులపై ద్రొమ్మిచేసిరనియు నక్రమముగా నాటంకపరచిరనియు తేబడినకేసులో తీర్పులో నుదహరింపబడిన విషయము లేవియనగా రెవిన్యూబంట్రోతులు తోలుచుండ, పోలీసుబంట్రోతులు వెంటవచ్చుచుండ కొన్నిబండ్లు వాంకనరుకు సాయంత్రము 8 గంటలకువచ్చెను. "అప్పుడు రాత్రియగుటచే వారాబండ్ల నచ్చట రోడ్డుమీద చోరాకు 10 అడుగుల దూరములో నాపి బం

ట్రోతులు ముగ్గురును వెట్టియాను లాంతరు తెచ్చుటకు లోపలకు వెళ్ళిరి.'' తరువాత బండ్లు వెట్టియానులతో వెళ్లుచుండగా నూటయేబదిమందిగలగుంపుచే నడ్డుకొట్టబడెను. గుంపులో నొకమనిషి యొకయెద్దు ముక్కుత్రాళ్ళు పట్టుకొనెను. లాంతరుతో సహా వెట్టియానును గుంపుమధ్యకు లాగివేసిరి. ఇంతలో మునసబు వచ్చెను. "పోలీసుబంట్రోతులవద్ద తుపాకులు లేవు. కాని ఫిర్యాది గుంపును చెదరగొట్టుటకు రెండవ వానితో తనతుపాకిని పైకెత్తుమనెను. తుపాకులమాటవినగానే ఫిర్యాదీయు తదితరులును చెదరిపోయి కొద్దిదూరము వెళ్ళిరి. వెట్టియానును లాంతరుతో తీసికొనిపోయిరి. బంట్రోతు, పోలీసుబంట్రోతు, పోలీసుపటేలువద్దకు వెళ్ళి విషయములను చెప్పుకొనిరి. ఆపటేలుగారు నేరముజరిగిన స్థలమునకు వెళ్ళలేదు కాని బంట్రోతులకు మరియొకలాంతరు యిచ్చెను. బండ్లు పయనమై పోయెను." ఈనేరముజరిగిన 11 రోజులవరకు నేరస్తులను గుర్తించుకర్మ జరుగలేదు. శ్రీయుతకళ్యాణజీ, శ్రీమతిమణిభెన్‌పటేలు (వల్లభాయిగారికుమార్తె) గారలు తమ యిండ్లు విడిచి రావలెనని ప్రజలను ప్రోత్సహించువరకు నిట్టి ప్రదర్శనము జరుగలేదు. అప్పుడు సాక్షులు ఖద్దరుబట్టలను ధరించినవారినే చూపుచుండిరి. ఈప్రదర్శనమునకు జేరిన మనుష్యులలో కళ్యాణజీ, మణిభెన్ పటేలుగార్లతోవచ్చిన వల్లభాయిగారి మోటారుక్లీనరు, వారివలెనే యేపాపము నెరు

గనివాడు, కూడకలిసెను. తమాషా చూడవలెనని బుద్ధిపూర్వకముగానే యితనినిట్లు కలియుమని వారు ప్రోత్సహించిరి. గుజరాతువిద్యాపీఠవిద్యార్థియగు భోగీలాల్ వాంకనరుశిబిరముకు చెందిన వాలంటీరుకాని యీనాడతడు వాంకనేరులో లేడు. అతడుకూడ యీజనములో నుండెను. ఏకారణముచేతనో సాక్షులొక్క ఖద్దరుధారులనే గుంపులోనుండి తీయనారంభించిరి. ఈవిద్యాపీఠవిద్యార్థియు, మోటారుక్లీనరు ముద్దాయిలలో జేర్చబడిరి.

ఈప్రదర్శనముయొక్క నిరుపయోగము నంతగా వెల్లడిచేయునవసరము లేదు. మున్సీ కమిటీయెదుట సాక్ష్యమిచ్చినయనేకమందిసాక్షులు యీగుర్తించునట్టి సాక్షుల నేవిధముగా లేవదీసిరో వివరించియుండిరి. అయిదుగురుముద్దాయిలను విడిచిపెట్టవలసివచ్చెను; విచారణచేసినమీాద ముగ్గురిని నిర్దోషులనిరి; 11 మందికి 147, 353, 149 శెక్షనులక్రింద నారుమాసములు కఠినశిక్షయు 341 శెక్షను క్రింద మాసముగోజులు విడిఖయిదు విధించిరి. ఈసారిమేజిస్ట్రేటుగారు న్యాయశాస్త్రమును బాగుగా అర్థముచేసికొనినందుకు వందనీయులు; శిక్షలనొకసారి యనుభవింపవలెననిరి. పదకొండుగురులోను అయిదుగురు అపీలుచేయుగా సరియైన గుర్తించుట జరుగలేదని నలుగురిని విడిచి వేసిరి.

మరియొక కేసులో భలాన్ హీరా యనునొక విద్యార్థి, నిష్కపటియగు వ్యవసాయదారుపై ప్రభుత్వసాకరుమీద పడెననియు, నేరముక్రిందవచ్చు బలమును ప్రయోగించెననియు 186, 353 శెక్షనులక్రింద కేసుచేయబడెను. భవానుని భార్య జప్తుఆఫీసరు వచ్చుసరికి తలుపును బిగించుట నేరమగుచో నట్టినేరమునుచేసినది తా ననియు, తనభర్త నేరముచేసినచోట లేనేలేడనియు మొదటినుండియు పోలీసుఉద్యోగస్తులతో చెప్పుచునే యుండెను. ముద్దాయి తా నేమియు నెరుగనని చెప్పెను. ఈ కేసులో ప్రాసిక్యూషనువారు చెప్పు విషయములు సత్యములే యగుచో శిక్షను విముక్తించుటకు వీలుండదు. కాని యిచ్చటసాక్ష్యము తగినంత లేనేలేదు. ఏలనన తన మీదనే నేరమును వేసికొనినముద్దాయియొక్క భార్యను బుద్ధిపూర్వకముగా సాక్షిగా పిలువలేదు.

మరియొక కేసులో గోపార్జియను వాలంటీరొకవ్యవసాయదారుగోడ కంటించినప్రభుత్వనోటీసును తీసివేసెనను నేరముతేబడెను. ముద్దాయి తనవాఙ్మూలములో ముండ్లతో గోడకు గుచ్చబడిననోటీను గాలికి కొట్టుకొనిపోకుండ తాను దానిని తీసి వ్యవసాయదారుతరఫునే తనవద్దదాచినట్లుచెప్పెను. నోటీసు నీవిధముగా తీయుటయే పీనల్‌కోడ్ 173 వ శెక్షను క్రింద నేరమగుటకు చాలునని విద్యాగరిష్ఠుడగు మేజిస్ట్రేటుగారు తలంచి ముద్దాయికి నెలరోజులు విడిఖయిదు విధించెను.

ఎంతయజాగ్రత్తగా కేసులనుపెట్టిరో, యెంతయజాగ్రత్తగా శిక్షలను విధించిరో యీ కేసులన్నింటిలోను కండ్లకు కట్టినట్లు కాన్పించుచునే యున్నది. ఒక్క కేసులోమాత్రము (మరియొక మేజిస్ట్రేటు) సాక్ష్యమెంతమాత్రియును లేదను కారణమున నొకరైతుపై చర్యతీసికొనుటకు నిరాకరించి రెండు నెలలతరువాత పోలీసువారిని కేసు తీసివేసికొనవలసినదని బలవంతపెట్టెను. పైనవివరింపబడిన చాలకేసులవలెనే యిది కూడ చాలస్వల్పమైనది. కాని దీనిపరిస్థితులుమాత్రము మిక్కిలి చమత్కారమైనవి. ఒకయథార్థమైన వ్యవసాయదారునియొక్క సత్యాగ్రహ మేమిచేయగలదో చూపుటకు దీనినొక యుదాహరణముక్రింద తీసికొనవచ్చును. ముస్తాయి రాయునుంచి వచ్చిన యొకవ్యవసాయదారుడు. అతడొకప్రభుత్వసాకరుమొక్క యాజ్ఞను శిరసావహించుటకు తిరస్కరించినందులకు కోర్టువారియెదుటకు పిలిపింపబడి విచారింపబడెను. అతడు సంతోషముచే కొంచెమించుమించు తన్మయత్వము నొందుచుండెను. “నేను న్యాయస్థానముయొక్క చీడీల నెక్కుటకిదియే నాజన్మలో మొదటిసారి,” అని యతడు నాతో చెప్పెను. “నాకు జ్ఞాపకమున్నంతవరకు గత యేబదివత్సరములలోను మాగ్రామమునుండియొక్కడునుకోర్టుకు రావలసినయగత్యము లేకపోయెను. మాలో మాకు తగాదాలు లేకపోలేదు. కాని మే మెప్పుడును వాటిని మాలో మేమే సవరించుకొందుము”

ఇతనిని 174 వ శెక్షనుక్రింద నొకమూడవరేటు మేజిస్ట్రేటు విచారణచేసెను. పోలీసు సబిన్స్పెక్టరుగారు ఫిర్యాదీ, అతడు ముద్దాయిని పంచాయితీగా నుండవలసినదని యాజ్ఞాపింపగా నడుడు తిరస్కరించెనట ! 'ఆయాజ్ఞ వ్రాతమూలకమైన దేనా ?' అని మేజిస్ట్రేటుగారు ప్రశ్నింపగా 'అవును' అని పొడిమాటలతోను సన్నగొంతుగతోను మాటలాడు నాచారముగల పోలీసుయిన్స్పెక్టరు బదులుచెప్పెను. వ్యవసాయదారు యీకథలోని యొక్కమాటనైనను వినియుండ లేదు. ఇన్స్పెక్టరుగారి డిపోజిషను నతనికి చదివి వినిపించుటతోడనే యతనికంఠ్లు కోపముచే చింతనిప్పులైపోయెను. అతడు తనచోటునుండి లేచి, మేజిస్ట్రేటుగారు పొట్ట చెక్కలగు నట్లు నవ్వుచుండగా, కోర్టును గజగజలాడించునట్టి పెద్దకంఠముతో 'నీవు దీనినంతను దైవసాక్షిగానే చెప్పుచుంటివా?' అనియడిగెను. 'దైవసాక్షిగా నేనా !' అని యురుముచు నతడు సబిన్స్పెక్టరును 'నీవు నన్ను వ్రాతమూలముగా నాజ్ఞాపించితినని చెప్పునపుడు నిజమే చెప్పుచుంటివా ?' అని కోపముతో నడిగెను. అతడు భగవద్భయము కలవాడు. భగవన్నామము నీవిధముగా నిందించుట యతనికి తనను నిందించులే యయ్యెను. అబద్ధమాడుట న్యాయస్థానములలో సర్వసామాన్యమే కావచ్చును. కాని పాపమాపూర్వకాలపు వ్యవసాయదారు యిదివరకెన్నడును యిట్టి 'న్యాయదేవతాగారములను' దర్శించి యుండలేదు.

తరువాత నతఁడు తనపై నెట్టివ్రాతమూలమైన యాజ్ఞలను అమలు జరిపియుండలేదని రుజువుచేయుట కిద్దరు ముగ్గురు సాక్షుల నుదహరించెను. మేజిస్ట్రేటుగారి కేమియు తోఁచలేదు. అత డావ్యవసాయదారును శిక్షించుటకు సాహసింపలేదు. అతనినివిడిచిపెట్టినచో సబిన్స్పెక్టరును అబద్ధపుప్రమాణికము చేసినందుకు విచారణచేయవలెను.

ఈకేసులన్నియు ధైర్యనిధులగు వ్యవసాయదారుల యుత్సాహమును భంగపఱచుటకే తేబడెను. చివరకివి దానికి వ్యతిరేకఫలితమును మాత్రమే యిచ్చెను. ఆఖరికేసులోని వ్యవసాయదారు మేజిస్ట్రేటుముందు తనసత్యాగ్రహము నాపుకొనజాలకపోయెను. విచారింపబడి శిక్షింపబడిన యితరులు తా మన్యాయముగా శిక్షింపబడిరనియు, తమనిరపరాధతయు పవిత్రబాధయు తమయుద్యమమునకు వేయిరెట్లు బలమునిచ్చెననియు నెరుంగుదురు. వారిలో ప్రతివాఁడు నతిసంతోషముతో జయిలునకు వెళ్లెను. వారిని గొప్పయుత్సవములతో సాగనంపినగ్రామములు తమవీరులను చూచి గర్వపడుచుండెను.

---

# బాడ్డోలీ విజయము.



## ఇరువదినాల్గవయధ్యాయము.



"బార్డోలి స్త్రీలు."

"ఆమె బాహులతలచే వానిని చుట్టివేష్టించుచు కన్నీటి ధారలను జలజలరాల్చుచు తమ ముద్దుబిడ్డలను గురించియు, చిన్ననాటి శపథములనుగురించియు చెప్పుచు నతనిని తనదేశమును మఱచిపోయి తన ప్రేమనుగురించి తలపోయుమని ప్రార్థించుచునా? లేదులేదు." "టెరెన్సు మేక్స్వినీ."

సర్దారుయొక్క విజయమునకు గల రెండుకారణము లిదివరకే తెలుపబడినవి. మూడవది యతడు స్త్రీల నాహ్వానించుటయే. మొట్టమొదటి సభలలో స్త్రీలుండెడివారే కారు. కాని మేప్రియల్ లగాయతు పురుషులకంటె స్త్రీలసంఖ్య హెచ్చగుటయేకాక యొక్కొకపుడు వారు తమ ప్రత్యేక సభలను జరుపుకొనుచుండెడివారు. బార్డోలీ స్త్రీలు తమంతతామే యుద్ధమును జయింపగలవారై యుండవలెనని సర్దారు భావించువరకును స్త్రీలు నెమ్మదిగాను కాని నిశ్చయముగాను వచ్చుచుండినసంగతి మన మెరుగుదుము. సర్దారు స్త్రీలను ప్రత్యేకముగా నాహ్వానించుటకు కారణము యిది పు

ంషుల కెంతముఖ్యమో స్త్రీలకు నంతే ముఖ్యము. మా యాలు కారణము కాదు. నిరాడంబరత్వములోను, పవిత్రతలో ను, కార్యశూరత్వములోను వీరు తమ పురుషులకంటె చాల మిన్న లనుయథార్థమునే యతడు తీసికొనెను. బ్రూమ్‌ఫీల్డు కమిటీతో మేము తిరిగినపుడు కొంత ప్రాథమికసమాచార మును పోగుచేయుట కొక గ్రామము వెళ్ళితిమి. మేము దూ ళ్లాల పరిస్థితులనుగురించి ప్రశ్నించుచుంటిమి; కాన్బీలు వా రికి ధాన్యమును సరిగా కొలిచి యిచ్చుచున్నారా యని యడి గితిమి. పురుషులు 'అవును' అనిరి.

లోపలనుండి యిదంతయు జాగ్రతగా వినుచున్న యొ కస్త్రీ పైకివచ్చి యిట్లు గద్దరించెను. "ఈస్నేహితులముందర నసత్యములను చెప్పరాదు. మనము సరియైన కొలతలను కొలి చి యిచ్చుటలేదనియే యొప్పుకొనవలెను. దూళ్లాలు మ మ్మనేకవిధముల బాధపెట్టుదురు. మేముకూడ వారితో సరళముగా ప్రవర్తింపము. ఈకారణముచేతనే మన మిపుడిట్టి దౌర్భాగ్యస్థితిలో నున్నాము." కొంతమంది మనుష్యులు తమ కున్న ఋణబాధనుగురించి చెప్పుకొనుటకు సిగ్గుపడుచుండిరి. ఒకస్త్రీ యొకనిని గట్టిగా మందలించెను. "యథార్థమును చెప్పుటకు నీవేల సిగ్గుపడెదవు? అయథార్థమైన మన యీ సిగ్గరిభావమే మనకొంపలను ముంచినది."

వారు తన్మయత్వముతో సత్యాగ్రహగీతములను పాడుచు సభలకు గుంపులుగుంపులుగా వచ్చుచుండుట, జప్తుదోపిడీల కెంతమాత్రమును జంకక స్థిరచిత్తులై యుండుట చూచియే యున్నారము. తనపురుషులను తమవద్దనుండి బలవంతముగా చీల్చివేసి జయిళ్లకు పంపినపుడు వీ రేమి చేతురా యని మన మాశ్చర్యపడితిమి. వృద్ధురాలు, మంచిసంస్కారముకల స్త్రీ, షణ్ముఖలాలుతల్లి కీపరీక్ష వచ్చెను. ఆమె చెక్కుచెదర లేదు. కాని విద్యాగంధము నెరుగని కాపుస్త్రీ లెట్లుందురో! పదునాల్గువత్సరముల ప్రాయముగల యొకకన్య సర్దారుకు తన గ్రామస్త్రీలతరపున స్వాగత మిచ్చుచు నిష్ఠాగోష్టియుపన్యాసములో దీనికి సమాధానము నిచ్చెను.

"మా శిబిరాధిపతి రవిశంకర్భాయి జయిలుకు వెళ్ళినందుకు మాకు విచారముగానే యున్నది. కాని యతని నిర్బంధము మాకు మరింతబలము నొసగెనని మీరు చెప్పుట కెంతయు సంతసించుచున్నాము. భూములు ప్రభుత్వవశము చేసికొనబడునను నోటీసులు మాకుకూడ వచ్చినవి. మాపురుషులు జయిలుకు పోవలసిన వంతురావచ్చును. మేము మాతండ్రికి వంతు వచ్చినపుడు జయిలు కతిసంతోషముతో పోవలసినదనియు నతడు లేనపుడు అప్పచెల్లెండ్రమిద్దరము పొలములను చూచుకొందుమనియు చెప్పితిమి." వాంకనరులో చాలమంది వ్యవసాయదారుల నరెస్టుచేసినపుడు ప్రభు

క్షమువారు ప్రజలలో నొకవిధమగు భయోత్పాతమును కలి
గింపగలరని యనుకొనిరి. భయము శూన్యము. అరెస్టు కా
బడినవారిలో కొందరిభార్యలు కోర్టుకు హాజరైరి. ఇద్దరిద్ద
రనుకలిపి త్రాళ్ళతో కట్టి, చేతులకు సంకెళ్లువేసి సిద్దీలవంటి
పోలీసు సిబ్బందీ కాపలా కాయుచు తమభర్తలను స్టేషనుకు
తీసికొనిపోవుచుండ యీ స్త్రీ లుల్లాసభరితలగుచు వారినను
సరించిరి. స్త్రీహృదయములో విచారముండుగాక ! వారి
ముఖకాంతులుమాత్రము తరుగలేదు. రైలు కదలువేళ
జయజయధ్వానములు మిన్ను ముట్టినపుడు వీరుకూడ తమ
కంఠముల నెత్తి సత్యాగ్రహ వీరులను పాటలతో సాగనంపిరి.

సమరము ముగియనున్నసమయములో నొక యమా
యకకాన్బివ్యవసాయదారు ప్రభుత్వనౌకరు నాటంకపరచె
ననియు, నతనికపాయమును కలిగించెదనియు కేసు తేబడెను.
ఈవ్యవసాయదారుభార్యయొక్క వీరత్వము పౌరాణికగాథ
ను స్మృతిపథమునకు తెచ్చుచుండును. అతని యమాయిక
త్వముననే యతనిని దీసికొనిరనియు నేరమేమైన నున్నచో
దానికి తానే బాధ్యురాలననియు నామెయెరుగును. పోలీసు
వారితో నామె యీసంగతిచెప్పి జపు ఆఫీసరువచ్చినపుడు త
లుపుబిగించినది తానే యనియు తనభర్త యచ్చట లేనేలేదని
యు నామె వాదించెను. ఉహూ! పోలీసువారామెను విని
పించుకొనలేదు. వారతనిని అరెస్టుచేసి విచారణకు తీసికొని

పోయిరి. ఆమెకూడ వానితో కోర్టుకు వెళ్లెను. విచారణకు పూర్వ మామె యతనిని శ్రీయుత వల్లభాయిగారి యాశీర్వాదమును బడయుటకు స్వరాజ్యాశ్రమముకు తీసికొనివచ్చెను. అచ్చట నామె సర్దారుయెదుట భర్తతో నిట్లు చెప్పెను. "ఇటుచూడుడు! మేజిస్ట్రేటుయెదుట నీళ్ళు నమలునట్టి పిరికి మాట పనికిరాదు! అతడెంత కఠినశిక్ష నీయగోరునో యంత శిక్షను యివ్వమనిచెప్పుడు. నన్ను గురించియు పసిబిడ్డలను గురించియు విచారింపకుడు. సంతోషముతో నోలలాడుచుండుడు. అన్ని ప్రశ్నలకు ధీరత్వముతో పురుషకంఠముతో జవాబు చెప్పుడు." తరువాత సర్దారు నుద్దేశించి "ఎంతదురదృష్టము! వారు నాపై నేరము మోపరైరి! అట్లుచేసినచో స్త్రీ యేమిచేయగలదో నేను వారికొకసారి రుచి చూపియుండెడిదానను. జయిలుకుపోటవ్వలో నేమున్నది? జయిలులో ఖయిదీలకిచ్చుపనిలో నేను నాపనికంటె యెక్కువపనినే చేసియుండెడిదానను. ఒకమణుగు బియ్యపుపిండి యొకలెక్కలోనిదికాదు. నే నొకమణుగున్నర చేసెడిదానను. నాభర్త జయిలుకువెళ్లుటకు సర్వసిద్ధముగానే యున్నాడు. కాని ఆయన చాల ఒదిగియుండుస్వభావముకలవాడు? పోలీసువారిని, మేజిస్ట్రేటును ధైర్యముగా నెదుర్కొనజాలడు. నేనే ఆయన స్థానములో నుండినచో పోలీసువారు, మేజిస్ట్రేటు జన్మలో చులకనగా మఱచిపోజాలనట్టి సమాధానముల నిచ్చెడిదా

ను." అనిచెప్పెను. దీనితరువాత వారిద్దరును కోర్టునకు వెళ్ళిరి. ౬ నెలలు కఠినశిక్ష విధింపబడెనను వార్తవినుటతోడనే యామె నభర్తతో నిట్లు చెప్పెను. "జయిలునకు ధైర్యముగా వెళ్లుడు! ఇట్టియవకాశము చులకనగా రాదు. నన్నుగురించికాని బిడ్డ లనుగురించికాని బాధపడవద్దు. మేము చాలసంతోషముగా నుందుము. భగవంతుడు మీకు బలము ను ధైర్యమును ప్ర సాదించుచుగాక!" ఇట్లామె యతనిని మనసార సాగనంపి ను రల స్త్రాడువద్దకు వచ్చి తనభర్త జయిలుకుపోవునట్టి యసామాన్యగౌరవమును పొందినందుకు కృతజ్ఞతను తెలుపుచు. తనభర్తకు స్నేహితులవలనను, అభిమానులవలనను ప్రసాదింపబడిన కానుకలగు తొమ్మిదిరూపాయిలను స్త్రాడుపాద ములకడ నుంచెను. ఈభార్యయొక్క ధైర్యసాహసము లితరులకు గూడ సోకెననుటలో నాశ్చర్యమేమున్నది? ఈమె భర్త సంతోషముతో జయిలుకువెళ్ళి యనేకరెట్లయుత్సాహముతో తిరిగివచ్చెను.

మరియిద్దరు స్త్రీలకథలు చెప్పెదను. వీరుయుద్ధములో పేరుప్రతిష్ఠలు పొందలేదు కాని యీస్త్రీలెట్టి పిడితో చేయబడిరో తెలుపునట్టి రెండుమచ్చలను చూపెదను. సమరము ముగియనున్నసమయములో మహాత్ముడు బ్రాడ్లోలీ వచ్చి, నపుడు రాయము అను నొకచోటుకు వెళ్ళెను. అచ్చట నొక గొప్పసభ, వడుకుపోటీప్రదర్శనము మొదలగునవి జరిగెను.

అచ్చటకొక వృద్ధురాలు, వ్యాధిచే మృత్యుబాధ నొందుచు తా నిక రేపో నేడో చనిపోవుదునని గ్రహించి కడసారి మహాత్ముని దివ్యదర్శనము చేసి యసువులను విడువవలెననివచ్చెను. గాంధిజీ ఆమెయింటికి వెళ్ళెను. అతడచ్చట నొకయెముకలపోగును చర్మమును చూచెను. కాని గాంధిజీని చూచుటతోడనే యీయామెముఖారవింద మొకింత వికసించెను. ఆమెప్రక్కనొక నూలుదండ సిద్ధముగనే యుండెను. కాని యాదండ నామె యతనిమెడలో వేయుటకు నిలువనుజాలదు కూర్చొననులేదు. కనుక గాంధిజీ యామెముందు మోకరించెను. ఆమె కృతజ్ఞతతో నాదండ నతనిమెడలో వేసి, నుదుట కుంకుమబొట్టు దిద్ది, అయిదుపూపాయిలనోటు నిచ్చి యతనియాశీర్వాదమును వేడుకొనెను. "సంతోషవంతురాలవు కమ్ము? ప్రశాంతురాలవుగ నుండుము" అని యతడు దీవించెను. మరునాడు "నేనువెళ్ళిపోవుచున్నాను. నేనతిసంతోషముగను శాంతముగను నున్నాను. నేను పోవునపుడు నన్ను తెల్లని శుద్ధఖద్దరువస్త్రముతో కప్పుడు" అని యామె చెప్పి యొకటిరెండుగంటలలో చనిపోయెను.

రెండవయామె పైకి యారోగ్యముగా గాన్పించు యిరువదివత్సరములకన్య. ఆమె వాంకనీరుపీడులలో నొకడైన తన తండ్రిని జయిలునుండి విడుదలమై వచ్చుచుండగా బార్డోలీలో కలుసుకొనవలెనని వచ్చెను. ఆమె వాంకనరునుండి బార్డోలీ

వరకు కాలినడకనే వచ్చెను. కాని బార్డోలీ చేరుటతోడనే యామె కడుపునొప్పిచే యమితమైనబాధపడుచు సాయంత్ర మగుసరికి నేలమీదపడి దొర్లుచుండెను. అక్కడ దొరికిన వైద్యసహాయమంతయు నుపయోగింపబడెను. కాని లాభము లేకపోయెను. ప్రాతఃకాలమున మూడుగంటల కామె "మహాత్ముని నాప్రక్కవద్దకు పిలిపింపుడు. నే నతనిని కడసారి దర్శింపఁగోరుచున్నాను." అని చెప్పెను. త్వరలో గాంధిజీ వచ్చెను. ఇంతలో నామెకు ప్రాపు తప్పిపోయెను. గాంధిజీ యామెను పలకరింపగా "నేను మిమ్ము చూడజాలకున్నాను. కాని మీకంఠమును గుర్తించుచున్నాను. ఎవరైనను నాచేతులను జోడింతురా? నేను మహాత్మునకు కడసారి నానమస్కృతు లొనరింపఁగోరుచున్నాను." అనిచెప్పెను. తరువాత నామె వల్లభాయిని కోరెను. అటుపైన కొంతసేపటికి తెల్లవారకముందే యామె ప్రాణములను విడిచెను. దగ్గిర తల్లిలేదు, తండ్రి ఆయుదయముననే రానైయున్నాడు; కాని యామెకడసారితలంపులు వారిమీద లేవు. ఆమె గాంధిజీని, వల్లభాయిని మాత్రమే తలపోయుచుండెను.

బార్డోలీస్త్రీలు తా మెట్లు జీవింపవలెనో యెఱుంగుటయే గాక తా మెట్లుచనిపోవలెనో కూడ నెఱుంగుదురనియు వారిమీద నాధారపడినసర్దారు వారెట్టిపిండితో చేయబడిరో తెలిసికొనె ననియు చూపుట కీయుదాహరణములుచాలును.

# బార్డోలీ విజయము.



## ఇరువదియొదవయధ్యాయము.

"షధ్యవర్తులు."

"సదుద్దేశ్యములుగల స్నేహితులు జోక్యము కల్పించుకొనుచున్నట్లు వదంతులు వినవచ్చుచున్నవి. వారి కట్టిహక్కు కలదు. అది వారిధర్మముకూడ కావచ్చును. కాని యీస్నేహితు లీయుద్యమముయొక్క ప్రాముఖ్యతను పూర్తిగా గుర్తించవలెను. వారొకదుర్బలమైనయుద్యమమునకు గాని, దుర్బలమైనప్రజలకుగాని ప్రాతినిధ్యమును వహించుటలేదు. బార్డోలీప్రజలు నిష్కళంకమైనన్యాయముకొరకే పోరుచున్నారు. వారు వరములను కోరుటలేదు. వారొక్కన్యాయమునే కోరుచున్నారు. కనుక నిందులో జోక్యము కల్పించుకొనువారు, తేలికగా వదలుకొనుటకు గాని, రాజీపడుటకుగాని వీలులేనట్టి యీసమరములోని యంతరార్థములను సరిగా గ్రహించనిచో ప్రజలకును, వారియుద్యమమునకును తీరని నష్టమును కలిగించినవార లగుదురు. "గాంధిజీ"

గాంధిజీ యీమందలింపును బార్డోలీప్రజలతరఫున జోక్యము కల్పించుకొనుచున్నవారికిని ముందట్లు చేయదలచుకొనినవారికిని పంపెను. సదుద్దేశ్యముతోనే 'మొదటపన్ను

అంతయు చెల్లించవలెను.' అను దానిని ప్రారంభించిన లేక సమర్థించినవానియుదాహరణ మొకటి యిదివరలో నీయబడెను. ప్రజలు ఐచ్ఛికముగా తమపై తామే విధించుకొను బాధలోనున్నవిలువ నితను గుర్తింపలేక దీనినెట్లో సమాప్తము చేయవలెననుకొనెను.

ఇపుడింకను ననేకమంది మధ్యవర్తులు వచ్చిరి. వీరు ప్రజలు దేనికొరకు పోరాడుచుండిరో గుర్తించిరి. వీరు కేవలము ప్రజలపక్షమున న్యాయవాదులవలె రాకపోయినను ప్రజావాదమును తమశక్తివంచన లేకుండ చక్కగా సమర్థించిరి. వీరందరును బార్డోలీ వెళ్ళి తమకండ్లు, చెవులు, బుద్ధి సాక్షీభూతములగుచుండ సర్వమును ప్రత్యక్షముగా తెలిసికొని వచ్చినచో మరింత బాగుండెడిది. బొంబాయి విశ్వవిద్యాలయముతరఫున శాసనసభ్యుడుగానున్న శ్రీయుత మున్షీగారు, బొంబాయి హైకోర్టువకీలుగారు మాత్రము బార్డోలీ వెళ్ళి తనవిచారణఫలితమును ప్రజలందర నాకర్షించునట్లుగా, బార్డోలీపై యందరినేత్రములు పడునట్లుగా నివేదించెను. గవర్నరుగారివద్దనుండి వచ్చినజవాబులు చట్టబద్ధులలో చట్టబద్ధుడగు నతనివంటివానికికూడ చాలయసంతృప్తిని కలిగించెను. అతడు గవర్నరును చూచి దానివలన ఫలితము లేకపోయిన తరువాత తానేమిచేయవలెనో నిశ్చయించుకొనుటకు స్వయముగా బార్డోలీవెళ్ళెను. అతడు బార్డోలీలో గ్రామములవెం

బడి గ్రామము వెళ్ళి సభలకు హాజరగుచు, గ్రామస్థులతో సంభాషించుచు, స్త్రీపురుషులను ప్రశ్నించుచు నీసందర్భనఫలితముగా పిడుగువంటి చట్టబద్ధము “ తనయసమ్మతిని ప్రకటించుటకు తగినవిధానము నవలంబింపవలసివచ్చిన విచారకరమైన యావశ్యకతకు” లోంగక తప్పినదికాదు. జూను 17 వ తేదీని యతడు బార్డోలీప్రజల పరిస్థితులనుగురించి కండ్లకు కట్టినట్లు వివరించుచు వారు యోరిమితోను, ప్రతీకారము లేకుండగను పడినబాధలు రెవిన్యూయుద్యోగస్థుల నెట్టినిస్సహాయస్థితికి దెచ్చెనో వర్ణించిచెప్పెను. అతడు ప్రభుత్వమువారి కనేకయుత్తరములనువ్రాసి, వారిని కేవలము తమధర్మము నాచరించుటకు మేల్కొలుప నెత్నించినమీదటనే బార్డోలీ వెళ్ళుటకు నిశ్చయించెనని జ్ఞాపకముంచుకొనెదరుగాక ! అతడు ప్రజలయాహ్వానముపై గాని సర్దారుయాహ్వానముపైగాని బార్డోలీ వెళ్ళలేదు. అతని కీయుద్యమముపట్ల నంతగా నెక్కువయభిమానము లేదని ప్రజాభిప్రాయమైయుండెను. అతడు రాజీనామా యిచ్చునని యెవరును యెరుగరు. అతడు కేవల మెట్టి పాక్షికబుద్ధియు లేకుండగనే వెళ్ళెను. తాను స్వయముగా దర్శించుటచే నతనికండ్లు తలవనితలంపుగా తెరువబడెను. అతడు ముఖ్యముగా ప్రభుత్వమువారికండ్లను తెరచుటకే వారికి యుత్తరమునువ్రాసెను. భారతదేశమంతటను ప్రతిపత్రికలోను ప్రతిధ్వనించి సహజముగా ప్రజలనాకర్షించిన ఖీాయు

త్తర మీాసంగ్రామచరిత్రలో ప్రధానపత్రములలో నొకటి యనుటకెట్టి సందేహమును లేదు.

"పురుషులు, స్త్రీలు, శిశువులు 80,000 మంది ప్రభుత్వము నెదుర్కొనుటకు వజ్రసంకల్పులై యున్నారు. మీా జప్తుఆఫీసరుగారు క్షురకర్మ చేయించుకొనుట కనేకమైళ్లు నడిచిపోవనగాని దిక్కులేదు. బురదలో కూరుకొనిపోయిన మీాయుద్యోగస్తునిమోటారుకారు మీా రధికారభాషలో 'బాల్శోలీపై బ్రతుకుచున్న యాందోళనపరుడు' అని శలవిచ్చినవల్లభాయిపటేలుగారు రక్షించనిచో నట్లు చీకిపోయి యుండవలసినదే! అనేకవేలరూపాయిలఖరీదుచేయుభూములను నామమాత్రపువిలువకు కొనిన గాడ్రాగారియింటికి పాకీ పనివాడుకూడ రాడాయెను! రైల్వేస్టేషనువద్ద కలెక్టరుగారికి వల్లభాయిగారి యనుమతి లేనిదే బండిమొదలగున వేవియు దొరకవు. నేను చూచిన కొద్దికాలములో నొక్కపురుషుడు గాని స్త్రీ గాని తా మవలంబించినదాని కెంతమాత్రమును విచారమునుగాని, తమ యపారవిశ్వాసమునందు చలనమును కాని చూపియెరుగరు. వల్లభాయి గ్రామగ్రామము వెళ్ళునపుడు పురుషులు, స్త్రీలు, బిడ్డలు నేలయీనినట్లు వచ్చి వానికవ్యాజముగా నర్ఘ్యపాద్యాదుల నిచ్చుటను నేను కండ్లార చూచితిని. విద్యాగంధములేని వృద్ధస్త్రీలు, కన్యలు చింకిరి గుడ్డలను కట్టుకొని వచ్చి యతనినుదుట విజయతిలకమునుదిద్ది

తను పవితోద్యమమును తను కష్టార్జితమైన యొకటి రెం-
రూపాయిః నతనిపాదములకడ నుంచుచుండుటను నేను గా-
చితిని. వారు తమ మోటుభాషలో దురదృష్టవంతమై
ప్రభుత్వముయొక్క దుష్కృత్యములనుగురించి పాటలుపాడు-
చుండిరి. అయిష్టముగానున్న ప్రజలపైని యీకృత్రిమాం-
దోళనను బలవంతముగా చొప్పించిరని చెప్పిన యుద్యోగస్థు-
లనివేదికలు కేవలము బూటకములని నేను యొప్పకొనక
తప్పినదికాదు. భీతావహమును కలిగించుటకు మీప్రభుత్వము
చేయు నెఱిప్రయత్నములను చూచి ప్రజలు నవ్వుకొనుచుం
దురు. వారిదివరలో సమస్తమును యుత్సాహముతో భరిం
చిరి. ఇక ముందునెంతదైనను ధిక్కరించుటకు సిద్ధముగనే
యున్నారు. వారు న్యాయ్యగారి నతిసరసముగా 'దున్నపోతు
లకొరకావురావురు మనుచుండు పెద్దపులి' యనియు, జప్తు
ఆఫీసరును 'ఛోటాకమీషనరు' అనియు వాడుచుందురు. ఉ
త్సాహవంతుడు, గొంతెమ్మకోరికలు కలవాడునగు ఆశ్మో
లాగారికొరకు వారు ప్రత్యేకించిన నమ్రమైనపదమును
నేను కాగితముపై వ్రాయసాహసింపను. ప్రభుత్వప్రయోజ
నముకొరకే యతడెంతపట్టుదలగలవాడో యంత శాంతుడు
గను నుండవలెనని నేను కోరుచున్నాను.........పుత్రవా
త్సల్యముతో చూచుకొనుచుండు తమ పశువులను రక్షించు
కొనుటకు 80000 మందిపురుషులు, స్త్రీలు, బిడ్డలు తమ

పసువులతోసహా తొంబదియహారాత్రములనుండి యపరిశు భ్రమైన చిన్నచిన్నయిండ్లలో తాళములుబిగించుకొని జీవించుచున్నారు నేను నిర్జనమై, నిశ్శబ్దమై, విడిచిపెట్టబడి పాడుబడియున్నగ్రామములగుండ పోవునపుడు, గ్రామపొలిమేరలను వాలంటీర్లు కాపలా కాయుచుండ, వచ్చునది జప్తుఆఫీసరేమోయని స్త్రీలు అడ్డకిటికీలనుండి తొంగిచూచుచుండగా చూచితిని. నేను నాసంగతి చెప్పుకొనగా నమ్మకము పుట్టిన మీదట తలుపులనుతెరచి నన్ను లోపలికి తీసుకొనివెళ్ళగా నే నచ్చట మురికిని, కుళ్ళును, కంపును, చీకటులనుచూచితిని. పురుషులు, స్త్రీలు, శిశువులు బక్కచిక్కి, శల్యావశిష్టమై, పాలిపోయి, వ్యాధిగ్రస్తమై విచారదృక్కులతో తమ్ముచూచునట్టి తమప్రాణసమానములగు పసువులతో నాకేగదిలో మందలవలె పడియుండుటను నేను చూచితిని. వారు తమపశువులను జప్తుఆఫీసరుల దయాదాక్షిణ్యములకు విడిచివేయుటకంటె నెన్నిమాసములైనను అట్లుపడియుండుటకే కృతనిశ్చయులై యున్నసంగతి వినినపుడు యీదిక్కుమాలిన జప్తుపద్ధతులను కనిపెట్టినబుద్ధి, వీని నాచరణకు తెచ్చునట్టి కాఠిన్యత, వీనికధికారమిచ్చినసీతి మధ్యయుగమునాటి చరిత్రలలో తప్ప మరెచ్చటను కానరాదని నేను తలంపక తప్పినదికాదు.”

తరువాత నతడు 'అపరిమితదుఃఖము కలుగచేయుట కు'ద్దేశింపబడి 'పగసాధింపబూనినవిజేత' యొక్క పద్ధతులను వర్ణించుచు, న్యాయమును నపహాస్యమునకుదింపినయుదాహరణముల నిచ్చుచు "తలతిరిగిననిరంకుశోద్యోగుల వెక్కిరింపులును, సాంకేతికనేరములకై వేసిన యతికఠినశిక్షలును, పొగరుమోతుప్రకటనలద్వారా చేసినగర్జనలును, ఉద్యోగస్తులకత్తిసాములును ప్రజలలో వేళాకోళమును తప్ప మరేమియు కలిగించలేకపోయె"నని వ్రాసెను. ఉత్తరము సమాప్తముచేయుచు నతడు బార్డోలీవిషయమై ప్రభుత్వమునకుచాలహెచ్చులోటులు వచ్చెనని వారు కోసినకోతలలోని నిస్సారతను వెల్లడించుచు ఓటుల నావిధముగా తికమకలుచేసి సృష్టించుకొనుటచే ప్రభుత్వమువారే యెట్టిచట్టబద్ధుడైన మానవుడైనను ప్రభుత్వమును సమర్థించుట కసాధ్యమగునట్లుచేసిరనియు "దీనికి నాయధీనములోనున్న జవాబు శాసనసభలోని నాసభ్యత్వమునకు రాజీనామా యిచ్చి రాష్ట్రమంతటనునిండియున్నవోటరుల నీసమస్యమీద తమతీర్పును ప్రకటింపవలసినదని కోరుట యొక్కటే" యనియు చెప్పెను.

ఈయుత్తరము తమవంటి దేశభక్తులయెడల నేమాత్రము గౌరవభావమున్నవారినైనను కదల్చివేసి బార్డోలీసమస్యకు ప్రజాహృదయము నాకర్షించినసమస్యలలో నగ్రస్థానమునిచ్చెను. శ్రీయుతమున్షీగారు రాజీనామా యిచ్చుట

తో నూరుకొనలేదు. అతఁడు వెంటనే తాను, హుసేనుభా యిలాల్జీ యం యల్. సి, డాక్టరు గిల్డరు యం. డి., యఫ్. ఆర్. సి. యస్., యం. యల్. సి., రావుబహదరు భీమభా యినాయిక్, యం. యల్. సి., శివదాసనీ యం. యల్. సి, చంద్రిచూడ యం. యల్. సి; కార్యదర్శియగు బి. జి. ఖేరు గార్లతో కూడిన యొకకమిటీని యేర్పాటుచేసి భీతావహాము ను కలిగించుట కవలంబింపబడిన పద్ధతులను క్రమమైన న్యా యపరీక్ష చేయుటకు గడంగెను. ఐచ్ఛికసేవ చేయవచ్చిన సూ రతు, బొంబాయి న్యాయవాదులద్వారా వారు 126 గురు సాక్షులను పరీక్షచేసిరి. తమవిచారణకు సహాయముచేయ వలసినదని వారు ప్రభుత్వమువారిని కోరిరి. కాని వారు దాని కంగీకరింపలేదు.

విఖ్యాతిచెందిన యీయుత్తరములో శ్రీయుతమున్షి గారు "స్వయముగా పరిశోధనలను గావింపవలెననెడుకోరిక నీయుత్తరము మీప్రభుత్వములో కలుగచేయు" నని యూ శించెను. గవర్నరుకాని రెవిన్యూసభ్యుఁడుకాని కదలకపోయి నను కమీషనరైన స్మార్టుగారు మొదటిసారి బార్డోలీవెళ్ళుట కీయుత్తరమే కారణమని చెప్పకతప్పదు. ఇది యితరుల ననే కమందిని నిద్రనుండి మేల్కొలిపెను.

ఈమధ్యవర్తులలో నింకొకరు సర్ పురుషోత్తమదా సుఠాకూర్దాసుగారు, కలెక్టరుగారి ప్రోత్సాహముపైని పురు

షోత్తమదాసుగారు కమీషనరును సూరతులో జూన్ మా
సములో కలుసుకొనెను. తనను సూరతులో కలుసుకొనవలె
నని యతడు శ్రీయుతవల్లభాయి కాహ్వానముపంపి కమీష
నరు సర్దారులమధ్య నొక ఛర్చ కవకాశమును కల్పిం
చనెంచెను. సర్దారు కప్పుడు యెక్కువతొందరపనులుండు
టచే పోజాలక యీగ్రంథకర్తను పురుషోత్తమదాసుతో మా
ట్లాడుటకు పంపెను. స్మార్ట్సుగారితో చాలాకాలము మాట్లా
డితిననియు, నుద్యమము నణచివేయుట కతడెంతదూరమై
నను పోవుటకు బద్ధకంకణుడై యున్నాడనియు, నీనెలాఖరు
లోగా సత్యాగ్రహులలో చాలమంది లొంగిపోవుట నిశ్చయ
మని యతడు చెప్పెననియు పురుషోత్తమదాసు నాతో చెప్పె
ను. ఈగ్రంథకర్త పురుషోత్తమదాసుతోను అతడు కమీషన
రుతోను సత్యాగ్రహులయొక్క యథార్థమైనసహనశక్తి
నతడు గుర్తించుటలేదనియు, జప్తుఆఫీసరు లవలంబించుచున్న
పద్ధతులును, పఠానులప్రవర్తనయును ప్రభుత్వమున కపయశ
స్సును సంపాదించెననియు స్పష్టపరచెను. తరువాత నతడు
తనసంఘముతరఫున ప్రతినిధియైన లాల్జీ నారంజీగారి రాజీ
నామా (బార్డోలీసమస్యమీద)ను గురించి యాలోచనకు
తెచ్చెను. ఈసంఘమున కధ్యక్షుడగు మోడీగారు ప్రభు
త్వాభిప్రాయమును తెలిసికొనవలెనని గవర్నరుగారికి వ్రా
సెను. కాని దానివలన లాభము లేకపోయెను. గవర్నరుగారు

మున్షీగారికిచ్చినజవాబులకంటె ఘాటైనజవాబులను వర్తక సంఘమువారికి పంపెను. పురుషోత్తమదాసుగారు గాంధిజీని సబర్మతీఆశ్రమములో కలుసుకొని సత్యాగ్రహుల తక్కువ కోరికను తెలుపగోరెను. దీనికి వల్లభాయికూడ నాహ్వానింపబడెను. గాంధిజీని కలుసుకొనినతరువాత పురుషోత్తమదాసు, మోడీ, లాల్జీ నారంజీగార్లతో గవర్నరుగారిని దర్శించుటకు పూనా వెళ్ళెను. గవర్నరుతోను, ప్రభుత్వసభ్యులతోనుకూడిన యాసమావేశ మెంతయూశాభంగకరముగనుండెనో పురుషోత్తమదాసు యీగ్రంథకర్తలతోచెప్పెను. శ్రీయుతవల్లభాయి నొకసభకు పిలిపించవలెననియు, నచ్చట తమకున్న భేదాభిప్రాయములు స్పష్టమయి రాజీ కుదరవచ్చుననియు పురుషోత్తమదాసు గవర్నరుగారితోచెప్పెను. ఆసభలోనున్న కొంతమంది 'అయఃపిండములకు' గవర్నరుగారు వల్లభాయివంటి 'విప్లవకారుని' సభకు పిలిపింపవలెనను సూచనయే కర్ణములో కాగముపెట్టినట్లయ్యెను. కనుక సభ విరమింపబడెను. తరువాత పురుషోత్తమదాసు గవర్నరును ఒంటిరిగా దర్శించెను. అతడు మంచిసానుభూతినిచూపెను. కాని 'మొదటినుంచి చివరవరకు దెబ్బలుతినుటకు' సహజముగా విముఖుడుగానుండెనట! "మొదటిపన్ను చెల్లింపవలెను లేదా వ్యవసాయదారులు హెచ్చుపన్నును మధ్యవర్తులవద్ద ధరావతుపెట్టినమీాదట విచారణ సలుపబడును." గవర్నరుగారిది తుది

మాటగా చెప్పిరి. ఈప్రతినిధివర్గమువారు "ఉభయపక్షము లకు రాజీకుదుర్పుటకు సాయపడ గలుగుదుముగాక" అను వాసతో వెడలిపోయిరి. తిరిగివచ్చునపుడు పురుషోత్తమదాసు వల్లభాయిని బొంబాయిలో కలుసుకొని జరిగినదంతయు చెప్పెను. ప్రభుత్వమువారికిని సత్యాగ్రహులకును సమా ధానము కుదరదని వారిరువురు నంగీకరించిరి.

తరువాత జరిగినచర్చఫలితముగా లాల్జీనారంజీ నిష్ప క్షపాతమైనవిచారణ కంగీకరించుటకు పూర్వము హెచ్చుప న్ను నిచ్చివేయవలెనని పట్టుపట్టుట హాస్యాస్పదమని వ్రాయు చు తన శాసనసభాసభ్యత్వమునకు రాజీనామాయిచ్చెను.

ఈమధ్యవర్తిత్వములు ప్రభుత్వమువారిని రాజీకును ర్చుకొనుట కెట్లుతయారుచేసెనో చెప్పజాలము. కాని వీటివ లన ప్రజలెంతమాత్రమును చలింపలేదు. 'అపరిపక్వమైన రాజీకొరకాతురపడకుడు' అని సర్దారు ప్రజలకు బోధించు చుండెను. "పచ్చిమామిడికాయను తెంపి రుచిచూచినచో నేమగునో మీరెరుంగుదురు. మీపళ్లు పులిసిపోవును. అట్లు కాక మీరుదానిని పండనిచ్చినచో సకాలములో తానంతట తామె రాలి మీయోర్పుకు తగినఫలితమును, ఫలముననును, మధురరసమును మీరుగ్రోలగలరు... రాజీకిసమయమాసన్న మగునేని యొకరుచెప్పనక్కరలేకుండగనే మనకది తెలియుగ లదు. నేను ప్రభుత్వహృదయములో నెట్టిమార్పును నాకు

ళన్పించుట లేదు. నిన్ననే స్థానిక మేజిస్ట్రేటు నాసిఫాలడ్ నుంచి వచ్చిన యొకనిరపరాధియైనవ్యవసాయదారున కారుమాసము లు కఠినశిక్ష విధించెను. అతని భార్యయు మరికొందరు స్త్రీలు ను జప్తు అఫీసరు కొంతమందిపఠానులతో యింట్లోనికి జొరబడు చుండగా తలుపులను బిగించుటయే దీనికి కారణము. ప్రభు త్వము వారు నిర్బంధచర్యలను నిరంతరముగా సాగించునం తకాలము, పశ్చాత్తాపము నెంతమాత్రమును చూపించ నం తకాలము రాజీమాటల కవకాశమే లేదు."

వీటిఫలిత మేదియైనను వాణిజ్యములో మునిగియున్న బొంబాయికి చెందిన ప్రముఖులలో చాలమంది ప్రభుత్వము వారిచే 'రాజకీయ' ఉద్యమముగా పరిగణింపబడినట్టియు, నిరంకుశులలో తలబిరుసుగలవారిచే 'విప్లవకారు' డని పిలువ బడునట్టియు నాయకుడు గలట్టియు యుద్యమముపట్ల నెక్కు డుయాసక్తిని చూపుటవలన దేశములో రాజకీయజీవిత మె క్కువగా నభివృద్ధియైనట్లు తెలియుచున్నది.

---

# బార్డోలీ విజయము.



## ఇరువదియారవ యధ్యాయము.



"నిష్పక్షపాత సాక్షులు"

"న్యాయము జ్ఞానముతో కూడిన మితమునందుండును."

"అరిస్టాటిల్."

బార్డోలీసత్యాగ్రహముపట్ల 'వర్తకములో మునిగి యున్న' బొంబాయి తీసికొనినశ్రద్ధయే ప్రశంసనీయమైన పుడు యితరరాష్ట్రములలో నున్న ప్రజాహితైషులు, లిబరలుపక్షముకు చెందినవారిలో ప్రధానులుకూడ నీయుద్యమమును సమర్థించుట మరింతప్రశంసనీయమని వేరుగ చెప్పనక్కరలేదు. ఈ రెండుతరగతులకును భేదమును చూడవలె నన్న మధ్యవర్తులు మానవబాధను చూడలేక దయారసప్రపూర్ణులై శ్రద్ధతీసికొనిరి. లిబరలుపక్షమువారు న్యాయముకొరకు శ్రద్ధతీసికొనిరి. మధ్యవర్తులు యీయుద్యమమును సమర్థించుటకంటె సత్యాగ్రహులను బాధనుండి తొలగించుటకును, వారు నాశనమైపోకుండనుండుటకును యెక్కువగా శ్రద్ధతీసికొనిరి. లిబరలుపక్షమువారు యీసంగ్రామచరిత్రను చక్కగా పరిశోధించి యిది కేవలము న్యాయమని ధృవపర

వి యంతవరకు దీనిని సమర్థించి తరువాత పరిస్థితులకు విడిచి వేసిరి. ప్రజాపక్షమున తలయెత్తినయుద్యమములో బహుశః బార్డోలీయుద్యమమొక్కటియే అన్నిపక్షములవారి సానుభూతిని, సహాయమును బడసెను.

జూన్ మూడవవారములో పండిత హృదయనాథ కుంజ్రుగారు సర్వెంటుఆఫ్ ఇండియా పత్రికాధిపతియగు శ్రీయుత వేజుగారితోను, అమృతలాల్ ఠక్కరుగారితోను యీ సమస్యను స్వయముగా తెలిసికొనుటకు బార్డోలీ బయలుదేరిరి. వారు సెటిల్‌మెంటుని వేదికలను క్షుణ్ణముగాచదివి సత్యాగ్రహులు మోపుచిందవలను పరీక్షించుటకును, విచారణచేయవలెననెడి వారికోరికలో నున్న న్యాయమును కనుగొనుటకును గ్రామములకు వెళ్ళిరి. శ్రీయుత మున్షీగారి దృక్పథముకంటె వీరిదృక్పథము మరింత సంగరహితమైనది. ప్రజలబాధలను గురించియు, వారివీరపురుషోచితసంగ్రామకలాపమునుగురించియు మున్షీగారు వర్ణించియే యుండిరి. ఇంతకంటె నెక్కువగా మరేమియు వ్రాయజాలరు. ఈస్నేహితులు పూర్తిగా రెవిన్యూవిచారణకొరకే పనిచేసిరి. వారు గ్రామములను పరీక్షించుచుండగా నొకస్నేహితుడు ఖద్దరు ప్రజల కెట్టిలాభమును చేకూర్చెనో చూపుటకు కొన్ని ఖద్దరుప్రదేశములను చూపింపగోరెను. కాని వారు దీని కొప్పుకొనలేదు. కనుక వారిలోనున్న యీసంగరాహిత్యమే వారి వి

చారణకును వారు చూపిన సారాంశములకును విలువనిచ్చు చున్నది.

విశేషణములు, వన్నెలు, చిన్నెలు యెంతమాత్ర మును లేని వారినివేదికలో, సహేతుకముగను, క్లుప్తముగ ను వ్రాసినవారినివేదికలో వారు నాలుగుప్రశ్నల నాలోచిం చియుండిరి. "పన్నుహెచ్చుదల కవులుకుతీసికొన్నవారివద్ద నుండి భూస్వాములు గుంజుకొనుచున్న అద్దెలమీద నాధా రము చేయబడెను కనుక కవులుదారులు చెల్లించుచున్న అద్దె లపట్టికను తగినంతశ్రద్ధతో తయారుచేసినదీ లేనిదీ పరీక్షింప వలసియున్నది. ఏలనన యీపట్టిక ఆర్థికలక్షణములతోకూడిన అద్దెలనుమాత్రమే చూపవలెను. దీనిలో గొప్పదోషము న్నచో దీనినుండి తీయబడినసారాంశములన్నియు నిరుపయో గములే యగును. మరియు పన్నులను స్థిరపరచునీతికి పోటీ లమీద వచ్చుచుండుఅద్దెలను పునాదిగా తీసికొనుటకు పూర్వము సాగులోనున్నభూమిలో నెన్నవవంతురొక్కము చెల్లించుకవులుదారుల చేతులలోనున్నదో నిశ్చయింపబడ వలెను. పాతసెటిల్మెంటు అమలులోనున్న కాలములోని (అద్దెలను గురించి విచారణ జరిపినపుడు) అసామాన్యపంవ త్సరములను విడిచివేసిరా యనునది మూడవప్రశ్న. క్రొత్త పన్నులరేటులను నిశ్చయించుటకు కేవలము మక్తా లేక అగ్గె విలువనే ఆధారముగా తీసికొనవలెననుటను రెవిన్యూకోడ్

కాని సెటిల్ మెంటుమాన్యుయల్ కాని యెంతవరకుసమర్థించు మన్నవి? అనునది నాలుగవప్రశ్న."

పైనుదహరింపబడినకోడ్‌ను, సెటిల్ మెంటుమాన్యుయల్‌ను చదివినమీాదట, అనేకగ్రామములలోనున్న ప్రజలను స్వయముగా పరీక్షించి విచారణలు సలిపినమీాదట వారీక్రిందినిర్ణయమునకు వచ్చిరి.

1 ఈఅద్దెలపట్టిక చాలదోషములతో నిండియున్నది. ఏలనన తణఖావ్యాపారములు, పూర్తిగా వసూలు చేయబడనిఅద్దెలు లేక షరతులతో చేయబడిన క్రియములు మొదలగువానిని మినహాయించ లేదు. రెవిన్యూకోడ్ 107 వసెక్షనుప్రకారము భూమికలవాని ఖర్చులమీాద చేయబడిన మరమ్మతులవలన తీసికొనబడుచున్న అద్దెలవిషయములో నెట్టి తీసివేతలును చేయబడ లేదు.

2 సాగుచేయబడుచున్న భూమిలో నొక్కమునకు అద్దెకు తీసికొనబడినప్రదేశము నూటికి యిరువదివంతులుమాత్రమే కలదు. 1895 లో "భూస్వాములలో నూటికి 94 గురు స్వయముగా వ్యవసాయము చేయుచుండిరి" అనువిషయమును చూచినపుడు నేను నూటికి ముప్పదిమందవరకు కవులుదారులు వ్యవసాయముచేయుట చాల పెద్దసంఖ్యయనియే చెప్పవచ్చును.

3 రెవిన్యూసభ్యుని వాఙ్మూలముప్రకారమే 1918-19 మొదలు 1924-25 వరకు గల యవా ధారణకాలమును మిన హాయించియుండవలసినది.

4 సెటిల్మెంటుకమీషనరు తన "ఒక్క యథార్థమైన మార్గదర్శి" గా నసంపూర్తియైనట్టియు పరిశోధింపబడనట్టియు అద్దెలెక్కలమీద నాధారపడెను. అప్రత్యక్షముగా జరుపబడిన విచారణఫలితములను సవరించునుద్దేశ్యముతో కాక వ్యవసాయఖర్చులలోని పెరుగుదలను గూర్చి యోచింపకుండ, దానికి తీసివేత లేకుండ చేయుటకును "పన్ను హెచ్చుదల చాలయెక్కువకాకుండ నడ్డుపెట్టుటకు" (సెటిల్మెంటు గ్రంథములో పైమాటలేయున్నవి.) పన్ను రేటులను హెచ్చించుటకును అతడీలెక్కల నుపయోగించెను. పైనుదహరింపపబడినసారాంశములను పురస్కరించుకొని కుంబ్రు వేజు, ధక్కరుగార్లు "క్రొత్తవిచారణకొరకు చేయబడుచున్న కోరిక పూర్తిగా న్యాయమైనదే" "వీరంగంతాలూకాలోని రివిజనుసెటిల్మెంటును తిరిగి విచారించెదమని చేసిన ప్రకటన బార్డోలీతాలూకాలోని సెటిల్మెంటును కూడ తిరిగివిచారింపవలసియున్నదని చెప్పకనే చెప్పుచున్నది" అను ఖండితమైన తీర్పులకు రాగలిగిరి.

శ్రీయుత వేజు మరియొకస్టేటుమెంటు నిచ్చుచు "బార్డోలీలోని ప్రస్తుతపోరాటము కేవలము ఆర్థికపోరాటమని

యు నది శాసనోల్లంఘన ప్రణాళికలో భాగము కాదనియు" ప్రత్యేకముగా నొక్కి చెప్పెను.

"....ఈయుద్యమనాయకులు తమ సర్వశక్తులను ధార పోసి బార్డోలీవ్యవసాయదారులపట్ల జరుపబడిన ఘోరమైన యన్యాయమని తాము త్రికరణశుద్ధిగా విశ్వసించుచు దానిని భంగపరుచు నుద్దేశ్యముతప్ప మరెట్టియుద్దేశ్యములను కలిగి యుండలేనట్లు నా పరిశోధనవలన నేను తృప్తిపొందితిని. ప్రభుత్వము వా రిట్టియుద్యమమునకు లేనిపోని రాజకీయసంబంధములను ముడిపెట్టుట తెలివితక్కువతనము, అక్రమము" అని యతడు వ్రాసెను.

ఈ నివేదిక అన్నిరాజకీయకక్షులవారిని తృప్తిపర చెను భారతదేశములోనున్న వార్తాపత్రికలలో నింకను యి టునటు నూగులాడుచున్న కొద్దిపత్రికలనిది సత్యాగ్రహుల పక్షముగ త్రిప్పివేసెను. లిబరలు పక్షమువారితోసహా అన్ని పక్షములవారికిని ప్రజల కోరికలనుగురించియు, వారికి న్యాయముగా చూపవలసిన తక్కువ న్యాయమునుగురించియు నొకే యభిప్రాయమును కలుగచేయుట కిదియే కారణము. మణిలాల్ కొఠారి చక్రముతిరిగినట్లు తిరుగుచు ననేకమంది నాయకుల కీకేసులోని విషయముల నన్నిటిని యెరుకపరచుచు బార్డోలీలో జరుగుచున్నచర్యలనుకూడ తెలియచేయుచు శక్తివలె పనిచేసెను. దీనిఫలితముగా నాయకులందరును ప్ర

జ్వలించుచున్న యీసమస్యపై తమ యభిప్రాయమును బహిరంగముగా వెల్లడిచేసిరి. జాతియొక్క దృష్టియంతయు నీసమస్యపై కేంద్రీకరింపబడెను. పండిత మోతీలాలు నెహ్రూగారు పత్రికలో నిట్లు వ్రాసిరి. "బొంబాయిప్రభుత్వమువారు పునర్విచారణ కంగీకరింతురు కాని యట్టివిచారణకుపూర్వము ప్రస్తుతసెటిల్మెంటుప్రకారము పన్నుమొత్తము నంతను చెల్లింపవలెనని పట్టు పట్టుచున్నట్లు నాకు తెలియుచున్నది. ఇది యొక వింతస్థితిగానున్నది. ఇప్పుడు కట్టినపన్ను అన్యాయము. తప్పనై పునర్విమర్శనకు తగియున్నపుడు దీనిప్రకారము రావలసినబాకీలను చెల్లింపవలెననుట మౌర్ఖ్యము తర్కవిరుద్ధము." "ప్రభుత్వమువారు యిరుపక్షములప్రతినిధులతోకూడిన యొకకమిటీని నియమించినచో" బార్డోలీలోనున్న విషమపరిస్థితులు చక్కబడ గలవని సర్ ఆలీయిమాంగారు చెప్పిరి. శ్రీయుత చింతామణిగారి యభిప్రాయముకూడ కుండ బద్దలుకొట్టినట్లు స్పష్టముగా క్లుప్తముగానుండుటచే మరింత చుర్రుమనునట్లుగా నుండెను. అతడీవాదమును ప్రపంచకజ్ఞానముమీద నాధారముచేసెను. "తమ యిచ్ఛయే న్యాయము; తమన్యాయము తరుచుగా తమ తెలివితక్కువతనమున కొకగౌరవ పదముమాత్రముగా నున్నట్టి యొక బ్రహ్మాండమైన ప్రభుత్వముతో వేలకొలది బీదప్రజ లకారణముగా తలపడి తత్ఫలితముగా లబ్ధిపొందునదేమియు లేక

పోయినను సర్వమును పోగొట్టుకొనునంతటి బుద్ధితక్కువస్థితికి 'మానవప్రకృతి' రాలేదని" యతడు చెప్పెను. తమవాదములోనున్న న్యాయముకొరకు మితిలేని బాధలను బుద్ధిపూర్వకముగా నాహ్వానము చేయుచున్న ప్రజలు హెచ్చుపన్నును రద్దుచేయవలసినదని న్యాయముగా కోరియుండవలసినదని యతడనుకొనెను. కాని "వారు నిర్మొగమాటముగ పన్ను తగ్గించవలసినదని కోరుటకు బదులు నిష్పక్షపాతమైన స్వతంత్రకమిటీతో తృప్తిపడుట బార్డోలీరైతువాదములోనున్న బలముకును, మితముకును నిదర్శనమని వేరుగ చెప్పవలయునా? ప్రభుత్వమువారట్టి విచారణకంగీకరించకపోవుట వారివాదములోని నిస్సారత నదేవిధమున రుజువుచేయుచున్నది. విచారణకు పూర్వము హెచ్చుపన్నును నిరసించుచున్నరైతులు దానిని చెల్లింపవలెనని ప్రభుత్వము వారు చెప్పు జవాబు కేవలము హాస్యాస్పదమైనది." అతడు మరియొక అడుగు ముందుకువేసి బార్డోలీసత్యాగ్రహవ 'శాస్త్రీయమైన ఆందోళన' యను పదమునకున్న అర్థముతో సమన్వయించుచున్నదనియు, నది లిబరలుపక్షమువారి త[illegible] మునకెంతమాత్రము నసంబద్ధముగా లేదనియు చాటెను. ప్రభుత్వగౌరవమును కాపాడుకొనుటకే "హెచ్చుపన్నుల సందర్భములో ప్రజలకు కలుగు నష్టనిష్ఠూరములను చారించుటకే కాక నీపన్నులను వసూలుచేయుట కవలం[illegible]పబ

డుచున్న పద్ధతులలోని నిందలను, పరిస్థితులను సామా
న్యముగా నవలోకించుటకును విచారణ యనవసరమని నాకు
తోచుచున్నది'' అని సర్ తేజబహాదరు సప్రూగారు చెప్పిరి.
సెటిల్ మెంటుఆఫీసరుగారు తయారుచేసిన పట్టికలను, తనవి
షయపరిజ్ఞానముతో తుత్తునియలుచేసి ఆ యంకెలలోను
వాటిపై నిర్మింపబడిన సారాంశములలోను గల యసందర్భ
ములను బల్లడిచేసిన కీర్తిశేషులగు మేడనుగారినామమును
కృతజ్ఞతతో సంస్మరింపవలసి యున్నది. అత డే రాజ
కీయ కక్షకును చెందినవాడుకాడు. ఈ యుద్యమములో
నున్నన్యాయ మతనిసానుభూతిని ప్రజలవైపుకు మరల్చగలి
గెను. బార్డోలీ విచారణ జరుగుచుండగా విచారించు ఆఫీసరుల
ముందు యితడొక పండితసాక్ష్యముగా హాజరయ్యెదనని మా
టయిచ్చెను.

దేశమంతటను గల భారతీయముద్రణాలయములు
సత్యాగ్రహులపక్షము నవలంబించెను. ఆంగ్లజాతివారి
పత్రికలు, బొంబాయిలోని అర్ధప్రభుత్వపత్రికతప్ప, పైపత్రి
కలన్నియు నుదాసీనముగానుండెను. లేదా మూకీభావమును
వహించియుండెను. కాని అలహాబాదులోనున్న స్టేట్సుమన్,
పయొనీరుపత్రికలు బార్డోలీసత్యాగ్రహమును సమర్థించుచు
ఆంగ్లజాతిపత్రిక లెప్పుడును నిరంకుశప్రభుత్వపక్షము నేబూ
నుచుండునట్టి వికృతసాంప్రదాయమును ముక్కలు చేసెను.

"ఆలస్యమంతమాత్రమును లేకుండ తేల్చవలసిన ప్రధానసారాంశమేమనగా బార్డోలీ తగాయిదాలోని యంశములనన్నిటిని గ్రహించిన యే నిష్పక్షపాతమానవుడును వ్యవసాయదారులపక్షమున ధర్మమున్నదనియు, నిష్పక్షపాతమైన విచారణసంఘముచే హెచ్చుపన్నుల యుక్తాయుక్తములను విచారింపవలెననెడు ప్రజలకోరిక న్యాయము, సహేతుకము, సరసముఅనియు నిర్ణయింపకుండ నుండజాలడు" అని పయొనీరు పత్రిక వ్రాసెను.

ఈవిధముగా నంతకంత కభివృద్ధిచెందుచున్న యేకాభిప్రాయమును బుద్ధికల ప్రభుత్వమెన్నడియు నిర్లక్ష్యము చేయజాలదు. కాని బొంబాయిప్రభుత్వమువా రింకను మీనమేషములను లెక్కపెట్టుచు కూర్చొనిరి.

---



# బార్డోలీ విజయము.



## ఇరువదియేడవయధ్యాయము.

"కుంభకర్ణులు మేల్కొనిరి."

"బ్రిటిషు పరిపాలనచరిత్రలో నపూర్వమైనస్థితియేర్పడినది. చివరకిది రేపో నేడో రక్తపాతముగనో లేక ప్రభుత్వమువారు తాలూకాను వదలుకొనుటగనో పరిణమింపనైయున్నది."
"టైమ్సు ఆఫ్ యిండియా"

బార్డోలీలో నిపుడు వింతమైన చతుష్పథికశక్తులు పనిచేయుచుండెను.

ఒక ప్రక్క ప్రభుత్వమనుష్యులుండిరి. పఠానులను గురించిన గొప్పబహిరంగయాందోళన ధర్మమా యని వారిని ముఖ్యపట్టణమునుండి తీసివేయవలెనను ఆజ్ఞలు కావింపబడిన పదిరోజులయినతరువాత తీసివేసిరి. జప్తుకాండకూడ ఆపివేయబడినట్లు కాన్పించును. కాని జప్తుఆఫీసరులు యింకను అచ్చటనే యుండి తమదోపిడిసొత్తులెక్కల నప్పుడపుడు వ్రాసిపంపుచు వారున్నసంగతిని వెల్లడిచేయుచుండిరి. వారు జప్తుచేసిన దున్నపోతులను డబ్బిచ్చి పిలిపించినవారికి, ప్రభుత్వనౌకరులకు, అట్టి యితరులకు వారియిచ్చవచ్చినధరల కిచ్చివేసిరి.

లనువచ్చినసొమ్ములోనుంచి వారిపోషణకైన అతిదూబరాగా
చేసినఖర్చుల నన్నిటిని తీసివేసి తహసీల్దారు మిగిలినసొమ్ముకు
వ్యవసాయదారులకు రసీదులను పంపుచు వారిబాకీలక్రింద
దానిని జమకట్టిరి. కొన్నికేసులలో నీవిధముగా జప్తుచేసి
అమ్మివేయబడిన దున్నపోతుకుగాను రు 4-8-0 కు మించి
జమకట్టబడలేదు. వ్యవసాయదారు లీరసీదులను గోరుచుట్టు
మీద రోకలిపోటువలె భావించి యతినీచముగా చూచుచు
తిరస్కారభావముతో స్వీకరించుట మానివేసిరి. సత్యాగ్రహ
ము ప్రారంభమైనది లగాయతు ఒక్కసారియైనను బార్డోలీని
సందర్శింపని కమీషనరు స్మార్టుదొరగారు జూన్ 19 వ తేదీ
గతించినవెంటనే భూములను ప్రభుత్వవశముచేసికొనుట కిచ్చిన
గడువు క్రొత్తగా నియమింపబడిన ప్రత్యేకపోలీసుసూప
రింటెండెంటు హేలీదొరగారిని తీసికొని ఆప్రదేశమును చక్క
గా పరిశోధించుటకును భూములు ప్రభుత్వవశముచేసుకొన
బడునని ప్రభుత్వమువారిచ్చిన నోటీసులను సరకుగొనక సాగు
చేసికొనుచున్న వ్యవసాయదారులపై చర్యలీసికొనుటకును, ని
ర్బంధవిధానమునకు మంచిపటుత్వము నిచ్చుపద్ధతులను, సాధన
ములను ఆలోచించుటకును దయచేసిరి. ఇచ్చటనొకవింత నిర్బం
ధ విధానమును, అవినీతిని పురికొల్పుదానిని, వివరించెదను.
సార్భానులో వ్యవసాయదారులుపైనోటీసులను ధిక్కరించి
వ్యవసాయపనుల నిదివరకే ప్రారంభించిరి. ఈధిక్కారము

ఉమకుమోతుతనమును కలిగించెను. కనుక ప్రత్యేక ఆఫీసరుగారు కొంతమంది వ్యవసాయదారుల కిట్లు నోటీ యిచ్చెను. "నవసారీ దూదిఫ్యాక్టరీప్రొప్రయిటరు ఆగెలాభాయి పరాగ్జీవలన రు 3236-3-1 అచ్చట జప్తుచేబడిన దూదిఖరీదుక్రింద వసూలువచ్చెను. నార్బానుప్రత్తిఘమువారికిచెందిన యీదూది వారీయవలసిన రెవిన్యూబాగాను జప్తుచేయబడి వారిబాకీలక్రింద జమకట్టుకొనబడెను. కనుక వారిపుడు భూములను నున్నుకొనవచ్చును." వ్యవసాయదారు లీనోటీసును చూచి యాశ్చర్యపడిరి. వారు దూదిఫ్యాక్టరీయజమానికమ్మివేసినదూది కదివరకే పూర్తిసొమ్ము తీసికొనిరి. ఇట్టే వాంకనరు మొదలగు గ్రామవాసులకు కొందరకు బార్డోలీదూదిఫ్యాక్టరీయజమానియగు నారంజీమలాబువలన 73000 రూపాయిలు ముట్టెననియు, నతడు మీవ్యవసాయదారుల దూదిని ప్రత్తి సూపరింటెండెంటుగారి ద్వారా సూరతులోనున్న యిద్దరువర్తకుల కమ్మివేసెననియు, వారిబాకీలు వసూలయ్యెననియు తెలియచేసిరి. ఇది కేవలము యితరుల సొత్తు నపహరించు నేరముతప్ప మరియొకటికాదు. ఈచర్యలోనున్న నిరంకుశత్వము, అన్యాయము సంగతి యటుండగా ప్రభుత్వమువారీ రెండు కేసులలోనుకూడ యేవ్యవసాయదారువలన దూదిఫ్యాక్టరీయజమానులకెంతెంతదూది అమ్మబడెనో తెలిసికొనుటకావంతయు శ్రద్ధతీసికొనలేదు. కమీషనరు

వారితో బేదారులును తమపద్ధతులన్నియు నిష్ఫలముల
ైనని యింకను విశ్వసించుటలేదు. ఇంకను యెక్కువ అధి
రముల నీయవలసినదని వారు పెద్దఆఫీసరులను కోరుచుం
. మఱియొకవంక నిష్పక్షపాతులైన సాక్షులు కొందఱుగా
తంత్రవిచారణకమిటీని నియమించవలసినదని రేయింబవ
) వేధించుచున్నారు. వార్తాపత్రికలు బార్డోలీలో ప్రభుత్వ
ును చెలాయించుచున్నయధికారుల క్రూరకర్మలను వెల్లడి
యుచుండెను. భారతదేశమంతయు నొక్కుమ్మడి గాఢనిద్ర
ుండి మేల్కొని యెచ్చటచూచినను బహిరంగసభలు, జిల్లా
కాన్ఫరెన్సులు, ఉత్సవములు, విద్యార్థులకోలాహలము, స్త్రీ
ు, పురుషులు, బిడ్డలు చందాలు వసూలుచేయుట, యీ
ధముగా దేశమంతయు అల్లడికిన ల్లడికి పోవుచుండెను.

సత్యాగ్రహనిధికి బొంబాయియువకులు 25,000 రూపాయిలు వసూలుచేసినట్లు మన మిదివరకే చూచితిమి. ఇదిగాక వారు సభలద్వారాను, సాహిత్యముద్వారాను ప్రజలలో నుద్యమప్రచారమును చేయుచుండిరి. సూరతు, అహమ్మదాబాదు యువజనసంఘములును యిట్లేచేసెను. అహమ్మదాబాదు సంఘమువారు వారిలోవారు 1000 రూపాయిలు యిచ్చిరి. ఇక పల్లెలలో నన్నితరగతులవారి కోలాహలమునకును మేరయే లేకుండెను. అన్నిజాతీయోద్యమములపట్లను ఉదాసీనముగను, విముఖముగను నుండుపురోహితజాతివారు

తమవిముఖత్వమును విడిచివేసి యుద్యమమునకు తమభాగము సమర్పింప నిశ్చయించుకొనిరి. రాజీనామాలనిచ్చిన చాలమం దితలాతీలు యీజాతికి చెందినవారే! బార్డోలీసత్యాగ్రహ విజయముకొరకు జలాల్పూరుతాలూకా (ప్రక్కనున్న తాలూకా) లోనున్న బ్రాహ్మణులు మహారుద్రాభిషేకము చేయించి శ్రీయుత వల్లభాయిని ఆఖరునాటియుత్సవమునకాహ్వానముచేసిరి. త్రోవలో నతడు శిశోద్రా యను గ్రామములో నొకబ్రాహ్మణునికతిధిగా నుండెను. అతనితల్లి సర్దారు యొక్క ఆగమనోత్సవమును జరుపుట కుదయమంతయు తదేకదీక్షతో నూలువడుకుచు నీక్రొత్తగా వడికిననూలుదండ నతని మెడలో వేసి తానుస్వయముగా వడుకుకొనిననూలుతో నేయబడినశాలువాను బహుమతియిచ్చెను. మహారుద్రాభిషేకమును చేయించినబ్రాహ్మణులు పూజ నుపక్రమించవలసినయధికారమును వారిలో నెక్కువపాటపాడువారి కిచ్చిరి. ఒకబ్రాహ్మణుడు 101 రూపాయిలకుపాడెను. ఉత్సవమయిన తరువాత నీధనమును, ప్రజలిచ్చినసంభావనయును, ఇది సాధారణముగా బ్రాహ్మణులకే పంచిపెట్టబడును. బార్డోలీ సత్యాగ్రహముకొరకిచ్చివేయబడెను. అందరును శ్రీయుత వల్లభాయి నాశీర్వదించిరి. అస్పృశ్యతానివారణకొరకు బద్ధకంకణుడైనసంగతి యెరింగియు శ్రీయుత వల్లభాయి కాహ్వానమునంపుటయు, తమకష్టార్జితములోనుండి సత్యాగ్రహోద్య

మమునకు ధనమునో సంగుటయు ప్రజలలో నెంతటియఖండమై నప్రబోధము కలిగెనో చాటుచునేయున్నవి.

వేలకొలది వ్యవసాయదారులు హాజరైనట్టి జూరతు, బోర్చి, నడియాడు, అహమ్మదాబాదు జిల్లాకాన్ఫరెన్సులు సత్యాగ్రహముపట్ల నాయాజిల్లాల ప్రత్యక్షసహాయమును శృతపరచెను. బోర్చిసభకు తప్ప తక్కినవాటియధ్యక్షులంద రును 'పైనుండివచ్చినవారే'. సూరతులో జయరాందాసు గారు, నడియాడులో ఖదీల్కరుగారు, అమహ్మదాబాదులో కెల్కారుగారు వీరందరును బార్డోలీసందేశమును తమతమ రాష్ట్రములకు గొంపోయెదమని వాగ్దానముచేసిరి. కెల్కారు గారు విషయమునంతను ఒక్కమాటలోచెప్పెను. "ఈతిరుగు బాటు నిరాశచే నెట్టిబుణాగ్రస్తుడైనను యొక్కొకపుడు తన ఋణదాతపైచేయు తిరుగుబాటుకంటె స్వభావముచే చెడ్డది యుకాదు మంచిదియుకాదు......ఇచ్చట ప్రభుత్వమువారే భూస్వామి ఋణదాతయైనపుడికనెవరు అడ్డుపడగలరు?"సర్దా రు ఒకసభకంటె మరియొకసభలో తననుతాను మించుచుం డెను. "శాంతముగానుండుడు. సానుభూతిగల శ్రద్ధతో నం తయు పరీక్షించుచుండుడు. మీావంతు వచ్చునపుడు నేను మీా కొరకుగంటకొట్టెదను. నేడు బార్డోలీయొక్క నాశన మొక్క టేచాలును. దానిబూడిదలోనుండి వేలకొలది బార్డోలీలు మొలకలెత్తగలవు." అనియతడు నడియాడులో చెప్పెను.

"ప్రభుత్వమువారు భూమిని మ్రింగివేయదలచుకొనినచో నీ మహాజ్వాల గుజరాతు అంతయు వేయినాలుకలతో హాహా కారములను చేయుచు ప్రసరించుననియు, ముందుసంవత్సరము ప్రభుత్వమువారికి గుజరాతులో నొక్క దమ్మిడీయైనను వసూలు కాదనియు నేను సకాలములోనే వారికి తెలియజేయుచున్నాను." అనియతడు బ్రోచిలో చెప్పెను.

"మన మొకబ్రహ్మాండమైనప్రభుత్వముతో పోరాడుచున్నాము. ఇది రావణునిప్రభుత్వముకంటె కూడ గొప్పదే కావచ్చును. కాని యట్టి రావణాసురుడు కూడా తన రాక్షస పటాలమంతటితోను పన్నెండు సంవత్సరముల దీర్ఘకాలములో నొకసీతమ్మను తన యిచ్ఛ కంగీకరించునట్లు చేయజాలక పోవుటయే కాక చివరకు యమమందిరము కంపబడెను. ఈబ్రహ్మాండమైనప్రభుత్వ మొక్కసీతను కాక 80,000 మంది పవిత్రహృదయులైన నిరపరాధవ్యవసాయదారులను వలిపివేయవలె ననుసంగతి గ్రహించును గాక!" అని యతడహమ్మదాబాదులో నుపన్యసించెను. డాక్టరు సుమంతుమెహతాగారి భార్యయగు శ్రీమతి శారదమెహతా సర్దారు బార్డోలీప్రజలలో మోహనాస్త్రమును ప్రయోగించినవిధమును వర్ణించుచు నిట్లు చెప్పెను. "అతడు ప్రబుద్ధునివలె మాట్లాడును. వానినోటినుండి వచ్చు ప్రతిమాట వానిహృదయకుహరమునుండియే వెలువడును. అతనిముందరనున్న

పరిస్థితులతనికి భాష నొసంగుచుండును. అతని తన్మయత్వము శ్రోతలనొకయున్నతలోకమునకు వెంటనే గొంపోవుచుండును." ప్రభుత్వమువా రిప్పటికి తా మిక నెంతమాత్రము నిర్లక్ష్యము చేయకూడనిమానవు డొక డున్నట్లు గ్రహించెను.

ప్రజలలో కలుగుచున్న ప్రబోధతరంగములును గవర్నరుగారికి బార్డోలీయొక్క సత్యమును తెలుపుచు మున్షీగారు వ్రాసినయుత్తరమును కలిపి చాలనుంది కుంభకర్ణులను తమ గాఢనిద్రనుండి మేల్కొలిపెను. ఇందులో నొకటి టైమ్సు ఆఫ్ యిండియాపత్రిక. దీనికి సత్యము చాల వెగటుగా కాన్పించుటచే దానిని మ్రింగుటకు వీలగునట్లుగా చేయుటకు తన ప్రత్యేకవిలేఖరిని బార్డోలీ పంపించెను. ఇతను బార్డోలీలో నొకదినము గడిపి శ్రీయుత మున్షీగారి నామూలాగ్రముగా బలపరచునట్టియు, సత్యమే మరింత యరుచ్యముగానుండునట్లు (సాధ్యమగుచో) చూపునట్టియు నివేదికలతో తిరిగి వచ్చెను. ఈప్రత్యేకవిలేఖరియొక్క నివేదికలు పత్రికాపాఠకులకు 'బార్డోలీలోని వ్యవసాయదారుల తిరుగబాటు' 'బార్డోలీలో బోల్షివిక పరిపాలన' మొదలగు ఘోరమైన శీర్షికలతో వరుసగా మూడుదినములు వర్ణింపబడెను. వాటిలో చేయబడిన 'సన్నాయి నొక్కులను' సూచనలను విడిచివేసి తిమేని, గ్రంథకర్తగారు ప్రాణప్రతిష్ఠ చేసిన దయ్యములను

బూచులను విడిచివేసితిమేని, అతడు హైడుగారి స్వరూపము లో తీసిన వంకరనారాంశములను తీసివేసితిమేని, అతడు డాక్టరు జెకిల్‌గారివలె ప్రత్యక్షముగా చూచినవిషయములు యింతవరకు నుద్యమము నుదాసీనముగా చూచినవారి దృష్టి నాకర్షింపకమానవు. ఈవిషయము లేవి యనగా: వల్లభాయిపటేలుగారు తాలూకాలోని రెవిన్యూపరిపాలన నంతను పూర్తిగా స్తంభింపచేయ గలిగిరి; ఎనభైకంటె యెక్కువమంది పటేళ్లను, సగముకంటె కొంచెము తక్కువగా తలాతీలును రాజీనామాల నిచ్చిరి; రాజీనామాల నీయనివారైనను సర్కారుయెడల ప్రభుభక్తిపరాయణులై యున్నారని చెప్పుటకు వీలు లేదు; అయిను ఆశ్రమములతోను, వాలంటీరు శిబిరములతోను గావింపబడిన ప్రజలకట్టుబాటు లెంతబలముగా నుండవలెనో యంతబలముగా నుండెను; శ్రీయుత వల్లభాయి లేనప్పుడు కూడ బార్డోలీఆశ్రమము సంతతకార్యకలాపముతో చకచక లాడుచుండెను; అచ్చటనున్న 250 మంది వాలంటీర్లు, ఇందులో చాలమంది సత్యాగ్రహులుగా పనిచేసి జయిలుజీవితము నిదివరకే రుచిచూచి యుండిరి, కఠినజీవితమును చేయుచు, తదన్నతదర్శములతో తృప్తిచెందుచు, దాని నింకను తగ్గించుచు అద్భుతమైనశిక్షణను చూపుచున్నారు; శ్రీయుత వల్లభాయిగారి నిరంతరప్రచారమువలన ప్రభుత్వమువారు హెచ్చుపన్నులను సమర్థించుకొనగలరని

యెవరును విశ్వసించుటలేదు; సర్దారుయెడల స్త్రీలు చూపు వీరపూజ విలేఖరి కాశ్చర్యమును కలిగించెను; స్త్రీలు, పురుషులు, బిడ్డలు తమ యిండ్లలో మందలవలె తమ పశువులతో కూడ పడియుండిరి. ఈపశువులశరీర మంతటను రసికారు పుండ్లతో నిండియుండెను. వాటి సహజవర్ణము పోయి పాండువర్ణము వచ్చెను. వాటిలో కొన్ని తమకాళ్ళమీద నిలువలేక పోవుచుండెను.

విలేఖరి యీబాధనంతను గాంధిజీకిని శ్రీయుత వల్లభాయికిని కట్టిపెట్టి వారు మానవజాతిపట్లను పశుజాతిపట్లను చెప్పరానంత క్రూరత్వమును చూపిరని చెప్పెను. వాటిసాక్ష్యమును గురించిన యీకల్లబొల్లిదుఃఖమును తీసివేసితిమేని యీవ్రాతలోనున్నవిషయములను గురించి భేదాభిప్రాయమేమియు లేదు. అతడు ప్రభుత్వమువారి నిట్లు స్పష్టముగా మందలించెను "వల్లభాయిగారు బార్డోలీలో తాను లెనిను స్థానమును పుచ్చుకొని సోవియటుప్రభుత్వమును స్థాపింప కంకణము కట్టినాడు. బార్డోలీగ్రామములలో నతనిపలుకు బడియుండు నంతకాలము శాంతి యుండనేరదు." ఈమందలింపు యెంతటి వెర్రివారినైనను మోసపుచ్చజాలదు. టైమ్సు దీనిని తగు వ్యాఖ్యానములతో నింగ్లండు తంతిద్వారాపంపెను. ఇది చేయవలసినపని చేసెను. బ్రిటిషుసింహము నిదిగాఢనిద్రనుండి మేల్కొలిపెను. కామన్సుసభలో వింటర్టను

ప్రభువుగారు బార్డోలీపన్నులనిరాకరణను విమర్శించుచు శ్రీయుత వల్లభాయి 'కొంతజయమును' పొందెను. అని యొప్పుకొనెను. కాని 'పన్ను యిచ్చుటకు తిరస్కరించినవారిపై న్యాయము బలవంతముగా ప్రయోగింపబడుచున్నది" అని చెప్పెను. ఇక సర్ మైకేలు ఒడ్వాయరుజాతికి చెందిన మనుష్యులు చిందులు త్రొక్కుచు "న్యాయము అనబడు కుట్రను చురుకుగా నమలు జరిపింపవలె"నని విలపింపసాగిరి.

వైటుహాలు, సిమ్లా, బొంబాయిల మధ్య నేమి తంతులు విసరబడెనో, వైటుహాలునుంచి వచ్చిన బలవంతమువలన నెట్టి సైనికనికాయముల నేర్పాటుచేయనెంచిరో మనము చెప్పజాలము. ఆకాలమునాటిప్రభుత్వపత్రములను చూచుటకు సావకాశము దొరకునట్టి భావిచరిత్రకారు డెవడైనను బార్డోలీలో ప్రభుత్వము కగ్నిపరీక్ష వచ్చిననాడు వారి రహస్యప్రవర్తన మెట్లుండెనో ప్రపంచమున కెరుకచేయును గాక ! కాని వారి బహిరంగప్రవర్తనమే వారు రహస్యముగా పడినకంగారుకు, అలజడిక తగినంత సాక్ష్యము నిచ్చుచున్నది. తాలూకా చాలమంది సాయుధపాణులగు క్రొత్తపోలీసుపటాలముతో నింపబడెను. క్రొత్తపోలీసు సూపరింటెండెంటుగారిని తీసివేసినను, బహుశః అతడు తీవ్రచర్యలకు గడంగ నిరాకరించుటయే దీనికి కారణము, ప్రభుత్వోద్దేశ్యములు తేటతెల్లముగనే యుండెను. బార్డోలీనంతను సైన్య

ముతో నాక్రమించుటకు సన్నాహములు జరుపబడుచున్నవని ప్రతిదినమును వినుచునే యుంటిమి.

మరియొకచోట యీఆపత్తు నెత్తినను, సాధ్యమగు చో, తరింపవలెననునాదుర్దా ప్రబల మగుచుండెను. రెవి న్యూసభ్యులైన ర్యూగారు అహమ్మదాబాదునుంచి తిరిగివచ్చిన తరువాత కార్యనిర్వాహకవర్గముయొక్క అర్జెంటుసభ కూడెను. అత డక్కడకు స్వయముగా విచారణచేయుటకు వెళ్లెను. గవర్నరుగారు జూలై 13 వ తేదీని గవర్నరుజన రలుగారిని చూచుటకు సిమ్లా వెళ్లెను. అతడు ప్రజలకు సేవ చేయుటకు బదులుగా యజమానిధర్మములను దొంగిలించిన వారిచే నడుపబడుటకు చాలకాలమునుండి యంగీకరించెను. అతడు తన పదవిని ప్రారంభించినప్పు డీవిధముగా చేయ లేదు. సర్ లెస్లీగారు ఉద్యోగమునకు వచ్చినప్పుడు బోర్సదులో సత్యాగ్రహము తీవ్రరూపమును తాల్చియుండెను. అత డప్పుడు వెంటనే ప్రభుత్వసభ్యులైన మారిస్ హేవర్డుగారిని బోర్సదు వెళ్ళిచూచి పరిస్థితులను గురించి తెలియచేయు మనెను. దీనిఫలితముగా వెంటనే న్యాయము చేకూరెను. కాని బార్డోలీ సర్ లెస్లీగారు నూతనరూపమును దాల్చిరి. అయిదువత్సరముల ఉద్యోగము ఆయనలోనున్న స్వతంత్రతను, ఉత్సాహశక్తిని నాశనముచేసెను. బార్డోలీయుద్యమము లో సర్ లెస్లీగారివలెనే గవర్నరు సివిల్ శాఖవారిచే నడిపింప

బడలేదు. ఈయన సెక్రటరీల సంతకములతోను, ఈయనసం తకములతోను కూడ నున్న పత్రములన్నియు దీనిని రుజువు చేయుచున్నవి. ఈయనపేరుమీదుగా వచ్చిన యుత్తరము లన్నింటిలోను 'విచారణలన్నియు జరుపబడెను. ఇక నెట్టి విచారణకు నావకాశ మెంతమాత్రమును లేదు' అనుపాటనే యీయనచే పాడించిరి. అసెంబ్లీయధ్యక్షతను వహించినం తటిపురుషుడు స్మార్టుగారు ఎడల్ బెహ్రింగారికి వ్రాసినయుత్త రమును చూచితిరా యని యడుగ నే నట్టియుత్తరము నెరుగ నని యీయన చెప్పెను. పఠానులను తీసివేయవలసిన దని యిత డాజ్ఞాపించెను. కాని వారిని తగ్గించుటకు వారి యవ సర మిక లేకపోవుటయే కారణమని యీయనచెప్పెనుగదు నిరంకుశు లందురు. వైస్రాయితో సంప్రతించుట కతడు సిమ్లా వెళ్ళుటకు నిశ్చయించెను. కాని యీవార్తను తెలుపునట్టి వ్యక్తి ప్రయాణమును గురించి భీకరవాక్యములను బెదరింపు లను మాన డాయెను. "న్యాయముయొక్క అధికృతను రక్షిం చుట గవర్నరుగారి ముఖ్యధర్మము. దీనిని గవర్నరుగారు సం పూర్ణముగా నమలు జరుపనెంచిరి." కాని "యనేకమందిప్ర జలకష్టములను, బాధలను" తొలగించుట కూడ వారిధర్మ ము అని యీయనచెప్పెను. గవర్నరుగారు రైతుల ప్రతినిధు లను సూరతులో కలుసుకొనుటకు కారణము "ప్రభుత్వము వారి స్థితిని స్పష్టపరచి యిదమిద్ధమని నిరూపణచేయుచు నిరు

పక్షములమధ్యను దురభిప్రాయములను పోగొట్టుటకు సర్వ ప్రయత్నములను చేయుటకే"యని చెప్పబడెను.

గవర్నరుగారీవిధముగా సిమ్లా వెళ్ళిరి. కాని యతని ప్రయాణమును గురించి ప్రకటింపబడినపత్రము యీయన ప్రభుత్వ మెట్టి శ్మృతిలోనుండెనో దాచజాలకపోయెను. తుది రాజీకుదురువరకును జరిగిన రాయబారము లన్నిటిలోను గొప్పను నిలుపుకొనుటకు ప్రాకులాటయే కాన్పించును. గవర్నరుగారు సిమ్లా వెళ్లుటకు కారణములను చెప్పబోవుట యనవసరము. అవి కాన్పించుచునే యున్నవి. తనకు తాను క్షమార్పణలను చెప్పుకొనువాడు తనను తాను నిందించుకొనినట్లే యను సంగతిని ప్రభుత్వమువారు మరియొకసారి మరచిపోయిరి.

---

# బార్డోలీ విజయము.



## ఇరువది యెనిమిదవ యధ్యాయము.



"వంకరకర్త్రిని టపటపలాడించుట."

"ఈనోటితుపాను, చెవులు గింగురుమనునట్లు కొట్టు యీ పగిల్చుటలు యేమి?" "షేక్స్పియరు."

గవర్నరుగారు జూలై 16 వ తేదీని సిమ్లా విడిచిపెట్టి 18 వ తేదీ యుదయముకు సూరతు వచ్చెను. వ్యవసాయదారులు వ్రాతమూలకముగా దరఖాస్తు పెట్టుకొనినచో వారి తరఫున గవర్నరుగారిని సందర్శించుటకు పన్నెండుగురు ప్రతినిధులకు స్వేచ్ఛయొసంగబడునని సూరతుకలెక్టరుగా రదివరకే బార్డోలీరైతులకు తెలియచేసెను. కాని పాపము 18 వ తేదీవరకు నెట్టిదరఖాస్తు రాదాయెను! గవర్నరుగారు వైస్రాయిగారితో సిమ్లాలో సంభాషణలు జరుపుచుండ శ్రీయుత వల్లభాయిఅహమ్మదాబాదులో వేలకొలది ప్రజలుగలసభలో నుపన్యసించుచుండెను. ఈ కాన్ఫరెన్సుపందిలలోనుండగా గవర్నరుగారివద్దనుండి పన్నెండుగురు బార్డోలీసత్యాగ్రహప్రతినిధులతో తనను సూరతులో కలుసుకొనవలసినదను నాహ్వానమును కమీషనరు శ్రీయుత వల్లభాయి కందించెను. ఇదివ

రకనేక పాట్లు గవర్నరును సందర్శించుటకు తన సంసిద్ధతను తెలుపుచు సమాధానపడుటకు తనకోరికను వెలిబుచ్చిన వల్లభాయి 18 వ తేదీ యుదయము అబ్బాసు త్యాబ్జీ, శారదా మెహతా, భక్తిలక్ష్మిదేశాయి, మితుభెన్ పెటిట్ కన్య, కళ్యాణజీ మెహతాగార్లతో గవర్నరుగారిని దర్శించెను.

ఉదయము యీసమావేశము మూడుగంటలకాలము జరిగెను. అంతయు పూర్తియైన సుహృద్భావముతోనే జరిగెను. గవర్నరుగారు వల్లభాయితో నొంటరిగా మాట్లాడుచు వైస్రాయిగారుకూడ నీ మునద్పృష్టస్థితిని సమాప్తము చేయుట కెట్లాతురపడుచున్నదియు విశదపరచెను. భూములను తిరిగి యిచ్చివేయుట, ఖయిదీలను విడిచిపెట్టుట మొదలగు లోతక్కువ విషయములనుగురించి భేదాభిప్రాయములున్నటు లేమియు కాన్పించలేదు. జాస్తిపన్ను చెల్లింపవలెనను ప్రధానాంశమే కష్టసాధ్యముగ నుండెను. కాని మధ్యాహ్నము గవర్నరుగారితో మాట్లాడిన రావుబహదరు భీముభాయి నాయికుగారు యీవిషయములలోకూడ భిన్నాభిప్రాయము లున్నట్లు తెలిసికొనెను. ఏలనన "అయఃపిండముఃు" ప్రభుత్వ వశము చేసికొనబడినభూములను తిరిగి యిచ్చివేయ శక్యము గుదు. కాని ప్రభుత్వవశము చేసికొనబడి అమ్మివేయబడిన భూముల నిచ్చివేయుటకు వీలులేదని సలహా యిచ్చిరట. కనుక వల్లభాయిని మరల పిలిపించి పొరపాటు అభిప్రాయ

ములను తొలగించవలసినదని యతడు గవర్నరుతో చెప్పెను. వల్లభాయి గవర్నరును మరల కలుసుకొని రాత్రి ప్రొద్దుపో వువరకును మాట్లాడెను. కాని గవర్నరు జాస్తిపన్నును చెల్లింపవలెను లేదా మధ్యవర్తు లెవరైనను సత్యాగ్రహులతరఫున హెచ్చింపబడినపన్నుకు సరిపడుధనమును ధరావతు కట్టవలెనని పట్టుపట్టెను. ఇతరవిషయములనుగురించికూడ కొంత కష్ట మేర్పడెను. కనుక సమాధానము కవకాశములేదని వల్లభాయి గవర్నరువద్ద శలవుతీసికొని ప్రభుత్వమువారి షరతులనుగురించి యొక స్టేటుమెంటు నిప్పించవలసినదని కోరుచు ప్రజల జవాబును సహచరులతో సంప్రతించినతరువాత పంపించెదనని వచ్చెను. ప్రభుత్వమువారు తమ షరతుల నీక్రింది విధముగా తెలిపిరి.

మొట్టమొదట పూర్తియైనపన్ను చెల్లింపవలెను లేదా పాతపన్నుకు క్రొత్తపన్నుకు గల తేడా వ్యవసాయదారులతరఫున ప్రభుత్వమువారిబొక్కసములో జమకట్టబడవలెను.

రెండవది భూమిపన్నును చెల్లింపకూడదనుయుద్యమము నాపివేయవలెను.

ఈ సూచన లంగీకరింపబడినచో యథార్థములను లెక్కవేయుటలో ప్రభుత్వోద్యోగులు చేసిరనిన ప్రమాదములనుగురించి ప్రత్యేకవిచారణను సలుపుటకు ప్రభుత్వమువా

రు చర్య తీసికొందురు. ఈకేసుతో నెట్టిసంబాధము లేని యొక రె. న్యూఆఫీసరుచుగాని లేక నొక రెవిన్యూఆఫీసరు ను వానితో పనిచేయుటకొక న్యాయాధికారిని (వివాదాంశ ములైన విషయములను అంకెలను నిశ్చయించుట యీాయన విధి) నియమించెదరు.

ఈషరతులు గాంధిజీకిని తదితరులకును చాలవెగటు గా తోచెను. శ్రీయుతవల్లభాయి ప్రజలకోరికలను తెలుపు చు దర్జాయైన సమాధానము నిచ్చెను. ఒడంబడికకొరకు య థార్థమైనయాతురత లేనివా డెవడైనను ప్రభుత్వబూటకపు శాంతివచనములను తుంగలో నూరద్రొక్కియుండెడివాడు. శ్రీయుతవల్లభాయి సమాధానము కొట్టియవకాశమునైనను జారవిడువనొల్లడాయెను. అతడు మరియొకసారి శాంతికొర కు ప్రయత్నించి ప్రభుత్వమువారు గుణపాఠమును నేర్చుకొన వలసిన సరసముతో వాదించెను. హెచ్చుపన్నును ధరావతు గా ముందు చెల్లింపవలెనని పట్టుపట్టుట "ప్రజల నిజాయితీ యందును వారి నాయకునిగౌరవప్రపత్తులందును విశ్వాస రాహిత్యమును వెల్లడించుచున్నది." అని యతడు వ్రాసెను. రెవిన్యూకోడ్ కేవలము పక్షపాతముగా నున్నదనియు, పూర్వకాలపువాసనలతో కూడి యుండుటచే నిప్పటి కెంత మాత్రమును తగియుండ లేదనియు గల పెద్దసమస్యను, ప్ర ధానసమస్యను బుద్ధిపూర్వకముగా ప్రజలు లేశమైనను నూర

గాని రషియు కోడ్‌లోని షరతులప్రకారమే న్యాయమును కోరిరనియు నతఁడు విశదముచేసెను. విచారణ చేయుటయే యవసరమని యంగీకరించుచో తత్ఫలితముగా నీక్రిందిపనులు జరుగవలెనని యతఁడనెను.

1. సత్యాగ్రహఖయిదీలను విడిచిపెట్టుట.

2. ప్రభుత్వవశము చేసికొనబడిన భూములు, అమ్ముడయినను కాకపోయినను సరే, న్యాయమైన యజమానుల కిచ్చివేయబడుట.

3. దున్నపోతులు, గేదెలు, నారాయి మొదలగు నతిహీనక్రియముకు విక్రయింపబడినచరాస్తికి బజారుధర ప్రకారము విలువకట్టి యజమానుల కాసొమ్ము యిచ్చివేయుట.

4. సమరము నిలుపుదలచేయబడినకాలములో గాని, సమరము జరుగుచుండగా గాని చేయబడిన యుద్యోగపు బర్తరఫులు, యితరశిక్షలు తీసివేయబడుట.

విచారణవిషయమై, యది బహిరంగముగను, నిష్పక్షపాతముగను, న్యాయసంబంధమైనస్వభావము కలదిగనుండి ప్రజలు అవసరమగుచో న్యాయవాదులద్వారా వాదించుటకు వీలున్నచో, ప్రభుత్వోద్యోగులే విచారణచేసినను తాను తృప్తిపడెదనని స్పష్టపరచి వల్లభాయి ప్రభుత్వకష్టమును తేలికచేసెను. శ్రీయుత వల్లభాయి ప్రభుత్వమును

చీకాకుపరచుట గాని, యగౌరవపరచుట గాని తన క్లిష్టము లేదనియు ప్రజలకును ప్రభుత్వముకును కూడ సమానగౌరవ ప్రదముగానే యుండునట్టి రాజీకొరకు తాను ప్రతియవకాశమును వినియోగించుచుంటి ననియు మరల మరల నొక్కి చెప్పుచుండెను.

సూరతులో జరిగిన రాయబారములలోని సారాంశములవిషయమై ప్రజలలోని యన్నిపక్షములవారును, యీవద్యారత, అర్ధాంగ్లజాతి పత్రికలును సత్యాగ్రహులపక్షముననే యుండెను. ఒక్క టైమ్సుపత్రిక తప్ప బొంబాయిపత్రికలన్నియు సత్యాగ్రహులనే సమర్థించెను. లీడరుపత్రిక ప్రభుత్వమతులను "బార్డొలీవ్యవసాయదారుల సంపూర్ణపరాజయమును కోరుట" అని వర్ణించెను. అనిబిసెంటుగారి న్యూ ఇండియాపత్రిక బర్కెనుహెడ్డుగారు "యింకను పెంకితనముగను,వక్రబుద్ధిగను నుండుచో" శాస్త్రీయపద్ధతులద్వారా పరిసితుల నతనికి స్పష్టపరచవలెనని సూచించెను. హిందూపత్రిక గవర్నరుగారు సంధిచేసికొనుటకు నుంచిశరుణమును చేతులార జారవిడిచిరని చాటెను. పయొనీరుపత్రిక ప్రభుత్వమతులు "ముందరకాళ్ళకు బందము వేయుట" వలె నున్నవని వర్ణించెను.

సర్ లెస్లీవిల్సనుగారు యీప్రజాభిప్రాయము కెంత మాత్రమును వెనుదీయక చట్టమును, శాస్త్రీయప్రభుత్వము

ను నిలబెట్టుటకు బద్ధకంకణుడయ్యెను. జూలై 23 వ తేదీని యతడు శాసనసభను తెరచుచు సూరతుజిల్లానుండి వచ్చిన శాసనసభాప్రతినిధులు తన షరతులను "ఈరోజులగాయితు పదునాల్గురోజులలో" నెరవేర్చనియెడల తత్ఫలితము ననుభవించెదరను ప్రతాపోక్తులతో బెదరించెను. విషయమును స్పష్టము చేయవలె నని యనుకొని యతడు దానిని కంగాళీ చేసెను. తేలవలసినసారాంశము బార్డోలీలోని క్రొత్తపన్నులు న్యాయమా అన్యాయమా యనునది కాక "చక్రవర్తి గారి డొమినియనులలోని యొకభాగములో చక్రవర్తిగారి శాసన మమలు జరగవలసినదా కాదా ?" అనునదియైనచో ప్రభుత్వమువారు దీనిని తమపొదిలోనున్నశక్తుల నన్నిటిని ప్రయోగించి యెదుర్కొనుటకు సంసిద్ధులైయున్నారని యతడు బ్రువ్వెను. కాని "క్రొత్తపన్నులు న్యాయమా అన్యాయమా యనునదొక్కటే తేలవలసినసమస్య యైనచో ప్రభుత్వమువారి కివ్వ వలసినపన్నుబాకీ చెల్లించిన తరువాత, ప్రస్తుత యాందోళన పూర్తిగా విరమింపబడినచో ప్రభుత్వమువారు యీకేసునంతను యిదివరకు ప్రకటింపబడి నస్టేటుమెంటుప్రకారము సంపూర్ణమైబహిరంగమైన, స్వతంత్రవిచారణకు లోబరచెదరు." ఈషరతుల నతడు వక్కాణించి బార్డోలీప్రజల యెన్నికమీద వచ్చిన ప్రతినిధుల నీక్రింది విధమున బెదరింపజూచెను. "ఈషరతుల కంగీకరింపక యొకం

బడికను కుదుర్చుకొననిచో చట్టమును సంపూర్ణముగా నమ
లుజరుపుటకు ప్రభుత్వమువారు తా మెట్టి చర్య యవసరము,
ప్రయోగింపతగినది యని తలంతురో యట్టి చర్యను తీసికొ
నెదరనియు, చట్టముచే సంక్రమించిన ప్రభుత్వాధికారమును
సర్వవిధముల చెలాయించుటకు తమ స్వాధీనములోనున్న
సర్వశక్తులను వినియోగించెదరనియు, స్పష్టముచేయుట నావి
ధియై యున్నది." తరువాత నతడు శాసనోల్లంఘనముయొక్క
చట్టరాహిత్యమును గురించి కొన్ని శ్రీరంగనీతుల నొలకబో
సి తన బెదరింపులను రాజీబేరములనుగా దురభిప్రాయపడు
దురేమో యని యత డవి "ప్రభుత్వమువారి నిర్ధారితమైన
తుది శాసనములు. క్రొత్తవిచారణ దేనిని గాని ప్రారంభిం
చుటకు పూర్వము నెరవేర్చవలసిన కొన్నిషరతు లందులో
కలవు. ఈ షరతులను మార్చుటకు వీలులేదు." అని హుంక
రించెను.

సత్యాగ్రహనాయకుని ముందర తన బెదరింపులు పని
కిరావని యత డెరుంగును. కనుకనే యతడు శాసనసభ్యులను
"క్రొత్తవిచారణ జరుగుటకు పూర్వము నెరవేర్చవలసిన షర
తులవిషయమై తమ్ము పంపించిన వోటరులతరఫున తమ
యంగీకారమును గాని యనంగీకారమును గాని యీరోజుల
గాయితు పదునాల్గురోజులలో రెవిన్యూసభ్యునికి తెలియచే
యవలసినది." అని కోరెను. గవర్నరుగారు శాసనోల్లంఘన

మును గురించి లబలబలాడు హడాహుడిలో తన భూతచరిత్రను, అయిదువత్సరములక్రితము బోర్సదుసత్యాగ్రహ సందర్భములో తాను చూపినరాజనీతిని మరచిపోయెను. అప్పు డతడు తన ప్రభుత్వసభ్యునితో చట్టరాహిత్యమైన యుద్యమము నణచివేయమని చెప్పకపోవుటయే కాక పరిస్థితులను పరీక్షింపవలెనని చెప్పెను. ప్రభుత్వసభ్యుని విచారణఫలితముగా "అదనముగా వసూలుచేయబడిన హెచ్చుపన్నును తిరిగి యిచ్చివేయుట న్యాయమని రుజువయ్యెను." అని యతడు గుర్తించెను. అయిదువత్సరములక్రిత మతడు తనకు తానే యజమానియై యుండవచ్చును కాని యిపు డతడు వైటుహాలు బూరాను ఊదవలసివచ్చెను. గవర్నరుగారు యిచ్చట బెదిరించిననాడే అచ్చట వింటర్టనుగారు కామన్సు సభలో తమకోతలను చూపి సర్ వెస్లీగారిప్రకటన వెనుకను న్నయూతమును వెల్లడిచేసిరి. "నేడు బొంబాయిశాసనసభలో సర్ వెస్లీవిల్సనుగారు బార్డోలీవిషయమై చెప్పిన షరతులు నెరవేర్చబడనిచో చట్టము నమలులో జొప్పించుటకును, యుద్యమము నణచివేయుటకును బొంబాయిప్రభుత్వమువారికి యిండియాప్రభుత్వమువారి సంపూర్ణమైన మద్దతు కలదు. అపు డీయుద్యమము ప్రభుత్వమును సాధించుట కుద్దేశింపబడినదే గాని సహేతుకమైన కష్టములను తెలుపుటకొరకు కాదని వెల్లడికాగలదు." అని యాయన శల విచ్చిరి.

ఇండియా అండర్ శక్రటరీగా రిట్లనూనపమునుగా వెడ
లగ్రక్కుట దౌర్జన్యరాహిత్య యుద్యమవిజయము బ్రిటిషు
హృదయములో నెట్టి క్రోధాగ్నిని రగుల్కొలిపెనో తెలియ
జేయుచున్నది. తాను నడుపుచున్న 80,000 మంది ప్రజలు
ఆవంతదౌర్జన్యకార్యమునైనను చేయకుండ ప్రభుత్వమువారిని
తమ యథార్థహృదయమును వెలిగ్రక్కునట్లు బలవంతపరచి
నందుకు, వల్లభాయి గర్వింపతగిన విషయమే! అతడుకూడ
ప్రభుత్వమువారి బెదరింపులతో కూడిన ప్రకటనలకు సమా
నఘాటైన జవాబుల నిచ్చి వారు చేయతగినంత దుష్కర్మము
ను చేసి చేతనైనచో నుద్యమమును నలిపివేయమని సవా
లు చేయవచ్చును. కాని తన బలమునుగురించి యతనికున్న
విశ్వాసమునకు తగిన వినమ్రతకూడ నతని కుండెను. కనుక
నతడు విషయమును చక్కగా స్పష్టముచేసి యిట్టి తాటాకు
చప్పుళ్ళకు భయపడవలదనియు, టక్కులమారిపదజాల
ముచే మోసపోవలదనియు ప్రజలను హెచ్చరించెను. "గవ
ర్నరుగారి యీ బెదరింపులకు నేను సిద్ధపడి యుండలేదని
యొప్పుకొనక తప్పదు. ఈబెదరింపుల నొకింత యవతలకు
తోసి వారి యుపన్యాసము బుద్ధిపూర్వకముగ గాని యబుద్ధి
పూర్వకముగ గాని కలిగించినకంగారును తొలగింపకోరె
దను. శాసనోల్లంఘనమే విహాదాంశమైనచో తాను ప్రభు
త్వహొదిలోనున్న శక్తులన్నిటి ప్రయోగించెదనని గవర్నరు

చెప్పెను. కాని "హెచ్చుపన్ను న్యాయమా అన్యాయమా యనున దొక్కటియే ప్రశ్న యగుచో నిప్పుడు ప్రభుత్వము కీయవలసిన రెవిన్యూబాకీ చెల్లింపబడి, ప్రస్తుత ఆందోళన విరమింపబడినచో నిదివరలో ప్రకటింపబడినస్టేటుమెంటు ప్రకారము ప్రభుత్వమువారు సంపూర్ణమైన, బహిరంగమైన, స్వతంత్రవిచారణ కంగీకరింతురు." అని యత డనెను. అసలు విషయ మెప్పుడును శాసనోల్లంఘనము కాదని నేను ఘంటా పథముగా చెప్పుచున్నాను. శాసనోల్లంఘనముయొక్క న్యాయమును గురించియు, ప్రయోజనమును గురించియు అన్ని పక్షములమధ్యను యేకాభిప్రాయము లేదని నే నెరుంగుదును. దానిని గురించి యప్రతిహతమగు నాస్వంతయభిప్రాయము నాకు కలదు. బార్డోలీప్రజలు శాసనోల్లంఘనముయొక్క హక్కును ధృవపరచుటకు పోరాడుటలేదు. వారు శాసనోల్లంఘనముద్వారా-లేక మీరు దానికి మరేపేరు పెట్టినను సరే- ప్రభుత్వమువారిని హెచ్చుపన్నును కొట్టివేయుటకు ప్రోత్సహించుటకు లేక ప్రభుత్వమువారు హెచ్చుపన్ను అన్యాయముగా విధింపబడిన దని విశ్వసింపనిచో యథార్థమును కనుగొనుటకు నిష్పక్షపాతమైన, స్వతంత్రవిచారణను జరిపించగలందులకు పోరాడుచున్నారు. కనుక హెచ్చుపన్ను న్యాయమా అన్యాయమా యనునదొక్కటియే ప్రశ్న. ఈప్రశ్నను 'సంపూర్ణ

మైన, బహిరంగమైన స్వతంత్రవిచారణ' ద్వారా పరీక్షించుటకు ప్రభుత్వమువా రంగీకరించుచో తమంతతామే తీసికొనివచ్చినసూచనయొక్క న్యాయక్రమ మేమనగా తగాయిదాలోనున్న హెచ్చుపన్ను చెల్లింపబడవలెనని పట్టుపట్టకుండుట; సమరము ప్రారంభము కాకమునుపు ప్రజలున్నస్థితిలోనికి వారిని తీసుకొనివచ్చుట. 'సంపూర్ణమైన, బహిరంగమైన, స్వతంత్రవిచారణ' యనుదానికి తగిలించుచుండు "ఇదివరలో ప్రకటింపబడిన స్టేటుమెంటులో చెప్పబడినప్రకారము" అను విశేషణషరతును మరువరాదని నేను ప్రజలను హెచ్చరించుచున్నాను. ఇది యుపద్రవకరమైనషరతు. ఏలనన సూరతు భాగవతిములో వాగ్దానము చేయబడినది 'సంపూర్ణమైన, బహిరంగమైన, స్వతంత్రవిచారణ'కాదు. అదియొక చేటపెయ్యనంటిది. సూరతుస్టేటుమెంటు సంకుచితమైనవిచారణనొక రెవిన్యూఆఫీసరు, 'యధార్థములలోను లెక్కలలోను గల ప్రమాదములను' పరీక్షించున్యాయాధికారిసహాయముతో చేయవలెననియే యుద్దేశించెను. కనుక గవర్నరుగారి బెదరింపులకు భయపడక నేనుదహరించినవిషయ మొక్కదానిమీదనే ప్రజాభిప్రాయము కేంద్రీకరింపబడునని నేనాశించుచున్నాను.' అని యతడు మరల స్పష్టపరచెను.

ఈపత్రమువలన సత్యాగ్రహవిద్యార్థి నేర్చుకొనవలసిన దేమియనగా నెంతటికోపమును కలిగించు విషమపరి

స్థితులలోకూడ మనము మన మనోదండిని విడనాడరాదు. సర్దారు బుద్ధిపూర్వకముగా పరుషపదములను ఉద్రేకపరచు భాషను దరికి రానీయలేదు. అతడు తనశత్రువుయొక్క ఘీంకారధ్వనులతో పోటీచేయ నిచ్చగింపలేదు. గవర్నరుగారి ప్రకటన వెలువడిననాడే గాంధిజీ యంగుఇండియాపత్రికలో ప్రభుత్వమువారి కొకమనవి చేసికొనెను. "సూరతులో చేయబడినవాగ్దానము నమ్మతగినవదంతుల ప్రకారము ప్రయివేటుగా ప్రభుత్వమువారు చేసినవాగ్దానముకంటె చాల తక్కువగానున్నది. శ్రీయుత వల్లభాయి యుదహరించినషరతులు క్రొత్తవి కావు. అతడు మొదటినుంచియు వాటి ననేకవిధముల ప్రభుత్వమునకు తెలియపరచుచునే యుండెను. గౌరవప్రదమైన యొడంబడికలలో నెప్పుడును జరుపబడుచుండుదానికంటె నధికమును దేనిని యతడడుగలేదు. బార్డోలీ, వాలడ్ లలోనిప్రజ లేదివారికొక సిద్ధాంతమో యట్టిదానికొరకపరిమితమైనబాధలనొందిరని యంగీకరింపబడినచో, అనుకొననివారుకూడ దీని నంగీకరించిరి. ఏకొద్దికేసులనో యొకచిన్న రెవిన్యూఆఫీసరు విచారణచేయుటకొరకే వారట్లు బాధలనొందలేదు. ప్రభుత్వమువారిసూచన యధార్థమునకట్టి విచారణనే చూపుచున్నది. అన్యాయముగా ప్రభుత్వవశము చేసికొనబడినదని వారు వాదించుచున్నట్టి యనేకవేలరూపాయిల విలువగలభూములను ప్రజలు పోగొట్టుకొనజాలరు.

ఆత్మగౌరవముగల స్త్రీ, పురుషు లెవరును అన్యాయముగా బాధింపబడుచున్నవారి నింకను అసహాయస్థితిలో నుంచజాలరు. ప్రభుత్వమువారి వాగ్దానము కర్థమేమి? హెచ్చుపన్నుల నిచ్చుటకు తిరస్కరించుటలో ప్రజలు బుద్ధితక్కువపని చేసినను వారిక బుద్ధితక్కువపని చేయుట మానివేసి వారన్యాయముగా విధింపబడినదని చెప్పుచున్నధనమును ధరావతుకట్టినచో దయారసపరిపూర్ణులైన ప్రభుత్వమువారు వారి దయనొలకబోయుచు కొన్ని కేసులను పునర్విమర్శించుట కంగీకరించెదరట! ప్రజ లట్టితప్పిదమును చేయలేదనియు, ప్రజలు పూర్తిగా న్యాయపక్ష మవలంబించిరనియు, ప్రభుత్వము వారే మొదటినుంచియు నన్యాయమున కొడిగట్టిరనియు పూర్తిగా విశ్వసించునట్టి నాయకు డెవడును యిట్టి సూచన నంగీకరింపజాలడు. కాని ప్రభుత్వమువారివలె శ్రీయుత వల్లభాయి యసాధ్యమైనషరతులను కోరుటలేదు. అతడు తామే తప్పు చేసినట్లు ప్రభుత్వమువారి నొప్పుకొనమనలేదు. అతనియుత్తరము నొక్కవాక్యములో ప్రభుత్వమువారు న్యాయాన్యాయములను విచారించుటకు వారికి యిష్టమువచ్చినకమిటీని యేర్పాటుచేయవలెను; ప్రజలకుమాత్రము కలిగినంత ప్రాతినిధ్య ముండవలెను అని క్లుప్తీకరించి చెప్పవచ్చును. అట్టి నిష్పక్షపాతమైనకమిటీని నియమించినపుడు తత్ఫలితముగా న్యాయముగను సహజముగను జరుగవలసినది ప్రజలను తత్పూర్వ

పుస్థితిలో నుంచుటయే యని యతడు సూచించెను. అత డింత కంటె తక్కువయడిగినను తీసికొనినను నమ్మికవ్రోహమును చేసినవా డగునని నేను చెప్పుటకు సాహసించుచున్నాను. అతనిసూచనలో ప్రభుత్వము నవమాన పరచవలెన నెడుభావముకాని యర్థముకాని యెంతమాత్రమును లేదు. గౌరవప్రదమైన యెట్టిరాజీకైన నంగీకరింపవలెనని యతనికి గల యాదుర్దా, న్యాయబుద్ధి యతని నతితక్కువను కోరునట్లు ప్రేరేపించుచున్నది. ప్రభుత్వమువారి రెవిన్యూనీతిలో నున్న క్రుళ్లునంతను బయటపెట్టుటకును, గతించిన నాలుగు మాసములనుండియు తమ తప్పిద మావంతయు లేకుండ ప్రజలనుభవించిన యపారనష్టములకు పరిహారమును కోరుటకును నిశ్చయముగా నతనికి హక్కుకలదు.

ప్రభుత్వమువారికి రెండే మార్గములు కలవు. వారు యావద్భారతప్రజాభిప్రాయమును శిరసావహించి శ్రీయుత వల్లభాయియొక్క షరతుల కొప్పుకొనవలెను. లేదా యొక యసత్యపు గొప్పను నిలుపుకొనుటకు వారి భీభత్ససిద్ధాంతములను మరియొకసారి ప్రజలపై విడిచిపెట్టవలెను. ఆలస్యముకానిచో నిప్పుడైనను బొంబాయిప్రభుత్వమువారు సత్యమార్గము నవలంబింతురుగాక యని నేను వారికి విన్నపముచేయుచున్నాను."

---

# బార్డోలీ విజయము.



## ఇరువదితొమ్మిదవ యధ్యాయము.



"భగవంతుని రక్షణక్రింద భద్రముగానుండుట."

"మనయాత్మ భగవంతునికొరకు నిరీక్షించుచున్నది; అతడే మనకుదిక్కు; అతడే మనకు చక్రరక్షకుడు"

ప్రభుత్వమువారు బార్డోలీలో వంకరకత్తిని టపటప లాడించుచుండగా దేశములోని యితరప్రాంతములలో నుద్రేకము హెచ్చగుచుండెను. గవర్నరు, అండరుశెక్రిటరీగార్ల భయంకరప్రకటనలు దేశములో (బార్డోలీలో కాదు) కొంతమందిలో భయమును కొంతమందిలో నాశ్చరమును కలుగచేసెను. ఈయాంత్యసందేశము పంపబడిన సభ్యులకిది నిశ్చయముగా నాశ్చర్యముగానుండెను. తమ వోటరుల తరఫున తా మీషరతులను నెరవేర్పజాలమని వారు రెండుమాటలతో సర్ వెస్లీవిల్సనుగారికి జవాబుచెప్పుట సరళమైన మార్గము. ఏలననగా, గవర్నరు పూర్తిగా నెరిగియుండవలసినవిషయమే, బార్డోలీసమస్యపై తిరిగి యెన్నుకొనబడినతరువాత ప్రజల కృతనిశ్చయములకు వా రండగానుండుట వారివిధియై యున్నది. కాని వారిట్లు సరళమైనజవాబు నీయక.

సంయుక్తజాతీయపక్షమువారొక ప్రకటనను యేబదిమంది శాసనసభ్యుల సంతకములతో గావించిరి ఈప్రకటన "గవర్నరుగారి యుపన్యాసములో బార్డోలీసత్యాగ్రహమునంటి శాంతియుతమైనట్టియు, శాస్త్రసమ్మతమైనట్టియు యుద్యమమును న్యాయవిరుద్ధముగా పరిగణింప యత్నించుటను తీవ్రముగా నిరసించెను; మరియు "గవర్నరుగారు యీస్థితిలో తమ యంత్యసందేశమువలన నుదయించుచున్న బాధ్యతను శాసనసభలోని యెన్నుకొనబడిన సభ్యులపైనను, ముఖ్యముగా మొదటినుంచియు యొడంబడికకొరకు ప్రయత్నించగానెవరిమాటలు పెడచెవిని పెట్టబడినవో యట్టి సూరతుజిల్లా సభ్యులపైనను వేసి రుద్దుట" విచారకరమనియు "ప్రజలకును ప్రభుత్వకార్యనిర్వాహకవర్గమునకును పోరు తప్పనిసరియగుచో తత్ఫలితమునకు కార్యనిర్వాహకవర్గమువారే సంపూర్ణముగా బాధ్యులగుదు" రనియు వారు నిష్కర్షగా నుదహరించిరి. ఈనిరసన బాగుగనే యున్నది. కాని యది యింతకంటె బాగుగనుండవలసియున్నది. సత్యాగ్రహమంతయు కావలెనన్నచో ప్రభుత్వమువా రాయుద్యమనాయకునితో ప్రత్యక్షముగా వ్యవహరింపవలసియుండునని వారు ఖరాఖండిగా రెండుమాటలలో చెప్పియుండవలసినది. కాని మన శాసనసభల జాతకర్మనుబట్టి మన మింతకోరికను కోరరాదేమొ!

ఇతరప్రాంతములలోనున్న యతివాదపక్షమువారీప్రకటనవల నతిసంతోషముతో నాహ్వానము చేసిరి. సత్యాగ్రహము నగ్నిపరీక్ష చేయుటకవకాశము లభించెనని యు, తద్వారా స్వరాజ్యముకొరకు పెద్దయుద్ధము నారంభించుట కదను దొరకునని యు, వారానందించిరి. ఈయభిలాషనే సిక్కునాయకుడగు సర్దారు శార్దూలసింగుకవీశ్వరుగారు గాంధిజీకొక బహిరంగ లేఖద్వారా తెలియజేసెను. సత్యాగ్రహమును శ్రీయుత వల్లభాయి కేవల మొకప్రాంతముకే యరికట్టజూచుట "ఆచరణీయమైన రాజనీతి నతిక్రమించుట"గా తనకు కాన్పించుచున్నదని యు భారతదేశమందంతటను సానుభూతికొరకు శాసనోల్లంఘనము నారంభింపచేయవలసినదని యు మహాత్మున కితడు సలహాయిచ్చెను.

కాని ప్రజలలో నొకపిరికిపక్షమువారుకూడ నున్నారు. వారు గవర్నరుగారి ప్రకటన నొకవజ్రపాతమువలె, గొడ్డలిపెట్టువలె భయపడసాగిరి. వారు మొదటినుండియు యుద్యమమును బలపరచుచున్నను, ప్రజలకోరిక న్యాయమైనదని యొప్పుకొనుచున్నను రాబోవుయుత్పాతమునకు భయపడసాగిరి. బొంబాయిలో నొకవారపత్రికకును దినపత్రికకును సంపాదకుడుగానున్న వీరుడొకడు యీజాతిలోనివాడే. అతడు శ్రీయుత వల్లభాయిపటేలు శాసనోల్లంఘనము సమస్య కాదని ప్రకటించినవిషయములో పొరపాటు మొంతమాత్ర

ము లేదని యొప్పుకొనుచు సర్ వెస్లీవిల్సనుగారి భయముల కు కారణము లున్నవనుచు వారిషరతుల కంగీకరింపవలసిన దని వల్లభాయిగారికి సలహాయిచ్చెను. ఎట్టిపోలికయులేని దక్షిణాఫ్రికా యుదాహరణము నిచ్చుచు నతడు శ్రీయుతవల్ల భాయిని "ప్రస్తుతము ఉద్యమము నాపివేయవలసినది" అని యు ప్రభుత్వమువారు "ప్రస్తుతము సమ్మెదారుల సమ్మెల చేతను, దేశములో సామాన్యముగానున్న పారిశ్రామికకల్లో లములచేతను బాధపడుచున్నారు." అనియు వ్రాసెను. అత డిట్లు తన దినపత్రికలో సూచించెను కాని యతనివారపత్రిక లో నతడు ప్రభుత్వమువారికి కలుగుకష్టములకన్న యీవిష మపరిస్థితులనుండి యావిర్భవించు యుద్ధశాసనములు, తదంత ర్గతకృత్యములకే భయపడుచున్నట్లు విశదపరచెను. ఒకనా డతడు శ్రీయుత వల్లభాయియొక్క యాత్మనిగ్రహమును మెచ్చుకొనును. మరునా డతనిని ధైర్యమును పెంకితనముతో కంగారు పరచవద్దని మందలించి పూర్తిగా లొంగిపోవుటచే ప్రజలు నష్టపోవున దేదియు లేదనియు వారికంతయు లాభ మే చేకూరుననియు సలహాచెప్పెను.

కాని కొండవిరిగి మీదపడుననియు, నరకద్వార ములు తెరువబడుననియు భయపెట్టబడిన వ్యవసాయదారు లు యెంతమాత్రమును చలింపక ప్రశాంతముగా నిమ్మకునీ రువోసినట్లు తమతమ వ్యవసాయపనులను సాగించుకొనుచుం

డిసి. వారిబెదిరింపును కాని యీ తెలివైన సలహాలనుకాని గమనింపనే లేదు. యంగుయిండియాపత్రికలో వ్యాసము వ్రాయుచు గాంధిజీ యోరిమిలేని యతివాదులను, రాజీ కొరకు ప్రాకులాడువారిని తొందరపడి యేమియు చేయన క్కరలేదనియు బార్డోలీప్రజలు "భగవంతుని రక్షణక్రింద క్షేమముగా నున్నారు" అనియు మందలించెను.

"సిక్కుసర్దారుసూచనకు శ్రీయుత వల్లభాయి యేమిచెప్పునో నే నెరుగను. కాని నేను "సమయమింకను కాదు," అని చెప్పగలను. సానుభూతికొరకు మితముగా సత్యాగ్రహము చేయుటకైనను సమయమింకను రాలేదు. బార్డోలీ తన శక్తినింకను ధృవపరుపవలసియున్నది. అది యీతుదియగ్నిపరీక్షకు నిలువగలిగినచో ప్రభుత్వమువారు తమకున్న చివరమితివరకును పోయినచో సత్యాగ్రహప్రవాహము నాపుటకుగాని యీసమస్యను పునర్విచారణతో ను తదనుగుణ్యముగా కలుగవలసిన న్యాయమైన ఫలితము లతోను సరిపెట్టుటకు నేనుగాని శ్రీయుత వల్లభాయికాని యేమియు చేయజాలను. అప్పుడాత్మత్యాగమునను, ఆత్మ బాధలకును యావద్భారతదేశమును ప్రదర్శింపగలశక్తియే దానికి తగినమితి నేర్పరచగలదు. అట్టిప్రదర్శనమే యవసర మైనచో నది సహజముగను వియత్తలమునుండి ప్రవహించు గంగాలహరివలె నెట్టిశక్తిసంపన్నులైనవారికైన వారింప

సత్యముగను నుండుననుటలో నతిశయోక్తి యెంతమాత్రము నుండజాలదు. కాని సత్యాగ్రహతత్త్వము నాకర్థమైనంతవరకు, దాని కార్యకలాపమును నేను గ్రహించినంతవరకు ప్రభుత్వమువా రెంత రెచ్చగొట్టుచున్నను, మేమేర్పరచుకొనిన మొదటిపాదము నతిక్రమించుటకు తగినంతకోపము నిదివరకే కలిగించియున్నను నేనును శ్రీయుత వల్లభాయియు మొదటి హద్దులనుమాత్రమే యాదరించుట మాధర్మమై యున్నది."

"యథార్థమేమనగా భగవంతుడు ప్రత్యక్షముగ నున్నాడు; అతడే దీనికి నాయకుడు అనుభావము సత్యాగ్రహశబ్దములో నిమిడియున్నది. దీనినాయకుడు తన నిజబలముమీద కాక భగవంతునిప్రాపుమీదనే యాధారపడుచున్నాడు. అతడు తన యంతర్వాణి ననుసరించే నడుచును. కనుక నాచరణీయమైన రాజకీయములు అని తరుచుగా పిలువబడునట్టివి యతని కసత్యములే యగును. కాని చివరకతనివే యాచరణీయములగు రాజకీయము లగును. భారతదేశమింతవరకెన్నడును కనివిని యెరుగని ఘోరసంగ్రామమును చేయవలసిన యీసమయములో నిదియంతయు వెర్రివేదాంతము క్రిందను, మౌర్ఖ్యముక్రిందను తోచవచ్చును. కాని యేది నాకు గంభీరమైన సత్యముగా గోచరించునో దానిని నేను చెప్పక విడిచితినేని నేను నాకును నాదేశమునకునుగూడ మహాద్రోహమును చేసినవాడ నగుదును. బార్డోలీప్రజలు

భాయి విశ్వసించునట్టి శక్తిసంపన్నత కలుగునా రగుదు ప్రభుత్వమువారు తమయొద్దనున్న వివిధాస్త్రశస్త్రముల ప్రయోగించినను భయపడ నవసరములేదు. మనము నిరీక్షించుచు చూచుచుందుముగాక! బార్డోలీప్రజలను రక్షింపవలెననెడి యుద్దేశ్యముతో రాజీలకొరకాతురపడు శాసనసభ్యులును, యితరులును తప్పటడుగు వేయకుందురుగాక! భగవంతుని రక్షణక్రింద వారు క్షేమముగా నున్నారు."

మరికొంచెము యోపిక, మరికొంచెము పటుత్వముకలిగినవారైనచో శాసనసభ్యులు పరిస్థితులను ప్రకృతికి విడిచివేసిన బాగుండెడిది. వారు గవర్నరుగారికి మేము సూచించిన జవాబు తప్ప మరేమియు చెప్పకపోయినచో బ్రహ్మాండమేమియు బ్రద్దలుకాదు! యథార్థముకు ప్రభుత్వమువారే రాజీకొరకు సమస్తమును చక్కబరచుచుండిరి. శాసనసభలో గవర్నరుగా రుపన్యసించిన వెంటనే బార్డోలీతాలూకాలోని మోటాగ్రామవాసియైన రామచంద్రభట్టు పాతపన్నులకును క్రొ—పన్నులకును గల భేదమును తాను ధరావతు పెట్టెదనని వాగ్దానము చేసెను. అతడు చేసిన వాగ్దానము సూరతుసభ్యులద్వారా రావలెనని యతనికి మొట్టమొదట ప్రభుత్వమువారు జవాబు యిచ్చినను తరువాత దాని నతనిదగ్గరనుండి తీసికొనుటకే యంగీకరించిరి. తరువాత పరిస్థితులు ప్రభుత్వమువారే రామచంద్రభట్టును యీపనికి ప్రోత్సహించిరను

ననుమానమును రూఢిచేయుచున్నవి. ఏది యెట్లు జరిగి శాసనసభ్యులకుమాత్రము అతృప్తి తగ్గలేదు. వారు గవ రుగారిని వారిసభ్యులను చూచిరి. ఆదొరలు యెప్పటివలె పాడిరి. శ్రీయుతమున్షీ పర్చుసీలాల్ మెహతాతో (ఆ సభ్యుడు) నాలోచనలుచేయుచు గాంధిజీ వల్లభాయిల నడి వారితక్కువకోరికలను తెలిసికొనవలెనను సరియైన యోచ చేసెను. అతడువారిని కలుసుకొనగా వారీక్రిందిషరతుల నుదహరించిరి.

1. విచారణజరుగుకాలములో పాతపన్నులే అంగీక రింపబడవలెను.

2. విచారణ ప్రకటింపబడినతోడనే సత్యాగ్రహులు పాతపన్నులను చెల్లించుచు ఉద్యమమును ఆపివేయవలెను.

3. విచారణ బహిరంగముగను న్యాయసంబంధమైన దిగనుచుండి కేవలన్యాయాధికారిచేతగాని లేక రెవిన్యూయు ద్యోగిసహాయముతో గాని జరుపబడవలెను. ప్రజలు అవసర మగుచో న్యాయవాదులద్వారా సాక్ష్యమిచ్చుటకును, సాక్ష్య మును పరీక్షించుటకును హక్కుగలిగియుండవలెను. నిర్ణయిం పబడవలసిన విషయములు (1) (ఏ) క్రొత్తగా హెచ్చింప బడినభూమిపన్ను ల్యాండు రెవిన్యూకోడ్‌లోనున్న షరతుల ననుసరించి చేయబడలేదనియు, (బి) ప్రజలకంద చేయుబడిన నివేదికయును, విజ్ఞాపనలును, పన్ను హెచ్చించుటకు తగిన

-లను చూపుటలేదనియు, కొన్ని లెక్కలు తప్పులెక్కల
ని బార్డోలీ, వాలడ్ ప్రజలుచేయు ఆక్షేపణలను విచా
రించి నివేదించుటయు; ప్రజలఆక్షేపణలు న్యాయమైనవని
కనుగొనబడినచో పాతపన్నులలో నెంతతగ్గించవలెను లేదా
యెంత హెచ్చింపవలెను అనువిషయమును నిర్ణయించుటయు
(2) క్రొత్తపన్నును వసూలుచేయుటలో ప్రభుత్వమువారు
నిర్బంధచర్యలకు గడంగిరని ప్రజలుకాని ప్రజలతరపునకాని
చేయబడిన యారోపణలను గురించి నివేదించుటయు—

4. భూములన్నియు తిరిగి యిచ్చివేయబడవలెను.

5. సత్యాగ్రహ ఖయిదీలనందరను విడుదలచేయ
వలెను.

6. అందరు పటేళ్ళను, తలాతీలను తిరిగి స్వస్థానము
లలో నుంచవలెను.

7. వాలడ్ సారాదుకాణదారుకు ముదరా యివ్వ
వలెను.

నిర్బంధచర్యలను విచారణచేయవలెననెడికోరిక రాజీ
కిభంగముగానుండునని యనుకొనుచో సత్యాగ్రహులు లాకోరి
కను బుద్ధిపూర్వకముగా విడిచివేతురని గాంధిజీ మున్షీగారితో
చెప్పెను. ఈషరతులతో శ్రీయుత మున్షీగారు గవర్నరుగా
రిని సందర్శింపగా వారు మొండిచేయి చూపించిరి. ఇట్లు జరిగి
నవెంటనే శ్రీయుతులు హరిభాయి అమీను, నారిమనుగార్లు

సబర్మతీలో మహాత్ముని దర్శించిరి. గాంధిజీ మున్షిగారికి
న జవాబే వీరికిని చెప్పి నిర్బంధచర్యలను గురించి చేయు
న విచారణనొక్కదానిని మాత్రమే తగ్గించుకొనవచ్చునని
ప్పెను. సభ్యులుకోరినచో పైనుదహరింపబడినషరతులప్ర
రము రాజీకుదుర్చుకొనుటకు శ్రీయుత వల్లభాయిని పూ
రమ్మనినచో నతడుదానికి తప్పక నంగీకరించుననని గాంధి
వారికభయహస్తమునిచ్చెను.

బార్డోలీలోనంతయు ప్రశాంతముగనే జరిగిపోవుచు
డెను. సర్దారు నిర్బంధింపబడుననువార్తలు దవానలమువలె
ప్రతిచోటకు ప్రాకనారంభించెను. సర్దారు వెళ్లిపోయినతరు
వాత నతనిస్థానములో ప్రవేశించుటకంటె నతనుండగనే యత
డేమిచేయమనిన నట్లు చేయుటకు సిద్ధముగా నుండవలెనని
గాంధిజీ బార్డోలీ పయనమయ్యెను. ఆగష్టు రెండవ తేదీ కత
డు బార్డోలీ చేరెను. బార్డోలీయొక్క యదృష్టమెట్లున్నదో
కదా! అని భారతదేశమంతయు నొకవంక దద్దరిల్లుచుండ
బార్డోలీలో నంతయు ప్రశాంతముగనుండుట మహాత్మున
కాశ్చర్యమును కలిగించెను. అతడాప్రజలమధ్య రెండురోజు
లుండుటతోడనే "భగవంతుని రక్షణక్రింద వారు భద్రముగ
నున్నారు" అని తాను వర్ణించినవర్ణన కేవలము యథార్థమని
యతనికి ద్యోతకమయ్యెను. అతడు బార్డోలీలో నడుగిడిన
నాడు వేలకొలది వ్యవసాయదారులు వివిధప్రాంతములనుండి

మ్మలోతురొంపి, మెళ్లకొలదినీరు దాటుకొనుచు గాంధిజీ పిస్కృతులొనరించుట కేగుదెంచిరి. రాజీవదంతులు వీరికి ఁయకపోలేదు. వారిలోనొకడు గాంధిజీతో నిట్లుచెప్పెను. మేము మాపుత్త్రులను సర్కారుకు స్వాధీనముచేసితిమి కాని గౌరవము నట్లుచేయలేదు." "అట్లయినచో మీగౌరవ ము భద్రముగా నున్నదని మీరు దృఢనిశ్చయులై యుండ చ్చును. కాని యింతకంటె గొప్పపరీక్ష యింకను రానైయు న్నది. మీరీతుదియగ్నిపరీక్షలో నుత్తీర్ణులగుదురేని మీకు విజయము నిశ్చయము. కాని నేను మిమ్మొకటి యడుగదల చితిని? వల్లభాయిని అతనితోకూడ నితరులను తీసికొనిపో యెదరనుకొనుడు. అప్పుడు మీరు లొంగిపోకుండ నుండె దరా?" అని మహాత్ముడు వారి నడిగెను. "అట్టిభయమేమి యు లేదు. వల్లభాయిసాహెబు ఉత్సాహగ్రహములను వజ్రపంక ల్పలనుగా తయారుచేయుటకు కావలసినదంతయు నిదివరకే చేసెను. ఆకాశమే విరిగిమీదపడినను సరే మేము చేసిన బాస ను జవదాటకుండుటయొక్కటే మేము చేయవలసినపని యని మే మెరుంగుదుము" అని వారిలో నొకడు తటాలునలేచి గం భీరముగా పలికెను. గాంధిజీ యపరిమితానందమునొందెను. కొన్నిగ్రామములను చూడవలసినదని యతనినొకస్నేహితు డు ప్రోత్సహించెను. "వల్లభాయి నన్నట్లు చేయుమని కోరు వరకును నేను చేయజాలను" అనియతడు బదులుచెప్పెను.

వల్లభాయికోరినమీదట గాంధిజీ సార్భాను, రాయంగ్ర ములనుచూచి పరిసరగ్రామములనుండివచ్చిన వందలకొ వ్యవసాయదారులను కలుసుకొనెను. తిరుగబాటుదారు తిరుగబాటుచేసిన వ్యవసాయదారులు అని సముద్రములు టి ఖండాంతరములలో నెవరిఖ్యాతి విస్తరించెనో యట్టి నిరా డంబర, నిరపరాధులైన గ్రామవాసులు, సిమ్లాకొండలమీ దనుండియు, వైటుహాలుభవనములనుండియు ఘీంకారములను చేయుచుండువారిలో నింతచలనము కలుగచేసినసంగతి నేమి యు నెరుగని గ్రామవాసులందరు నచ్చటనుండిరి. రాయంలో జరిగిన సమావేశము కనేకవేలమంది వచ్చిరి. అనేకగ్రామము లనుండివచ్చిన పురుషులు నడిమొడలో నిలువబడిరి. నూలు తీయుప్రదర్శనము, వందలకొలదిస్త్రీలు, గాంధిజీపాదముల కడ కానుకలను సమర్పించుచుండు నారీప్రవాహము-ఆహా! ఆదృశ్యమంతయు కన్నులవైభవము గానుండెను. అతడు ముక్త సరిగా కొద్దిమాటలను మాత్రమే యిట్లుచెప్పెను. “సర్దారు యొక్క యాజ్ఞ స్పష్టముగనే యుండుటచే నేను మాటాడజా లను. అతడిచ్చటనుండి నన్ను మాట్లాడమనినచో నేనట్లే మాట్లాడియుండెడివాడను. నేడు నేను మీ ధైర్యసాహసముల కును, మీసంఘీభావమునకును మిమ్మభినందించుటతప్ప మరే మియుచేయజాలను. నూలుతీయుప్రదర్శనమును చూచుటను నేనెంతయు సంతసించుచున్నాను. కాని నేను చర్ఖాను గురిం

డ మాట్లాడజాలను. మనము మన సర్దారుగా నిర్ణయిం
చిన వానియాజ్ఞలనుకాని పురమాయింపులనుకాని శిర
సహించి చేయుట మనకొక సూత్రప్రాయముగా నుండవలె
నేను వల్లభాయికి జ్యేష్ఠసోదరుడనని యొప్పుకొందును.
ని ప్రజాజీవితములో నన్ను, తండ్రి యనుచివక్షత లేకుండ
నమెవరికిక్రింద పని చేయదలచుకొంటిమో వారియాజ్ఞలను
రసావహింపనలెను. ఇదియొకక్రొత్త చట్టముకాదు. ప్రాచీన
కాలములో కూడనిది చట్టముగనే యుండెను. శిక్షణయందు
క్ష యీతత్త్వమే శ్రీకృష్ణభగవానునంతటిమహాపురుషుడు
అర్జునుని రథసారథిగా నుండుటకును యుధిష్ఠిరుని రాజ
సూయయాగములో నీచాతినీచుని సేవచేయుటకును కార
ణమయ్యెను. కనుక నేను మిమ్మభినందించుటకంటె మరే
మియు చేయజాలను. వల్లభాయి మిమ్ము భారతదేశమం
తటను కీర్తివంతులనుచేసెను. కాని ప్రపంచమంతటను
మీకీర్తిని విస్తరింపచేసినది ప్రభుత్వమువారే! భవిష్యత్తులో
మీరింకను ఘనకార్యములను సాధింతురుగాక !"

---

# బార్డోలీ విజయము.

## ముప్పదియవయధ్యాయము.

"సత్యాగ్రహవిజయము."

"రాజనీతికోవిదులను మోసముచేయునట్టి కళను నభ్యసించితిని. నేను సత్యమునే పలికెదను." "కావూరు."

గాంధిజీ ప్రశాంతముగా బార్డోలీలో స్థిరపడుటతో డనే శ్రీయుత వల్లభాయిని పూనా రావలసినదని రావుసాహేబుదాదుభాయిదేశాయి గుజరాతుసభ్యులతరపున తంతి ద్వారా యాహ్వానము నంపెను. ప్రభుత్వసభ్యులలో సీనియరుసభ్యుడగు సర్ చునీలాల్ మెహతాయొక్క ప్రోద్బలముచే కాకపోయిన నంగీకారముతోనైనను యిది పంపబడెను. ఏలనన యీ టెలిగ్రాములోనే యితనిని. సర్ చునీలాల్ గారి యతిథిగా నుండవలసినదని కోరిరి. గుజరాతుసభ్యులను సంతోషపెట్టవలె ననునూహతో నతడు దీనికంగీకరించి ఆగష్టు మూడవతేదీని పూనా చేరెను.

మూడునాల్గు తేదీలలో వల్లభాయి సర్ చునీలాలు గార్ల మధ్యజరిగిన విషయములన్నిటిని బయలుపెట్టుట సాధ్యము కానేరదు. ఒకవేళ సాధ్యమైనను యుచితము గానేరదు. కానిదీనితోసంబంధమున్న వారికందరకున్యాయముగానుండుట

ము కేవలయథార్థములను చెప్పకతప్పదు. ప్రభుత్వము
ం తమయంత్యసందేశముసు సూరతుసభ్యులకు పంపినను
రకది శ్రీయుతవల్లభాయివద్దరకే వెళ్ళవలెనని వారు
హించిరి. సూరతుసభ్యులు, వారితో పనిచేయుచున్న
తరసభ్యులవలెనే, చిట్టచివరవరకు నెట్టివాగ్దానమును గాని
శ్రీయుతవల్లభాయితరఫున నెట్టియొప్పందలను గాని నిచ్చుటకు
రాకరించిరి. సర్ చునీలాలుగారిసభలో నిష్ఫాగోష్ఠిచ
ర్చలు జరుగుచుండగా సూరతుసభ్యులు రాజీ కెంత యాతు
తను చూపుచుండిరో ప్రభుత్వమువారును అంతయాతుర్తా
గానే యున్నట్లు ద్యోతకమయ్యెను. కాని ప్రభుత్వగొప్పను
కాపాడునట్టి విధానము దొరకక ప్రతివాదును తబ్బిబ్బులాడు
చుండెను. ఒకనిర్గంధమైనచిత్తు తయారుచేయబడెను. కాని
యది సర్ చునీలాలుగారికి నచ్చలేదు. అతడు యితరప్రభుత్వ
సభ్యులతో చర్చించుచు చివరకు సాయంత్రమగుసరికి సూర
తుసభ్యులు రెవిన్యూసభ్యునకు పంపించవలసిన యొకచిత్తు
యుత్తరమును తయారుచేసెను. "గవర్నరుగారు జూలై 23
వ తేదీని శాసనసభను ప్రారంభించుచు సూచించినషరతులు
నెరవేర్చబడునని ప్రభుత్వమువారికి తెలియజేయుటకు మా
కెంతయు సంతోషముగానున్నది."

ఇది వినుటతోడనే శ్రీయుతవల్లభాయి "విచారణ
కంగీకరింపకపూర్వమే షరతులను నెరవేర్చవలసియున్నపుడు

శాసనసభ్యులు తాము షరతులను నెరవేర్చెదమను న ములో సంతకములు చేయుట కర్థమేమి? షరతులను న ర్చగలవారెవరైనను నున్నచో వాటిని మేమే నెరవేర్చ ము. విచారణజరిపించెదమని ప్రకటించువరకును పాతప లను కూడ చెల్లించుటకు వలనుపడదని యిదివరకే మే చెప్పియుంటిమి." అని యాశ్చర్యముతో పలికెను. "దానిత మీకెట్టిసంబంధమును లేదు. శాసనసభ్యులీవిధముగా యుట కంగీకరించినచో నీషరతులు యెప్పుడు, యెట్లు, వరిచేత నెరవేర్చబడు ననువిషయమై మీరుయోచింపనక్క లేదు. విచారణజరుపబడునని ప్రకటించినతరువాతనే మీర పాతపన్నులను చెల్లింపవచ్చును" అని సర్ చునీలాలుగార చల్లగా నూదిరి.

నిజముగా నీచతురంగపుటెత్తు మాబుద్ధికి మించినదని చెప్పకతప్పదు. ఈసంధిగ్ధసమయములో సర్దారుతోకూడనున్న శ్రీయుతులు మున్షీశివదాసనీగారలు వేరువేరుచిత్తుపత్ర ములను తయారుచేసిరి. కాని యవి సర్ చునీలాలుగారికి రుచింపలేదు. ఆయన ప్రభుత్వమువారి చిత్తుయుత్తరమునే సమర్థించెను. శ్రీయుతమున్షీగారు మరల త్రాడుతెగునేమో యనుభయముచే నితరషరతులనుగురించి చర్చింప నారంభిం చెను. దీనిఫలితముగా రాత్రి చాలకాల మగుసరికి యితరష రతులనుగురించి యనగా భూములనిచ్చివేయుట, ఖయిదీలను

పెట్టుట, తలాతీలకు వారియుద్యోగముల నిచ్చివేయుట-
గురించి యొడంబడిక కుదిరెను. ఇతరవిషయములన్ని
కుదిరినచో నష్టపరిహారముసంగతిని విడిచివేయవచ్చు
శ్రీయుత వల్లభాయి చెప్పెను. కాని చిత్తుయుత్తరమే
ఖ్యవిషయము. శ్రీయుత మున్షీ రాత్రి చాలపొద్దుపో
నతరువాత నేదోయొకమతలబు కుదరవచ్చు ననువాశ
వెడలిపోయెను. నేనును స్వామిఆనందుయును శ్రీయుత
ల్లభాయితో నీసందిగ్ధసమయమున నుంటిమి. సర్ చునీలా
లు, మానలెనే యొడంబడిక కుదురుట యసంభవమని య
మకొని రాయబారములు విఫలములు కాకతప్పదని భగ్న
మనోరథుడై వెడలిపోయెను. రాయబారము లెందులకు
భగ్నములయ్యెనో విశదము చేయుచు గవర్నరు కొకలేఖను
వ్రాయుటకు చిత్తు తయారుచేయుచు బహ్మన తెల్లవారువరకు
మేము చర్చించుచుంటిమి. చివరకొకదానిని తయారుచేసి
నేలపై కొరిగితిమి. రెండుగంటలలో నేను సర్ చునీలాలుగారి
యుత్తరమునుగురించి యోచించుచు తిరిగిలేచితిని. నేను
శ్రీయుతవల్లభాయిని లేపి "ఇంతకును యిది యెంతమాత్ర
మును హానికరముకానట్టి, అర్థములేని యుత్తరము. మన
మెట్టివాగ్దానము చేయుటలేదు. సూరతుసభ్యులుకూడ నేమి
యు చేయుటలేదు. ప్రభుత్వమువా రిట్టి యర్థరహితమైనలే
ఖను కోరుచో మన మీదేవశుని కీతెలకపిండిముక్క పార
వేయవచ్చును" అని యంటిని. ?

"కాని యిది సత్యమును కూనీ చేయుటవంటిది' శ్రీయుతవల్లభాయి యనెను.

"దీనిని నే నంగీకరించుచున్నాను. కాని ఇట్లు చేయుచున్నది ప్రభుత్వముకాని మనముకాదు." అని నే నంటిని

"కాని మనకుమాత్రి మిందులో భాగము లేదా?"

"లేదు. మనము ప్రభుత్వమువారితో స్పష్టము గా నేమిచేయుచున్నారో తెలియచేసితిమేని మన కేమియు భాగముండదు" అని నేను చెప్పితిని.

"అయితే ప్రభుత్వము వారు సత్యమును కూనీ చేయుచున్నారని మీరు సర్ చునీలాలుతో చెప్పుటకు సిద్ధముగా నున్నారా?"

"తప్పకుండా నే నిప్పుడే చెప్పెదను."

"కాని నా కీనాటకము అర్థముకాకున్నది. వారు యథార్థముల నేల సరిగా నెదుర్కొనరు? దీనినిగురించి బాపు యేమనునని మీ రనుకొనెదరు? స్వామీ! మీ రేమనెదరు? అని శ్రీయుతవల్లభాయి యడిగెను.

సర్దారుయెడల నా కానాడుకలిగినంతగౌరవము మరె న్నడును కలిగియుండలేదు. అతను 'బాపు' యభిప్రాయ మెట్లుండునో తెలిసికొనవలెనని యెంతయాదుర్దా పడుచుండె నో వినయవిధేయులమైన నావంటియు, స్వామివంటియు య నుచరుల యభిప్రాయములను తెలిసికొనుటకును నంత యా దుర్దా పడుచుండెను.

మనము సత్యమును కూనీ చేయుటలేదు లేక గురువు సిద్ధాంతములను భంగపరచుటలేదని యీవిధముగా నత ట్టినమ్మకము కుదిరినతరువాత "సూరతుసభ్యులీయర్థ వ్యమైనయొడంబడికపై సంతకము చేయుదురా?" అని గెను.

"వారుకూడ నీనాటకమును గ్రహించియే యుండవ ని నేను చెప్పగలను. కాని సంతకము చేయుటకు వారి కైయభ్యంతరము నుండదని సర్ చునీలాలుగారికి గట్టినమ్మక మున్నట్లు కాన్పించుచున్నది." అని నేను చెప్పితిని.

"సరే! వారు సంతకము చేసేయెడల నాకెట్టియభ్యం తరమును లేదు. కాని మన యథార్థస్థితిని మరియొకసారి మ ము సర్ చునీలాలుగారికి తెలియచేయుచు ప్రభుత్వము వారు సత్యమును కూనీ చేయుచున్నారని స్పష్టముగా చెప్పవ లెను." అని సర్దారు చెప్పెను. నేను సర్ చునీలాలువద్దకు వెళ్ళి సమస్తమును పూసగ్రుచ్చినట్లు చెప్పితిని. "మీరు మీ స్థితినిగురించి స్పష్టముచేయుట చాల బాగుగనే యున్నది. నేను ప్రభుత్వమునకు సమస్తమును తెలియపరచెదను." అని యతడు చెప్పెను. మే మిట్లు చర్చించుచుండగా శ్రీయుత వల్లభాయి తిరిగిచూచి మరల సత్యమును కూనీ చేయువిషయ మును తలపెట్టి యింతకును ప్రభుత్వమువారు పైనుదహరింప బడిన యుత్తరముద్వారా తెలియచేయబడిన 'సమాచార

ము' అంగీకరింపకపోవచ్చునని చెప్పెను. ఈ చిత్తు ముసాయిదాను మనసా కాదనమునకు నిరాకరించినప్పుడు కొంత ఆమోదమును బడయుట కతిమంచిదిగనో చెడ్డదిగనో యుండెను. కాని సర్ చునీలాలుగారికిం మెట్టి సందేహమును కలుగదాయెను! ప్రభుత్వముల తుల నెరుంగ నేరికిని శక్యము కాదుగదా! సూరతుసభ సంతకముచేయుట కంగీకరించుచో తనకెట్టి యభ్యంతరః లేదని శ్రీయుత వల్లభాయి చెప్పినతక్షణమే యొడం పూర్తియైపోయెను. సర్ చునీలాలుమెహతాపట్ల న్యా ముగా నుండవలెనన్న ప్రభుత్వచిత్తము నతడు మనయం కంటె బాగుగా నెరుగుననియు, నిట్టి సందిగ్ధసమయము నతని దేశభక్తియే యధికారతత్వమును మ్రింగివేసెననిం చెప్పకతప్పదు. అతడు తనదేశమునకు సేవ చేయుచున్నసం యెరుంగును. తానేప్రభుత్వము కొకసభ్యుడుగానుండెనో యట్టి ప్రభుత్వము యథార్థమైనగొప్పను కోల్పోయి దా ఛాయనుమాత్రమే యనుసరించుచున్నట్లు చివరకు కనుగొ గల రనుసంగతి నతడు పాటించుచున్నట్లు కాన్పించదు.

కాని ప్రభుత్వమువారు కేవలము మోరలతో తృప్తి పడుచున్నను శ్రీయుత వల్లభాయి ముంజెలతోగాని తృప్తి పడడాయెను! అతనికి కావలసినదంతయు పూర్తియైన స్వతం త్రమైన, న్యాయసంబంధమైన విచారణయు, ప్రజలను తమ పూర్వస్థితికి తిరిగి తెచ్చుటయు- ఇచ్చుటకూడ తమ ప్రతిష్ట చె

నకుండ నున్నచో ప్రభుత్వమునకిది పూర్తిగా నంగీ
కనే యుండెను. సభ్యులు పైనుదహరింపబడిన చము
ఫు టుత్తరము పంపుటతోడనే శ్రీయుత వల్లభాయి
- మాటలలో నొక్కయక్షరమైనను పొల్లుపోకుండ
ంపబడిన- ఒక వ్యాకరణదోషముమాత్రము దొర్లిం
ను- విచారణను (నిర్బంధచర్యలను గురించిన షరతు
యబడెను) ప్రకటించుటకును, సభ్యులు రెవిన్యూసభ్య
లాంఛనముగా నొక యుత్తరమును వ్రాసినమీదట
తీలకు తిరిగి యుద్యోగముల నిచ్చుటకు, భూములను
యిచ్చివేయుటకు, ఖయిదీలను విడిచిపెట్టుటకు యీవి
ంగా వ్యవహారము పరిష్కరింపబడెను. శిక్షలనన్నిటిని
ంచేయుట, వాలడ్ సారాదుకాణదారుకు నష్టపరిహారము
ప్పకొనుట యనుషరతును యుత్తరములో జేర్చలేదు. అధి
రులే దీనివిషయమై యాజ్ఞల నములు జరుపుదురు కనుక
ని వక్కాణింప నవసరము లేకపోయెను. శ్రీయుత వల్ల
ాయి కిక కావలసినదేమియున్నది? అతనికి కావలసినది పూ
ము కాని డొలక కాదు. దాని నతడు పూర్తిగాను సమగ్రము
ాను సాధింపగలిగెను.

తక్కిన కథయంతయు గుఱ్ఱపుదాడువలె పరుగెత్తెను.
హరతుసభ్యులు ఉత్తరముపై సంతకముచేసిరి. వీరుగాక
మరి ముగ్గురునలుగురుకూడ-కారణమేమియో మనసు చెప్ప

జాలము - సంతకము చేసిరి. సర్ చునీలాలు గారి ప్రోత్సా
హైని రావుబహాదరు భీమభాయి నాయికు, శ్రీయుత
మరికొంతమందియు అమ్మివేయబడిన భూములను తిరిగి
లుయజమానుల కిచ్చివేయుటకు కలెక్టరు గారికి తోడ్ప
కుగాను సూరతు వెళ్ళిరి. ఈ భూములను కొన్నవా రతి
ముగాను, విసిరి వేసిన ట్లచ్చటచ్చటను యుండిరి. కాని
నందరను వేటాడి పట్టుకొనవలసి వచ్చెను ఏలననగా నీ
వహారమంతయు దుర్దినమైన ఆగస్టు ఆరవ తేదీ గతించులో
లనే జరుగవలెనుగదా ! అమ్మివేయబడిన భూములిక నె
డును వాపసు చేయబడవని విసుగులేకుండ పాటలు పాడు
డిన పాతకలెక్టరయిన హార్టషారన్ దొరవారి నాసనుయ
కు మెల్లగా మరియొక జిల్లాకు సాయముపట్టిరి. కొత్తక
క్టరయిన గ్యారెటుగారు భూములను కొన్నవారిని తిరిగి
చ్చివేయుటకొప్పించెను. పాపము ! వారికి కలెక్టరుగారు
కమీషనరుగారును ననేక నిరర్థకవాగ్దానములను చేసిరి. కన
క నప్పనముగా వారు వేసికొనిన యీయక్రమలాభములన
వారిచే కక్కించుట కష్టమైనపనియే యగును! కలెక్టరుగారు
యీస్నేహితుల నెంత చాకచక్యముగా నడిపించెనో చిత్రము
గా వర్ణించుచు మున్షిగా రొకయుత్తరములో వ్రాసిరి. రెవి
న్యూసభ్యున కుత్తరమును పంపినదినముననే సత్యాగ్రహులు
సూచించిన షరతులతోనే తూచా తప్పకుండ విచారణ ప్రక

డెను. శాసనసభ్యులు తిరిగి యిచ్చివేయవలసినపర
ంగురించి రెవిన్యూసభ్యునకు వ్రాయుటతోడనే ప్రభు
వారు భూములనన్నిటిని తిరిగి యిచ్చివేయుటకు, ఖయి
ందరను విడిచివేయుటకు, సరియైన దరఖాస్తులను పంపి
దట తలాతీలందరకు తిరిగి యుద్యోగము లిచ్చుటకు
ల నిచ్చెదమని ప్రకటించిరి. శ్రీయుత వల్లభాయి కిక
తాము వారు చేసినదాని కామోదమును వెల్లడించుట
మరి చేయవలసినదేమియు లేకుండెను. అతఁడు దీనితో
బంధమున్నవారి నందరను ప్రభుత్వమునుసహా బహిరంగ
ుగా నభినందించుచు వ్యవసాయదారుల కిట్టి యుత్తరువ్రల
చ్చెను. "మన మిప్పుడు పాతపన్నులను చెల్లింపవలెను.
హెచ్చింపబడినపన్ను కాదు! పాతపన్నులను చెల్లించుటకు
మీరు సంసిద్ధులగుదురని నే నాశించుచున్నాను." ఖయిదీ
లను విడిచిపెట్టెదరను నూహతో నత డిట్లు వ్రాసెను.
కాని వారిని విడిచిపెట్టుదురని ప్రకటింపకపోవుట యతని
కాశ్చర్యమును కలిగించెను. శ్రీయుత వల్లభాయికిని, సత్యా
గ్రహులకును యీ యొడంబడిక యంగీకారముగ నున్నదీ
లేనిదీ ప్రభుత్వమువారికి సందేహముగనుండుటయే దీనికి
కారణము. కనుక వా రీవిషయమును కనుగొనుటకు కలెక్ట
రును పంపిరి. శ్రీయుత వల్లభాయి తన యామోదము నిదివ
రకే యొక గుజరాతుబులెటినుద్వారా తెలియపరచితినని

చెప్పుటతోడనే కలెక్టరు ప్రభుత్వము వారికి తమపొర
దిద్దుకొనవలసినదని తంతి పంపెను. మరునాడుదర
ఖయిదీలందరును విడుదలచేయబడిరి. తలాటీలయుద
లవిషయమై శ్రీయుతవల్లభాయి వ్రాసినదరఖాస్తు
కంగీకారముగనే యుండుటచే నతడు వెంటనే య
పంపించెను. ఈపని జరుగుటతోడనే ప్రజలిక తము
వేర్చవలసియుండెను. వెంటనే వారు తమపాతపన్ను
వేయ నారంభించిరి. నెలరోజులలో రెవిన్యూబాకీల
పూర్తిగా చెల్లించివేయబడెను.

తమ్మొక తృటికాలములో నలిపి వేయగల శ
శాంతియుతులు, సత్యము, ఓరిమితో బాధ ననుభ
మాత్రమే యాయుధములుగాగలిగిన కృషీవలులుస
గావింపబడినసమర మీవిధముగా సమాప్తము చెందె
ర్డోలీవ్యవసాయదారులు సత్యమును, దౌర్జన్యరాహి
జయించుట నేరికిని శక్యము కాదని ప్రపంచముకంతె
టింపగలిగిరి. బార్డోలీయొడంబడిక సత్యముయొక్క
ర్జన్యరాహిత్యముయొక్కయు విజయమే యనుటకు
మేమియు లేదు. ఇది సర్దారుయొక్క తృతీయవి
అతడు స్వరాజ్యప్రస్థానములో పొందిన మూడవమైల
నాగపురవిజయ మొకసాంకేతికహక్కును స్థాపించు
బోర్సదువిజయము తీవ్రమైనసమరము నతిస్వల్పకాల

యకస్థానికకష్టమునుమాత్రమే తొలగింపగలిగెను. ఈ
మముకంటె గొప్పది, సంపూర్ణమైనది మరియొకటి యుండ
కపోయినను యిది నిమిషములమీద సమాప్తమగుటచే
ర్డొలీయుద్యమమువలె ప్రజల నాకర్షింపజాలకపోయెను.
ర్డొలీయుద్యమము భారతజాతియొక్క దృష్టినేగాక సా
ాజ్యమంతటిదృష్టిని యాకర్షింపగలిగెను. అది ప్రజలకోరిక
నున్న న్యాయమును, మితమును చాటుచు జాతియొక్క
భిమానమును చూరగొనెను. బార్డొలీయుద్యమము భార
దేశములో నీతివినయవిధేయతలుగల తాలూకాచే సాగింప
బడెను. ఇది యెవరిపరివర్తనను దేవతలుకూడ శంకింపరాదని
యింతవరకు తలంపబడెనో యట్టిరెవిన్యూశాఖకు శృంగభంగ
మును కలిగించెను. ఇది యుద్యమము నణచివేసెద మని
కంకణము కట్టుకొనిన యొక బ్రహ్మాండమైన ప్రభు
త్వమును వారు శపథముచేసిన పదిహేనురోజులలోనే
లొంగిపోవునట్లు చేయగలిగెను. ఈ యుద్యమనాయ
కుడు వ్యక్తిప్రతిష్ట యనుభావము నంతను పారద్రోలె
ను. ఈ రాష్ట్రములోని గవర్నరు వైటుహాలు బూరా
ను కొంతకాల మీదినను శాంతిని చేకూర్చుటకు తాను
స్వయముగా చేయగలిగినదంతయు చేసెను. శాంతిని చేకూ
ర్చుటకొరకే యతడు కొంతడాబు చేయుట కంగీకరించెను.
కనుకనే గాంధిజీ, వల్లభాయిగారలు యొడంబడిక కుదిరిన త

రువాత వారమురోజు లీయుద్యమములో గెలుపొం
నెంతయభినందించవలెనో గవర్నరును కూడ నంతగా
దించుట తమ ధర్మమని తమ యుపన్యాసములలో బోధి
గిరి. ఇట్లీయుద్యమ మన్నివిధముల నసమానమైనదని చె
తప్పదు.

---

కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B167 |
| పుస్తకం పేరు | బార్డోలీవిజయము |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 375 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV, V |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya thasin |
| పేజీలు విడదీసినది | |
| స్కాన్ చేసినది | teena |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |